శ్రీ స్కాందపురాణాంతర్గత

# నాగర ఖండము

నవమ దశమాశ్వాసములు.

గుంటూరుజిల్లా పల్నాడుతాలూకా జానపాడు
నామకగ్రామ నివాసియు, అభినవసరస్వతీ
పత్రికాధిపతియు, బహుగ్రంథకర్తయునగు
జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

ఆంధ్రీకృతము.

894.8131
PAT-5

ప్రథమ ముద్రణము
అభినవసరస్వతినుండి యుద్ధృతము.

గుంటూరు
చంద్రికాముద్రాక్షరశాలయందు
ముద్రితము

1934

సర్వస్వామ్యసంకలితము.] [వెల రు. ౧-౮-౦.

# విషయసూచిక

:o:

## నవమాశ్వాసము

## దశమాశ్వాసము



గ్రంథకర్త,

జానపాటి పట్టాభిరామశాస్త్రి,

అష్టావధాని,

జానపాడు, పల్నాడు తాలూకా.

Presented In Memory Of
Late Vangapalli Neelakantam

# పీఠిక

ఈగ్రంథమున కిది నాల్గవసంపుటము. గ్రంథమంతయుఁ బదియాశ్వాసములలో ముగింపనెంచి యేతదుపక్రమం బొనరించుచుఁ బండ్రెండువేల మూలగ్రంథమునకు భాషాంతరీకరణము పదివేలపద్యములు కావచ్చుననియు నెల కెనిమిదిపుటలచొప్పున నభినవసరస్వతిలోఁ బ్రచురించిన సం॥న కొకయాశ్వాసము సుమారు వేయిపద్యములతో ముగియవచ్చుననియు నెన్నిమేమను వేసికొంటినిగాని మధ్యసంప్రాప్తములైన మత్ప్రథమకళత్రమారణారోగ్యాభావాదికములవలన మతిమూఁడు (కొంత్తము మీఁద ౧౩) సం॥లకుఁ దొమ్మిదివేల యిరువదియొక్క గద్యపద్యములతోఁ బదియాశ్వాసములు నాంధ్రీకరించి ప్రకటింపఁగలిగితిని. ప్రథమద్వితీయసంపుటములలోఁ బీఠికయను పేరుతో నేదో వ్రాసియుంటినిగావున దీన వ్రాయవలసినయంశ మేమియుం నాబుద్ధికిఁ బొడకట్టదు. కాని ధారాపాతములైన యస్మత్కవితాదోషములు కొన్ని శుద్ధాశుద్ధపత్రము సిద్ధముచేయ నాఁటికిని స్ఫురింపమి నందుఁ జేర్పఁబడకయుండవచ్చును. వానినన్నిటిని విద్వత్కవులు క్షమించుటకు వేడుకొనుచు ననేకపురాణములు ననేకఖండములు నుండియుండ నీఖండమునే తెనిఁగించుట కుండు ముఖ్యకారణమును దెలుపుచున్నవాఁడను. విశ్వబ్రాహ్మణులను వారికిని బ్రాహ్మణులకును బ్రాహ్మణ్యవిషయమై కలిగిన వివాదములోఁ బ్రథములు స్వకులోత్కృష్టత్వమును ఋజువుపఱచుటకై నాగరఖండమను తాటియాకులప్రత్తమొకటి కోర్టులో దాఖలుచేసి తత్రత్యములగు తప్పుశ్లోకములఁ గనఁబఱచుచుఁ దద్గ్రంథము స్కాందపురాణాంతర్గతమని నుడువఁగడఁగుటయు నయ్యాథార్థ్య మరయుటకై బొంబైనుండి మాచేఁ దెప్పింపఁబడిన తత్పురాణమును ధర్మాధికారులు పరిశీలించి ప్రతివాదులు కనఁబఱచు పద్యము లందుఁ గనఁబడమిని వారి నాగరఖండమును దూరీకరించిరి. అయావిషయము లన్నియు స్వర్ణకారవ్యవహారమను పేరఁ జెలుపఁబడిన చరిత్రమున స్పష్టగించుచు

తే. అట్టి తడకలలోనిదే యరసిచూడ
వీరి నాగరఖండ మో విజ్ఞులార !
కల్లగానట్టి నాగరఖండ మిపుడు
వేఱ నాగరలిపి నచ్చువేయఁబడియె.

శా. దానన్ వీరలుచూపుశ్లోక మొకఁడున్ బైవాఱ. దాగ్రంథమే
మానంబయ్యెడిఁగాని వీరి తడకల్ మానంబుగా వింతయున్.
నే నద్దేనియుఁ దెన్గుచేసి మృదువాణిం దత్పురాణస్థితా
ఖ్యానంబుం బ్రకటింతు వీరి నుడువుల్ కల్లల్గ నెంచన్ జనుల్.

అని వ్రాసియుంటిని. ఆవ్రాసినదాని నన్వర్థముచేయుటకును గవితావ్యాసంగమునఁగల కాంక్ష తీఱమినే యీతన్నాగరఖండాంధ్రీకరణమునకుఁ బ్రారంభించినను బ్రారబ్ధము సాగినకొలఁది బయలువెడలు పరమేశ్వరావిర్భావములు తీర్థక్షేత్రమహాత్మ్యములు పుణ్యోపాఖ్యానములు ధర్మరహస్యములు నపూర్వగాథలు మొదలైనవి మదీయోత్సాహమును మఱింత వృద్ధిఁజేయుటయుఁ బలుకష్టములకు లోనైనను బట్టిన పట్టు వీడక పరిపూర్తిఁ జేయఁగలిగితిని. కలిగినకష్టము లన్నియుఁ దొలఁగించుకొని యిలాతలమునందే నింతవఱకు నిలువఁగలుగుటకును నేతద్గ్రంథమహిమయే కారణమని నానమ్మకము. కష్టసాగరమునుండి గడ్డను బడ్డవారి కథలే కడుబహుళముగాఁ గల గ్రంథంపు టాంధ్రీకరణమువలన బంధవినిర్ముక్తుండనైతినని పరమానందభరితుండనగుచు జగత్ప్రసిద్ధపండితులగు స్వల్పసంఖ్యాకుల యభిప్రాయములమాత్ర మిందుఁ బొందుపఱచుచున్నవాఁడను. ఎట్లైననేమి? ఏతాదృశసద్గ్రంథాంధ్రీకరణంబునకు నిదానభూతులగుటచే విశ్వబ్రాహ్మణమన్యసోదరుల కెంతయుం గృతజ్ఞుఁడను.

ఇట్లు
విద్వద్విధేయుఁడు
జానపాటి పట్టాభిరామశాస్త్రి,
ఎడిటరు
'అభినవసరస్వతి'

---

## పండితాభిప్రాయములు.

శ్రీశ్రీ జగద్గురు పుష్పగిరిసంస్థానపండితులును బండితప్రవర
వ్యాఖ్యానవాచస్పతి బిరుదాంకితులును నగు
బ్రహ్మశ్రీ మల్లాది రామకృష్ణచయనులుగారు.

విద్వత్కవులగు బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిలుగారు రచించిన యాంధ్రనాగరఖండమును స్థాలీపులాకన్యాయముచేఁ బరికించితిని. ఇందలి భాష శుద్ధము. శైలి మృదుమధురము. మూలమున కన్యూనాతిరిక్తమగు నాంధ్రీకరణము. ఈఖండము రథకారుల పూర్వచరిత్రముఁ జెప్పునని బహుజనులకు భ్రాంతికలదు. దానిఁ దొలఁగించుటకై వీర లీఖండమును దెలిఁగించిరని నే నూహించెద. ఇప్పుడు గూర్జరదేశమందు వడనగరమను ఖ్యాతిగాంచిన నగరమను పుణ్యక్షేత్రమందలి యనేకవిశేషము లీగ్రంథమున వర్ణింపఁబడినవి. నాగరులని పిలువఁబడెడి ఘూర్జరబ్రాహ్మణులలోని యొకతెగవారి మహత్త్వ మీగ్రంథమున వర్ణింపఁబడినది. వారు రథకారులు కారు. ఇంతియకాక యనేకధర్మరహస్యము లీగ్రంథమున నుపాఖ్యానములతో వర్ణింపఁబడినవి. ధర్మశాస్త్రమని చెప్పఁదగిన యిట్టి మహాగ్రంథము నిర్దుష్టమగు భాషతో నాంధ్రీకరించి యిమ్మహనీయుఁ డాంధ్రలోకమునకుఁ జేసిన యుపకారము వర్ణనీయము. పల్నాటిసీమలో నప్పకవి యనంతర మీకవి యెన్నఁదగి

యున్నవాఁడు. కేవల శ్రవణానందకరములగుచు నీతిబోధరహితములగు నవలలవలెను శృంగారగ్రంథములవలెను గాక సకలసనాతనధర్మబోధకమగుచు సహృదయమనోరంజకమగు నీగ్రంథము శ్రీనాథుని కాశీఖండ భీమఖండములం బోలె నాచంద్రార్కస్థాయియై కవికి యశం బొనఁగూర్పఁగాక.

---

కింకవీంద్రఘటాపంచానన బాలసరస్వతి కళానిధి బిరుదాంచితులును
శతావధానులును తిరుపతివెంకటేశ్వరకవులలో నొకరును నగు
బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులుగారు

ఎప్పటి కప్పుడే పత్రికలో నాగరఖండము చదువుచునే యున్నాను. దీని రచన మొదలిడునాఁటికే మీధార సొంపుదేలినది. పిదప దీనిని రచించుకొలఁది నుత్తరోత్తరాభివృద్ధిగా సానఁబట్టిన వజ్రమువలెఁ బ్రకాశింపఁజొచ్చినది. పురాణముల ననువదించిన ప్రాచీనకవుల ధారతోఁ బాటియయ్యది విద్వత్కవుల సమ్మానమునకుఁ బాత్రమగుటకు సందియములేదని నా ముఖ్యాభిప్రాయము. తక్కిన వ్యాకరణాదిస్ఖాలిత్యములు లోనగువానినిఁగూర్చి యారురుక్షుల కవనముల కభిప్రాయ మిచ్చునప్పు డెత్తుకొనవలెనేమో కాని యారూఢుల కవనముల విషయమున నది యప్రస్తుతమే. ఎటులైనను ఈగ్రంథము వ్రాయునప్పు డెట్టి స్ఖాలిత్యమున్నను నయ్యది ప్రమాదకృతము కావలెనే కాని యజ్ఞతాప్రయుక్తము కాదని ప్రాజ్ఞు లెఱుఁగనిది కాదు.

---

కవిరాజ కవిసార్వభౌమ బిరుదాంచితులును శతావధానులును
గవిత్రయము తరువాత మరల మహాభారత మూలాగ్రము మూలానుసారము
తెనిఁగించిన మహాపురుషులును నగు
బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రులుగారు

బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు రచించిన నాగరఖండమను నాంధ్రగ్రంథము వారి యభినవసరస్వతీపత్రికలోఁ బ్రచురించుచున్నప్పుడు పెక్కుభాగముల నేఁ జదివితిని. పట్టాభిరామశాస్త్రిగారి నెఱుఁగని యాంధ్రపండితులుండరు. వారికవిత్వము మృదుమధురమై విన నింపుగా నుండును. వారు సంస్కృతాంధ్రపండితులుగావున వారికవిత్వమందు దోషములు గానరావు. శైలి నిర్దుష్టమైయుండును. ఈనాగరఖండములో నక్కడక్కడ విచిత్రప్రయోగము లున్నవి. అవి పాఠకుల కింపు సంపాదింపఁగలవు. అనేకములైన మనోహరకథాంశములు గలవు. ఆయా స్థలముల మన శాస్త్రిగారు మిక్కిలి చక్కఁగాఁ దెలుఁగు గావించినారు. ఈతెలుఁగు నాగరఖండము కొంచె మించుమించుగాఁ బూర్వకవిప్రణీతములవలెం గానవచ్చునని యనుటకు సందియింపఁబడ నక్కఱలేదు. శాస్త్రిగా రిట్టి మఱికొన్ని పురాణములు రచించి లోకోపకార మొనర్తురుగాకయని కోరుచున్నాను.

---

శతావధానులును నవద్వీపశిరోమణిబిరుదాంచితులును
సంగీతసాహిత్యాది బహుకలాకోవిదులును స్వమతసిద్ధాంతనిపుణులును నగు
మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు

బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభిరామవిద్వత్కవిమహాశయా!

కం. శ్రీగిరినిలయునికృపచే
నాగరఖండమ్మును దెలుఁగునను వ్రాసితి. నీ
నాగరఖండము వెలసెను
నాగరఖండమయి కైతనాతికిఁ దలపై.

---

సంస్కృతాంధ్రాంగ్లేయభాషాకోవిదులును ఆంధ్రసాహిత్యపరిషదాధార
భూతులును బహుశాసనపరిశోధకులును ప్రెసిడెన్సీ మేజస్ట్రేటు, అసిస్టాంటుకలెక్టరు
పదవు లలంకరించి ప్రకృతము విశ్రాంతివేతనము గైకొనుచు
ధర్మదేశభాషాసేవాసంపన్నగృహస్థులును నైన
బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులు బియేబియల్ గారు

బ్రహ్మశ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రులుగారు రచించిన యాంధ్రనాగరఖండము నక్కడక్కడఁ జదివినాఁడను. స్కాందపురాణాంతర్గతమగు నొకస్థలమాహాత్మ్యమున కిది తెలుఁగు. స్థలపురాణమను మాటమాత్రమే కాని యిందు లోకము తెలిసికోవలసిన విషయము లనేకము లున్నవి. ఇతరపురాణములలోని కొన్నికొన్ని విషయము లిందును దగినరీతిగా నివరింపఁబడినవి. కవిత్వ మనర్గళధారాశుద్ధిగలిగి హృద్యముగా నున్నది. శైలి ప్రాచీనశైలి ననుకరించుచున్నది.

---

భాష్యాంతవ్యాకరణవేత్తలును శతావధానులును జెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రులు
గారి భాగినేయాభర్తలును కీర్తిశేషులైన శ్రీ చెలికాని లచ్చారావుబహదరు
జమీందారుగారి యాస్థానపండితులును నగు
బ్రహ్మశ్రీ ద్వివేది నారాయణశాస్త్రులుగారు

తే. ఆంధ్రదేశగురూత్తములైన సుకవి
వరులు తిరుపతివేంకటేశ్వరులె మీదు
కైత నగ్గింప వాకొనఁగా వలయునె
రమ్యకవితాస్త్రి! పట్టాభిరామశాస్త్రి!

---

# తొలిపలుకు

జ్ఞానోదయమును గాంచినమానవులు బుద్బుదప్రాయము లగునీతుచ్ఛశరీరసౌఖ్యములను దగులుకొని కాలము వృథఁబుచ్చరాదనియో స్థిరమై ప్రకాశించు బ్రహ్మజ్ఞానమును భక్తిమార్గమునఁ గనుగొని ముక్తిమార్గ మెఱుంగుటయే మానవజాతికిఁ బ్రధానలక్షణం బనియో,

" జగతిఁ బుట్టి పుట్టి చచ్చి చచ్చి
పొరల నేల మనకుఁ బుట్టని చావని
త్రోవ వెదకికొనుట దొడ్డబుద్ధి "

యను పోతనార్యుని వాగ్విలలయం దుదయించిన గాఢమగు నమ్మకముచేతనో, సరస్వతీకరుణాకటాక్షముచే లభించిన కవిత్వము భగవంతుని వినోదంబులం జూపు సత్కృతులు రచించి సార్థకముచేసిన నుత్తమజన్మము లభించుననియో స్కాంద పురాణాంతర్గత నాగరఖండమును శ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు తెనిఁగించిరి. ఏతద్గ్రంథప్రాశస్త్యమును గుఱించి చెప్పుటకు ముం దీశాస్త్రిగారి పావనచరిత్రాంశములఁ గొన్ని లోకమునకుఁ జెప్పవలసియున్నది. వీరు జ్ఞానములవడినదాది నేఁటివఱకు (రమారమి నలువది సంవత్సరములనుండి) భాషాసేవకై తను వర్పించి విశేషసుకృతము నార్జించుచున్నవారు. అభినవసరస్వతీ పత్రికాధిపతులై రమారమి ముప్పదిసంవత్సరములనుంచి పత్రిక నెన్ని చిక్కులలోఁ జిక్కుకొన్నను మానక నడపించుచుండుటయే వీరికిఁగల పట్టుదల నగుపింప సామర్థ్యమును జెప్పక చెప్పెడిని. బాల్యమునందే యష్టావధాన శతావధానములను జేసి పేర్వడ్డవారు.

" కాలుగా జేయుదు నాడునంతవఱ కీర్తికల్యాణిఁ బోషించెదగా "

అని ప్రతిజ్ఞావిషయమునఁ బ్రతిజ్ఞఁ బట్టినవాఁడే వీరి యశఃకుసుమసౌరభ మాంధ్రదేశోద్యానవనవాటికల వ్యాపించి యున్నది. కవితాలోకమున వీరి పేరెఱుంగనివారు లేరు. కవులై శతావధానులై బహుగ్రంథకర్తలై పత్రికాధిపతులై సర్వవిధముల సమర్థులైయుండుట యట్లుండ నిరాఘాటపాండిత్యముతో పాటు నిరర్గళ వాక్పద్ధతికూడ కలవారని వీరి " ఆరోగ్యభాస్కరము " సాక్ష్యమిచ్చుచున్నది. వీరు లోకమున కాదర్శప్రాయులు. కవుల కనాదినుండి వచ్చుచున్న దారిద్ర్య బాధ వీరికిని దప్పదయ్యె. దీనికిఁదోడు సంసారబాధలు - ఇన్నిటికి లోనైనను కవితాసేవయే పరమావధిగా నెంచుటం జేసి కాంబోలు నీతి కాలవాలమై ధర్మముల

మునికిపట్టై సన్మతప్రబోధకంబై జ్ఞానప్రదమై యిహపరసాధకమై విలసిల్లు గ్రంథరాజ మొకండు వ్రాయ సంకల్పించి,

మ. ఒనరన్ నన్నయతిక్కనాదికవు లీయుర్విం బురాణావళుల్
తెనుఁగుం జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్. దీనిన్ దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్.

అని పోతనార్యుఁడు హరికరుణావిశేషమున భాగవతమును వ్రాసి కృతార్థుండైన చందంబున శ్రీశాస్త్రిగారు నేఁటివఱ కెవ్వరును దెనిఁగింపని వేదవ్యాసప్రోక్తంబగు సాగరఖండంబును దదేకదీక్షతోఁ బట్టినపట్టు విడక మూలానుసారముగఁ దెనిగించి కృతకృత్యులైరి. ఆంధ్రకవితాలోకమున కొక్క యుత్కృష్టగ్రంథ మందఁజేసి యాంధ్రభాషావధూటి కొక్క నూతనాలంకారము సమర్పించి రనుటలో సందేహము లేదు. జాహ్నవీనదివలె నీగ్రంథము పవిత్రమైనది. ఇందుఁ గానఁబడని ధర్మములు నీతులు నితిహాసములు లేవు. తక్కినపురాణములకంటె నీసాగరఖండమందు సమస్త ధర్మములు నిమిడియున్నవి. ప్రారంభమునుండి తుదవఱ కీగ్రంథ మొకసారి చదివిన సంశయములన్నియుఁ దొలఁగిపోవుననుమాట యటుండ మఱి యేగ్రంథమును జూడ నక్కఱలేదనుట నిశ్చయము. ఎన్నియితిహాసములు చదివినను నెన్నిపురాణములు చదివినను తుదకు మానవులు గ్రహింపవలసినది నీతి. ఈగ్రంథమంతయును నీతులకుఁ బుట్టి. అందీనాల్గవభాగమునందు ధర్మరహస్యములన్నియు విస్తృతముగఁ జెప్పఁబడినవి. ఈవిషయంబు లన్నియు గుర్తించియే శాస్త్రిగా రీగ్రంథమును సృష్టించి యాంధ్రులకుఁ బరమోపకారముఁ జేసినారనుట యథార్థము. రత్నములన్నియు నొకచోటికిఁజేర్చిన ట్లీగ్రంథమునందలి నీతిరత్నములన్నియు సేకరించి బాలబాలికలకు బోధించుటకవకాశముండునటులఁ జిన్నగ్రంథముగ నొనర్చి పాఠశాలలయం దుంచినఁ జిఱుతప్రాయమునుండియుఁ బిల్లలు నీతిగలవారగుదురని మా నమ్మకము. ఈగ్రంథము శ్రుతిస్మృతులయందుండు ధర్మసారసంగ్రహ మనవొప్పు. వేదవేదాంతశ్రవణంబుచేతను భగవద్గీతాపఠనంబుచేతను నేపుణ్యము లభించునో యాపుణ్య మీపురాణపఠనశ్రవణాదులచేత లభ్యము. రమారమి పదివేలపద్యముల రసవంతముగ ధారాళమైన కవితాధారతో రచించి లోకమున వ్యాపింపఁజేసిన యీగ్రంథకర్త కెట్టి సుకృతంబు లభించునో చదువరు లూహింతురు గాక. ఈగ్రంథము మూలము ననుసరించి తెనిఁగింపఁబడినది. మూలముననుసరించి తెనిఁగింపక కథాభాగము ననుసరించి స్వేచ్ఛగ

వ్రాయఁబూనినచో ఋషిప్రోక్త సంస్కృతగ్రంథంబులయందలి విశేషములన్నియుఁ దెలిసికొనుట కవకాశ మంతగా నుండదనిఁ బోలు సర్వజనాదరణీయముగ శాస్త్రిగారు మూలము విడువక తమ గ్రంథము నడపించియుండవచ్చును. రామాయణ భారతాదిగ్రంథములు మూలముననుసరించి తెనిఁగింపఁబడకపోయినను రసవత్కావ్యములై నీతిబోధకంబులై యొప్పుచున్న వనుట కేమాత్రమును సందేహములేదు కాని సంస్కృతగ్రంథమందున్న విశేషధర్మములన్నియు నెఱుంగుట కవకాశములు లేవు. మూలముననుసరించి తెనిఁగించినను "మక్కీకిమక్కీ" యనునట్లు గాక వలయుచోట్లఁ గుదించుచుఁ బెంచుచు రచనాసామర్థ్యమును వెల్లడించుచు వ్రాసిన కావ్యము శ్లాఘ్యముగ నుండును.

ఉ. "ఒక్కడఁ జక్కనౌపదము నొక్కటిఁజేర్చిన మెచ్చరో మతిం
కొక్కడ నున్న దున్నయటు లెంచి రచించిన మెచ్చరో మతిం
కొక్కడ నున్నదాన సగ మెంచి రచించిన మెచ్చరౌనుగా.
మక్కికిమక్కియన్నటుల మార్చిన కావ్యము శ్లాఘ్య మెట్లగున్"
(తిరుపతి వేంకటేశ్వరకృతము)

ఈగ్రంథ మట్టి యేయంశములకును దావీయక స్వకల్పితగ్రంథమా యను భ్రమను గలిగించుచున్నది. విశేషలోకానుభవము గాంచినవెనుక రచింపఁబడిన గ్రంథమగుటంజేసి యిందుఁ గల కవిత్వము ద్రాక్షాపాకమై సులభార్థప్రతిపాదకంబై మృదుపదఘటితంబై శబ్దాలంకారభాసమానంబై ప్రసాదమాధుర్యాది కావ్యగుణంబుల కాకరంబై యమృతప్రవాహమువలె నాహ్లాదజనకంబై పండితపామరజన మనోరంజకంబై విలసిల్లుచున్నదనుట నిర్వివాదాంశము. ఏసమయమం దేరసము గురిపింపవలయునో యాసమయమున నారసము గురిపించుచు నేరసమును వర్ణించినను భక్తిరసము తొలుకునట్లు రచించిరని చెప్పుట చర్వితచర్వణమగును. ఈగ్రంథ మనేక పండితకవులచేఁ గొనియాడఁబడినది.

జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందెమేల ? వీరి యవధానపాటవముగుఱించియుఁ గవితానైపుణ్యము గుఱించియు మేధాసంపత్తిగుఱించియుఁ బాండితీప్రభావముగుఱించియు విశేషించి వీరి సౌశీల్య సౌజన్యాది గుణగణముల గుఱించియు జ్ఞానవైరాగ్యముల గుఱించియు నాంధ్రలోకమునకు నూతనముగఁ జెప్పం బనిలేదు. పరమేశ్వరానుగ్రహమువలన నేనాఁటి కెంతలభించునో యంతతోఁ బరితృప్తిఁబొంది యానందముగఁ గాలము గడపువారలలో వీరొకరని చెప్పవచ్చు. శ్రీ జటప్రోలు

గద్వాలాది సంస్థానములయందు రాజమర్యాదలను గాంచిన యిట్టిమహనీయుని గ్రంథమునకుఁ దొలిపలుకు వ్రాయుభాగ్యము లభించినందులకు మే మెంతయు శ్రీ శాస్త్రిగారియెడఁ గృతజ్ఞులము. శ్రీ శాస్త్రిగారికి శతాధికగ్రంథరచనాసామర్థ్య మిచ్చి భగవానుఁడు చిరాయుర్భాగ్యోన్నతులచే సంరక్షించుఁగాత.

ఉ. నాగరఖండముల్ దెనుఁగునన్ రచియించి కరంబు మించుటన్
వాగనుశాసనాది కవివర్యులవోలె యశంబు గాంచుచున్
శ్రీగలవారలైతి రిలఁ జెప్పెడి దెయ్యది? దేహదార్ఢ్యముల్
రాఁగల దింక సత్కృతిని రంజిలఁజేసిన కారణమ్మునన్.

ఇట్టి యుద్గ్రంథము,

గీ. సప్తసంతానములలోఁ బ్రశస్తిఁ గాంచి
ఖిలము గాకుండునది ధాత్రిఁ గృతియకాన
కృతి రచింపుము మాకు శిరీషకుసుమ
పేశలసుధామయోక్తులఁ బెద్దనార్య!

యని కృష్ణదేవరాయలు పెద్దనార్యునింబలె యాడవరము జమీందారులగు శ్రీబాకరాజు పరాంకుశరావుగారు తమ కంకితంబుగ నిమ్మటం ప్రార్థించిరని తెలియుచున్నది. రాజులకును గవిరాజులకును గలబాంధవ్య మీనాఁటిది కాదు, రాజధర్మములలో నిది ప్రధానమని గ్రహించి దేశముఖుగారిందులకుఁ దొడంగుట సంశ్లాఘ్యము. గ్రంథప్రాశస్త్యమునకుఁ గృతికర్తయుఁ గృతిభర్తయు నిరువురును బ్రధానులే. ఇట్టియుత్తమగ్రంథమునకు లోకోత్తరగుణుం డగు దేశముఖుగారు నాయకుఁడగుట ప్రశంసార్హము. ఇప్పట్లు శాస్త్రిగారిపుణ్యము గొప్పది. ఇట్టిమహనీయులచే రచింపఁబడిన గ్రంథమును జేపట్టి గ్రంథరూపమున నాశీర్వాదములను బడసిన కృతిభర్త సుకృత మింతింతయని చెప్ప శక్యముకాదు. ఇందు నందు శాశ్వతకీర్తిఁ దేఁజాలు సత్కృతులను బట్టి పోషించుచున్నవారని చెప్పినచోఁ దక్కుంగల దేశముఖుగారి యౌదార్యాతిశయంబును బరోపకారపారీణత్వమును విద్యాభిమానమును గవిజనపక్షపాతమును నిరంతరదైవతారాధనతత్పరతను విశేషించి చెప్పనేటికి? శ్రీ దేశముఖుగారికి వారికుటుంబమునకు గుణధాముం డగుపట్టాభిరాముండు చిరసౌభాగ్యసంపత్తిని జిరాయురున్నతుల నిచ్చి సంరక్షించుఁగాత.

ఇట్లు బుధజనవిధేయులు,

వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు, బి. యే.,

వెంకటనారాయణ.

సోదరకవులు,

స్నేహలతాకవితాసంఘాధ్యక్షులు,

కొల్లాపురము.

---



# నాగరఖండము.



## నవమాశ్వాసము.



కం॥ శ్రీకార్తికమాసాంతఃప్రాకటరుద్రాభిషేక బాడబజనతా
స్తోకాన్నదానయుత ! నాకౌకోరత ! శ్రీపరాంకుశావనినేతా ! ౧

ఆ॥ అవధరింపు. శౌనకాదిమును ల్పౌరాణార్థవేదియగుచు నవనిలోన
యశముగాంచినట్టి యా రోమహర్షణి చక్కి మరలి మరల సవినయముగ. ౨

తే॥ " విజ్ఞ ! యేద్రవ్యసమితి నేవేళలోన నెట్టివిప్రులఁ గూర్చుండఁబెట్టి శ్రాద్ధ
మాచరింపంగవలయునో యావిధానమెల్ల వాక్రువ్వ " నానతిం డిట్టులనియె.

వ॥ దీనిఁ దొల్లి హరిశ్చంద్రునాత్మజుండగు రోహితాశ్వుండు మార్కండేయు నడిగియుండె. హరిశ్చంద్రుండు స్వర్గతుండగుటయు రోహితాశ్వుఁడు రాజ్యంబు చేయునెడఁ దీర్థయాత్రాప్రసంగంబున మార్కండేయుండు సరయూసాగరసంగమంబు నకుఁ జని స్నాతుండై పితృదేవతలకు విధిపూర్వకంబుగాఁ దర్పణంబువిడిచి సార్థక నామంబగు నయోధ్యం బ్రవేశింపఁ దదాగమనంబు విని రోహితాశ్వుండు పాద చారియై సమ్ముఖంబుగాఁ జాలదూరగ మరిగి సాష్టాంగ నమస్కారంబు సలిపి. ౪

### —— శ్రాద్ధకల్పము ——

కం॥ " స్వాగతమునీకు. మఱియును స్వాగతము. త్వదంఘ్రిరేణు సంస్పర్శముచే
బాగుగ నమ్మార్గజతతి తా గడియించెం బవిత్రతను-ధన్యుఁడ నేఁ. " ౫

వ॥ అని చేయిపట్టి పేరోలగంబునకుఁ దోడుకొనిపోయి పెద్దగద్దియం గూరు చుండఁబెట్టి తాను వినయావనతుండై దోయిలిఘటించి క్రిందఁగూర్చుండి. ౬

ఆ॥ " నిరభిలాషుఁడైన నీవిందు రాఁ గతంబేమొ నిజముచెప్పు మోమహాత్మ !
యీయరానివస్తువేనియు నిచ్చెద మద్గృహాగతునకు మాటనిలుప. " ౭

వ॥ అని మధురంబుగా మనవిసేయుటయు మార్కండేయుం డిట్లనియె. ౮

తే॥ " తీర్థయాత్రాప్రసక్తి నేతెంచినార మిచ్చటికి. రేపుప్రొద్దున నేగఁగలము
మరల సరయూనదీసంగమమున కేము. నిరభిలాషులమను దర్శనీయ ముండు. ౯

తే॥ ఉత్తమబ్రాహ్మణుని స్వయముద్భవమగు లింగమును సాగరముఁగూర్చి లీలనేగు
నదిని గన నొక్కదినపుఁటేనస్సుతోలఁగునంచుఁ జెప్పిరి శాస్త్రిజ్ఞులైనవారు ” ౧౦

వ॥ అని యిట్లు వాక్రుచ్చి సవినయంబుగా నెదుట నిలువఁబడియున్న యన్నర
నాయకుం బొడగాంచి ౧౧

తే॥ “ నీవు చదివిన వేదముల్ నీదుశ్రుతము నగ్నిసాక్షికముగను బెండ్లాడఁబడిన
నీ కళత్రంబులును మఱి నీదుధనము సఫలమయ్యెనె మానవసార్వభౌమ ! ” ౧౨

వ॥ అని ప్రశ్నించుటయు రోహితాశ్వుం డిట్లనియె. ౧౩

తే॥ “ నా పఠించినవేదముల్ నాదుశ్రుతము నగ్నిసాక్షికముగను బెండ్లాడఁబడిన
నా కళత్రంబులును మఱి నాదుధనము సఫలమగుటన్ నెట్లు వాచంయమేంద్ర ! ”

వ॥ అని యిట్లడుగుటయు వెండియు మార్కండేయుండు ౧౫

సీ॥ “ అగ్నిహోత్రఫలంబు లవనీతలాధ్యక్ష ! యజురాదికములైన యాగములును.
శీలవృత్తఫలంబు చిత్రభానుకులీన ! కడువిమర్శించినయెడల శ్రుతము.
రతిపుత్రఫల లహో రాజన్యమూర్ధన్య ! యగ్నిసాక్షిగఁ బెండ్లియైన స్త్రీలు.
దత్తపుత్రఫలంబు ధర్మాధ్వసంచార ! యార్జింపఁబడినట్టి యఖిలధనము.
నీవిధంబెఱింగి యీ వస్యవిధమును మానవలయు నెపుడు మానవేంద్ర !
యస్మదుక్తవిధి నిహాముత్రఫలకాంక్షు లందఱికిని గార్హ్యసుగును జేఁడ ! ” ౧౬

వ॥ అని వక్కాణించి పురాణరాజన్యులయు విశేషించి దేవర్షులయుఁ జిత్రకథ
లం జెప్పుకొనుచుఁ గూర్చుండుటయు నందొక్కకథ యవసానంబున రోహితాశ్వ
మహీపతి యమ్మునిశ్రేష్ఠుదిక్కు మొగంబై ౧౭

కం॥ “ భగవానుఁడ ! ద్విజతతికిం దగుగతి శ్రాద్ధాచరణము తప్పనిపనియౌ
నుగదా ! బహుభేదము లం దగుపడుఁ. దత్కల్పమును దయం జెప్పఁగదే ” ౧౮

వ॥ అని యడుగుటయు వెండియు మార్కండేయుం డిట్లనియె. ౧౯

కం॥ “ నిజమే యడిగినవాఁడవు భుజభవ ! శాఖావిభేదములచే శ్రాద్ధ
వ్రజమందును భేదంబులు ద్విజతతి కేర్పడియె. దానిఁదెల్పెద నీకున్. ౨౦

తే॥ కాన నానర్తవసుమతీజానికి మును భర్తృయజ్ఞునిచేఁ జెప్పఁబడినయట్టి
శ్రాద్ధలక్షణమును సక్రుచ్ఛ్రముగ నీకుఁ జక్కవచియింతు రోహితాశ్వ! వినుమయ్య.

ఆ॥ సొంతయాశ్రమమున సుఖముగాఁ గూర్చున్న భర్తృయజ్ఞుకడకుఁ బరమభక్తి
నరిగి కేలుమోడ్చి యానర్తభూపాలుఁ డెంతయునుమృదూక్తి నిట్టులనియె. ౨౨

ఆ॥ పితృభీష్టమైన పృథుశ్రాద్ధకల్పముం జెప్పుమో మహాత్మ ! యిప్పుడీవు.
నాదుపితరులెల్ల నాచేత శ్రాద్ధమం దర్చితులయి తృప్తినందునట్లు. ౨౩

సీ॥ శ్రాద్ధకర్మమునకు సముచితంబైనట్టి కాలంబదెద్ది త్రికాలవేది !
యాకార్యమందు సమర్హంబులైనట్టి ద్రవ్యంబులెయ్యవి తాపసాగ్ర్య !

అటు భోక్తలుగనుండ నెటువంటిద్విజులకు యోగ్యతకలదయ్య యోగివర్య!
యెటువంటివారల నేటి యందుఁబరిత్యజింపంగవలయును క్షితిసురేంద్ర!
మఱియుఁ దచ్ఛ్రాద్ధమందున మంచివనుచు వేని నుపయోగపఱుపనౌ వానిచంద్ర!
యంతయునునాకు నగ్గలంబైనకరుణ నానతీయంగదయ్య యోయమివరేణ్య! ”

కం॥ అని యిట్లు వచించుటయును ననఘుతముండైన భర్తృయజ్ఞుఁడు కృప న
జ్జననాథుదిక్కు మొగమై మనమునధ్యానించుచభవు మఱియిట్లనియెన్. ౨౫

ఆ॥ “ ఎద్దివినుటవలన నిప్పుడీ మానవుల్ శ్రాద్ధఫలముఁ బడయఁజాలియుందురొ
యత్యపూర్ణమైన యాశ్రాద్ధకల్పంబు నుడువువాఁడ వినుము పుడమిఱేఁడ! ౨౬

— ♦ అమావాస్యశ్రాద్ధావశ్యకత ♦ —

తే॥ శ్రాద్ధ మనువసనాఁ డవశ్యంబుగాను బెట్టవలయును సతము కోవిదజనంబు.
దాన స్వర్లోకసౌఖ్యంబు తప్పకబ్బు. నటుల సంతానమునుగల్గు నవనిపాల! ౨౭

సీ॥ శీతబాధార్దితుల్ వీతిహోత్రప్రావరణములకై యాతురపడునట్లు
దారిద్ర్యపీడితు ల్ధనసంచయంబును హృదయంబునం దిచ్ఛయించుభంగిఁ
గర్షకు ల్సస్యంబు కడుఁబెరుంగుటకుఁగా వృష్టి ప్రతీక్షించువిధముగాను
జఠరవాకము లుషస్సమయంబునం బ్రొద్దుపొడుపునకై యాసపడుపడువున
నాఁకటంగుంచు పితరులు నమను గోరుచుందు. రటుగాన నయ్యెడ నుదకమునినొ
శాకముననొ యొనర్పనౌ శ్రాద్ధకర్మ. మంతఁ బితరులకగుఁ దృప్తి. యాఘముదొలఁగు.

ఉ॥ ఆఁకలిపెల్లునం బితరులందఱు మారుతరూపులై యనుల్
వాకిలిఁగాచియుండెదరు. వారికి శ్రాద్ధముపెట్టి భక్తిమై
లోకులు తృప్తిసేయనగు. లోపమొనర్చినఁ బ్రొద్దుగ్రుంకునం
దాఁక వసించి దుఃఖమునఁ దర్లుదు రుస్సురటంచుఁ దిట్టుచున్ ” ౨౯

తే॥ అనుడు నానతఁజనపతి “ మునివరేణ్య! శ్రాద్ధ మమవసనాఁ డేలసలుపవలయుఁ?
మృతులు కర్మానుకూలమౌగతికిఁజనక సుతునిసదనము నేటికిఁ జొత్తురయ్య. ౩౦

కం॥ ఈ సంశయంబు నామది నో సంయమివర్య! కలిగె. నున్నదియున్న
ట్లీసర్వం బెఱిఁగింపుము ” నా సంతసపడుచు నతఁడు నగుమొగమొప్పన్. ౩౧

తే॥ సత్యమిద్ది మహాభాగ! జనులు స్వస్వకర్మముల కనుగుణమైనగతిని గందు.
రింక నిజవంశజునియింటి కెటులవత్తు రనెడివిచికిత్సఁ దీర్చెద నవధరింపు. ౩౨

తే॥ చచ్చిపోయినవా ర్స్వవంశంబు పుడమి నుండునందాఁకఁ గ్రిస్మతి నుదయమందు.
రందుఁ బుణ్యాత్మకు ల్దివి నకృతపుణ్యు లంతకునిలోకమునను వసింతు రధిప! ౩౩

## ___ శ్రాద్ధము లేర్పడినవిధము. ___

ఆ॥ అనుడు భర్తృయజ్ఞుఁ డానర్తభూభర్తఁ జూచి “సత్యమిద్ది క్షోణినాథ!
కలవు శ్రాద్ధయోగ్యకాలము ల్పితృతృప్తికరము లింక నెన్నొ గణనచేయ. ౪౮

సీ॥ మన్వాదులందొట్టి మంచికాలములను సంక్రాంతిమున్నగు సమయములను
నయ్యుగాదులు మొదలైన ఋతువులను రవ్యోషధీశుల గ్రహణములను
నల్ల గజచ్ఛాయయందును దద్వ్యతీపాతంబునందును భక్తిమెయిని
పితృదేవతలఁ దృప్తిపెట్టుటకై శ్రాద్ధ మొనరింపవలయును మనుజనాథ!
యర్హులైనయట్టి బ్రాహ్మణులు పితృతృప్తిదంబులైనయట్టి ద్రవ్యములును
ప్రాప్తమైనయపుడె పర్వంబునం గూడ శ్రాద్ధ ముచితభంగి సలుపవలయు. ౪౯

## ___ అమావాస్యాశ్రాద్ధము. ___

ఆ॥ తీర్థములఁ బ్రసిద్ధదేవాలయంబులం బెట్టవలయు శ్రాద్ధ మట్టు మఱియు
నందులో విశేష మమవసనాఁటి శ్రాద్ధంబునందుఁ గలదు. దానివినుము. ౫౦

కం॥ అమయను రశ్మిసహస్రప్రముఖము తత్తేజమునను భానుఁడు త్రైలో
క్యమునకు దీపకుఁ డచ్చటు హిమదీధితిఁగూడి యొకఁ డెనఁగెడి నొకటన్. ౫౧

కం॥ ఇద్దఱుఁగూడివసించుట నద్ది యమావాస్యనాఁగ నభిహితమయ్యెన్.
దద్దినము ధర్మకృతికిం బెద్దది పితృకృతికిఁ బెద్దపెద్దది యరయన్. ౫౨

సీ॥ అధిప! యగ్నిష్వాత్తు లాజ్యపు లోమపుల్ బర్హిషదులు రశ్మిపాయులు నుప
హూతు లాయంతునుల్ ఖ్యాత నాందీముఖుల్ శ్రాద్ధభుక్కులు నాఁగ సమభిహితులు
క్రతుభుక్త్వసంయుక్తపితృగణంబులు తొమ్మిదజునిచే నిర్దిష్టమయ్యె నిటుల.
నాందీముఖులవీడి యందఱు వసురుద్రు లాదిత్యు లాశ్విను లగ్గలముగఁ
దృప్తిపెట్టుము-రవ్వారిఁ దృప్తిపెట్టియే యజుండును దా సృష్టిసేయుఁబూనె.
వీరలే కాక మఱియుఁ ద్రివిష్టపమున మనుజులపితాళ్ళు సహితము మనినవారు. ౫౩

తే॥ తమ స్వవంశజకృత పృథుశ్రాద్ధసమితి వసురులుం బోలె సంతృప్తు లందుఁ గొండ్రు.
ఉద్ధరణి నీరమేనియు నొసఁగునట్టి కొడుకులే కేడ్చువారలు కొంద ఱధిప! ౫౪

కం॥ పితృలోకము కడుదొడ్డది క్షితిపా! వేల్పులకుఁగూడఁ జేరఁగరాదం
దతిభక్తి నాపితాళ్ళకుఁ గ్రతుభుజు లందఱును బూజ గావింపరొకో. ౫౫

క॥ ఒకపరి యగ్నిష్వాత్తాదిక పితృదేవతలు ప్రీతి దేవేశుని యం
తికమున కరుగం బయనము ప్రకటించుడుఁ దద్విధంబు పరికించి యటన్. ౫౬

ఆ॥ మనుజులొపితాళ్ళు చనుదెంచి యాఁకలిదప్పికలను మిగుల దైన్యపడుచు
వేదచోదితములు పితృవల్లభములైన సూక్తములను జాల స్తుతియొనర్ప ౫౭

కం॥ లే దధికారము సురలకు క్ష్మాదైవతములకుఁబోలె స్నానముసేయన్.
గాదంటున మాకిష్టద మాదేవతలిచ్చు సుధయను నంభోజభవా! ౮౦
ఆ॥ కాన మనుజదత్త కవ్యంబువలననే నాకమునవసించు మాకు వారి
కధికతృప్తిగలుగున ట్లొనరింపుమీ కరుణనూంచి హేమగర్భ! నీవు" ౮౧
చం॥ అనవినిధాత కొంతవడి యాత్మను ధ్యానమునూని యిట్లనున్-
"జనులు క్రమక్రమంబుగను సత్క్రియలం ద్యజియించి దుష్టులై
మనుదురు.హవ్యకవ్యములమాట దలంపరు-కాన నింక నీ
ఘనపితృసంచయంబునకుఁ గష్టముగల్గుటు నిక్క మారయన్. ౮౨
కం॥ త్రేతాయుగమిది.యపుడే యాతీ రారబ్ధమయ్యె.నిఁక ద్వాపరమం
దాతెన్ను డుదురుకొనుఁ.గలి యొతేరం జెప్పవలసియే యుండ దహో! ౮౩
కం॥ కాన సుఖోపాయంబొక డేను కచించెదను వినుఁ డహీనగుణాఢ్యుల్!
మానవులిచ్చెడికవ్యముచే నగ్గలముగను దృప్తిసెందఁగ మీరల్. ౮౪
తే॥ పితృపితామహ తత్పితృప్రీతికొఱకుఁగా మహీసురదత్తమగు కవ్యమునన
యగును సంతృప్తి నాదుపర్యంత మందఱకునుగూడను బితరులారా! ధ్రువముగ.
తే॥ అట్లు మాతామహులపక్షమందుఁగూడ మువురకుం దృప్తిసేయుచోఁ దగువిధమున
నగును సంతృప్తి నాదాఁక నందఱకిని వినుఁడు భవదీయసంతృప్తివిధము నిఁకను.
చం॥ పితరులపేళ్ళుచెప్పుచును బృథ్వ్యమరాళికి భిక్షవెట్టినన్
బితమగుతృప్తియొకవిధము తత్పితృనామము లుచ్చరించు చ
వ్వితమున భక్తిఁ బిండములు పెట్టిన మీకగుఁ దృప్తి గాన నో
పితరులు మానివాసములఁ బ్రీతిమనుండు-చనుండు మీరిఁకన్" ౮౭
కం॥ అనవుడు వేల్పులపితరులు మనుజులపితరులును ఘస్రమణితుల్యములౌ
ఘనదేవయానములనైఁ జనిరి నిజస్థానములకు క్ష్మాపాలమణీ! ౮౮
ఆ॥ అపులఁ జాలకాల మరుగఁ ద్రిపూరుషశ్రాద్ధములును బెట్టఁజాలరైరి.
నరులు పెక్కురును బితరుల నుద్దేశించి కవ్యముల నొసంగఁ గడఁగరైరి. ౮౯
తే॥ తిరిగి మునుపటివలెనె యా నరులపితరులకును దన్నిర్గతపితరులకును గూడ
క్షుత్పిపాసోద్భవంబౌ ప్రసూతిజంబు మిక్కుటంబగుటయును సమేతులగుచు. ౯౦
తే॥ అందఱును బ్రహ్మసన్నిధి కరిగి యొరఁగి యుచ్చరవమున నిట్లని. "రోమహాత్మ!
యస్మదన్వయసంజాతు లధికదౌష్ట్యమూని మముఁగూర్చి శ్రాద్ధంబు లొనరుపమిని.
తే॥ కష్టపడుచున్న వారము-కడుదరిద్రులును మమ్ముం దృష్టిపెట్టనొ పనువెతింగి
మఱి యథాపూర్వముగ మేము మనువిధంబుఁ జూడవే"యని యీరీతి వేడుటయును

సీ॥ దయగలఁడై విధాత పితృతండమును గూరిచి యిట్లనున్. “నిజం
బయినది. మహోదయంగా ల్వినుకఁబడ్డకాలంబి దినక్రమంబుగా
నయభయదూరులై జనులు న్యాయమును దప్పి చరించుచున్నవా.
రయినను మీరు తృప్తులగునట్లు ఉపాయ మొకండు చేసెదన్. ౯౩
కం॥ అమవసనాఁ డెవ్వారలు తమ పితృవర్గమును గూర్చి తత్పరతను శ్రా
ద్ధము వెట్టుదు రవ్వారు ధనము ధాన్యము గలిగి రిపుజనంబుల సెల్లన్ ౯౪
కం॥ గెలిచి యపమృత్యువెనయక యిల సుస్థితులగుదు”రనుచు నిట్లనుటయు వి
త్తలమిం జెంది స్వకీయస్థలములకుం జనిరి వారు ధరణీకాంతా! ౯౫
చం॥ అమవసనాఁడు వంశభవు లాదట శ్రాద్ధముఁ బెట్టఁ జొచ్చుడున్
దమి నటఁ గవ్యముల్గుడిచి తత్పితృదేవతలెల్ల రొక్కమా
సము సుఖముండుచుండిరి రసాధర! యంతటఁ గొన్నినాళ్ళ కా
యమవసనాఁటి శ్రాద్ధమె మహాశ్రమమయ్యెను భూజనాళికిన్. ౯౬
ఆ॥ మనుజు లవ్విధంబ మాసాంత్యనాఁడు శ్రాద్ధములు తఱచు పెట్టక మసలుటయు
నమరులును మనుష్యలో పితృగణములు క్షుత్పిపాసలకుఁ బ్రకోప మొంది ౯౭
కం॥ కడుదీనవదనులగుచును బడఁ జత్తుస్సవులనుండి బాష్పకణము లొం
డెడఁ గాడుకొని ప్రజాపతికడ కరిగి నమస్కరించి ఘనవినయమునన్ ౯౮
కం॥ “దేవా! మీ యొక సెలవటు కేవిధమును గొఱఁత లేక యెంతయుఁ దృప్తిన్
దై వారలు జనులు దర్పం గావింతురు శ్రాద్ధమనుచుఁ గరమనుకంపన్ ౯౯
శా॥ వక్కాణించితి, కాని దౌష్ట్యయుతులై వా రద్దియుం జేయరై
రిక్కాలంబున. క్షుత్పిపాసలకు మే మెట్లోర్తు, మేదో విధిన్
జక్కంజేయను సనుగ్రహించి మమునన్ నా నేమి సేయంగనా
నాకోల్కయం చటఁ డింత సేప్రు మదిలో యోజించి తా సత్కృపన్ ౧౦౦
ఆ॥ “యిమ్మెదస్థమై మఘో క్క చిన్నయమావాస మెడదఁ దోఁచెఁ బిత్రధీశులార!
యకృతమగును గాక యమవస శ్రాద్ధంబు-లొక్క యేడు తృప్తి యొనరు మీకు.

—• పితృపక్ష శ్రాద్ధము. •—

కం॥ రవి కన్యాగతుఁడగు నెడఁ దవిలి పితృ వ్రతావహమందుఁ దత్పరతను శ్రా
ద్ధవిధి కృతమైనచో మీ కవు నాప్యాయనము లెస్స యబ్దముదాఁకన్. ౧౦౨
ఆ॥ ఇత్తెఱంగు తెలిఁగి యిల శ్రాద్ధములు ప్రజల్ ప్రేతపక్షమందుఁ బెట్టఁగలరు.
ఒకరిచేతనట్లు లోనరింపఁబడినను నబ్దమెల్లఁ దృప్తియగును మీకు. ౧౦౩

క౦॥ ఆ పితృపక్షమునందున నోపిక మిముఁగూర్చి శ్రాద్ధ మొనరుపకున్నన్
బాపపుఁ జండాలత్వము ప్రాపించును బితరులార ! ప్రజలకుఁ గానన్ ౧౦౪

తే॥ కూరయో కాయయో యింత కూరుచుకొని సవిత కన్యాగతుండైన సమయమందు
సలుపవలయు దరిద్రుఁడున్ శ్రాద్ధకర్మ. మింతకంటెను వాక్రువ్వ నేమిగలదు. ౧౦౫

సీ॥ తత్పితృపక్షశ్రాద్ధంబుఁ బెట్టనిచెట్టఁ గూడి యొక్కరుగూడెఁ గూరుచున్నఁ
దత్పితృపక్షశ్రాద్ధంబుఁ బెట్టనిచెట్టుదండ నొక్కటెకయ్యెఁ బండుకొన్నఁ
దత్పితృపక్షశ్రాద్ధంబుఁ బెట్టనిచెట్టు పంక్తిఁ గూర్చుండి యప్పములుతిన్నఁ
దత్పితృపక్షశ్రాద్ధంబుఁ బెట్టనియట్టి కట్టిఁడిఁ జేసేత ముట్టుకొన్నఁ
జాలనుడు లేల. యకృతతచ్ఛ్రాద్ధుతోడ నొక్కచోఁగూడి మాటాడియున్నఁగాని
ధనము ధాన్యము సుఖము సంతతియులేక ఘోరనరకంబునం గూలుఁ గొనకొ నరుఁడు.

తే॥ అట్లుగావున నవ్యగ్రులగుచుఁ జనుఁడు ప్రీతి స్వస్థానములకు నోపితరులార !
యతిభయంకర కలికాలమందు సేని పెట్టు; ఈ యొక్క శ్రాద్ధంబు బీసగూడ ”

క॥౦ అనవిని పితరులు స్వనికేతనములకుం జనిరి ప్రీతిఁ. దచ్ఛ్రాద్ధంబున్
జనులు కలిమోహమునఁబడి పొనరుపఁబోరైరి దుష్టబుద్ధిని భూపా ! ౧౦౭

క౦॥ అకృతశ్రాద్ధుల పితరులు సకలామరపితృసమూహా సముపేతముగా
నకటాయని వడివడి నజు సకాశమున కరిగి యొరఁగి శరణని మఱియున్ ౧౦౮

శా॥ “ దేవా ! యేటికి నొక్కమాఱయిన నాదిత్యుండు కన్యాగతుం
డై వర్తిల్లెడివేళఁగూడ ఖలులౌ నస్మత్కులస్థాలిచేఁ
గావింపంబడవయ్యె శ్రాద్ధములు. క్షుత్కార్శ్యంబు ప్రాప్తించెమా.
కీవేదిక్కిఁక. మున్నటట్లు చెపుమీ యేదో ప్రతీకారమున్. ౧౧౦

తే॥ ఏటికొకపరి మా కన్నమిడనివంశ్యు లున్ననొక్కటె. పేర్మాసి చన్ననొకటె.
వీఁక వంశక్షయంబైనఁ గాకపోయెఁ. బుడమిఁబడియుండుచుంటిమి పోయి సుగుడ”

క౦॥ అనవిని వనజాసనుఁ డాత్మను యోజనచేసి తడవు తద్దయుఁగృప ని
ట్లను. “ మీర లెప్పటికి ముదమెనయఁగనగు చిన్నియనువు సెఱిఁగితి వినుఁడీ ౧౧౨

— గయాశ్రాద్ధము. —

ఆ॥ ఒక్కసారియేని మిక్కిలిశ్రద్ధమై గయను మిమ్ముఁగూర్చి కవ్యమిడినఁ
దత్ప్రభావమునను దప్పక దివ్యత్వ మెనయఁగలరుమీర. లింత నిజము. ౧౧౩

సీ॥ బ్రహ్మహత్యందొట్టి బహుపాతకంబులం గావించినటువంటి కటికరుని
రౌరవంబునఁగూలి రోరూయమాణుఁడై యుండినయటువంటి మొండిరోని
పెద్దకాలమునుండి తద్దఁ గుంభీపాక మనుభవించు కృతఘ్నుమనుజుఁడేని
దయ్యమైపట్టి తత్తర్జనంబులచేతఁ జెప్పుదెబ్బలుతిను చెనటియేని

స్వీయవంశజుఁ డేల గయాశీర్షమునకుఁ బోయి శ్రాద్ధంబుఁ బెట్టినఁ బూర్వకృతము
లైన దుష్కర్మముల ఫల మవలఁ ద్రోసి మోక్షసామ్రాజ్యపదవిని బొందఁగలుగు.

ఆ॥ ఈ సుసూక్తము శ్రవణించి యింక మనుజు లధనులయ్యు గయాశిరమందు మీకుఁ
బెట్టుదురు శ్రాద్ధ మొక టేని పితరులార! ముక్తినిచ్చు నయ్యది వ్యక్తమగును"

క॥ అనియిట్లు చెప్పిరార్యుల కనుజ్ఞ యిచ్చుటయుఁ బోచ్చి రాత్మపదము. లా
దినము మొదలుగాని యొప్పడిరియును శ్రాద్ధము లాత్రిపురుష మిల భూపాలా! ౧౧౬

ఆ॥ బ్రహ్మ మొదలుచేసి పరలోకగతులైన స్వకులజులగు తలంచి శక్తికొలఁది
నంతె నుండి ద్విజుల కలిగిన దిను మంటి కంటకం బెఁబూర్వమవని నాథ! ౧౧౭

ఆ॥ ధారుణీశ్వరా! యుక్తి కల్గ మీరయిన. యొక్టి పేదయేని పెట్టఁగలుగు.
మర్త్యులందు బితా శ్రేష్ఠ గృహస్థులు గూడ నిక్కార్యమందుఁ దృప్తిగాంచఁగలరు. ౧౧౮

ఆ॥ కాన నుంచి తెలిపికలవాఁడు శ్రాద్ధంబు సలుపవలయు నిట్టిసమయములను.
నిహముఁ బరముఁ గోరెనేని విశేషించి గయను బిండమీయఁ గడఁగవలయు. ౧౧౯

క॥ పితరులు తను కమనస నీక్షించె నెవఁడును శ్రాద్ధవిధిని జేయకయున్నన్
పితృగణసౌగణమునకుం బ్రతిశ్రుణము నేయుచుంద్రు పవలును రేయున్. ౧౨౦

క॥ జలదాగమనంబునకై యిలఁ గర్షకజనులవోలె నెంతయు శోకా
కులులై జూచు పడియుందురు నల పితృపక్షంబుగూడ నరిగినపిదపన్ ౧౨౧

శా॥ కన్యారాశిని సూర్యుఁడుండువఱకుం కంకన్ వంశజుండైన యే
ధన్యుండో యిడుఁ బిండమంచు మని యాతర్వాతఁ గూడం గడున్
దైన్యంబూని యుహూస్కరుండు తుల మన్ దాఁకన్ నిరీక్షింతు రో
మాన్యా! వారల నైరాస్య మింక వచియింపన్ నోరులా. దేమనన్. ౧౨౨

ఆ॥ ఎదురుచూచి చూచి యినుఁడు వృశ్చిక రాశియందుఁ జొచ్చుటయు నిరాశులగుచు
నెవరి స్థానములకు నేగుదు రవార్య లబ్ధిమేఖలాసహస్రనయన! ౧౨౩

ఆ॥ వాయుభూతులగుచు వాకిటం బడియుంద్రు రెండు నెలలు గూడ నిండువఱకు
నగులపితరు లట్లు తరణి కన్యం దులఁ గ్రాలునెడను దర్శఁ గాళ్యపీశ! ౧౨౪

తే॥ కానఁ బితృతృప్తివాంఛించు మానవాళి యాచరింపంగవలె శ్రాద్ధ మధికనిష్ఠ.
నజుఁడునుడివినవదువృస నన్వహమును నువ్వులును నీళ్ళు విడువనౌను జననాథ!

ఉ॥ విత్తసమృద్ధి లేదనుచు విజ్ఞుఁ డమాతిథి శ్రాద్ధకర్మమున్
బొత్తిగ మానఁగూడ. దటిపోవిడిసన్ రవి కన్యనుండున
న్నైతెలఁగేని చేయవలె. నిద్దియుమాన గయన్ విధింపనౌ.
విత్తేముఁ బెట్టు శ్రాద్ధమున నిండుఫలంబు ఘటిల్లుఁ గావునన్. ౧౨౬

చం॥ ఎదినను బ్రశ్న సేసితివో యింతయుఁ జోవిడ కద్ది యంతయున్
గదితమునీవు. దీననికఁ గర్మములెల్ల రమాభిధానమా
సుదినమునందునన్ మఱియు సూర్యుఁడు కన్యవసించునప్పుడున్
బ్రథితగయాశిరంబునను శ్రాద్ధముఁ బెట్టి కృతార్థులౌనటుల్. ౧౨౭
కం॥ ఎవఁడీ శ్రాద్ధోత్పత్తిని సవధానతమైఁ బఠించు శ్రవణించును వాఁ
డు విముక్తసకలదోషుం డవు శ్రాద్ధఫలంబుగూడ నతనికిఁ గలుగున్. ౧౨౮
కం॥ శ్రాద్ధముఁ బెట్టెడిచుపు డీ శ్రాద్ధోత్పత్తి కడు శ్రద్ధఁ జదువంబడఁ ద
చ్ఛ్రాద్ధం బక్షయఫలమగు. సద్ధాత్రీరమణ! ఛిద్రసంచయ మెడలున్. ౧౨౯
సీ॥ శాస్త్రనిషిద్ధ దుష్టద్రవ్యములు పెక్కు పాకంబునం జేర్పఁబడును గాక
తృప్తాస్మయననైనఁ దెలియని బ్రాహ్మణుల్ విధిదూరముగ సంభవింత్రు గాక
భోక్తలు తుష్టిగా భుజియింపనొల్లని సుఖహానులగుచుఁ బొల్చుదురు గాక
మంత్రంబు లపశబ్దమహితంబులై విద్వదురరీకృతములు కాకుండుఁ గాక
యీ నృదేవపితృనిదాన శ్రాద్ధోత్పత్తి శ్రవణపఠనముల ససంశయముగ
క్ష్మాబిడౌజ! యగును సర్వము సంపూర్ణ" మనుచు నాతఁ డిట్టులనియె మఱియు

—♦ శ్రాద్ధవిధి. ♦—

కం॥ "ఏవిధిచే శ్రాద్ధంబును గావింపఁగవలెనో చెపుము కార్త్స్న్యంబుగ నా
కో వాచంయమనాయక! యావిషయమునందు శ్రద్ధ యధికం బయ్యెన్"
కం॥ అనియిటు వాక్రుచ్చుటయును మునివర్యుం డతనిదిక్కు మొగమై "వినుమో
జనపాలక! వచియింతును ననయముఁ బితృతృప్తిహేతువగు శ్రాద్ధవిధిన్. ౧౩౨
సీ॥ పుణ్యకార్యము లెవో పొనరింతుమను నెపంబున గడించిన యర్థమునను గాక
యెఱుఁగని పెనుదోవ మెదొ మీఁద వైచి లంచముతీసికొన్న విత్తమునఁ గాక
యత్యర్ఘములు సెప్పి యధికమారౌపాయముల సంతరించిన కలిమిఁ గాక
తస్కరత్వమున నింతయు నేని కృప యాత్మ లేక యార్జించిన లబ్ధిఁ గాక
సత్ప్రతిగ్రహ లోకరక్షావిధాన పణ్య కృషికర్మములనుండి ప్రాప్తమైన
ద్రవ్యమున విప్ర బాహుజోరవ్య శూద్రు లాచరింపంగవలె శ్రాద్ధ మవనినాథ!
తే॥ అట్టి సకలపదార్థంబు లాహరించి పూర్వదివసంబు మునిమాపె పూతుఁడగుచు
బ్రాహ్మణులయిండ్లకేగి సభక్తికముగ వారి నామంత్రణము సేయవలెను భూప!
తే॥ యతుల నామంత్రణముచేయనగును. వారు సంభవింపకయున్న చో స్నాతకులను
వారలుంగూడ దొరకని పక్షమున గృహస్థులం బిల్వవలయును నైదుగురిని. ౧౩౪

## —* శ్రద్ధార్హులగు బ్రాహ్మణులు. *—

సీ॥ బహుకుటుంబికులు పావనతము లాహారనియమంబుగాఁ బింప నేర్చువారు
అపరవయోన్వితు లధ్యానపేతులు షట్కర్మములు శద్ధ జరుపువారు
ఆరోగ్యసంయుక్తు లఖిలసద్గుణయుక్తు లంగలోపములేక యలరువారు
ఆత్మవేత్తలు నిరతాగ్నిహోత్రులు వేదశాస్త్రంబులం జక్కఁ జదువువారు
అవని శ్రాద్ధకృతుల నామంత్రణముసేయఁ దగినయట్టివారు ధరణిపాల!
తగనివార లెవరొ తద్బ్రాహ్మణబ్రువుల్ కీర్త్యమాణు లాలకింపు మింకను. ౧౩౬
సీ॥ అధికాంగయుతులు హీనాంగులు సర్వభక్షుకు లపాంక్తేయులు శౌచహీను
లామయగ్రస్తులు నన్వృతవాదులు వ్యర్థదంతులు వేదశాస్త్రవిరహితులు
వేదవిక్రయకులు వేదవిప్లవకారు లాచారవర్జితు లతికృశాంగు
లతిదీర్ఘు లతికాయు లపవాదసంయుతు ల్గురుతల్పగులు నాస్తికులు ప్రమత్తు
లన్నకన్న మున్న యాచరితోద్వాహు లట్లు పూర్వమైన యాహితాగ్ను
లధ్వరములొనర్చు నవ్వారుగూడ శ్రాద్ధములఁ బనికిరారు ధరణినాథ! ౧౩౭
సీ॥ వడ్డివ్యాపారంబువలన జీవించువా రంగళ్ల సరకులనమ్మువారు
శిల్పంబు వృత్తిగా స్వీకరించినవారు చౌర్యంబె మనుగడసలుపువారు
క్ష్మాపతికడఁ జేరి చాడీలు చెప్పువా రత్యంతదాంభికులైనవారు
పుంస్త్వహీనులు రోమభగ్నులు నిర్లోము లన్యహింసకులు కృతాయుధులును
గోతివన్నె పండ్లు కునఖము ల్గలవారు మంచిపెండ్లమును త్యజించువారు
తల్లి దండ్రి వీడి దవ్వులమనువారు కారు శ్రాద్ధయోగ్యు లోరసేశ! ౧౩౮
సీ॥ నిజగోత్రమునను జన్మించినవానిని బ్రివరలో నైక్యమేర్పడినవానిఁ
జేసిన మేలు మఱచినయట్టివానిని స్వయముగా సేద్యంబు సలుపువాని
గోచియు మొలత్రాడు గూడ లేనటువంటివాని వికర్మస్థుఁడైనవానిఁ
బరకాంతతోడఁ గాఁపురము సేసెడివాని నజ్ఞాతకులుఁడైనయట్టివాని
వంధ్యకును నష్టసంతానవతికిఁ బెండ్లికాకమున్నె రజస్వలయౌ కలికికి
భర్తయగువాని వర్జింపవలయు శ్రాద్ధములను బితృగౌరవం బాత్మఁ గలిగెనేని.
ఆ॥ ఇంక మొదటినుండి యెవ్వరు పంక్తిపావనులటంచు ఖ్యాతివడసినారొ
యెవరు శ్రాద్ధకృతుల నెంతయు శస్తులో వారలను వచింతు ధీర! వినుము. ౧౩౯
సీ॥ ఇలను త్రిణాచికేతులు త్రిసుపర్ణులు త్రిమధువు లంగషట్కమహితులును
విద్యావ్రతస్నాత వివిధపురాణజ్ఞ ధర్మశాస్త్రాధ్యేతృ తత్త్వవిదులు

జ్యేష్ఠసామాథర్వశిరముల నెఱుఁగువా ర్కృతుగాములు పరోపకారరతులు
మృష్టాన్నభోక్తలు మృష్టవాక్యులును సద్యఃక్షాళకులును సత్కర్మకరులు
ప్రియత దౌహిత్ర జామాతృ భాగినేయ జాపకులు పంక్తిపావను ల్మ్రానుహేంద్ర!
తన్మిళిత నింద్యులేని శ్రాద్ధములఁ గుడిచి పితరులను దన్పుచురు కులయుతు లెట్టైన.

ఉ॥ కాన బహుప్రియత్నములఁ గన్గొనవాను గులంబు పూర్వ. మా
హైని తదీయ శీలమును బ్రియ మెఱుంగఁగనాను. గన్యకా
దానము శ్రాద్ధకర్మమును దత్పరతం బొనరించువేళలం
దీనియమంబు పూనవలె నెల్లద్విజాతులు మానవేశ్వరా! ౧౪౨

చం॥ కులమును శీలముం గలుగు కూళలనైనను శ్రాద్ధభుక్తికిన్
బిలువఁగవచ్చుఁ. గన్యనిడి పెండిలిసేయఁగవచ్చుఁ. గాని యా
కులమును శీలముం జెడిన కోవిదవర్యునకైనఁ గూడ. దా
లలినొనరింప భస్మమున లాజలు వేల్చినయట్లు లయ్యెడిన్. ౧౪౩

ఆ॥ కాన నల్పవిద్యు నేని కులాచారసహితుఁ బిలువవలయు శ్రాద్ధమునకు
సోఁకదంపినట్లు లూషరక్షేత్రంబునందు విత్తినట్లు లన్యుఁబిలువ. ౧౪౪

కం॥ ఈవిధ మటువంటి మహీదైవతముల గుర్తెఱింగి తత్పదయుగమున్
బావనముఁ బాణియుగి సద్భావనఁ బట్టుకొని మ్రొక్కి పదపడి భక్తిన్. ౧౪౫

శ్లో॥ "ఆగచ్ఛంతు మహాభాగా విశ్వేదేవా మహాబలాః
యే అత్ర విహితా శ్శ్రాద్ధే సావధానా భవంతు తే"

కం॥ అని కుడిమోకాల్ధరనిడి వినయంబున విన్నవించి విశ్వేదేవా
యనమం దిరువురువిప్రుల మును పామంత్రింపవలయు భూవరతిలకా! ౧౪౬

తే॥ అంత నపసవ్యముగఁదోఁగ్రి యజ్ఞసూత్ర మొగిని బిత్రగ్రముగ నొక్కరొక్కరికిని
మువురుముప్వురుద్విజులనో మువ్వురికిని మువురనో యొక్కరునో పిల్వనను మహీశ!

ఆ॥ మాతృపక్షమునను నీతిరెవిధిగాన నవలఁ దన్మహీసురాంఘ్రులను బ
రిస్పృశించి ప్రియతహృదయతఁ బితృభక్తి వక్ష్యమాణముక్తి వలుకవలయు.

కం॥ "నాతండ్రియుఁ దాతయు ముత్తాతయు నీదేహమందుఁ దారుందురుగా
కాతతెనియమముదాలిచి ప్రీతిని నీవుందుగాక పృథ్వీశమరేంద్రా!" ౧౫౦

కం॥ అని పితరుల మాతామహులను బిలువఁగవలయుఁజూ యిలాగరమణా! యు
ల్లన యజమానుఁడు ద్విజులును మనవలయును బ్రహ్మచర్యసహితముగాఁగన్॥

కం॥ శాంతమనస్కత నా రేయంతయు వెల్లించి పిదప నరుణోదయమనా
నంతకె మేల్కొని తదహ మొకింతయుఁ గోపంబులేక యొసఁగఁగవలయున్॥

సీ॥ స్వాధ్యాయపాఠంబు సల్పంగాఁజనదుచూ యాన ర్తభూపాల! యాదినమునఁ
గుత్సితంబగుచేఁతకుం దిగఁదగదుచూ యవనీతలాధ్యక్ష! యాదినమున
నభ్యంగనము సేయ నర్హంబుగాదుచూ యంభోధిగంభీర! యాదినమున
దూరప్రయాణంబు దూషితంబగునుజూ యాశ్రితావనదీక్ష! యాదినమున
యానమును శ్రమంబు నానాఁడు నింద్యంబు లట్టులుండి సూర్యుఁ డభ్రమధ్య
గతుఁడుగాఁగఁ గుతపకాలంబునం దాడి ధవళవస్త్రములను దాల్చి యంత

కం॥ పితృతర్పణముం బొనరిచి గతదినమునఁబిల్వఁబడిన ఘనవిప్రులఁ గు
త్సితజనులు చూడకుండఁ బ్రియతగృహమధ్యమునఁజేర్చి యర్చింపవలెన్. ౧౫౪

సీ॥ శ్వ వరాహ ఋతుమతీ వర్ణచ్యుతుల్చూచు శ్రాద్ధంబు వ్యర్థంబు క్ష్మాబిడౌజ!
తైలాక్త పర్యుషిత సకేశ భక్తమౌ శ్రాద్ధంబు వ్యర్థంబు సాధుచరిత!
దక్షిణా హీన శబ్దస్వచ్ఛతల్లేని శ్రాద్ధంబు వ్యర్థంబు సత్యవచన!
ప్రస్ఫోటన ఘరట్ట భవశబ్దసహితమౌ శ్రాద్ధంబు వ్యర్థంబు క్షత్రవర్య!
కలహ పంక్తిభేద కలితమౌ శ్రాద్ధంబు బట్టబయటఁబెట్టఁబడెడి శ్రాద్ధ
మగ్ధభక్త ఘృతపయస్సులు గలశ్రాద్ధ మగును వ్యర్థ మోయహార్యధైర్య! ౧౫౫

తే॥ సంధ్యలను రాత్రిఁ బూర్వాహ్ణ సమయమునను బెట్టుశ్రాద్ధంబునందుండ దెట్టిఫలము
పొట్టుగింజలు నుచ్ఛిష్టమును గలసిన శ్రాద్ధమును వ్యర్థమగు రాజచంద్ర! వినుము.

తే॥ బ్రహ్మచర్యంబు వహియింపవలసియుండుఁ గర్తయునుభోక్తలును శ్రాద్ధకాలమందు
అట్లుగాకున్నఁ దచ్ఛ్రాద్ధ మగును వ్యర్థ మోమహీపాల! చెప్ప నింకేమిగలదు.

## శ్రాద్ధార్హకాలములు.

తే॥ ఎట్టికాలంబులం దెవ్వి యీయఁబడిన శ్రాద్ధ మక్షయఫలమగు నిద్ధరిత్రి
నట్టికాలంబులును వాని నవనిపాల! చెప్పెదనువిను సవధానచిత్తమునను. ౧౫౬

శా॥ శ్రద్ధాపూతమనస్కుఁడం దిలలతో సంమిశ్రితంబైన యా
శుద్ధాంభఃకణమేన్ బితాళ్ళకొఱ కిచ్చో నీయఁగాఁబడ్డదై
యిద్ధాత్రిస్థలి నక్షయంబగునో యా యేనోహరంబుల్ మహీ
భృద్ధీరా! వచియించెదన్ విను పితృప్రీత్యర్థ మన్వాదులన్. ౧౫౭

సీ॥ మాఘశుక్లతృతీయ మఱి సప్తమీతిథి భాద్రతృతీయయు ఫాల్గునామ
యిషశుద్ధనవమి పౌషైకాదశీతిథి యాషాఢమాసంపు టాద్యదశమి
బాహుళద్వాదశి బహుళనభోష్టమి శుచి కార్తికిక చైత్ర శుక్ర ఫాల్గు

నికపూర్ణిమలు ధరణీపాల! మన్వాదు-లవ్వానియందుఁ గృతాపగాహుఁ
డగుచుఁ దిలదర్భసమ్మిశ్రితాచ్ఛజలము నేని పితృదేవతలఁగూర్చి యిచ్చువాఁడు
పొందు నిందును నందును బూర్ణసౌఖ్య మన్నవస్త్రాదిదాతల నడుగనేల. ౧౬౦

ఆ॥ వేనికీర్తనమున నానాఁటి యేనస్సు రూపుమాయఁగలదొ రూఢముగను
బితరులకుఁ గరంబు ప్రీతిపాత్రంబైన యాయుగాదు లధిప యాలకింపు॥ ౧౬౧

సీ॥ వైశాఖసితపక్షవర్తియైనతృతీయ కృతదుష్టవ్రాత! కృతయుగాది.
కార్తికమాసాగ్రవర్తియౌనవమి సంస్థాపితసుపథ! త్రేతాయుగాది.
భాద్రపదాసితపక్షత్రయోదశి పాలితశిష్ట! ద్వాపరయుగాది.
మాఘమాసీయమహామహితామవాస్య ప్రాకటమానవాధీశ! కలియుగాది.
స్నానదానహోమజపపైతృకంబులం దాచరించుపుణ్య మక్షయంబుఁ
జేయు నయ్యుగాదు లోయిలారమణ! మహాఫలంబులవ్వి యాగమిచారు.. ౧౬౨

ఆ॥ మేషతులలలోనఁ బూష ప్రవేశించు దినము విషువసంజ్ఞనెనయు. నట్లెదు
మకరకర్కటముల మనఁజను దిన మయనాఖ్య. మందు విషువ మగును మిన్న.

కం॥ రవి రాశి సంక్రమించెడిదివసము సంక్రాంతి. శ్రాద్ధదేవార్చనలం
దవి క్రమముగా మహాఫల నవనిజనావళి కొసంగు నానర్తవిభూ! ౧౬౩

తే॥ శ్రద్ధలేకుండనైనను నెద్ది దత్త మే యసత్పాత్రములయందొ యొడ్డిదత్త
మద్ది యప్పుడె యక్షయమగును భూమిపాల! సంక్రాంతిమున్నగు కాలములను.

## —* శ్రాద్ధనిర్ణయము. *—

కం॥ శ్రాద్ధము శ్రద్ధామూలము. శ్రాద్ధాఖ్య యదేకతముగ సంసిద్ధం బో
యిద్ధమహీనాయక! యది శ్రద్ధంగావింపఁబడిన సఫలంబగుఁ జూ.

తే॥ ఉర్విపైఁబడు విప్రపాదోదకమున ము న్నపుత్రకులై మృతింగన్న యట్టి
గోత్రజాతులు సుధనుండి యాత్రివిష్టపమున సురలట్లు సంతృప్తి వడయఁగలరు.

తే॥ విప్రపాదోదకంబున విపుల తడిసి యెంతవఱ కాఱకుండునో యంతవఱకుఁ
దామరాకులదొప్పలతో మహీశ! త్రావుదురుతజ్జలము పితృదైవతములు. ౧౬౫

తే॥ శ్రాద్ధముం బెట్టునటువంటి సమయములను నుర్విపైఁబడు పుష్పగంధోదకమున-
నన్నమునుదిను గృమికీటకాహిముఖ్య జన్మములఁబొందినటువంటి స్వపితృగణము.

తే॥ వడిగ నపమృత్యువెనసిన వంశజులకుఁ బ్రేతలైయున్న స్వకులసంజాతులకును
బాత్రలనుగడ్డుమీఁద నీగోత్రఁబడినయట్టి యుచ్ఛిష్టమునఁ దృప్తియగును భూప!

ఆ॥ సంస్కరింపఁబడక చచ్చినవారలుం ద్యాగమొనరిచిన కులాంగనలును
స్వకులజుం డొసంగు వికిరాన్నమునఁ దృప్తిఁగాంచఁగలరుచుమ్ము కాశ్యపీశ!

## శ్రాద్ధకర్తృభోక్తృ నియమములు.

తే॥ మంత్రమున లోపమున్నను మఱి సవిధిగఁ బెట్టకున్నను యుక్తమైనట్టివేళ
సలుపకున్నను శ్రాద్ధ మత్యలఘుదక్షిణాయుతంబైన సంపూర్ణమై యెసంగు.

తే॥ కానఁ బితరులకుం దన కో నృపాల! నిత్యతృప్తినిగోరు మనీషులెల్ల
దక్షిణాహీనముగఁ బెట్టఁదగదు శ్రాద్ధ. మింతకన్నను వచియింప నేమిగలదు?

తే॥ చవిటినేలను గురియు వర్షంబుపగిది బధిరునెదుటను బాడెడి పాటభంగి
నంధకారంబునందాడు నాటవోలె దక్షిణాహీనమైన శ్రాద్ధము వృథయగు. ౧౨౮

తే॥ శ్రాద్ధకర్తయు భోక్తయుం దద్దినంబునందు నిష్కాములై యుండవగు మహీశ!
యాచరింపంగఁదగదు స్వాధ్యాయపఠన. మితరసంవసథంబున కేగఁదగదు.

తే॥ శ్రాద్ధదినమున భామినీశయ్యమీఁది కేగు కర్తల భోక్తల యింద్రియంబుఁ
దినును దన్మాసమెల్ల బితృవ్రజంబు. రతియొనర్చిన నొకవత్సరంబు గుడుచు.

తే॥ శ్రాద్ధముం బెట్టి తినియును శ్రద్ధతోడ నయ్యహమునందు స్వాధ్యాయ మధ్యయనము
సల్పునటువంటివారు వత్సరమునకును వ్యర్థతచ్ఛ్రాద్ధఫలులయి వ్యథపడుదురు.

తే॥ శ్రాద్ధముం బెట్టియేనియు శ్రాద్ధమున నిమంత్రితుండయియేని యేమానవాధ
ముండు గ్రామాంతరమునకుం బోవువాఁడు శ్రాద్ధమంతయు వ్యర్థముం జలుపు భూప!

తే॥ శ్రాద్ధనియమములఁ దఱచెంచి సవిధముం దె యుండఁ దచ్ఛ్రాద్ధభోజన మొరుఁడొనర్ప
గూడ. దట్లు లొనర్చినవాఁడే కాక కర్తయును దుర్గతిం గూలఁగలఁడు దాన.

కం॥ శ్రాద్ధముఁ బెట్టినవాఁడును శ్రాద్ధాన్నముఁ దిన్నవాఁడు శ్రాద్ధదినమునన్
గ్రుద్ధత నితరులతోఁ గలహోద్ధతులై రేని వ్యర్థులో నృప! వారల్. ౧౩౦

ఆ॥ కాన యత్నపూర్వకముగ నీ కార్యము ల్సల్పఁదగదు వారు శ్రాద్ధదినము.
కర్తభోక్తృఁడీర్పఁగలుగు కామ్యశ్రాద్ధముల వచింతు వినుము భూప! యింకను.

## కామ్యశ్రాద్ధములు.

సీ॥ గుణరూపములఁ గల్గు కొడుకులం గోరుచో భాద్రశుక్ల ప్రతిపద్దినమున
ఘనరూపసంయుక్తకన్యకం గోరుచో నదియుపక్షపు ద్వితీయాదినమున
ననిలవేగములైన యశ్వంబు లగోరుచో నావలిదగు తృతీయాదినమునఁ
బశుపంచలోహము ల్పడయంగఁ గోరుచో మీఁదటిదగు చతుర్థి దినమున
మంచికొడుకులఁ గోరుచోఁ బంచమిని స్వవంశజులపల్లఁ బరలోకవర్తియగుచు
శ్రాద్ధముం బొందఁగోరుచో షష్ఠినాఁడు పెట్టవలె శ్రాద్ధముం బితృప్రీతిపొంద.

సీ॥ సప్తమి శ్రాద్ధంబు జరిపినవారికి గ్రైష్మశారదకృషిం గలుగు సిద్ధి.
యష్టమి శ్రాద్ధంబు నాచరించినవాఁడు క్రయవిక్రయక్రియ ఘనతఁగాంచు.
నవమీతిథిం గృతాన్న శ్రాద్ధుఁడగువాఁడు సౌభాగ్య రోగనాశనములొందు.
దశమీదినమున శ్రాద్ధముఁబెట్టువానికి సర్వకార్యములును సఫలమగును.
నవల నేకాదశిని శ్రాద్ధ మట్లు చేయ ధనము ధాన్యంబు రాట్ప్రసాదంబు నొనరు
ద్వాదశీశ్రాద్ధదాత దాఁ బ్రవరులైన పుత్రకుల నిష్టపశువులం బొందు నధిప! ౧౮౩
కం॥ తనకుం బితరులకును ముక్తినిగోరు నెవండు సంతతిం బొందకయే
మనియెడి నెవఁ డవ్వానికిఁ జనును త్రయోదశిని శ్రద్ధ శ్రాద్ధము జరుపన్. ౧౮౪
తే॥ సంతతింగోరువాఁడు తచ్ఛ్రాద్ధకర్మ మాచరించిన వంశక్షయంబయగును.
ద త్త్రయోదశియందు సంతానవృద్ధి యనభిహితమయ్యె వేదంబునందదేమొ.
తే॥ భాద్రబహుళత్రయోదశి భక్తితోడ శ్రాద్ధముంబెట్టు పుత్రవర్జనము మాకు
లమున లేకుండుఁగాకని లలిని బితరు లాత్మ వాంఛించుచుండెద రన్వహంబు.
కం॥ హరిహయుఁడు మున్ త్రయోదశి విరివిగ శ్రాద్ధంబుజరుప వెన్వెంటనె తా
మరణించెను దత్తనూజుఁడు. ధరణీశ! సపుత్రకుండు తగ దది పెట్టన్. ౧౮౭
ఆ॥ జ్వలన జల విషాహి శస్త్రాదికముచేత నీల్గి నరకబాధ లెనయు వంశ
జు లుద్ధరింపఁగలరు క్షోణీశ్వరా! చతుర్దశిని బెట్టునట్టి శ్రాద్ధమునను.
కం॥ ఇఁక దర్శశ్రాద్ధక్రియ ప్రకటంబే. యది యొనర్పఁ బడయును దత్ప్ర
క్ష్నకలశ్రాద్ధంబుల ఫల, మకలంకా! యేల పెక్కు వ్యాహారంబుల్. ౧౮౯
కం॥ ఇవి కామ్యశ్రాద్ధంబులు. వివరంబుగ నీనివిధము వినుజనులును న
య్యవి చేసినవారొందెడి యవితథఫల మొందఁగల రిలాధిప! రూఢిన్. ౧౯౦

## —* శ్రాద్ధార్హద్రవ్యసృష్టి *—

ఆ॥ సస్యముల సృజించు స్రష్టచే నిర్మింపఁబడియెం దిలలు భూప! ప్రథమమందు.
అందువలన నవ్వి యతిపవిత్రంబులై పైతృకముల వాడఁబడుచు నుండె. ౧౯౧
ఆ॥ పుష్పజాతులందుఁ బూర్వము శతపత్రి సృజనసేయఁబడియె నజునిచేత.
నదియె హేతువునను నాన స్త భూపాల! ముఖ్యమయ్యె శ్రాద్ధములను నదియు.
కం॥ ధాతువులను సృజియించుచు నాతం డల రూప్యజాతి నాదిని జేసెన్.
ప్రీతులఁగావించెడి నదె హేతువుచే దక్షిణలను నిద్ది పితాళ్ళన్. ౧౯౩
ఆ॥ రజతపాత్రలందు ద్విజహస్తములఁ బితృప్రీతికొఱకె దేని పెట్టఁబడినఁ
గలుగ దయ్యుగాంతకాలంబునందేని యంత మాపితాళ్ళ కవనినాథ! ౧౯౪

తే॥ వెండిగిన్నెలు లేని యుర్వీసురుండు వాని పేరేని కీర్తింపవలసియుండుఁ
గీర్తనంబునఁగూడ నానర్తభూప ! సంతసింతురు పితరులు శ్రాద్ధమందు. ౧౯౫
కం॥ రసములలోపల నధిపా ! వెస మధువును దా సృజించె విధి ప్రథమమునం
దసమానమగుచు నటు తద్రసము పితాళ్ళను గరంబు తనిపెడి జగతిన్. ౧౯౬
కం॥ మృష్టాన్నవిశిష్టంబై యిష్టంబగు నితరరసము లెల్లఁ గలిగియున్
దుష్టియిడ దప్పితాళ్లకు స్పష్టంబుగ మధువులేని శ్రాద్ధము భూపా ! ౧౯౭
ఆ॥ అంతో యింతో శ్రాద్ధమందున స్వచ్ఛమౌ మధువులేనియెడల "మధువుమధు"వ
టని తదాఖ్యయేని ఘనతఁ గీర్తింపనౌఁ బితృగణంబు తృప్తిఁ బెట్టఁబొంటె. ౧౯౮
కం॥ శాకముల వరుసలోపల నా కమలాసనుఁడు తా నిలాధిప ! కరివే
పాకును సృజియించినవాఁ డాకారణమునఁ బితాళ్లకది తృప్తియిడున్. ౧౯౯
ఆ॥ కాలసృష్టిఁ గుతపకాలంబు మొదలయ్యె నట్లుగాన దానియందె పెట్ట
నగును శ్రాద్ధకర్మ మాత్మకుం బితరుల కెపుడు సౌఖ్య మిచ్చయించు బుధుఁడు.
కం॥ వీరుతృణసృష్టిని దర్భలు ప్రారంభమునందుఁ జేయఁబడి యుండుటచే
నోరాజవర్య ! యయ్యవి యీరస శ్రాద్ధార్హమయ్యె నేమనవలయున్. ౨౦౧
ఆ॥ శ్రాద్ధయోగ్య భూసురవ్రజసృష్టి దౌహిత్రు లాద్య్య. లంగహీన సమధి
కాంగ శౌచహీనులైనను యోజ్యులు శ్రాద్ధములఁ బితాళ్ళ సంతసింప. ౨౦౨
ఆ॥ పంకజాసనుండు పశువుల సృజియింప నావు లాదిఁ బుట్టె. నందువలన
వాని పాలు నెయ్యి యానర్తభూపాల ! శ్రాద్ధములను గడుఁ బ్రశస్తమయ్యె. ౨౦౩
కం॥ అజుని ప్రజాసృజనక్రియ ద్విజులును నస్వప్నసృష్టి విశ్వేదేవుల్
భుజభవ ! మొదలేర్పడి రెల్లజనులు శ్రాద్ధముల వారలను మును గొలువన్. ౨౦౪
కం॥ ఆవిశ్వేదేవతలు యథావ త్ప్రథమార్చితులయి తగు రక్షణమున్
గావింతురు శ్రాద్ధంబుల. నేవిధమగు ఛిద్రములును నిఁక నుండ వటన్. ౨౦౫
తే॥ యిట్టి ముఖ్యపదార్థంబు లేరుపఱచి స్రష్ట సృష్టించెఁ బూర్వంబు శ్రాద్ధకర్మ
మంత వేల్పులు నిర్మితులైరి. కాన వార లత్యంతవిఖ్యాతులైరి మున్ను. ౨౦౬
కం॥ పితరులకిచ్చినదానికి క్షతిలేనటుచేయు శ్రాద్ధసర్వస్వము నే
నతిగుహ్యము నీకుం జెప్పితి నానర్తావనీశ ! పృథుతరకోశా ! ౨౦౭
కం॥ శ్రాద్ధము పెట్టంబడునెడ బద్ధశ్రద్ధను భుజించు బ్రాహ్మణుల కడన్
శుద్ధత నిది చదివినఁ దచ్ఛ్రాద్ధం బగు నక్షయంబు క్ష్మాపాలమణీ ! ౨౦౮
ఆ॥ చాలశ్రద్ధ దీని శ్రవణించునవ్వాఁడు విహితమైన శ్రాద్ధవిధి నొనర్చు
వాఁడు వడయు ఫలము వడసెడి నానర్తమనుజనాథ ! శత్రితసమస్తగాథ ! ౨౦౯

## —♦ శస్త్రాదులవలనఁ జచ్చువారికిఁ బెట్టు శ్రాద్ధము ♦—

సీ॥ శస్త్రంబువలనను జచ్చినవానికి నపమృత్యువశుఁడైన యట్టివాని
కుపసర్గమున మృతినొందినవానికి విషమునఁ బ్రాణము ల్విడుచువాని
కాశుశుక్షణి దగ్ధుఁడైనట్టివానికి జలములలోఁబడి సమయువాని
కాశీవిషవ్యాఘ్రహతుఁడైనవానికి నుద్బంధనంబున నొరగువాని
కల్ల భాద్రచతుర్దశియందు శ్రాద్ధమాచరించినఁ దృప్తియగు నవనిపాల!”
యనుడు నానర్తధరణీశుఁ డమ్మునీంద్రు నీక్షణముచేసి భక్తిమై నిట్టులనియె.
ఆ॥ “ఏల శస్త్రహతుల కీభాద్రపద చతుర్దశి విధింపఁబడియె శ్రాద్ధకర్మ?
మన్యులకు మ తేల యానాఁ డనుక్తంబు? సంశయాస్పదంబు చాల నిద్ది. ౨౧౧
క౦॥ ఏకోద్దిష్టంబు సపిండీకరణంబును బ్రశంసనీయంబులు గా.
వేకారణమున నానాఁ డాక్రియ లర్హంబులయ్యె ననఘా! చెపుమా. ౨౧౨
తే॥ శ్రాద్ధమంతయుఁ బెట్టుచు సంయమీంద్ర! యట విశేషించి పితృపక్షమందుఁగూడఁ
బార్వణముసేయ వచ్చెడి పాపమేమి? తెలుపు మెందుల కది నిషేధింపఁబడియె?”
క౦॥ అనియిటు వాక్రుచ్చుడు ముని “యనఘ! హిరణ్యాక్షుఁడనెడి యసురుఁడు పూర్వం
బునను బృహత్కల్పంబున ఘనసురలకు భయదుఁడగుచుఁ గడు ఘోరుండై ౨౧౪
తే॥ బ్రహ్మఁగూరిచి తపముండి బహువిధముల నట విశేషించి భాద్రపదాఖ్యమాస
బహుళపక్షచతుర్దశిం బ్రస్తుతింప నెంతయును మెచ్చి యతఁడప్పు డిట్టులనియె.
శా॥ “సంతోషించితిఁ. జెప్పు వాంఛితము. వత్సా! యద్ది యీరాని కొం
డంతైనన్ బదులాడ కిచ్చెదను” నా నయ్యాతుధానుండు “వా
క్కాంతా! ప్రేతపిశాచభూతతతి రక్షశ్శ్రేణి క్షుత్క్షాములై
చింతన్ నిత్యము భక్ష్యసంచయము యాచింపం దదర్థంబుగన్ ౨౧౫
ఆ॥ తపముసేయుచుంటిఁ. దరణి కన్యారాశి నధివసింప నొక్కయహమునిమ్ము.
తద్దినమునఁ గుడిచి తత్ప్రేతభూతంబు లబ్ధమెల్లఁ దృప్తులై వసింప” ౨౧౬
చ॥ అని వచియించుడు న్నలువ “య ప్పితృపక్ష చతుర్దశీతిథిన్
జనుఁ డెవఁడేని యాత్మపితృసంఘముగూరిచి శ్రాద్ధముం బొన
ర్చిన నది ప్రేతభూతతతిఁ జెందు మదుక్తి నసంశయంబుగా.
దనుజవరేణ్య! నీవనిన తక్కిన దుర్మృతులున్ సమిద్ధతుల్ ౨౧౭
క౦॥ తనుజకృతైకోద్దిష్టంబునఁ దృప్తిం గాంచఁగలరు పొమ్మని యపు డా
వనజభవుఁ డదృశ్యుఁడగుటయు మనుజాశనుఁ డరిగెఁ దనదు మందిరమునకున్.

—* కలియుగమునకుఁ దగిన పుత్రులు *—

ఆ॥ అర్హులైనయట్టి యచలామరులఁ బిల్చి యచట సపార్వణముగ నవనినాథ!
శ్రాద్ధమును ద్విజుండు సల్పంగనౌ విపరీతమైన నద్ది వ్యర్థయె యగును. ౨౩౩

కం॥ జారజముఖ్యద్విజులను జేరిచి యేశైత్యకంబు చేయంబడునో
యో రాజవర్య! యదియును నీరహి నిష్ఫలము. సంశయింపకు" మనుడున్. ౨౩౪

కం॥ అన నత్తక్ష్మాపాలుఁడు "మానీంద్రా! జారజాదిమహితశ్రాద్ధం
బేనియతఫలము నిడదను నీ వడివిన భయమునగలిగె నిజముగ నాకున్. ౨౩౫

సీ॥ కన్నియం బెండ్లాడి కాఁపురమునకు రా నావెయందునఁ గన్న యర్భకుఁడును
దాఁ బెండ్లియాడిన తన్వంగి తనయాజ్ఞఁ బరువల్లఁ గన్నట్టి బాలకుఁడును
నడిగినవిత్తంబు నిడి యన్యునొద్దనుండి గ్రహించినటువంటి డింభకుఁడును
శరణమెవ్వరులేక చనుదెంచి తనచేతఁ బోషింపఁబడినట్టి బొట్టెయుఁ బ్రతి
పన్నుఁడు సహోఢ కానీనులు నృపేంద్ర! కుండగోళులు ముఖ్యశిష్యుండు మిత్రి
బారివలనను రక్షింపఁబడినవాఁడు స్వవనసంస్థాపితాశ్వత్థపాదపమును ౨౩౬

కం॥ ఈపన్నిద్దరు సుతులని మా పూర్వికుఁడైనయట్టి మనువు వచించెన్.
బాపులఁగా గణియించుచు నీపగిదిం జెప్పెదీవి విదేమి మహాత్మా!" ౨౩౭

ఆ॥ అనుడు భర్తృయజ్ఞుఁ "డయ్యది సత్యంబె. సుతులె వారు ధర్మస్మృతిని జూడ,
మూఁడుయుగములందు ముఖ్యులే యవ్వారు. కలినిమాత్ర మట్లు కారుతలఁప. ౨౩౮

తే॥ అట్టిసంతతి సత్పాత్రులైనయట్టి తద్యుగంబులవారికిం దగునుగాని
తగునె యత్యల్పమేధసులగుచునుండునట్టి కలికాలజనముల కనుములిడక. ౨౩౯

కం॥ ఏతద్వ్యవహారంబు ప్రపాతద మాఁ గలియుగమున. బహ్వల్పబలం
బై తోఁచు తద్యుగప్రజ కీతీరు విధింపఁబడిరె బుధులితలిచేతన్. ౨౪౦

తే॥ కలిని నసవర్ణవుం బెండ్లి సలుపఁదగమి నప్పు డవివాహితలతోడ వ్యభిచరించి
యోనిసంకరమొనరింప నొదవునట్టి సుతుల కితమును వచియింతు క్షితిప! వినుము.

సీ॥ బ్రాహ్మణస్త్రీయందు బ్రాహ్మణునకుఁబుట్టు నధమాధముఁడు చారుఁడనఁగఁబడెడు
బ్రాహ్మణస్త్రీయందు బాహుజునకుఁబుట్టు నాతండు సూతుఁడం చనఁదగియెడు.
బ్రాహ్మణస్త్రీయందు వైశ్యునకుం బుట్టువాఁడు మాగధుఁడునాఁ బలుకఁబడెడు.
బ్రాహ్మణస్త్రీయందుఁ బదజునకుంబుట్టు చెట్ట యంత్యజుఁడునాఁ జెప్పఁబడెడు.
కాన నిట్టిసుతులు కలిలోనవర్జితుల్. ద్వాదశప్రకార తనయులందు
నేడుగురు సుపుత్రు లేన్గురు కులహంత. లుర్విఁ ద్రోయుదురు స్వపూర్వికులను.

సీ॥ కన్నెరికంబునం గడుఁబ్రీతిఁ బెండ్లాడు నాతియం దొదవు స్తనంధయుఁడును
దల్లిదండ్రులచేతఁ ద్రయ్యుక్తవిధముగా వార్ధింపఁబడి దత్తుఁడౌ నాత్మజుఁడును

కం॥ నాందీముఖాన్యమగు పితృబృందంపుం గ్రియలనెల్లఁ బృథివీరమణా!
జందెం బపసవ్యము దోఁడుగం దగు శ్రాద్ధములయందుఁ గర్తల కెపుడున్. ౨౫౩
కం॥ చేతనయినంతమంది ద్విజాతులఁ గూర్చుండఁబెట్టఁజను సాధుజన
త్రాతా! విశ్వేదేవుల ఖ్యాతస్థానమునఁ బ్రాఙ్ముఖంబుగ నుండన్. ౨౫౪
కం॥ పితరులస్థానమున ద్విజత్రితయత్రితయంబో లేక త్రితయమొ యొకరో
సుతుచే నుత్తరముఖముగ క్షితిపాలకవర్య! యదియెక్రియ సంస్థాప్యుల్. ౨౫౫
శా॥ "దేవానామిద మాసనమ్మనుచు" నాదేవళ్ళకుం దద్విధం
బావెన్వంటఁ బితృక్రియంబునకు పశ్చ్యంతప్రయోగంబుతో
వైవంగావలె నాసనంబు నృపతీ! వా రందుఁ గూర్చుండి య
ప్డే వాక్రువ్వ "సుఖాసనం"బనుచు నెంతేనిం బ్రమోదంబునన్. ౨౫౬
తే॥ అపుడు ఋజుదర్భజలసంయుతాక్షతలును విషమదర్భలు జలతిల ల్వేయవలయు
వారి కుడియెడమలయందు వరుసగాను. జేతులం బెట్టఁదగదవ్వి ఘాతమతిని.
కం॥ ఆతీరున జలదర్భలు చేతులనే పెట్టఁబడినఁ జీయని పితరుల్
వీత తదాసనులయి సంప్రీతిని నటఁ గూరుచుండ పేకొన రాత్మన్. ౨౫౭
తే॥ పితరులను దేవతలను వేర్వేఱఁ జేయనగును నావాహనము ద్వితీయావిభక్తి.
మఱియొకవిభక్తిఁ జేసిన నరుగుదేర రాఁకటం గుందుచుంగూడ నహాహా! వారు.
కం॥ విశ్వేదేవాహూతిని "విశ్వేదేవాస" యనఁగ వెలసెడి మనువున్
విశ్వేశ! యుచ్చరించుచు వే శ్వేతాక్షులఁ దలల వేయఁగవలయున్. ౨౬౦
కం॥ అంత "నుశంతస్త్వా "నామంత్రించి పితాళ్ళ వారి మస్తములు తిలా
క్రాంతములు సేయునది. "ఆయంతున "యను మంతరంబున నటు జప్యంబౌ.
మంత్రము॥ శంనోదేవీ రభిష్టయ. ఆపోభంతు పీతయే. శంయోరభిస్రవంతునః. ౨౬౧
ఆ॥ క్షత్రియాగ్రగణ్య! స్వాహాయుతముగ నీమంతరమును జదువు చంత దేవ
తార్ఘ్యపాత్రిలెల్ల నర్ణఃపరిపూర్ణముల్ సల్పవలయుఁ జుమ్ము శ్రద్ధతోడ. ౨౬౩
ఆ॥ అందులో"యవోసి యవయా"యనెడి మంత్రమును బఠించుకొనుచుఁ బుష్పచంద
నాక్షతలను వైచి యర్ఘ్యంబొసంగనౌ వారి సహపవిత్రపాణులందు. ౨౬౪
కం॥ సస్వాహాకారం బట జ్యాస్వామిచయాగ్రగణ్య! "యాదివ్యా" యన్
సస్వరమనువున నుదకము భాస్వరపితృదేవతార్ఘ్య పాత్రిల నిడనౌ. ౨౬౫
మంత్రము॥ తిలోసిసోమదేవత్యో గోసవో దేవనిర్మితః
ప్రత్నవద్భిః ప్రుక్త స్స్వధయా పితౄ నిమాన్ లోకాన్ ప్రీణాహి నస్స్వధా.
కం॥ ఈ పైమంత్రముఁ జదువుచు నాపాత్రిలఁ దిలల వైచి "యాదివ్యా" యం
చాపైఁజెప్పిన మనువున భూపాలా! యర్ఘ్యమీయఁబోలును బిదపన్. ౨౬౬

ఆ॥ పిండపిండమందు వేర్వేఱుగా దారములనుబెట్టి యంత భూమిసురులఁ
బోలెఁ బూచితములఁ బొనరించి యాచమనంబు సేయవలయు నరబిడౌజ! ౨౮౧

కం॥ ప్రక్షాళితకరచరణత నాత్మజుఁడు పితాళ్ళకెరఁగి యటుతరువాతన్
బ్రోక్షించి సవ్యముగ క్ష్మాధ్యక్షా! యాచింపవలయు నర్ఘ్యాశీస్సుల్. ౨౮౨

ఆ॥ అటుపయిం బితాళ్ళ కర్ఘ్యసలిలం బొసఁగి పవిత్రములను సరిగ మీఁది
కగుపఱచి 'స్వధా' యటంచుఁ గీర్తించి 'యస్తుస్వధా'యటంచు క్షోణిసురులు ౨౮౩

కం॥ అనుటయుఁ బిండంబులపై నునిచి మధువు పాయసము తిలోదకమును నో
య్యన 'నూర్జస్వ' యనంజనుమనువునఁ బితృపిండములను మఱియుంచఁగనో. ౨౮౪

ఆ॥ అర్ఘ్యపాత్రములను నటుపయి వెలికిలఁద్రిప్పి స్వర్ణమయము దేవతలకు
వెండి పితరులకును విధ్యుక్తదక్షిణ యిచ్చునది వసుంధరేశ భక్తి! ౨౮౫

కం॥ తరువాత జందెమును గుడికరమునకుం దొడిగి శ్రాద్ధకర్త మహీశా!
గరిమఁ బితృత్రయమునకును వరుసగ స్వస్త్యుదకములను వదలఁగవలయున్. ౨౮౬

కం॥ ఆమీఁద శ్రాద్ధనియమితభూమిసురోచ్ఛిష్టపాత్రముల నెత్తవలెన్.
స్త్రీమాణవకప్రముఖులు తా మాపాత్రలను దీయఁదగ దెన్నటికిన్. ౨౮౭

ఆ॥ ఈప్రకారముగను నెంగిలివిస్తళ్ళ స్వయముగానెతీసి శ్రాద్ధకర్త
క్షాళితస్వపాదకయయుగళుండయి భూసురులకు భక్తి మ్రోసిలొగ్గి ౨౮౮

శ్లో॥ అఘోరాఃపితరస్సంతు. అస్మద్గోత్రం వివర్థతాం.
దాతారో నోభివర్థంతాం. వేదా స్సంతతి రేవ నః. ౨౮౯
శ్రద్ధా చ నోమా వ్యగమ. ద్బహుధేయంచ నో స్త్వితి.
అన్నంచ నో బహుభవే. దతిథీంశ్చ లభేమహి.
యాచితారశ్చ నస్సంతు. మాచ యాచిష్మ కంచన. ౨౯౦

కం॥ అనిప్రార్థించి యివే దీవనలవుఁగాకనుచుఁ గర్త పఠియించుటయున్
వినివిప్రులు సంప్రీతిని ననవలయుఁ దథాస్తటంచు నవనీనాథా! ౨౯౧

ఆ॥ స్వస్తికొఱకు ధరణి సవ్యంబుగం బితృపూర్వ ముదకములను బోయవలయు.
వసుమతీకళత్ర! వాజేయనెడిబుక్కు నని పవిత్ర మవల నునుపవలయు. ౨౯౨

కం॥ ఆమావాజస్యయనన్ క్ష్మామండలి ఖ్యాతమైన సన్మంత్రముచే
నామహీసురులకు వలగొని ప్రేముడి నటుఁ గూరుచుండఁబెట్టి తపంప్రమల్ ౨౯౩

ఆ॥ అదిమిపట్టిపిసికి యనిపి యాసీమాంత మన్నబలినిపైచి యధికనిష్ఠ
వహనమూని గగనమణి యుండఁగానె భోజనము సేయవలయు మనుజనాథ! ౨౯౪

తే॥ అటు సపిండీకరణము సమాంతమందు జరుపవలయును నాన_ధరణిపాల!
వృద్ధి యొకవేళ నేతెంచెనేని యరసి పూర్వమేనియుఁ గావింపఁ బోలియుండు.

ఆ॥ పార్వణోక్త విధిని నుర్విఁ ద్రిదైవత్యముగ నదైవికముగ మొనసి ప్రేతఁ
గూర్చి చేయవలయు గురుత నేకోద్దిష్ట మేకపాకమున మహీభుభుజుఁ! ౩౦౯

ఆ॥ ప్రేతకొఱకుఁగాను ప్రీతిఁ గల్పించిన యర్ఘ్యపాత్రదీసి యవనిపాల!
త్రిపితృపాత్రలందుఁ ద్రివిధంబుగం జించి యుంచవలయు శ్రద్ధ యుట్టిపడఁగ.

తే॥ అట్లు పిండంబు త్రివిధంబు లాచరించి 'యే సమాన' యనం గరమెసఁగుమంత్ర
ములను రెండును బఠియించి యొలయు శ్రద్ధఁద్రిపితృపిండంబులం గల్ప నపుడు మృతుఁడు

కం॥ ప్రేతత్వవిముక్తుండై ప్రీతిం జెందును మహీశ! పితృపూర్వముగా
నాతర్వాత యథాక్రమ మేతత్పిండములమీఁద నించుక జలముల్ ౩౧౧

కం॥ ప్రోక్షించి గంధమునఁ బుష్పాక్షతలను ముగుర శ్రద్ధనర్చించి యిలా
ధ్యక్షుఁ! పితృత్రయి పేళ్ళను స్వక్షరముగ నుచ్చరించి యట్లు చతుర్థ ౩౧౨

తే॥ విడువవలెఁగాని కొందఱువిడువకట్లు ప్రేతశబ్దముతోడనే పితకు ముందు
పెట్టుచుండిరి యిల శ్రాద్ధ. మట్టిచేత నామతముగాదు మేదినీనాయకాగ్ర్య! ౩౧౪

కం॥ క్షయతిథి భాద్రచతుర్దశిఁ బ్రియతమ! యీరెంటివిడి సపిండీకరణం
బయినతరువాత నొప్పదు త్రయి యేకోద్దిష్టమనెడి శ్రాద్ధముజరుపన్ ౩౧౫

కం॥ ఎవఁడు సపిండీకృతుఁడై పావణించెడిప్రేత భిన్నముగు పిండమునం
దవిధిగ యోజనసేయునొ యవునాతఁడు పితృహుఁ.డద్ది యకృతంబ యగున్.

ఆ॥ తండ్రిచచ్చిపోయి తాతజీవించుచోఁ దండ్రిపేరుచెప్పి తాతతండ్రిఁ
బేర్కొనంగవలయుఁ బృథ్వీశ! తాత ప్రత్యక్షముగనె యచట నారగించు. ౩౧౭

ఆ॥ తాత క్షయదినమున ధరణీశ పార్వణశ్రాద్ధ మాచరింపఁ జనునుజుమ్ము.
తనదుజనకువిడిచి తాత కెట్లేనియుఁ బెట్టఁదగదు పితకు భీతుఁడగుచు. ౩౧౮

కం॥ సకలామావాస్యలఁ దప్పక పార్వణమాచరింపవలె మృతపితకుం.
డకలంక! ప్రేతపక్షమునకు నడుమనుగూడఁ బార్వణము చేయఁగనౌ. ౩౧౯

తే॥ ఎంతవఱకు సపిండత యేరుపడదొ యంతవఱకును బితృపక్షమందుఁ బితకుఁ
దగదు శ్రాద్ధంబుపెట్టఁ,బితామహాదులకు నొనర్పఁగవచ్చు నిలాతలేశ! ౩౨౦

కం॥ పితృపిండంబులతోడం గృతసాపిండ్యుండుగాక కృతసుకృతుండో
పితయును బ్రేతగనుండెడు. క్షితిపా! సాపిండ్య మందునో నేర్పడిదియున్. ౩౨౧

ఆ॥ ఎవఁడుచేసికొన్న యేన సుకృతముల వారలన్యయోనిఁ బడియు నచట
వంశభవులొసంగు వారిప్రభృతులచేఁ దృప్తిఁబొందుచుంద్రు ధీర" యనుడు 3౨౨
కం॥ "పుత్రుల పౌత్రుల కలలం బిత్రాదులువచ్చి యేమె పెట్టుదురటంచున్
రాత్రులఁ గోరుచునుందురు. ధాత్రీసుర ! యేమగునిది ? దయ నుడువఁగదే" 3౨3
కం॥ అని యానత్తుండడుగుడు మునివర్యుఁడు "గతులులేక పొక్కుచుఁ బ్రేత
త్వనియుక్తినుండువారలు జననాథా ! వచ్చుచుంద్రు స్వప్నంబులలోన్" 3౨౪
కం॥ అని వక్కాణించుటయును "ననుఁగుం బుత్రకులులేని యవ్వారల కో
మునివర ! సాపిండ్యం బె ? ట్లనవుడు నృపుతోడఁ దపసి యపు డిట్లనియెన్. 3౨౫
తే॥ "ఎవరి కొరసతనుజాతుఁ డేరుపడఁడొ యతఁడు నాలవవాఁ డెట్టులగును దలఁప
నొగిఁ బ్రకర్షంబుగాఁ బొందుచుండుఁగానఁ బ్రేతయనిచెప్పఁబడియెడుఁబృథివి మృతుఁడు.
తే॥ సుతుఁడొ తాఁబుట్టువో లేక సతియొ మృతున కొనరుపఁగవలె సాపిండ్య
మోనృపాల !
కానిచో క్షేత్రజాది కైకాదశాత్మజుల సుతప్రతినిధులఁగాఁ దెలియవలయు. 3౨౭
కం॥ కాలమున నుత్తరక్రియ మేలుగఁ గాకుండిన నపమృత్యువశులకుం
జాలెను నారాయణబలి వాలాయంబుగను జేయవలెఁ బ్రేతత వోన్. 3౨౮
ఆ॥ ఆత్మహంతలకును నవనీసుపర్వుచే మరణమొందినట్టి మనుజులకును
నాచరింపవలయు నదియె నారాయణబలి" యటంచు నిట్లు పలుక నతఁడు 3౨౯
ఆ॥ "ఎట్లుమృత్యువెనయు నిలఁ బురుషుండుదా ? నేసుకర్మమునను నేగు దివికి ?
ముక్తియెట్లువడయు మునినాథ ! నిరయమం దేలకూలు ?" ననుడు బుషివరుండు

—✳ నరకములు తన్నివారణోపాయములు ✳—

ఆ॥ పుణ్యపాపములను బూర్వకర్మ జ్ఞానముఁ గలవు ప్రజకు మూఁడుగతులు. వానఁ
బుణ్యమునను స్వర్గమును బాపమున నరకమును జ్ఞానమునను నమృతి నొందుదు.
శా॥ ఈయర్థంబు శరవిమృత్యుభీష్ముల నల శ్రీకృష్ణుండు తోడ్పాటుగా
ధ్యాయం బోయి యుధిష్ఠిరుండు "యమువీటం బాపకృత్ప్రాప్యముల్
చేయంబు ల్గలవంట నారకము.లవ్వేవో. కిమేనస్సులన్
జేయం బ్రాప్తము లౌనో. నిండుకృపతోఁ జెప్పంగదే" నావుడున్ 33౨
తే॥ ఆతఁడిట్లను. యమలోకమందు వత్స ! యేకవింశతినరకంబు లెసఁగుచుండు.
జంతువులు స్వస్వకర్మానుసారముగను నచటికింజని కృఛ్రంబు లనుభవించు. 333
తే॥ చిత్రగుప్తుఁడు విచిత్రుఁడను పేళ్లఁ జెలఁగుచుండు రచటఁగాయస్థులిరువు. రందఱుమునులను వి
చిత్రుఁడుం జిత్రగుప్తుఁడాడిల శ్రేయములను వ్రాయుచుందురు యత్నపూర్వకముగాను.

సీ॥ మఱియు గరాళుండనఁ బరఁగెడివాఁడును వికరాళుఁడనుసంజ్ఞ వెలయువాఁడు
వక్రనాసుండన వర్తిల్లువాఁడు మహోదరుండను పేర నున్నవాఁడు
సౌమ్యాహ్వయంబుతో సంయుక్తుఁడగువాఁడు శాంతుండునాఁబడు శాంతియుతుఁడు
నందుఁడన్ సంశ్రావ్యనామంబుగలవాఁడు నటు సువాక్యుండను పటుమతియును
యముని దూతలు. వారియం దాద్యులైన భయదరూపులు నలువురం బాతకులను
మంచిరూపంబుగల కడను నలుగురును సుకృతులను యమపురికిఁ జేర్చుచుండు సతము.
తే॥ వారివశమున లెక్కింపవలనుగానియంతనుంది భటుల్గల రనఘ! వారు
చిత్రుఁడు విచిత్రుఁడును వ్రాయుపత్రములను గొంచుఁ జని యందుఁగలరీతిఁగొంక కడఁడు
తే॥ అప్సరోగణసేవిత మగు విమానములను నెక్కించి ధర్మంబు సలుపువారిఁ
గట్టియుం గొట్టియుం గ్రూరకర్మరతులఁ బట్టుకొనిపోవుదురు యము పట్నమునకు.
తే॥ వారలకు బాసటగనుండ జ్వరముఁదొట్టి వ్యాధులును నూటయొనిమిది యముని చేతఁ
గల్పితము. లవ్విచని మును కైవసంబుచేసికొనుచుండుఁ బ్రజ యుధిష్ఠిర! బలిమిని.
తే॥ అంతటం గింకరులుపోయి యచటనుండు నరుల కగుపడకుండఁ దన్నాభిమూల
సంస్థితప్రాణవాయువు సంగ్రహించి తనువు నటుడించి యమమార్గమునఁ జనుదురు.
తే॥ ఎనుబదియు నాలువేలయోజనములపయి నున్న దయ్యమపురి మన మున్నచోటి
కచట వైతరణీసమాఖ్య నదియొకటి రెండుపాయలఁ బ్రవహించుచుండు నెప్పుడు.
కం॥ ఒకపాయను జలములు వేఱొకపాయను నెత్తు నడుమ నురుశస్త్రిములున్
బ్రకటముగఁ గలిగి యది పాండుకుమారా! ప్రాణులకుఁ గడున్ భయదంబౌ. ౧౪౦
ఆ॥ మేనుదొఱఁగువేళ వేదినీసురునకు గోనువిచ్చువాఁడు దానితోఁకఁ
బట్టుకొని తరించు భరతర్షభా! తాను జలములున్నపాయ శ్రమము నాక. ౧౪౧
కం॥ ఇతరుఁడు తనచేతులతో నతికష్టముమీఁద నీఁది యలసినవాఁడై
శతయోజనవిస్తృత శోణితతటోన్నితస్ను దాఁటు నేర్వఁగవలయున్. ౧౪౨
ఆ॥ కాన మనుజు లంత్యకాలంబునందు గోదాన మాచరింపఁదగును. దాని
కవల ధర్మస్మృతిని నరుగు ధర్మిష్ఠుండు. పాపమార్గమునను బాప యోను. ౧౪౩
కం॥ వైతరణి యపరతటమున భీతిద మసిపత్రవనము బిట్టలరెడు. దు
ర్నీతిఁ బరభార్యఁ బరధన మేతులువ హరించు నాతఁ డిటఁ గోయఁబడున్. ౧౪౪
ఆ॥ అట్టి కూళగూడ నాత్మజకృత నవశ్రాద్ధములనుజేసి నరవి నచటి
కలుషలంపములను గలుగల తెలుఁగంగఁబడక ముక్తుఁడగును బాండవేయ! ౧౪౫
ఆ॥ అవల నొక్కభూరుహము కూటశాల్మలియనఁగ వాఁడిముండ్ల నలరుచుండును.
ప్రేలుచుండ్రు క్రింద విశ్వాసఘాతకుల్ తల్లక్రిఁదుగాఁగ దగ్ధులగుచు. ౧౪౬

క॥ కూటశాల్మలిద్రుమ గురుశాఖలం దలక్రిందుగాఁగ వ్రేలనుంద్రుగాక.
తద్విముక్తి ధర్మతనయ! యేకాదశశ్రాద్ధమునను జేసి సంఘటించు. ౩౪౭

క॥ అవలినరకమనఘ! యంత్రాత్మకంబు. బ్రహ్మఘ్ను లనుభవింపనది తగినది.
వంశజుండొనర్చు ద్వాదశశ్రాద్ధంబు ద్వారమునను నగును దద్విముక్తి. ౩౪౯

చ॥ పదపడి యయుక్కకంబములు ప్రజ్వలమానములౌచునుండు. దు
ర్మద మొగఁబట్టి యన్యతనుమధ్యలఁ బొందెడివాఁడు వోయి వా
పెదపెదయయుక్కకంబముల బిగ్గఁ గవుంగిటఁజేర్చునౌను. న
య్యదియును దప్పు మాసికసమాచరణంబున వానికిన్ సుతా! ౩౫౦

క॥ ఇనుపపండ్లమక్క లిఁకఁ బృష్ఠమాంసాశులను భుజించుచుండు బలిమి నవల.
దానివలన ముక్తుఁడౌను ద్వైపక్షికశ్రాద్ధమునను జేసి సత్యమునను. ౩౫౧

క॥ ఇనుపముక్కు కాకు లిఁకఁగొంచెమావల. స్త్రీ సరాగమునను జేరిచూచు
వానిగ్రుక్కుపొడుచు వడిఁ బట్టుకొని యవ్వి. మాను నది ద్వితీయమాసికమున. ౩౫౨

తే॥ ఆపయిం గూటశాల్మలి. యట్లు లోహమయపు ముండ్లును గలవు. తన్మధ్యమమునఁ
గొండెకాండ్రు బలాత్కృతి గుంజఁబడుదు. రదియుఁను ద్వితీయ మాసికంబైనదొలఁగుఁ

ఉ॥ రౌరవనారకంబు కడురౌద్ర మనంతరమందు. దానిలో
ఘోరతరాయుధంబులను గొట్టియు నెట్టియు బ్రహ్మహంతలన్
దూఱుదు రగ్గలంబు యమదూతలు. నాలవమాసికంబునన్
వారు విముక్తులౌదు రటువంటిమహాపదనుండి ధర్మజా! ౩౫౪

తే॥ అవలినరకము క్షారోద. మటఁ గృతఘ్ను లడుగు లూర్ధ్వంబునం దుత్తమాంగ మవనిఁ
గాఁగ వ్రేలాడుచుండు రిక్కరణి. నేనవదగు మాసికమున ముక్తి వారి కొలయు.

మ॥ కుంభీపాక మనంతరం. బది మహాఘోరంబు. తద్దుర్గతిన్
దైంభప్రాణములన్ హరించు కటికన్ దండాభిసంధం బ్రవి
ష్టాంభోరాశినుత ష్ప్రతైలమున నుం. త్రాబాధ షణ్మాసికా
రంభంబైన యనుక్షణంబు తొలఁగున్ రాజేంద్ర! యింకేమనన్. ౩౫౬

క॥ పాములుఁ దేష్యం గలదై యామీఁద నిఁకొక్కనరక. మట శాంభికులన్
పేసుఱు శిక్షిం. త్రేడవదౌ మాసికమునఁ జేసి యయ్యది వాయున్. ౩౫౭

మ॥ అట సంవర్తకనామదుర్గతియొకం. డామ్నాయ విప్లావకుల్
పటువాక్యంబుల సాధులం దెగడు కూళల్ వహ్నితప్తంబులౌ
పటుకాఱు ల్గమ కొండెనాలుకలకుం బట్టించి లాగన్ భటుల్
త్రుటితస్వాంతములందుఁ బ్రాకృతములన్ దూషించుచుం ద్రచ్చటన్. ౩౫౮

ఆ॥ అనృతవాదిజనుల యంగంబుఁ గుక్కలు కొఱికి తినుచునుండు మఱియునచట.
నవ్విధొల్లఁ దప్పు కష్టమమాసికశ్రాద్ధదానమునఁ బ్రశాంతి వొందు. ౩౫౯

క॥ జలజాప్తుఁడు వృషభంబున మెలఁగఁగ జలధేను వటులె మృగశీర్షమునన్
జెలఁగఁగఁ దిలధేనువు విప్రుల కొసఁగెడివాఁడు కనఁడుపో నిరయంబున్. ౩౮౫

క॥ సోమమున సోమనాథుని సోమగ్రహపర్వమునను జూచినవాఁడై
నేమమున నబ్ధిఁ గ్రుంకిన యామనుజుఁడు నిరయబాధ నందఁడు తనయా!

క॥ రవి రాహుగ్రస్తుఁడుగా రవివాసరమందుఁ బోయి రహిఁ సన్నిహితీ
భవద కురుక్షేత్రములం దవగాహనసేయఁ దొలఁగు నటు నరకంబుల్.

తే॥ కృత్తికాయుక్తయుత కార్తికికి నెవండు కలితమానతఁ జని త్రిపుష్కరమునకును
దాఁ బ్రదక్షిణ మొనరించు తన్మనుష్య నయనములలోనఁ బడదుపో నారకంబు.

సీ॥ బురదలో దిగఁబడి యఱచుచుండినయట్టి యావు నీవలకీడ్చు నలఘుమతులు
నతిదైన్యవశత బ్రాహ్మణికిఁ దటస్థమా దాస్యంబుదొలఁగించు ధర్మరతులు
దొంగలకుం జిక్కి యంగలార్చుచునుండు నార్యుల విడిపించు శౌర్యధనులు
హంతకుఁజేతియం దర్పితప్రాణుఁడౌ భూసురుం గాపాడు పుణ్యతములు
నరకగాములగుచు నవయ" రంచని యిట్లు పలికె భీష్ముఁడనుచు ధర్మ్యయజ్ఞుఁ
డానతిచ్చె నట్టు లానర్తభూపాలమణికి రోహితాశ్వమనుజనాథ! ౩౮౬

—* జలశాయి యుపాఖ్యానము *—

వ॥ అని మార్కండేయమహాముని శ్రాద్ధకల్పమంతయు వక్కాణించె. నట్లు నాగబిలద్వారంబున జనార్దనుండు జలశాయియై వర్తించెడిఁ. బావనంబగు తద్బిలద్వారంబునం గ్రుంకి శేషపర్యంకశయను సేవించు జనుం డాజన్మమరణపాతకంబునుండి ముక్తుండగు. వార్షికంబులగు చతుర్మాసంబులును సరీసృపశయానుఁడగు జనార్దను సభక్తికంబుగా సమర్చించిన జన్మరాహిత్యంబగు. మును పచట మునీశ్వరులు ముచికుందుఁ బూజించి తత్స్థలస్థ మృత్తికాగ్రహణంబున వైకుంఠంబునకుఁ జనిరి. చాతుర్మాస్యాకృత జలశాయిసేవనంబున సకలతీర్థస్నానఫలంబును సకలయజ్ఞాచరణఫలంబును సంప్రాప్తగోగ్రహమృత్యుఫలంబును బడసెదరు. మఱియును ౩౮౭

సీ॥ ఎపుడుఁజూచిన నొడ్లయిల్లాండ్ర కౌఁగిళ్ళ మనుచుండు పరమదుర్మార్గుఁడేని
యెట్టిబ్రాహ్మణుఁగూడఁ దిట్టి సహింపమిం గట్టి కొట్టి వధించు కటికమౌని
యేనాఁడుఁ గల్లుత్రావి మేనెఱుంగక వీథిఁ బొరలాడుచుండు దుష్పురుషుఁడేని
యేయింతియైనను నిష్ఠురాల్లానిచోఁ గుతికెయొత్తెడి మహాక్రూరుఁడేని
నాల్గునెలలు జీవనశయాను సేవింప నార్యులార! ముక్తులై రహింతు"
రనుచుఁ జెప్పుటయును నా శౌనకాదిమునీంద్రు లంద ఱతని కిట్లనిరి. ౩౮౮

ఆ॥ "పాలకడలిఁ బాపపాన్పుపైఁగద హరి యోగనిద్రవశత నుండుననుడు
రెట్టు లమ్మహాత్ముఁ డీబిలద్వారమం దయ్యె నుదకశయనుఁ డార్య! మరల?"

క॥ అని మనమున సంశయపడి తన నడిగెడి యమ్మునీంద్రతతిఁ గనుఁగొని మె
ల్లన రోమహర్షణాహ్వయతనయుండగు సూతుఁ డపుడు తా నిట్లనియెన్. ౩౯౧

వ॥ మహాభాగులారా! యయ్యది సత్యంబ. యాదేవుండు బిలద్వారంబున జలశాయియై చతుర్మాసంబులును సంపూజితుండై జనుల ననఘులం జేయుం దెఱంగుఁ జెప్పెద సావధానులరై యాలకింపుఁడు. తచ్చాతుర్మాసంబులును ముఖ్యంబులగు యజ్ఞోద్వాహాదికార్యంబు లొనర్ప ననర్హంబులు. దేవాదిదేవుండును నిర్గుణుండును గుణాత్ముఁడును నవ్యక్తుండును నప్రమేయుండును సర్వదేవమయుండును సర్వజ్ఞుండును గవీశుండును సర్వభూతాత్మకుండును నగు మహానుభావున కంజలిసేసి యయ్యది కీర్తించెద. తొల్లి నరసింహావతారమెత్తి విష్ణుండు వేని వధించె నామహాసురుండు హిరణ్యకశిపుండనా భయంకరుండై యుండ వానికి వీర్యమందప్రతిములును సర్వలక్షణలక్షితులును నై ప్రహ్లాదుఁడనియు నంధకుఁడనియు నిరువురు సుతు లుదయించి రంతఁ గొంతకాలంబున కారాక్షసుండు పరలోకగతుండుకా దేవతలు తద్రాజ్యంబునఁ బ్రహ్లాదుఁ బట్టభద్రుఁ జేయ నుంకించుటయుఁ బితృపైతామహంబై సమాగతంబగు నారాజ్యంబుఁ జేయుట కతఁ డియ్యకొనఁడయ్యెఁ దత్కారణంబు వచింతు వినుండు. రక్కసుల కందఱకుం జక్రితో సదా విరోధంబు. ప్రహ్లాదుఁడట్లు ద్వేషింపక దానవులం ద్యజించి స్వరాజ్యంబు సహితము సల్పనొల్లక విష్ణునాశ్రయించె. నంత విష్ణుద్వేషపరాయణులగు నాక్షుద్రరాక్షసులు పితృపైతామహమగు రాజ్యమం దంధకు నభిషేకించిరి. వాఁడును వనజాసను నారాధించి యాచంద్రార్కస్థాయి యగు నమరత్వంబు నార్జించె. వరబలంబున వాసవు విరోధించి సమరంబున జయించి యజ్ఞభాగంబు లపహరించె. నాత్మీయసహితంబుగా నమరావతికిం జని హరిహయుం బాఱఁదోలి యమరాలయం బగ్గంబుసేసికొనియె. సర్వదేవసహితంబుగం జని శక్రుండు శంకరు సంసేవించి పెద్దకాలంబున కప్పినాకి ప్రీతుండై యేమి కావలయునని ప్రశ్నించుటయు ౩౯౨

ఆ॥ "అస్మదీయరాజ్య మధ్వరాంశములతో నంధకుఁడు హరించె నతిశయించి.
వానివలన మగుడ దానినిహరియించి కరుణసేసి నన్నుఁ గావుదేవ!" ౩౯౩

వ॥ అని దీనంబుగాఁ బలుకుటయు భగవంతుఁడగు ప్రమథాధిపుఁడు త్రైలోక్యరాజ్యంబు భవదధీనంబుసేతు నుండుమని యూఱడించి ౩౯౪

ఆ॥ "నాదు ముదలయయ్యె. నాకంబువిడిచి నీ పితృవ్యమైన రాజ్యపీఠ మెక్కు-
మధ్వరాంశములకు నాశింప కవనికిం జనుము. చనకయున్నఁ జచ్చెదీవు" ౩౯౫

—— *అంధకాసురుఁడు శంకరునాజ్ఞ యుల్లంఘించుట. *——

వ॥ అని గణనాథుఁడగు వీరభద్రుముఖంబున నంధకునకుం జెప్పిపంపుటయు నమ్మహాబలుండు నవ్వి ౩౯౬

తే॥ "దూత వధియింపఁదగమిని దుష్ట! నిన్ను విడిచితిని ప్రాణములతోడ నడువుమింకఁ
దప్పుదెలియక యీరీతిఁ జెప్పిపంప నెవ్వఁడాశంకరుండు? నన్నెఱుఁగఁడొక్కొ?

క॥ ఎఱిఁగియుఁ జాఁదలఁచి యిటుల్ మొఱఁగుచునున్నాఁడొ? తెలిసెఁబో మనమున నా
మొఱకుఁడు నిజజీవితమున నిరాశుఁడయి యున్నవాఁడు నిశ్చయముగఁ దాన్.

సీ॥ ఎవ్వానిముఖమున నెపుడు దరిద్రదేవత తాండవంబాడుఁ గుతుకమునను
నెవ్వానిచేతను నేభోగమేనియు ననుభూతంబు రవంతయేని
యెవఁడు జగత్త్రయి నెటఁజోటుదొరకక యల శ్మశానంబునం దాటలాడు
నెవఁడు సుగంధవద్భవవస్తువులు లేక వెలిబూది మెయినిండ నలదుకొనును
నెవఁడు కరచరణాదులౌ నవయవములఁ బాములం జుట్టుకొని దిగంబరతఁ దిరుగు
వాని కిఁక జీవితముతోడిపని యదేమి? యందుననె నన్నుఁగూర్చి యిట్లన్నవాఁడు.

ఆ॥ కాన వేగ నేగి కైలాసమును వీడి కాశిఁదపము సేయఁ గడఁగుమనుము.
విభవసహితముగను వృషన కాకైలాసధరము నా సుతునకు దత్తమనుము. ౪౦౦

ఆ॥ ఏతదస్మదుక్తి యెంతయుం బాటించి సరవి నవ్విధంబు జరుపుమనుము.
జరుపకున్నఁ దన్ను శత్రుని వధియింతుననుము. బుద్ధిగలిగి మనుము. చనుము."

వ॥ అని వాక్రుచ్చుటయు వీరభద్రుండు పదింబదిగ భర్త్సించి కడుంగడు కోపంబునఁ గైలాసంబునకుఁ బరువెత్తి క్రతుధ్వంసి కా కారులు వినిపింప నతండు క్రుద్ధుండై యఖిలగణంబులతోడను హరిహాయా ద్యఖిలామరులతోడను వృషభారూఢుండై వెడలి యమరావతి కరిగె. నదిగని యంధకుం డానందంబున నర్జునాశ్వయుతంబగు నరదంబు నధిష్ఠించి యనీకినీసహిత మభిముఖుండై నిలిచె. నంత నాహవం బారబ్ధమై కొయియేండ్లు నడచుటయు దినక్రమంబుగా దేవతాసైన్యంబె క్షీణించెఁ గాని రక్కసులు చెక్కుచెదరరైరి. కటకటంతఁ డంతఁ గనులెఱ్ఱఁజేసి త్రిశూలంబుచే వ్రేసినను బ్రహ్మవరప్రభావంబునఁ బ్రాణంబులం బాయక యంధకుండు మగుడ నాయోధంబునకుం గడంగి యనేకగణంబుల నలయించి గదాఘాతంబుల ఖండపరశువుం బలువారంబులు నొప్పించుటయు నది యఖిలలోకభయావహంబై కనుపట్టె. నంత నంబుజాసనవరప్రభావంబున నంధకునకు మృత్యువులేకుంటి యెఱింగి యస్త్రమూర్తిశూలాగ్రంబునఁ బొడిచి గగనంబునకు లేవనెత్తి ఛత్రంబుం బోలె ధరించుటయు నధోముఖంబుగా వ్రేలాడు నాత్మాంగంబునుండి యవనిపైఁబడు నఖండరక్తధారలం బ్రబుష్టధాతుచతుష్టయుండును జర్మాస్థిస్నాయుశ్శేషుండును నైయావిరుండు

## అంధకుఁడు భృంగిరిటియను పేరి శివభక్తుఁడగుట

శా॥ "ఈదృగ్వీర్యసమన్వితుండవని నిన్నే గుర్తింపంగఁ బిభూ!
ప్రాదుర్భూతమదాంధతం దలఁచు దుర్భావ ప్రసంగించితిన్.
నా దౌరాత్మ్యవివేకహీనతలకున్ న్యాయ్యంపు శిక్షాక్రమం
బో దేవేశ్వర! నీ యొనర్చపని. యెంతో శ్లాఘ్యమై యొప్పెడిన్. ౪౦౩

తే॥ నీ కిరహితున కొదవు విద్యాతిశయము సిరియుఁ జిరకాల ముండవు. సిద్ధమిద్ది.
అతిమదాంధుఁడనగు నాదు నలఘుబలపరాక్రమైశ్వర్యరాజ్యసర్వస్వమట్లు. ౪౦౪

తే॥ పాపకర్ముఁడఁ. బాపుఁడం. బాపభవుఁడ. మఱియుఁ బాపాత్ముఁడను నేను గరళకంఠ!
అఖిలపాపహరుండవై యభవ! నీవు నన్ను రక్షింపుమయ్య. నిన్ సన్నుతింతు ౪౦౫

సీ॥ కాలంపు వ్రేట్లకుం దూలిపోయి కరంబు శోకాకులిత మానసుండనైతి.
నధమాధముండనై ప్రధనంబునను నీదు చేతిలోపల వచ్చి చిక్కుపడితి.
నధికతరైశ్వర్య మంతయుం గోల్పోయి దీనత్వమున నీవె దిక్కటంటి.
భాషించుటకుఁగూడ బలములే కెంతయుం బార్శ్వభాగంబుల వ్రాలుచుంటి.
నిట్టి యాపన్ను రక్షింపవే మహేశ! శరణుచొచ్చితి. మనసు నీచాయతిరిగె.
సర్వపాపక్షయంబైన సమయమందె భవునిమీఁదికిఁ జిత్తంబు పరువులెత్తు.

తే॥ శివుని బూజింపనటువంటి చెనటిప్రజకు వచ్చిపోయెడిదినములే చచ్చిపోవు
వారలకుఁగూడఁ గ్రమముగా వచ్చిపోవు బ్రదికియుండిన యటువంటి ప్రజకె కాక.

సీ॥ చెడు కుష్ఠగదమునం జేసి యత్యంతంబు మేనెల్లఁ జెడిపోవువాని కేని
తెగులుగొంటయి సదా తీఱని వ్యధతోడ వర్తించునటువంటివాని కేని
యంఘ్రిలోపమున నొక్కడుగిడుటకునైన వశముగా కల్లాడువాని కేని
సవిధంబునందగు శంఖధ్వనుల్గూడ వీనులంబడనట్టివాని కేని
యెవనిచేతఁ బరమశివుఁడు దైవతబుద్ధిఁ గొలువఁబడఁడో వానికులమునందుఁ
గలుగకుండుఁగాక కటకటా! జన్మంబు పార్వతీశ! సకలపాపనాశ! ౪౦౬

సీ॥ విడిచినాఁడను నేను వివిధాఘములకును నాదికారణమైన యసురభావ.
ముజ్జగించినవాఁడ నొకమాఱె త్రైలోక్యరాజ్యంబుగూడ విరాగినగుచు.
వదలిపెట్టినవాఁడ వాస్తవంబుగ నాదు పుత్రపౌత్రుల బుద్ధిపూర్వకముగ
నవలఁద్రోసినవాఁడ నష్టవిధైశ్వర్య మగ్నిసాక్షిగఁ బెండ్లియైన స్త్రీల.
ముట్టుకొని నీదు పదపద్మములను సరిగ మూఁడుపదులు వచించుచున్నాఁడ రూఢిఁ.
గాన నను విశ్వసించి సత్కారణతోడ స్వాగతంబొనరింపుమీ సాంబ! యింక."

వ॥ అనినవిని గతకల్మషుంగా నెఱింగి శూలంబునుండి మెల్లనదించి వినయ వినమితగాత్రుండగు నాతనికి భృంగిరిటియని స్వయంబుగం బేరువెట్టి ౪౧౦

తే॥ "నందికంటెను మఱి గజాననునికంటె నస్మహాకాళుకంటెను నగ్గలంబు
వల్లభుండవైతి నాకు. నీవారిఁ దలఁచుకొనక సుఖముండు నాతోడఁ గొడుక! నీవు"

వ॥ అని వక్కాణించుటయును వాఁడు వల్లెయని నమస్కరించి గణంబులం జేరి శంకరు నాశ్రయించి యుండె. నంతఁ దత్తనయుండగు వృకుండు నిరుత్సాహుండై మహాభయంబున మాతశేషులం గూడుకొని యంభోధిం బ్రవేశించె. సంక్రందనుండు సంతోషంబున శంభునకు జోతవెట్టి తద్రాజ్యం బంగీకరించి యమరావతి కరిగి ముజ్జగంబు లేలుచు హావిర్భాగంబు లనుభవించుచుండె. వృకుండు సాగరంబు వెలువడి జంబూద్వీపంబున కేగి తండ్రి తపముండిన హాటకేశ్వర క్షేత్రంబు సిద్ధిప్రదంబని తలంచి యొరులెవ్వరును నెఱుంగకుండ బ్రహ్మను ధ్యానించుచు వాయుభక్షకుండై కొన్ని యేండ్లును జలాహారుండై కొన్ని యేండ్లును జితేంద్రియత్వంబునఁ బుడమిపయి బొట్టనవ్రేలు మోపి తపంబొనరించుటయుఁ గమలాసనుండు సంతుష్టుండై తపంబునకు మెచ్చి గర్తామధ్యగతుండగు వాని దగ్గఱి ౪౧౨

—♦ వృకుం డింద్రపదవిం బొందుట. ♦—

క॥ "ఓహోహో వృక! యిఁక నతిసాహసపదమైన తపము చాలింపుము. నీ
యాహితమైన వరంబెదో వ్యాహరింపు. మిడిపోవ వచ్చినవాఁడన్" ౪౧౩

వ॥ అని పలుకుటయు వాఁడిట్లనియె. ౪౧౪

క॥ "తుష్టిం జెందితివేని మదిష్టంబగు వర మొసంగ నేతెంచితివేన్
గష్టంబని భావింపక నష్టజరామరణుఁగాఁగ ననుఁ జేయు విధీ!" ౪౧౫

వ॥ అనియిట్లు కోరుటయు విధాత ౪౧౬

ఆ॥ మత్ప్రసాదమునను మరణంబు జరయును నీకు సంభవింప వో కుమార!
యేమొ యనియెననుచు నీవిషయంబున సంశయింపఁబోకు. సత్యమిద్ది." ౪౧౭

వ॥ అనివాక్రుచ్చి యదృశ్యుఁడగుటయు వృకుండు కృతకృత్యుండై సర్వార్థకుసుమోజ్వలంబగు రైవతగిరికిఁ జని నిజామాత్యులతో యోజించి త్వరితంబుగా దైవతేశుపైకి దండెత్త నతండు వాని బ్రహ్మవరంబున జరామరణవర్జితుంగా నెఱింగి సర్వసుపర్వసహితంబుగా సత్యలోకంబునకుం జనియె. మహాబలుండగు వృకుండు సంతసించుచు ససైన్యపరివారంబుగా స్వర్గంబుం బ్రవేశించి దేవరాజ్యపదంబున మునిచేఁ బుష్పోదకంబుల నభిషిక్తుండై హావిర్భాగంబులఁదుఁగా వసురుద్రాదిత్య

మరుత్ప్రముఖదేవతాస్థానంబుల నసురుల నెలకొల్పి యథేచ్ఛ జగంబుల శాసింప మొదలిడిరి. బలవీర్యధైర్యామర్షంబుల వాఁ డంధకునకు వేయిరెట్లధికుండై లోకంబుల క్షోభింపఁజేయ నదియెఱింగి జను లెవ్వరును యజ్ఞయాగాదులు చేయమానుకొనిరి. యెవరేని చేసిన నమరసంతృప్తికిఁగా నతిగుప్తస్థలంబునం జేరి యాచరించెడివారు. స్వర్గతులగు రాక్షసులు భూలోకంబునం దమ్మెఁ గూర్చి హవిస్సులిచ్చువారు లేకునికికి సందేహించి. రంత వృకుండు కుపితుండై ౪౧౮

—* ఏకాదశీవ్రతమాహాత్మ్యము *—

క॥ "ఎవఁడేని వేల్పులకుఁగా నవనీస్థలి దానహోమయజనంబులఁ దా
సవిధి నొనరింపఁ గడఁగిన నవలీలం జని వధింపుఁ డస్మదనుజ్ఞన్"

వ॥ అని యానతిచ్చుటయు బలవంతులగు పలలాశను లిలాతలంబునకు దిగి గుప్తంబుగా సర్వత్రి సంచరించుచు జపహోమస్వాధ్యాయపరాయణుఁ డెవఁడేని కనఁబడినఁ గఱకుకత్తులం దత్తిగి వైచుచుండి. రట్టియెడ సాంకృతియను మునివరుండు తొల్లి వృకుండు తపించిన బిలంబున ఘన్నవిగ్రహుండై గుప్తంబుగం దపంబు సేయఁ బరుషాక్షరంబుల భర్త్సించుచు సమీపించి తదగ్రంబున గంధపుష్పాక్షతలం బూజితమై హస్తచతుష్టయంబుచే నలరారు హరివిగ్రహంబు నవలోకించి యాయుధంబుల యమివరేణ్యుఁ బ్రహరించుటయుఁ దళతళమను తదాయుధంబులు మొక్కవోయి చంప సమర్థంబులుగాకునికిని వారు వైలక్ష్యంబునొంది వృకునికడ కేగి ౪౨౦

తే॥ "ఒక్కబాపఁడు తొల్లి దివౌకసులకు జడిసి నీవు తపంబున్న స్థలమునందు
హాటకేశ్వరమున విష్ణునర్చ తనదు నగ్రమున నిల్పి యొంటిమై నధికనిష్ఠ ౪౨౧

తే॥ తపము సేయంగఁ గనుగొని యపుడు మేము మొత్త మొత్తంగఁ గత్తులే మొక్కవోయెఁ
గాని యాతని మెయి కసుగందదయ్యె. నెద్ది యుచితమొ యదిచేయుము మింక నీవు"

వ॥ అనినవిని వృకుం డాగ్రహంబున రయంబ తల్పవిధంబున కరిగి కృష్ణవిగ్రహంబును గుహాయవలికిం జిమ్మివైచి పదింబదిగ నదలించుచు నీకాల నాకాలం దన్ని

క॥ "నాకుం బగవాఁడగు నల వైకుంఠు భజించువాఁడు వధ్యుఁడు నాచేఁ
గైకొందు దొంగతనముగ నా కేళవుఁ గొలుచు నీదు నసువుల నింకన్" ౪౨౪

వ॥ అనిపలికి ఖడ్గంబున వ్రేయుటయు నది పదనుగలదయ్యుఁ దద్గాత్రంబునకుఁ దగిలి నూఱుముక్కలయ్యె. నంతతోవిడువక యత్యాగ్రహంబునఁ దత్సాంకృతి నామక భూసురశ్రేష్ఠుండు ౪౨౫

ఆ॥ "కాళ్ళు రెంటితోడఁ గడు దౌష్ట్యమున నీవు నన్నుఁ దన్నిదవుర యన్నపోత!
మరలఁ దన్నకుండ విఱుగఁబో నీకాళ్ళు తీక్ష్ణంబ సారసాక్షు కరుణ" ౪౨౬

వ॥ అని యనునంతమాత్రంబునఁ బంచశీర్షంబులగు పన్నగంబులుం బోలె వాని కాళ్ళు రెండును విఱిగి ధరం బడుడుఁ దత్సైన్యంబులును విశేషించి తగుజనంబులును రుదితంబు లాచరించిరి. త్రిదశాలయు లడవిని పడింబడిగ నేలెంచి త దనీకిని పయిం బ్రివరంబులు గురియుచుయు హతశేషు లగ్నోలోకం బాశ్రయించిరి. వృకుండు కుంటివాఁడై వెలందులుం దానును వెక్కి వెక్కి యేడ్చి పెండియు విరించినిగుఱించి తపింప మొదలిడియెఁ. బాకశాసనుండు ప్రాప్తరాజ్యుండై ప్రణష్టకంటకంబుగం బరిపాలించె. ధరాతలంబున నరుల ధర్మకార్యంబులు ప్రవృత్తంబులయ్యెఁ. బిద్దకాలంబు నకుఁ బితామహుండు ప్రీతుండై వివరమప్పగతుండగు వృకు సమీపించి ౪౨౭

క॥ "వృక! మెచ్చితి నీతపమున. కేకఁ దడయక యిష్టవరము లిచ్చెద. శంకం
బక దుర్లభార్థమేనియుఁ బ్రకటింపుము హృదయగతము భయపడకుండన్" ౪౨౮

వ॥ అని వక్కాణించుటయు వాఁడు ౪౨౯

క॥ "తుష్టుండ వైతివేని యభీష్టము నెఱవేర్చెదేని యిప్పుడ యస్మ
న్నష్టాంఘ్రులు దయసేయుము. కష్టించుచునుంటిఁ గుంటికాళ్ళఁ గగంబున్"

వ॥ అనినవిని వనజాసనుండు వానిం దోడ్కొని సాంకృతి సవిధంబునకుం జని సాంత్వపూర్వంబుగా నిట్లనియె. ౪౩౧

క॥ "నావాక్యము పాటించుచు నీవృకు పంగుత్వ ముపశమింపఁగ వలయున్.
గావలెఁడే యగునుగాక మహీవిబుధ! యనుగ్రహింపవే యెటులైనన్" ౪౩౨

వ॥ అనవుడు సాంకృతి ౪౩౩

తే॥ "ఇష్టగోష్ఠులయం దేని యెపుడు నేను బలికియుండఁగ నబద్ధ మోఘ్యాగతీశ!
యట్టినియతవ్రతంబు నేఁ డిట్టు మరల విడిచి పెట్టంగవలయునో నుడువు మీవ"

వ॥ నావుడు దేవజ్యేష్ఠుండు పెండియు నిట్లనియు. ౪౩౫

ఆ॥ "భక్తుఁ డీవృకుండు పెత్తుండవీవు నా. కగ్గలంబు ప్రియుఁడ. వట్లుగాన
ననఘ! యుష్మదుక్త మనృతంబుఁజేయలేక యిట్లు వేడుచుంటి నేను నిన్ను" ౪౩౬

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయు నమ్మునీశ్వరుండు ౪౩౭

తే॥ "వీఁడు దుర్మార్గుఁ డెంతయు. వేల్పులయు విశేషముగ నాదుగురుఁడైన శ్రీధరునియు
నహితమున నుండువాఁడు. కుంటయివసింప నర్హుఁడగు. ద్విజనమాన్యుఁడ. దధిక పాప.

తే॥ జరయు మరణంబు లేకుండ సల్పితీవ. యట్టి బలవంతునకుఁ గాళ్ళు నమరునేని
నరసురాసురసహితమైన జగమెల్లఁ బాడుసేయంగఁగడఁ గడు వీఁడు నేఁడు. ౪౩౯

ఆ॥ కాన నుండనిమ్ము కొఱ్ఱలేకుండనే జరుపకుము వికల్ప మరసి మరల.
ముజ్జగములు సౌఖ్యముగనుండఁ జింతింపవలయు నీవుఁగూడఁ దలపునందు ”

వ॥ అనివచించుటయుఁ దమ్మిచూలి మఱియునిట్లనియె. ౪౪౧

ఆ॥ “ వానకాలమునం బ్రయాణంబు దుర్ఘటం, బందు మొదలె కుదుర దాహవమున.
ఎండకాలమునను హేమంతమునను నిరంతరాయమునను నది పొసంగు. ౪౪౨

తే॥ అట్లుగావున వార్షికంబైన నాల్గునెలలు వృకునకుఁ బాదము ల్గలుగు నెపల
నప్పు డఖిలజగంబుల కరుగలేక తగుపను ల్సేసికొనుచు స్వస్థలి వసించు. ౪౪౩

ఆ॥ కాన దానవేంద్రుఁడైన యీవృకుఁడు దాఁ గొఱ్ఱగలిగియుండుఁగాక యపుడు.
దేవతలకు భూమిదేవతలకు దీన నొలయఁ బాధ లెవియు నుండఁబోవు. ౪౪౪

క॥ ఏవంవిధముగ నగుచోఁ దావకమైనట్టివాక్కు తథ్యంబునుగా.
దీవృకుఁడు నన్నుఁగూరిచి కావించిన తపము నవితథగాక ఫలించున్ ” ౪౪౫

వ॥ అని యిట్లు పలికి మహాత్ముఁడగు తత్సంకృతుచేఁ దథాస్తనిపించుటయు వృకునకు వెండియుఁ జరణంబులువచ్చె. శీతాతపసమయంబులఁ జెలియాలుం దానును దక్కంగల బంధుగులును బర్హిర్ముఖులతోడి బలువిరోధంబునం బలవరించుచుఁ బడి యుండినను జలదాగమంబుగల చతుర్మాసంబులును భయంకరుండై ౪౪౬

సీ॥ వేధించు నీర్ష్యమై వృద్ధశ్రవోముఖ్యబృందారకులను దత్సుందరులను.
బాధించు నలుకమై బ్రాహ్మణప్రముఖాఖిలావనీజనముల సనఘుతముల.
శోధించు బలిమిమై క్షోణిఁ గూలంద్రోసి పట్టణంబుల నెల్ల పల్లియలను.
ఛేదించు పీఁకమైఁ జెట్లొక్కటియువీడ కుద్యానవనముల నుటజములను.
నిర్విఘమునఁ బెట్టు నిడుములు పడలేక క్షీరవారినిధిని శేషశయ్యఁ
బవ్వళించియుండు పద్మాక్షుఁడుండ నానెలలు నాల్గు గడపి నిర్జరాళి ౪౪౭

వ॥ వెండియు వృకాసురుండు విగతపాదుఁడగుటయు నష్టమాసంబులును హర్షాన్వితులై యమరావతి నలంకరించుచుండి. రట్లనేకాబ్దంబు లరుగుడు నాషాఢ మాసాంతంబున హరిహయుం డాచార్యు నాలోకించి ౪౪౮

పృథ్వి॥ “ గురూ! మరల వర్షముల్ గురియువేళ వచ్చెన్. వృకా
సురుండు ధృతపాదుఁడై సురలపై. బడున్ రౌద్రతన్.
సరీసృపశయానుఁ డో సరసిజాక్షు నొద్దం బయ
స్సరిత్పతి వసింపఁగం బనఁగనొ నికన్ వేలుపుల్.

సీ॥ గగనభాగస్థ ప్రాకారావృతములైన చంద్రకాంతోపలసౌధములను
హంసతూలికలపై నమరుపంబడిన హొంబట్టుదిండ్లం గ్రాలు మంచములను
రతనముల్తాపి స్వర్ణమున నిర్మితములై శయనీయమైన యాస్తరణములను
గలధౌతఘంటికాకలితంబులౌ గజవాజిముఖ్యవిచిత్రవాహనముల
నతిహితములైన యితరపదార్థములను విడిచి కడుదీనతం బురి వెడలిపోయి
సతతముఁ బరాశ్రయంబున వెతలఁబడుట మన కభావ్యంబగుంజుమీ మంత్రివర్య!
తే॥ కాన మౌనీంద్ర! మామీఁదఁ గరుణయుంచి వ్రతమొ హోమమొ నేమమో మతిని లెస్స
యోజనముచేసి వాత్రువ్వ మొకయుపాయ. మనుభవింపంగఁజాల మీయలజడులను.
తే॥ దేన స్వకళత్రశూన్యంబుగాని శయ్య స్వగృహముం బాసిపోవమి సంఘటిలునొ
దాని వాత్రువ్వుమయ్య స్వస్థానచలనమునను నిర్విణ్ణమయ్యె నామనసు మిగుల.
కం॥ ఏడాదికి నాలుగునెల లేడకొ భయపడుచుఁబోయి యల నిజభార్యన్
వీడి యొకండఁ బరుండుచు నూడిగపుం బ్రహ్మచర్య మొనరుపవలసెన్."
వ॥ అనినవిని బృహస్పతి తడవుధ్యానించి శతక్రతువున కిట్లనియె. ౪౫౪
తే॥ "విష్ణునారాధనముపొంటె విబుధనాథ! కల దశూన్యశయననామకవ్రతంబు.
దానిఁజేయుము క్షీరయాదఃపతిస్థుఁడైన యాహరి తీర్చు నీయభిమతంబు
ఆ॥ పట్టుపఱుపులందుఁ బవళించుచును నీదునిలయమందె యుండఁగలవు నీవు
సర్వశత్రువులును సమసెద రాజలశాయికరుణవలన సత్వరముగ" ౪౫౬
వ॥ అనియిట్లు వక్కాణించి యాయనచే నశూన్యశయనవ్రతం బాచరింపఁజేయుం
టయు భగవంతుండగు విష్ణుండు సంతుష్టుండై ౪౫౭
కం॥ "ప్రీతుండనైతిఁ ద్వత్కృతచాతుర్మాస్యవ్రతమున శతమన్యూ! నీ
చేతస్సునఁగలకోరిక నాతోఁజెప్పుకొను మిత్తు నాతోడింకన్" ౪౫౮
వ॥ అనుటయు నింద్రుండిట్లనియె. ౪౫౯
తే॥ "విష్ణుదేవ! దురాత్ముఁడౌ వృకునివలన నేనుబొందుపరాభవం బెఱుఁగుదీవు
నే నొకెన్మిదినెలలేల నేలు నాల్గునెలలు తానును ముజ్జగంబులను వాఁడు. ౪౬౧
ఆ॥ ఇట్లు తెలిసికొనుచు నెంతయు నామీఁదఁ గరుణయుంచి యెల్లకాలములును
నాకు రాజ్యముండుపేఁక విధింపుమీ యిందిరేశ! యసురబృందనాశ!" ౪౬౨
వ॥ అని యిట్లు వాకొచ్చుటయు విష్ణుదేవుండు [యుండ
తే॥ "జరయు మృతియును లేకుండ సల్పియుండె బ్రహ్మ వాని నిఁ కవ్వాఁడు బ్రదికి
నీవు త్రైలోక్య మెబ్భంగి నేలనౌను? నైనను హితంబు నీకునై యాచరింతు.

ఉత్సాహము॥ వానకాలు నాల్గునెలలు వాసవా ! రమాయుతం
జేసి పాలకడలి వెడలి యేగి హాటకేశ్వర
స్థానమున శయింతు నంతఁ దద్భరంబునన్ సదా
మేను సత్తలేక వాఁడు మిడుకుచుండ యుండెడున్. ౪౬౫

మ॥ ప్రతిసంవత్సర మిట్లునీకు హితముల్ భావించుచుండుదు. సం
భృత రాజ్యుండవు కమ్ము. పొమ్ము దివికిం. బ్రీతుండనై నమ్ము నీ
పతివస్థాసమయంబులందును భయంబందంగఁబో కింక. నీ
వ్రతమందుండు మనుజ్ గుఱించి ప్రజ నిర్వర్తింప నిష్టార్థినా" ౪౬౬

వ॥ అనియిట్లు వచియించి వృషకేతుండను స్వారాజ్యపరివృద్ధిఁబొందె. నిశ్శేష భయుండగు నిర్జరేశుం బంపించి యేటేట నాషాఢశుద్ధైకాదశీదినంబున హాటకేశ్వర క్షేత్రంబున కరిగి సముద్రభాగ్యశంబుగా వృత్రాసురుండై పవళించుచుండుటయుఁ దదాకారింపుండగు వాఁడు భాగీరథీరేకంబునం బ్రసిద్ధుండై చచ్చినట్లు పడియుండెడి. నాల్గు నెలలును నట్లుండి విష్ణుండు వెండియు కార్తికశుక్లైకాదశీతిథిం ప్రబుద్ధుండై పాలసముద్రమునకుఁ బయనంబు సేయుటయుఁ బలలాశి బ్రాహ్మణశాపంబునఁ బంగువై పడియుండెను. ఇట్లు వారి యానాల్గు నెలలును నఘాత్ముఁడగు నసుర భయంబున హాటకేశ్వరంబునం దధివసించు. భగవంతుఁడగు యజ్ఞపురుషుం డెవ్వఁడు పన్నెండి భాగంబును స్వీకరింపమి నవనీజనంబులచే నఖిలయజ్ఞక్రియలును నాచరింపఁబడ. వట్లున్నప్రాశన చాతుర్మాస్యంబులు దప్పఁ గన్యాదానాది నిఖిలశుభకార్యంబులును నిషిద్ధంబులు. జగన్నాథుని శయనసమయంబున సలుపంబడు సకలశుభకర్మంబులును వ్యర్థంబు. లయ్యవసరంబునం దాచరించు వ్రతనియమంబు లధికఫలంబులగుటఁ నత్యంతయత్నంబున హరిసంతృప్తికై వ్రతస్థులగునది. శయనబోధనైకాదశీదినంబుల జరుపంబడు యత్క్రాంచిత్క్రగ్మంబును నక్షయఫలంబగు. మహావ్రతశయనవ్రతంబె యాచరితంబుగా నడుగవలసియే యుండు. దనుగనై శయనించు నంబుజనాభుఁ డద్దాని కనంతఫలంబొసంగు. నట్టుచట శయనించిన యచ్యుతుండె యానతిచ్చెఁ. బాపాత్ముఁడై యెవఁ డయ్యేకాదశి నన్నంబుదినువానికి జ్వరమేని వచ్చియుండవలయు. లేనిని యేదేని వేదనయేని యేర్పడియుండవలయుఁ. గావున నెన్నివిధంబులఁ జూచినను నన్యంబగు హరివాసరంబునఁగూడ నన్నంబు భుజింపఁజనదు. శయనబోధనైకాదశుల నిట్ల నడుగనేల. వార్షికంబులగు చతుర్మాసంబులును వాసుదేవుఁ బూజించువాఁడు వైకుంఠంబున వసియించు. దానంబులవలనను నన్యవ్రతంబుల

వలనను నుపవాసంబులవలనను వచ్చు విశేషంబు లేమింజేసి సుశ్రేష్ఠండగు సుదర్శన హస్తుఁ బూజించునది" యని సూతుండు నుడువుటయు శౌనకాదులు

—◆ చాతుర్మాస్యవ్రతనియమములు ◆—

సీ॥ "హరి నిదురించెడి యవసరంబున నింక నేయేవ్రతంబుల్రం జేయవలెనో
దైత్యారి శయనించు తఱిని గింకింమంత్రజపముల నిష్ఠమై జరుపవలెనో
చక్రి నిద్రించినసమయమం దెటువంటి హోమంబులం జేయుచుండవలెనో
విష్ణుండు పన్నుండువేళ బ్రాహ్మణులకు నేమేమిదానంబు లీయవలెనో
యిదియునుంగాక నియమంబు లెట్టివపుడు పట్టవలయునో చెపు"మనుచుఁ బ్రశ్న సేయు
టయును శౌనకాదిమహామునీంద్రులకు సూతుఁ డెంతయును నాదరంబున నిట్టులనియె.
సీ॥ కలితస్వరాగ్రావగాహాభ్యాసికమైన యజురాది వేదపారాయణంబొ
యష్టాక్షరద్వాదశాక్షరప్రభృతులౌ ముఖ్యమహామంత్రముల జపంబొ
వటపలాశాశ్వత్థవానీరఖదిరార్క సమిధాజ్యచర్వాదికము హవనమొ
కల్పోక్తవిధ్యుక్తక్రమముగా నుండంగ సాత్వికాహారమౌ సద్వ్రతంబొ
యేదొయొక్క నియమ మూఁదంగవలె మునీశానులార ! శార్ఙ్గిశయనవేళ
నద్ది కొంచెమయ్యు నగ్గలంబు ఫలించు నంచు మును విరించి యనుటఁ జేసి.
సీ॥ ఈనాల్గునెలలును నేకభుక్తము సేయ ధనము సమృద్ధమౌఁ దపసులార !
యీనాల్గునెలలు రేయి భుజింప సుమతియై సిరియు సురూపంబుఁ జెందుమనుజుఁ
డీనాల్గునెలలనో నేకాంతరోపవాసముల వైకుంఠధామము ఘటించు.
నీనాల్గునెలలు షష్ఠాన్నహారి రాజసూయాశ్వమేధ ఫల మొందు.
విస్తరశ్రీవుండు వృక్షమైఁ బరున్న యీనాల్గునెలలు మూఁడునాళ్ళ కొక్క
పరి భుజింప మగుడఁ బడఁడుతా సంసారసాగరమున జనుఁడు యోగులార !
సీ॥ ఒకనాఁడు పవలు వేఱొకనాఁడు నిశఁ దిన్న నబ్బు నగ్నిష్టోమయజ్ఞఫలము.
యాచితేతరమైనయది పసాపడినచో నొలయదు బంధువియోగ మెపుడు.
నెయినూనియలు వెట్టి నెత్తింటుకొనకున్న స్వర్గభోగంబులు సంభవించు.
నష్టలద్బ్రహ్మచర్యమున వర్తించుచో దేవయానము మీఁదఁ దిరుగు దివిని.
నీరదావృతి నలరు నీనెలలు నాల్గు మైని నూనియరాయక స్నానమాచ
రించి మధుమాంసములనువర్జించువాఁడు ముక్తుఁ డేయగు సంయమిముఖ్యులార! ౪౨౦
సీ॥ శాకంబునందుండు శ్రావణమున బ్రహ్మ యటుగాన సంత్యాజ్య మప్పుడద్ది.
దధిలోననుండు భాద్రపదంబునం జక్రి. యట్లౌట విడువనౌ నపుడు దానిఁ.
బాలయందుండు నా శూలి యాశ్వినమున. దాన నపేయ మత్తఱిని నదియు.
నామిషమందుండు రమ్మర్వ్వరుం గార్తికమునఁ. గాబట్టి దూష్యమదియపుడు,

వానివదలువాని వత్సరకృతమైనయఘము వదలిపోవుననుచు మున్ను
చేయిరెత్తిచెప్పె స్వాయంభువుండైన మనువు శౌనకాదిమౌనులార ! ౪౭౧

సీ॥ కంచు వివర్జించి కనుడు దా వాజపేయాతిరాత్రంబుల యధికఫలము.
నష్టౌరలవణాశియగు మహీసురుచేత నఖిలపూర్తములు చేయఁబడినట్లె.
స్వాహాంత వైష్ణవసన్మంత్రములఁ దిలాక్షతలు వేల్చినఁ గాఁడు జాడ్యయుతుఁడు
స్నాతుఁడై వైకుంఠసన్నిధిఁ బురుషసూక్తముపఠించిన బుద్ధి తద్ద పెరుఁగు.
మఱియు వార్షిక తచ్చతుర్మాసములును సఫలమౌ స్తత మౌనియై చక్రహస్తు
నూటయెనిమిదిసారులు నూటిగాను వలగొనినవాని కొలయ దేకొలయునేని. ౪౭౨

సీ॥ మేదినీసురులకు మృష్టాన్నమిడువాఁడు పొందు నగ్నిష్టోమపుణ్య ఫలంబు
హరిమందిరాచరితామ్నాయపాఠుండు విద్వద్వరిష్ఠుఁడై వెలయఁగల్గుఁ
గణివేల్పుగుడిఁ గృతగాననృత్యనిమోత్రల నవిసేయుదురు దివి నప్సరసలు
అహరహశ్చరితగీతాదికుండగువాఁడు గంధర్వభావంబు గాంచితీరు.
వార్షికంబులగుచు వఱలు నాల్నెలలందో కడకు నొక్క కార్తికంబునందో
పట్టఁదగు నరుండు ప్రాగుక్తనియమముల్ చేతనైన మౌనిసింహులార !

వ॥ అట్లుపట్టినను నిహపరార్థులగు విష్ణుభక్తులు కార్తికపూర్ణిమనాఁ డవి కావించునది. ౪౭౪

సీ॥ అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన స్త్రీనేని కలియకుండుట మేలు కార్తికమున.
హుతశేషమైన యత్యుత్తమామిషమేని కడకుఁద్రోయుట మేలు కార్తికమునఁ
పరికరణాంతర ముఖ్యభావ్యముండనమేని కావించుకొనమి మే ల్కార్తికమున.
లాజాదికాత్యంతలఘుపదార్థంబేని క్రిమ్మఱఁదినమి మే ల్కార్తికమునఁ.
గంచు వాడుకొనమి మేలు కార్తికమున. క్షౌద్రరస మానకునికి మే ల్కార్తికమునఁ
గార్తికంబున వీని త్యాగంబుసేయ నబ్బుఁ బూర్వోక్త సకల నియమఫలంబు.

వ॥ కార్తికమాసంబున జలశాయిదేవు ప్రాసాదంబుమీఁది కలశంబున దీపంబు పెట్టువానికిఁ గాంస్యాది షట్పదార్థత్యాగంబునఁగలుగు ఫలంబు చేకూరెడి. శుభార్థులు సుప్రియంబునుఁ నిష్టతమంబునునైన దేనికేని చాతుర్మాస్యంబున నేమంబును బూనునది. నియమసమాప్త్యనంతర మదియే యవనీసురున కర్పించునది. శక్తికొలఁది నియమంబు చరించుటయు ఫలంబు సిద్ధించు. జపమో వ్రతమో నియమమో లేక చతుర్మాసంబులు గడపిన మూర్ఖుండు జీవించియు మృతుండు. కాకయవలుం దిలారణ్యంబులుం బోలె నమ్మానవులు నామమాత్రప్రసిద్ధులు కానఁ గడంకమైఁ గార్తికంబునఁ గొలఁదిపాటిదై

నను నేదో యొకనేమంబు పట్టవలయు. సమాహితుండై నిత్యంబును దీనిఁ జదివినను
విన్నను జాతుర్మాసీకృతపాతకంబున సంత్యక్తుఁడగు." ౪౭౬

## —◆ చాతుర్మాస్యా మాహాత్మ్యము. ◆—

కం॥ అనియిటులన మును లాతనిఁ గని చాతుర్మాస్యవ్రతము కడవెళ్ళఁ ద్వాదా
సనమునసుండి వినఁగ మా మనముల జనియించెఁ గోర్కె మహనీయతమా! ౪౭౭
తే॥ కాన నగ్గలంబు కరుణించి దాని సవిస్తరముగ మాకు వినుచుమయ్య.
త్వద్వచోమృతంబు ద్రావంగ మఱియింత గలిగె శ్రద్ధ" యనుడుఁ గథకుఁడంత
వ॥ మునులారా! చాతుర్మాస్యావ్రతమహత్త్వంబు విస్తరించెదే మీముందఱ
వచించెద. నందఱును వినుండు. తొల్లి నారదుండు బ్రహ్మముఖంబున నానావ్రత
విధానంబు విని. ౪౭౯
ఆ॥ "దేవ! వింటిఁ బెక్కుతీరులవ్రతములం ద్వన్ముఖమునఁ గాని తనివితీర.
దిఁక దయఁగ వచింపు మిపుడు చాతుర్మాస్యవ్రతము. నాలకింప వాంఛవొడమె"
వ॥ అనియడుగుటయు బ్రహ్మదేవుం డిట్లనియె.
క॥ "విను చాతుర్మాస్యవ్రత మనఘా! వాక్రుత్తు. దీని నధికశ్రద్ధఁగ.
విను భరతఖండమందలి జనులకు మోక్షంబు సులభసాధ్యం బగుఁబో. ౪౮౧
క॥ భగవంతుండగువిష్ణుం డగు మోక్షప్రదుఁడు. ఘోరమగు సంసృతి దాఁ
టఁగ నౌక. యతని స్మరణము విగతాఘులఁజేయు జనుల వేలుపుజోగి! ౪౮౨
సీ॥ బహుపుణ్యములఁగాని పడయంగరానిది మానవజన్మంబు మహితలమున.
నందులోఁగూడ బ్రాహ్మణుఁడయిపుట్టుట యత్యంతదుర్లభం బరసిచూడ.
బ్రహ్మత్వసంసిద్ధి పడసినప్పటికిని గరుణాయుతుండౌట కష్టతమము.
సహకరుణునకేని సత్సహవాసంబు దొరకుట మఱియును దుర్లభంబు.
అట్టిసజ్జనసహవాస మమరకున్న విష్ణుభక్తి జనింపదు. విష్ణుభక్తి
లేనివాఁడు వ్రతంబుల లెక్కసేయఁ. డవ్వి కరణీయములు సదా యాత్మజాత!
క॥ చాతుర్మాస్యంబున నోతాతా! విష్ణువ్రతంబు తద్దయు శుభ. మీ
చాతుర్మాస్యంబున వ్రతియై తోఁపనివాని పుణ్యమంతయు వృథయౌ. ౪౮౪
క॥ చాతుర్మాస్యంబు సమాయాతము కాఁ బుణ్యదేవతాయతనంబుల్
పూతములగు తీర్థములుం బీతాంబరు నాశ్రయించుఁ బృథుదానములుఁగ.
క॥ చాతుర్మాస్యంబున హరి కాతతమగుభక్తి మొక్క యావజ్జీవం
బాతనికిఁ బ్రీతులై సుర లోతనయా! వరములిచ్చుచుందురు చుమ్మీ. ౪౮౬

ఆ॥ మనుజులగుచుఁబుట్టి మహిని జాతుర్మాస్యమునకు విముఖులైన మూఢతముల
కాయములను జేరఁ గలుషసహస్రముల్. సంశయంబువలదు సంయమీంద్ర!

కం॥ మానవతరమె దుర్లభ. మానవతను విష్ణుభక్తి మఱిదుర్లభ. మో
హానీ! చాతుర్మాస్యములోనే యది యున్న నున్నె లోప మ్మింకహో!

కం॥ చాతుర్మాస్యంబునఁగాఁ బ్రాతఃకాలంబునందె బహుభక్తిని సు
స్నాతుఁడగువాఁడు సకలఖ్యాతక్రతుఫలము వొంది క్రాలు దివమునన్. ౪౮౯

కం॥ చాతుర్మాస్యంబునఁజని పూతజలంబగు తటాకముననో నదినో
ప్రీతిం గూపంబుననో స్నాతుండుకా నపుడ యడఁగు సకలాఘములున్. ౪౯౦

ఆ॥ పుష్కరప్రయాగపూర్వంబులగు మహాస్థలములందు నెందొ శ్రద్ధనరిగి
హరిశయించియుండునట్టి చాతుర్మాస్యమున మునుంగఁ బుణ్యమునకు మితియె

కం॥ రేవ తొలిసంద్రమునఁబడు తావు రవిక్షేత్ర. మచ్చటం జాతుర్మా
స్యావసరపు నొకదినమే సేవాఁడు మునుంగు వాని సెనయవు దోసఁగుల్. ౪౯౨

తే॥ నర్మదానదిలో మూఁడునాళు లేగి చక్రి నిదురించునెడల సుస్నాతులైన
ప్రజల పాతకములు పటాపంచలగును. నారదమునీంద్ర! వింటె తన్మహిమ మహాహా!

కం॥ గోదావరి దిగి ప్రజ సూర్యోదయమున నొక్కపక్షు మెుంగి నాడెడిచో
ఛేదించి కర్మజంబగు నీదేహము విష్ణులోక మెునయును దనయా! ౪౯౪

కం॥ చాతుర్మాస్యమునఁ దిలాన్వితాంసులకోపనీత బిల్వదళాంచ
త్పాత్రోదకములతోడను స్నాతుండగు జనుని దోషజాతము లడఁగున్. ౪౯౫

## గంగాస్నానఫలము.

కం॥ ఏజలములు కడ నేనియుఁ దాఁజని గంగేయమనుచుఁ దలంచినమాత్రన్
సాజంబుగ నగు నది గంగాజల మటు స్నానవిధిని గావింపనగున్. ౪౯౬

ఆ॥ గంగగూడ విష్ణు కాలిబొట్టనవేళ్ల నుండు. నద్ది కొలలఁ జెందునెపుడు.
నందులోన మఱియు నట్లు చాతుర్మాస్యమునను పాపహంత్రి మునివరేణ్య!

క॥ స్మరియింపఁబడుచు విష్ణువు హరియించును వేలకొలల. నటుగావునఁ ద
చ్చరణోదకంబు శిరమున ధరియించుటె శివ. మతండు తాఁగూర్కెనెడన్

క॥ చాతుర్మాస్యంబునఁ దత్పీతాంబరుఁ డుదకమందుఁ బ్రీతిని మను. న
ట్లాతని తేజముచేసము పేతం బదితీర్థమగుచుఁ బేర్కొనఁబడెడిన్. ౪౯౯

ఆ॥ అట్టి దాన స్నానమవ్విష్ణునామపారాయణంబు నగు మహాఫలములు.
దేవు నిద్రవేళ దేవత్వమే యిచ్చు నవ్వి యాచరితములైనయెడల. ౫౦౦

ఉ॥ స్నానము సేయకుండ సెవి సల్పిన నేనవి నిష్ఫలంబు. ల
వ్వానిని రాక్షసాధములె వచ్చి గ్రహించుచునుందురి బల్మిమై.
స్నానము సత్యదంబును. సనాతనధర్మము. దాన ముక్తుఁడై
మానవుఁ డెన్నడుక్ మరల మగ్నుఁడుగాఁడు భవాబ్ధిలోపలన్. ౫౦౧

మ॥ ఎవ రధ్యాత్మ మెఱింగి పుణ్యతములై యిద్ధాత్రి వర్తింతురో
యెవ రామ్నాయ తదంగము ల్పదివి యెంతేఁ గీర్తి నార్జింతురో
యెవ రేవ్వా రెవి యాచ్న చేసినను నవ్వీఁజాలియుందోరి సామి
ప్రవరా! వారికి శుద్ధి స్నానముననే ప్రాప్తించుచుండుం జుమీ. ౫౦౨

ఆ॥ స్నాతుఁడోడలుసొచ్చి సకలక్రియాకలాపముల ఫలదుఁడగును బద్మనాభుఁ.
డట్లుగాన స్నాన మమరసంతుష్టికిం గలుష హారణమునకుఁ గార్య మెపుడు.

తే॥ గ్రహణమువినాఁగ నని నిశాకాలమునను సంధ్యలందును గూడదు సంయమీంద్ర!
కూడ దుష్ణోదకంబునంగూడఁ గాన నోనర దటువంటిస్నానంబులను విశుద్ధి.

ఆ॥ సూర్యదర్శనమున శుద్ధి సమస్తకర్మముల విహిత. మందునఱియు హరి శ
యించు నాల్గునెలలు నేర్పడు జలశుద్ధి యమరమునివరేణ్య! యార్యగణ్య!

క॥ సలిలస్నానాశక్తులు బలుమంత్రిస్నానముననో భస్మస్నా
మలవిష్ణుపాదజలములవలననో శుద్ధంబుసేయవలయును దనువుక్. ౫౦౬

ఆ॥ క్షేత్రతీర్థనదుల శ్రీనాథుముందఱ స్నాతుఁడైనవాఁడు పూతుఁడగును.
హరి పరుండియున్నయపుడు విశేషించి శుద్ధదేహుఁడగునుజూ యతండు. ౫౦౭

——◆ చాతుర్మాస్య నియమవిధి. ◆——

శా॥ చాతుర్మాస్యమునందు స్నాతుఁడయి తత్స్నానావసానంబునన్
బూతాత్మం బితృతర్పణంబు సలుపం బుణ్యం బనంతంబు. ద్వి
ప్రోక్తస్విన్యమలాంబుసంగమమునన్ సుస్నాతుఁడై దేవతా
వ్రాతంబుం బితృవర్గముం దనుపు నవ్వాఁడున్ మహాపుణ్యుఁడో. ౫౦౮

కం॥ గోవిందస్మరణంబును గావించి యొనర్పనగు సుకర్మములెల్లన్.
దేవ పితృమనుష్యావళి కీవిధమగు తృప్తిదం బిఁకేమనవలయున్. ౫౦౯

కం॥ చాతుర్మాస్యను ధర్మాన్వితంబగు శ్రద్ధతోడ నిఖిలక్రియలన్
భూతాత్ములగుటకై స్మృతిపూతంబులుగాఁగఁ జేయఁబోలును దనయా! ౫౧౦

సీ॥ అవనీసురులయెడ నతిభక్తినునికియు సత్పురుషులతోడి సంగమంబు
గురుజనంబులుగోరు కోర్కె తీర్చుటయును దైవతనివహ సంతర్పణంబు
గోవులపై భక్తి గోప్రదానంబును వీతిహోత్రమునందు వేల్చుటయును
సన్నృతంబులాడమి యామ్నాయపాఠంబు దాతృత్వమందలి తత్పరతయు
సంతతమును ధర్మసాధనసత్కార్యములు తలంపనందు మురవిరోధి
నిదురవోవుపట్ల నియమబద్ధంబుగా వీనిఁ జేయు టెంతయేని లెస్స" ౫౧౧

ఆ॥ విష్ణుఁ బ్రీతుఁ జేయ విద్యను గోవును భూమి నిచ్చునట్టి పురుషవరుఁడు
తనదు పూర్వికులను దరియింపఁజేసెను. యతఁ డింద్రలోక మందఁగలఁడు.

ఆ॥ అసలమందు హోమ మవనీసురాళికి దాన మర్చనంబు ధేనువులకు
నయముం బొనర్పనగును. జాతుర్మాస్యమున విశేషముగను బొనరుచు మనది.

సీ॥ మంచిపాకములోన దించంగఁబడినదై యెంతయుం దివ్యమై స్నిగ్ధబెల్ల
మపగతమాలిన్యమగుచు స్థలమును దనరారునట్టి సంద్రంపుటుప్పు
పాకంబునకుఁ గడుం బకివచ్చెడికీతి నూత్న సంసిద్ధమౌ నువులనూనె
అత్యంతమధురంబు నద్యతనంబునై పాలుపొందునటువంటి పుట్టతేనె
వగరుగలిగిన రుచ్యంపు వస్తువులు తిలాన్నమే దేవతంగూర్చి యర్పితంబు
లగునో యా దేవతాలోకము గుఱియించి చనును దద్దాత కలశాంభోజనమునీంద్ర !

ఆ॥ దానపాత్రమగుచుఁ దనరు చాతుర్మాస్య మచ్చువెళ్ళిపోవునట్టికుఁగూడ
వసుమతీసురునకు వాగ్దత్త మీకున్నఁ దొంటిసుకృతమెల్ల మంటఁగలయు.

ఆ॥ వడ్డి పెరుఁగుచుండు వాగ్దత్తమైన ద్రవ్యమున కహరహంబు. నట్లుగాన
నించుకేని శీఘ్రమీనున్నదాని వాగ్దత్తమాచరింపఁ దగదు తగదు. ౧౫౯

ఆ॥ మోహసహితుఁడగుచు ముం దిత్తునన్నాఁ డాదిగాఁగ నిచ్చునంతవఱకుఁ
బెరుఁగుఁ గోటిరెట్లు సరిగఁ. జాతుర్మాస్య మంతకంటె దశగుణాధికమగు.

తే॥ అట్టిదాతలు పదునల్గురైన యింద్రులరుగువఱకును నరకంబు నందుఁబడుదు.
రట్లుగావున వాగ్దత్తమర్పణీయ మాలసింపక నరులచే యమివరేణ్య ! ౧౬౦

తే॥ ఒకరికొసఁగినదాని వేఱొకరి కొసఁగరా. దొసంగియు హరియింపరాదు సుగల.
దత్తమైనట్టిదియును వాగ్దత్తమైనయట్టిదియుఁ దుల్యములె యగు నరసిచూడ. ౧౬౧

సీ॥ స్వాధ్యాయ పఠనాదిసత్కార్యకరులకుఁ గరమిష్టమైన యాస్తరణములును
సూత్మాసనంబులై చూచుట కింపయి లలివహించుచునుండు కలశములును
బలుప్రకారంబులౌ పాకము ల్గావింప బహ్వనుకూలమౌ భాండములును
సంధ్యారుణద్యుతిం జాల దీప్తంబులౌ పావనతమ తామ్రపాత్రములును
శక్తికొలఁది నీయఁజనును జాతుర్మాస్యమున మహీసురులకు మునివరేణ్య !
తన్నుఁ బూర్వజులను దద్దాత విడిపించు వృజినవితతినుండి వేగముగను. ౧౬౨

సీ॥ అవయవసౌష్ఠవం బగ్గలంబుగఁగల్గి వత్ససంయుక్తమై వఱలునావు
నుష్పపండెడి వట్టియూషరక్షేత్రంబు వంటిదిగానట్టి పంటవలఁతి
నూనె మిక్కిలివెళ్ళు నువుధాన్యములచేతఁ బూరింపఁబడియున్న తామ్రపాత్రి
చమురును వత్తులు సంపూర్ణముగఁగల్గి బలుగంటువిధమున వెలుఁగుదివ్వె
విశ్వకర్త గోప్త విశ్వఫలప్రదుం డైన శౌరి ప్రీతుఁడగుటపొంటె
నవనిసురున కొసఁగునతఁడు ఋణత్రయమునను దప్పుకొండె ముక్తుఁడగును. ౧౬౩

చేత నొకప్పుడుం జేత నంటకయున్న నగును యావజ్జీవ మతిధనాఢ్యుఁ.
డన్యతసంత్యాగమున మోక్షమబ్బు. యక్షకర్దమత్యాగి బ్రహ్మలోకంబునొందు.
రాజవల్లభుఁడగుఁ గేసరంబువీడ హరిపరుండినసమయంబునందుఁ బుత్రి!

ఆ॥ నల్లనలువ వీడఁ జెల్లనుసతి. మవశ్యమున వీడవలయు హరిపరుండ.
శ్యామలాంబరంబు సందృష్టమగుమీఁద సూర్యదర్శనమున శుద్ధిగలుగు. ౫౩౨

క॥ పరమర్మంబును బ్రకటముషఱచుటచేఁ దక్షణంబ పాపముకలుగుఁగా.
హరిశయనావసరంబునఁ బరనింద త్యజింపవలయుఁ బ్రజ యటుగానన్.

క॥ పరదూషణంబు పాపము. పరదూషణవలనఁ గలుగు భయము పధికముగన్.
బరదూషణంబు దుఃఖము. పరదూషణకన్న నున్నె పాపము పుడమిన్. ౫౩౪

క॥ కేవలదూషణమునసే కావలసినయంత పాతకము గల్గును గా
నీ వినినయట్టివానికి నావిధమైనట్టిపాప మబ్బదు తలఁపన్. ౫౩౫

తే॥ కేశసంస్కారసంత్యాగికిం దనూజ! తొలఁగుఁ దాపత్రయంబును దూరమునను.
హరి పరుండఁగ నఖరోమధరుఁడై యైనఁ బ్రత్యహము గంగనాడినఫలమువొందు.

ఆ॥ ఎల్లవర్ణజనుల కెలమిఁ జాతుర్మాస్య యమ్యుపాస్యుఁడైన హరి ప్రసాద్యుఁ.
డగును బంధముక్త మాహరినామంబు పలికి తలఁచుకొనియుఁ బ్రజ మునీంద్ర!"

వ॥ అనియిట్లు వక్కాణించుటయు నారదుండు ౫౩౬

—॥ వ్రతమహిమము. ॥—

ఆ॥ "విష్ణుదేవుమ్రోల విధినిషేధంబుల నెపుడుచేయవలెనొ కృపను జెపుమ.
త్వద్వచోమృతంబు తద్దయుఁద్రావినం దృప్తిగా దదేమొ దేవ! నాకు" ౫౩౭

వ॥ అని వాక్రుచ్చుటయు వెండియు బ్రహ్మదేవుం డిట్లనియె. ౫౪౦

ఆ॥ "కర్కసంక్రమమునఁ గమనీయజంబూఫలములచేత హరికి యమివరేణ్య!
యర్ఘ్యమీయవలయు. నల్ల జంబూద్వీపసంజ్ఞ వానఁగాదె సంఘటించె. ౫౪౧

శ్లో॥ షణ్మాసాభ్యంతరే మృత్యు ర్యత్ర క్వాపి భవే న్మను
తన్మయా వాసుదేవాయ స్వయ మాత్మా నివేదితః.

క॥ అను నీమంత్రము చెప్పుచు ఘనచాతుర్మాస్యమందు గ్రహియింపఁగనా
తనయా! విధియు నిషేధము జనార్దనుని మ్రోల జనము శ్రద్ధాయుతమై. ౫౪౩

ఆ॥ విధియనంగ వేదవిధి. నిషేధంబన నిపుమ. యవ్విరెండు నీరజాక్షుఁ
డే తలంపఁ. గాన నెవ్విధమునసైన సేవ్యుఁడతఁడు మానిసింహ! భక్తి. ౫౪౪

సీ॥ సానుజవ్రాతసంరక్షణార్థమై కృతమైన తన్మూర్తి కీర్తనమును
నసురసంహారణార్థ మవతరించెడి యాదిపూరుషుఁడగు శౌరి పూజనమును

ధర్మసంస్థాపన దక్షమైనటువంటి తదవతారంబుల ధ్యానములును
సాష్టాంగసహితమై యతిభక్తిసహితమై కడుశ్లాఘ్యమౌ నమస్కారములును
సర్వమును నెవండు చక్రిసంప్రీతికై చేయువాఁడు ముక్తిఁజెందఁగలఁడు.
వాస్తవస్వరూపి వర్ణాశ్రమవిధికి మూర్తి విష్ణుమూర్తి మునివరేణ్య! ౫౪౫

ఆ॥ వ్రతమువలన హరిని వశుఁజేసికొనవలె. వ్రతము శ్రద్ధఁ జేయవలెను మేన.
మేను తపసుచేత మిక్కిలి శోధ్యంబు హరిపదన్నయట్టి యవసరమున" ౫౪౬

వ॥ అనియిట్లు వచించుటయుఁ గలహభోజనుండు ౫౪౭

ఆ॥ "ఎద్ది వ్రతము? మఱియు నెద్దితపంబని వ్యవహరింపఁబడును వసుధలోన?
హరిపరుండ నెద్ది యాచరించిన మహాఫలముగలుగు? నాకుఁ దెలుపుమయ్య"

వ॥ అని యనుటయు నంబుజాసనుం డిట్లనియె. ౫౪౯

ఆ॥ వ్రతమనంగ భక్తియుతమైన విష్ణువ్రతంబయగును జుమ్ము తాపసాగ్ర్య!
తపమనంగ నగును ధర్మవర్తిత్వంబు. కృచ్ఛ్రముఖరకృచ్ఛ్రకృత్యమేని. ౫౫౦

ఆ॥ వినుపచింతునీకు మును వ్రతమాహాత్మ్య మమరవానిసంచయాగ్రగణ్య!
అన్నివ్రతములకును నత్యుత్తమవ్రతంబగును బ్రహ్మచర్య. మదుగనేల. ౫౫౧

సీ॥ బ్రహ్మచర్యముకన్నఁ బరమోత్తమంబైన ధర్మసాధనమొండు ధరణిఁగలదె.
బ్రహ్మచర్య ప్రభావముచేత నేకాదె యుగ్రమైనతపంబు నుర్విమనుట.
బ్రహ్మచర్యముకదే పను లెల్ల నిర్విఘ్నముగ సమాప్తమ్ముఁజేయఁగఁ గలయది.
బహుఫలాఢ్యంబైన బ్రహ్మచర్యముకదే సత్తపంబునకెల్ల సారభూత.
మట్టిబ్రహ్మచర్య మనఘ! చాతుర్మాస్య నాచరింపఁబడిన నతివిశేష.
మది మహావ్రతంబటం చనవరతంబు నెఱుఁగుమయ్య. చెప్ప నేమిగలదు.

క॥ మున్నాటియువది దివసము లెన్నఁగ సంవత్సరమున. కీదివసములం
దన్నారాయణు నొకదిన మున్నతి భజియించుటన్న నుత్తమ మరయంగ. ౫౫౩

తే॥ ఈసుకార్యముచేసెద నేను దేవ! యని యిటు ల్సేయు టే వ్రతమందు. రదియు
హరిపరుండినయప్పుడైన నతివిశేష. మదియె నారాయణము. ముక్తుఁడగు నొనర్చ.

సీ॥ పితృహోత్రమునందు వేల్పుట విప్రులయందు భక్తియు ధర్మమందు శ్రద్ధ
శుభమతి హరిభక్తి సుజనసంగమమును సత్యవాదము దయాస్వాంతతయును
ఋజుభావమును సచ్చరిత్రము దాసక్తి మధురమౌ వాణి శమదమములు
స్వాధ్యాయపాఠంబు చౌర్యంబులేమియు హింసావిదూరత హ్రీయుతతయు
మోహక్రోధలోభములను మమత్వంబు నవలఁద్రోసియునికి యాగమోక్త
సత్క్రియాచరణముగు జ్ఞానంబు మఱియుఁ గృష్ణార్పితమయి వెలయు నాత్మవృత్తి

ఆ॥ ఈవ్రతంబులున్నయెడల జీవన్ముక్తుఁడగు నరుండు. వాని ననుసు లంతు
వేకవారకృతమ యెపుడును ఫలియించు. హరిపరుండఁజేయు నధికఫలము.

క॥ వ్రతమెడియును లేకుండను క్షితిఁజాతుర్మాస్య మెవరిచే నీతనుగుణ
విశే వారి ధర్మమని యానతియిచ్చిరి తత్త్వవిదులు నారద! వింటే. ౫౫౭

ఆ॥ సర్వవర్ణములకు సద్వ్రతచర్య మహాఫలంబు స్వల్పమయ్యు వత్స!
యింతె కెచ్చుసుఖద మదియె చాతుర్మాస్య. మింతెకన్నఁజెప్ప నేమికలదు. ౫౫౮

క॥ సర్వత్రి చూడఁబడును సుపర్వముని! వ్రతులచేతఁ బంకజనాభుం.
డుర్విం జాతుర్మాస్యను సర్వవిధంబులను వారి సాకె యుతించుఁగా. ౫౫౯

సీ॥ తీర్థస్వరూపుండు ద్విజరూపుఁడును నయి జగతిఁ బవిత్రంబు సల్పునెవఁడు
ఆగమమయుఁడును నసలమయుండునై ఘనకల్పిసాటపు ద్గాల్చునెవఁడు
ఎవ్వనికృపచేత నెక్కఁగూర్చుండు మోక్షమహీరుహంబుపై సజ్జనంబు
ఎవనిసేవించిన భవసూర్యయూలమా తాపంబు గలుగదు ధరణియందు
ఆవిరాజు విష్ణు నజు షోడశోపచారములచేతఁ బూజనము విధింపు
మదెతపంబు మతియేమి హరిపరున్నపుడు మహాతపంబటుండు రాజ్యజనులు

—॥ తపోమహిమము. ॥—

సీ॥ పంచయజ్ఞము లాచరించుటయును నొక్కభంగితపంబయాఁ బ్రత్యహంబు
గృహికి స్వస్త్రీతోడి ఋతుకాలగమనముం దపమని చెప్పంగఁదగినదగును.
అనవరతంబును నస్మృతంబులాడమియును నొక్కతపమయా నుర్వియందు
సతత మహింసాదిసద్గుణంబులనెల్లఁ బాలించుటయును దపంబె మరయు.
ప్రత్యహంబుఁజేయు పంచాయతనపూజయును దపంబె కాని మునివరేణ్య!
అవి మహాతపంబులగును జాతుర్మాస్య నాచరింప ఫలము నగ్గలంబు" ౫౬౧

వ॥ అని యిట్లుపలుకుటయు నసురముని ౫౬౨

కం॥ "పంచాయతనంబనుచు విరించీ! దేనికది సంజ్ఞ? కృప యధికముగా
మంచి యెటయ్యెనో? యది పూజించుట యెట్లో? విస్తరించిచెపుమీ నాకుఁగా" ౫౬౩

వ॥ అనవుడు బ్రహ్మయిట్లనియె. ౫౬౪

కం॥ "హరిశక్తిధ్యానంబుల నోతనయా! యవిని రాత్రి యుడుపతి మధ్య
స్థాతిలఁజేసి సమ్యములైతనరెడి పూలతోడ నర్చింపవలెఁగా.

ఆ॥ నిమ్నకోణమందు దైవ్యమాతునని నిల్పి రక్తచందనసుమ రాజిచేతఁ
బూజసేయవలయుఁ బుత్రి! చాతుర్మాస్యమున విశేషముగను బూజ్యుఁడతఁడు.

ఆ॥ అసురదర్పహారి యగు భగవానుండు నైఋతీయదళమునం బ్రతిష్ఠి
తుఁడయి కేస్తు పగలుఁ గ్రుంచెడి సర్వదా. యట్లుగాన విష్ణు నచట నునిచి. ౫౬౯
ఆ॥ గంధపుష్పములను గమ్మని వంటకంబులను జేయవలయుఁ బూజనంబు.
వాయుకోణమందు వరుస నంబికనుంచి కొలువవలయుఁ గులము నిలుచుపొంకె.
ఆ॥ వేనిమహిమ బ్రహ్మవిష్ణ్వాదులును లిఖింపంగఁజాల రట్టిభవుని శ్వేత
పుష్పములను సతము బూజించునది యపమృత్యుముఖర దోషబృంద మెడల.
క॥ ఏకత్వంచాయతనము భూతలమున కేస్తులెల్లఁ బూజింతురుగా.
ఊతప మెపుడుం గార్యము. చాతుర్మాస్యఁ గృతమైనఁ జాలఫలంబౌ. ౫౭౦
ఆ॥ అన్ని పర్వవేళలందును గృతమైన దానధర్మములును దపమయగును.
అది యనంతఫలదమగును. జాతుర్మాస్యసమయమందు శ్రద్ధ సల్పఁబడిన. ౫౭౧
ఆ॥ బాహ్య మాంతరమనఁ బరగును శౌచంబు ద్విప్రకారమగుచు విప్రముఖ్య !
జలకృతంబు బాహ్యశౌచంబు. శ్రద్ధనై నాచరించుశౌచ మాంతరంబు. ౫౭౨
ఆ॥ ఇంద్రియముల నిగ్రహించుట యొకతపం. బింద్రియముల లౌల్యమెల్ల నణఁప.
నది మహాతపంబటంద్రు. చాతుర్మాస్య నింద్రియార్థనియమి యెనయుసుఖము.
ఆ॥ ఉత్పథమునఁజనెడి యుర్వింద్రియంబులే నరకముననుదోయు నరుని. గాన
మమతయనెడి దుష్టమతియైన మొసలిని నిగ్రహించుటొప్పు నిరత మనఘ ! ౫౭౪
ఆ॥ అదియు నొక్కతపమె యగును. జాతుర్మాస్యమందెదైన నదియుమహాతపంబు.
కామమును జయింపఁగలవా ర్మహాత్ములు. అఖిలజగము గెలిచినట్టి వారు. ౫౭౫
క॥ కామంబును సంకల్పము నేమనుజుఁడు గెల్చు వానిదే జ్ఞానమనం.
గా. మూలమదియె తపమున కోముని యది హరిపరుండ నురుతపమగుఁజూ. ౫౭౬
తే॥ లోభ మెపుడును దార్యశ్యంబు. లోభమంటుఁ గిల్బిషంబుండు. నద్దాని గెల్వ తపము.
హరిపరుండిన సమయమం దట్టిగెలుపు మహితతపమనఁబడుఁ జెక్కుమాటలేల. ౫౭౭
తే॥ మోహ మవివేకమును సదా మొనసి విడువఁదగును నారద ! వానిచేఁ దక్కుఁడైన
వాఁడె యగు జ్ఞాని. యవ్వాని వదలకున్న నెన్నియున్నను నజ్ఞానియే నరుఁడు.
ఆ॥ మదము దేహమందు మను వైరి జనులకు. దాని నిగ్రహింపనొను సతము.
హరిపరుండుసమయామం దవశ్యంభావ్య మిమ్మదంబు నిగ్రహించు టన్న. ౫౭౯
క॥ మానము భయదంబగుచును దానుండును సకలభూతతతియందును. న
ద్దానిని క్షమచే గెల్వఁగనౌ. నది హరిశయనవేళ నధికఫలంబౌ. ౫౮౦
ఆ॥ అధికపాపకారియైనట్టి మాత్సర్యమును జయింపవలయు మొనసి ప్రాజ్ఞుఁ.
డట్లు హరిశయనుండునపుడు జయించువాఁ డిగజగముల నురల నొగిజయించు. ౫౮౧

కం॥ మునులు జితేంద్రియులయ్యును దనఁదు! యహంకారమునఁ దావలమగుచున్
ఘనధర్మమార్గమును విడి యనయంబున్మార్గగాములగుదురు చూవే. ౬౮౧
ఆ॥ కాన నెప్పుడు విడువనౌను నహంకృతి. యందువలన ఫలము ననుభవించు.
ఆట్లు హరిపరుండునప్పుడు విడుచుచో నధికఫలముగలుగు నామిళశ్రేణ్య!
కం॥ మనమున నేతత్త్యాగం బనునది తపమునకు మూలమగు నారద! వీ
నిని వదలి శుద్ధమతియై మనుమనుజుఁడు బ్రహ్మమయుఁడు మహిఁ బరికింపన్.
ఆ॥ మొదలఁ గాయశుద్ధిపొందఁ బ్రాజాపత్య మాచరింపవలయు నవనిజనము.
హరిపరుండునమయమందే యొనర్చుచో నది మహాతపంబటండ్రు బుధులు.
కం॥ హరిశేయనవేళ నేకాంతరమైన యుపోషణము సతంబును జేయన్
నరుఁడు యమాలయమునకేఁక నరుగఁడు నారదమునీంద్ర! యఘువిరహితుఁడై.
ఆ॥ హరిపరుండునెడల నహరహమును నరుం డేకభక్తమును సహించనేని
ద్వాదశాహఫలము తప్పక కలిగెడి దినదినంబు నతనికిని మునీంద్ర! ౬౮౨
సీ॥ ఎవఁడు చాతుర్మాస్య నవుచు శాకాహారి క్రతుసహస్రఫలంబు గలుగు వాని.
కెవఁడు చాతుర్మాస్యఁ దవిలి చాంద్రాయణ మొనరించుఁ దత్పుణ్య మూర్జితంబు.
ఎవఁడు చాతుర్మాస్య నెంతయుఁ బారాక మాచరించును వాని యఘములడఁగు
ఎవఁడు చాతుర్మాస్యఁ గృఛ్రసంసేవియౌ నైరంతరమునందు వాఁడు ఘనత.
ఏపుమాంసుఁడో మునీశ! చాతుర్మాస్యఁ దప్తకృఛ్రపరతఁ దావసించు
వాఁడిహమునఁ బుత్రవంతుఁడై విష్ణుసాయుజ్యమొందుఁ గీర్తియుఁ వెలయు.
సీ॥ దుగ్ధపానమునఁ జాతుర్మాస్య గడపినఁ బాపసహస్రముల్ రూపుమాయు.
మితమైనయన్నంబు మెసవఁ జాతుర్మాస్యఁ గొలలం దొలంగి నైరంతర మొందు.
ఏకాన్నభోజన మెలమి జాతుర్మాస్యఁ జేసినఁ దెగుళులు చెందు లయము.
అక్షారలవణాళి యైనఁ జాతుర్మాస్య బ్రహ్మహత్యాదిపాపములు వాయు.
ఉదకములను ద్రావి యుండ్నఁ జాతుర్మాస్య నహరహంబుగూడ నశ్వమేధ
యాగమాచరింప నబ్బెడిఫలమబ్బు సంశయంబులేక సంయమీంద్ర! ౬౮౩
తే॥ కందమూలాశనుండైన ఘనుఁడు తన్నుఁ దనదు పూర్వుల ఘోరపాతకమునుండి
యుద్ధరించుటయేకాక యొందుఁ బోయి విష్ణుసాలోక్యమును దాను విద్వదగ్రణి!
కం॥ చాతుర్మాస్యను విష్ణుప్రీతికిఁగా నెవఁడు శీతవృష్టి సహించున్
పీతాంబరుఁడగు శ్రీహరి యాతని కగు వశుఁడు నారదా! వింటివొకో.
ఆ॥ మాసమంతయు నుపవాసంబులుండిన నది మహాపరాక మనఁగఁబడును.
హరిపరుండియున్న యానాల్గునెలలలో నొకటనేని దాని నొనరుపనగు.

క॥ ఎవ్వఁడిది భక్తి నొనర్చునో యవు విష్ణువు వాఁడు. తపములన్నిటిలోనన్
భువినిది మహితతపంబగు. సవనంబులకన్నఁ బెద్ద చాతుర్మాస్యన్. ౧౯౩

ఆ॥ దుర్లభంబు మఱియు దుష్కరంబగు నీమహాతపంబుఁ జేయు సకలుమానవుఁ
ప్రతిదినంబునందుఁ బదివేలయజ్ఞము ల్సలిపినంతఫలము గలుగఁగలదు.

సీ॥ ఈమహాపారాకమే మహాపుణ్యంబు. నీమహాపారాకమే సుఖంబు.
ఈమహాపారాకమే కడు శ్రేయంబు. నిదిసేయువానిమే నెనయు శౌరి.
జ్ఞానంబు వానికిఁ గలుగుఁ బాతకయుక్తుఁడయ్యు జీవన్ముక్తుఁడగు నతండు
మాసోపవాసియా మట్టు కేగర్జించు నఘములు. నరకంబు లంతకఱకె,
మాయలంతేఁకఱకె. మఱియుఁ జాతుర్మాస్య నుపవసించియున్న యుర్వ్యమరుని.
నతిథిఁజేయువాని హత్యాసహస్రసంజనితపాపములును క్షయము గాంచు. ౧౯౫

ఆ॥ ఎవ్వఁడీపురాణ మితరులకును సుబోధముగ వినుచుఁ జదువుఁ దనకుఁదాను.
వాఁడుగూడ గురునివంటివాఁడై ఫలం బనుభవించు సంశయంబులేక. ౧౯౬

క॥ పరమపవిత్రంబగు నీపురాణమును మానసమునఁ బురుషోత్తము సు
స్థిరముగనుంచి పఠించిన నరులకు దుష్ప్రాప్యమైన సుధ లభియించున్." ౧౯౭

—• తపోధికారము. •—

వ॥ అని యిట్లు చెప్పుటయు నారదస్వి. ౧౯౮

తే॥ "షోడశోపచారంబుల చొప్పదెట్లొ హరిపరుండంగ నిత్యంబు నాచరింప
నుచితమైనట్టి యాషోడశోపచారములును నెయ్యవో వివరించి తెలుపుమయ్య."

వ॥ అని యడుగుటయుఁ బద్మగర్భుని మఱియు నిట్లనియె. ౨౦౦

క॥ "శ్రుతిశాస్త్రవిధానముచే నతివృద్ధముగ విష్ణుభక్తి యాచరణీయం
బుతనూజా! ఇదియంతయు శ్రుతిమూలం. మనాది హరియు శ్రుతి పఠింపన్.

తే॥ బ్రాహ్మణాధారములు శ్రుతుల్. బ్రాహ్మణుండు వహ్నియారాధనముచేయువాఁడు.
[ వాఁడు
యజ్ఞమున దేవునర్చించు చాశ్రయాశమందుఁ బ్రాహ్మణాహుతి జితేంద్రియా!

క॥ హరిపూజారతుఁడగుప్రిజ నిరతము ధరియింపఁజేయు నిఖిలజగంబున్. [ మునీంద్ర!
స్మరణము సేయఁగఁబడినంత హరియించు నశేషమైన దురితిలంబుల్.

క॥ జలరూపంబును దాలుచు జలజాయతలోచనుండు చాతుర్మాస్యన్.
దలఁచుకొనఁబడినయెడలను విలయించు విశేషముగను వెతలు మహాత్మా!

తే॥ ఉదకమునఁనుండి యన్నఁబు లుద్భవించె. హరిశరీరాంశ సంభూతమైనయన్న.
మగును బ్రహ్మము. దానిని హరినిలిపి యింత జరామరణాదు లేన్నఁడును నిలఁచు.

సీ॥ ఆకాశమునుండి యాది ఋగ్వేద మొక్కటిరు యేర్పడెఁగాని క్రమముగాను.
జగతి యజుస్సామసంజ్ఞలుగలది సహస్రశీర్షమును నారాయణమయ.
మయి షోడశార్చల వలనారుచును మహాసూక్తంబటంచుఁ దాఁ బ్రోక్తమయ్యె.
తత్పాఠమాత్ర సెంతటి బ్రహ్మహత్యయు నడఁగును. బుధుఁడైన యవనిసురుఁడు
స్వీయదేహమునను స్మృత్యుక్తమున న్యసించునది మొదటఁ. బిదప శుద్ధమయిన
సురుచిరప్రతిమల మఱియు సాలగ్రామములను నొగి న్యసింపవలయు లలిని. ౬౦౬

సీ॥ వైకుంఠపురమున వర్తించునట్టిఁడు కౌస్తుభమణిచేఁ బ్రకాశమానుఁ
డర్యమకోటితుల్యప్రభాసహితుండు పంచశాఖస్థిత భవ్యదండుఁ
డఖిలపాపసమూహహారణుండు శిఖయును సూత్రంబు గలిగిన సుందరుండు
పచ్చనిరంగు హొంబట్టు పుట్టముగట్టి పెంపెసలారెడిభిక్షురొట్టు
నైన విష్ణురూప మావాహనముచేసి పూజసేయవలయుఁ బూర్ణభక్తి.
అవిధంపుఁబూజ యుల్లచాతుర్మాస్యమున విశేషఫలదమని వచింతు. ౬౦౭

## —♦ షోడశోపచారపూజ ♦—

ఆ॥ ధ్యానసంస్థుఁడైన తద్విష్ణుభగవాను బ్రణవముఖరమలను బరఁగునట్టి
ఆదిఋక్కుచేత నావాహనముచేయవలయుఁ బ్రథమమందుఁ గలహాశీల! ౬౦౮

తే॥ పార్షదులతోడ సహితుఁడై పరగుచున్న హరినిగుఱియించి సౌవర్ణ మాసనము ద్వి
తీయ ఋక్కునఁ గల్పించి యీయవలయు. భూరిభక్తిని నది పరిపూర్ణమగును. ౬౦౯

తే॥ పాద్యము తృతీయ ఋక్కున హృద్యముగను నీవలయును గంగను సంస్మరించి.
నాలుగవఋక్కుచే నర్ఘ్య మొలి నిడుచునది సరిత్తులతోడ సప్తాంబుధులను. ౬౧౦

తే॥ మఱి జగన్నాథునకు నాచమనము చేయనగును శుద్ధోదకమున. మూఁడాచమనము
లాచరించిన బ్రాహ్మణుఁ డగును శుద్ధుఁ. డాచమనవారి ప్రకృతిస్థమగుట లెస్స.

సీ॥ ఫేనబుద్బుదముల హీనమౌ నుదకంబు హృత్ప్రాప్తంబుగా శుద్ధినొసఁగు ద్విజుఁడు.
కంఠగతంబుగా క్షత్రియునకుఁ దాలుగతముగా విశునకుఁ గలుగుశుద్ధి.
స్త్రీయును శూద్రుండుఁ జేత జలంబుల స్పృశియించియే శుద్ధిఁజెందఁగలరు.
భక్తియుక్తంబుగం బంచమఋక్కుచే నాచరితవ్య మయ్యాచమనము.
భక్తిచేతనె గ్రాహ్యుండు పద్మనాభుఁ-డాత్మనిచ్చును భక్తిచే నతఁడు సరిగ.
ఆచమనమైనతరువాత నాఱవదగు ఋక్కుచే స్నాన మొగిని జేయింపవలయు.

సీ॥ నిఖిలౌషధీరసాన్వితము ఘర్మనుతుసంస్థితమును మఱి సువాసితము నైన
జలమున మనసుచే సముపాహృతంబైన తీర్థోదకమునను దేవునకును

స్నానంబుఁ జేయింపవాను గరము శ్రద్ధ-సశ్రద్ధ దత్తమహానర్ఘ రత్న
రాశినైనను ఫలరహితమా. శ్రద్ధచే నర్పిత జలమే ననంతఫలద.
మట్టిశ్రద్ధతోడ నట్లు చాతుర్మాస్య నర్పితస్వచ్ఛమైన నగుఁ బవిత్రుఁ.
డంత వస్త్రదాన మాచరితవ్య మేడవది యైన బుక్కున విధువునకు. ౬౧౩
క॥ ఆచ్ఛాదింపఁగఁబడుజగ మాచ్ఛాదింపంగఁబడిన హరివస్త్రముచే.
ఆచ్ఛాదనదానం బోసచ్చీల ! మహాఫలంబు చాతుర్మాస్యన్. ౬౧౪
ఆ॥ విష్ణురూపియైన భిక్షునకుం బునరాచమనము నొసఁగవగు మునీంద్ర !
అంత యజ్ఞసూత్ర మష్టమబుక్కుచే నీయవలయు. దానిచాయ వినుము. ౬౧౫
సీ॥ దానిసంస్పర్శంబు భానుకోటిస్పర్శమున కనురూపమై తనరు ఘనత.
అనవరతంబును నత్యధికముగ విరాజమానంబది తేజుతోడ.
అగ్రహవ్యారితుండగు విప్రునం దది సౌదామినీకోటిసమతఁబరఁగు
బ్రహ్మవిష్ణుమహేశ్వరస్వరూపంబును వేదమయంబునై వెలయునద్ది.
సవితృచంద్రవహ్ని సంగమమున బుణత్రయముచేత సుయుక్తంబునద్ది.
తత్ప్రభావమునను దా ద్విజన్ముండనుగాఁ జెప్పఁగఁబడెనుఁ బృథివి జనుఁడు.
సీ॥ జన్మ బుచే శూద్రశబ్దవాచ్యుండును సంస్కారమున ద్విజశబ్దవాచ్యుఁ
డతఁడు. శాపానుగ్రహసమర్థుఁ డట్లు కోపంబు ప్రసన్నత బ్రాహ్మణునివె.
త్రైలోక్యమునయందుఁ బ్రవరుండు నాఁగను బ్రాహ్మణహూనుండె పలుకఁబడెనుం
బ్రాహ్మణసముఁడైన బాంధవుఁ డొకఁడు లేఁడు. కలుగదు తత్తుల్య గతియునేని.
సచర మచర మైన జగతీత్రయంబునం దొకఁడు బ్రాహ్మణునకు నుద్దిగాఁడు.
హరిపరుండు నెడల యజ్ఞోపవీతి బ్రాహ్మణుఁడు చేయు నఖిల మాత్మమయము.
ఆ॥ అఖిలజగముగురుఁడు హరి యత్కు కర్దుత్తుఁడగుట దాన లేపనంబు
నవమబుక్కుచేత సవరూపున కాచరింపవలయుఁజూ నిలింపమాని ! ౬౧౮
క॥ ఈ నిఖిలంబగులోకం బా నారాయణునిచేత నావ్యాప్యయిత. మూ
శ్రీనాయకు సత్కీర్తినికా నారద ! వాసితంబు కడు జగమెల్లన్. ౬౧౯
మత్తకోకిల॥ తేజమునను సూర్యుఁడగుచు దేవభావ మొంది వి
భ్రాజమానమైన యట్టి బ్రహ్మముఖరపదములన్
రాజిలంగఁగలదు చందనంబు హరి కొసంగుచో
త్మాజనం బిఁకేమి నీకు సంయమీ ! వచింపదున్. ౬౨౦
క॥ చందనలేపముచేఁ గడుసుందరుఁడగు నందసూనుఁ జూచిన భాస్వ
న్నందను మందిర మొందరు. సందియమే యందులకిఁకఁ జాతుర్మాస్యన్. ౬౨౧

ఆ॥ దళమబుస్కఁ జేతఁ దగఁ బుష్పపూజయు భక్తిపూజ చేయఁగలయు నట్లు.
పుష్పగర్భమందె పూజ్యారాలగు లక్ష్మి రహి వసించుఁ దా నిరంతరంబు. ౬౨౨
తే॥ సర్వమయుఁడయ్యు విష్ణు వేచాయ దోషముల స్పృశింపంగఁబడఁడో యాలలిని లక్ష్మి
యును సతీత్వంబు లోపింపకుండ నుండు సర్వమయుయయ్యు నారదసంయమీంద్ర!
ఆ॥ ఎల్లపృథివులందు నిలఁగల మనుజాది సర్వభూతములను సంతతంబుఁ
బూలతోడిపూజ పొసరింపఁదగినది దేవతల పితౄళ్ళ తృప్తిపొంటె. ౬౨౪
ఆ॥ ఆద్భిరూఁతుతోడి హరి యొక్కఁ డెవనిచేఁ బూజసేయఁబడునో పూలచేత
బ్రహ్మ మొదలు స్తంబపర్యంతమగు జగం బతనిచేత నగును నర్చితంబు. ౬౨౫
ఆ॥ అట్లుగాన విష్ణు నవదాతసుమములఁ బూజసేయఁగలయుఁ బూర్ణభక్తి
ననయ. మధికఫలదమగును జాతుర్మాస్యయందె యట్టిపూజ యాచరింప. ౬౨౬
ఆ॥ భక్తిసహితమైన ప్రసవార్చనంబున నభిమతార్థసిద్ధి యగును సతము.
ప్రసవశోభి హరికిఁ బ్రణతుఁడౌ నొరుఁడును క్షయవిహీనమైనజగము నొందు.
క॥ ఈపని చాతుర్మాస్యను నేప్రజ చేసినను గలుగు నెక్కువఫల మో
శాపాయుధ! యేకాదశి ధూపము యతిరూపుఁడగు విధువునకు నిడనౌ. ౬౨౮
శ్లో॥ వనస్పతిరసో దివ్యో గన్ధాఢ్యో గన్ధ ఉత్తమః
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోయం ప్రతిగృహ్యతాం. ౬౨౯
శా॥ ఈమంత్రంబును జెప్పి యాగుసుజన్మై యేపారు ధూపంబు త
ద్భూమీభర్తకు నిత్య మిచ్చునది. చాతుర్మాస్య నింకన్ ఫలం
బౌ. మాంసీజటలన్ సితామధువులన్ వ్యాప్తంబు బాహ్లీకమున్
సోమంబుం గల దైన ధూపమిడినన్ సూనూ! బలిధ్వంసికిన్. ౬౩౦
ఆ॥ క్రతుభుజులు తనూజ! ఘ్రాణంబునను సంతసించుచుంద్రు సంతతంబు
ఘ్రాణహారము ధూపకర్మంబు. గావున నర్పణీయమద్ది హరికి భక్తి. ౬౩౧

—• దీ ప మ హి మ. •—

క॥ ద్వాదశబున్కన దీపం బొ దేయము ముక్తికాములగువారల కో
భూదేవా! తేజోవిభవో దీపము ముఖ్యమగును నఖిలక్రియలన్. ౬౩౨
శ్లో॥ దీప స్తమోఘనాశాయ దీపః కాంతిం ప్రయచ్ఛతి
తస్మా ద్దీపప్రదానేన ప్రీయతాం మే జనార్దనః. ౬౩౩
ఆ॥ వేదబున్కతోడ విహితమైన పురాణమంత్రమిది కుమార! మహితదీప
దానమునఁ బ్రియుక్తమై నశింపఁగఁజేయుఁ గల్మషములు. నేమిగలదు చెప్ప.

శా॥ చాతుర్మాస్యమునందుఁ జక్రిఁయెదుటన్ జాజ్వల్యమానంబుగా
జ్యోతిన్ నిల్పినవాని పాతకపురాసుల్ దహ్యమానంబులౌ.
శ్రీతం గృష్ణునియాలయంబునను దివ్యంబెట్టుపర్యంతమే
ఖ్యాతుండయ్యెడుఁ బాపి. పాపములు నిర్ఘాతాత్మకర్ జించెడిన్. ౬౩౫
శా॥ దీపంబున్ దరిసించుమాత్రమున సిద్ధించున్ సమస్తంబు. శ్రీ
గోపాలాలయమందు దీపమును నేకోర్క్యెం బ్రతిష్ఠించునో
పాపింపంగలఁ డడ్డులేక యది పుత్రా! చక్రి నిద్రించుచో
దీపారాధనచేయునట్టిఁ డెనయుం దృప్తిన్ ఫలం బెంతయున్. ౬౩౬
క॥ పంచాయతనస్థలముల నంచిత తత్వంచ దేవతాయతనములం
దుంచునది దివ్వె త్రిజగత్సంచారా! తప్పకుండఁ జాతుర్మాస్యన్. [నిచ్చుముక్తి
తే॥ అర్చితుఁడు ధ్యాతుఁడును స్తుతుఁడగుచు నొకడు పేందుఁ డానందమొందుచో
ముక్తికోఱ కిచ్చునది విష్ణుమూర్తి కెపుడు స్వగృహమందుఁగల శుభవస్తువెల్ల.
క॥ శ్రీపతిదీపం బస్మద్దీపంబుఁ కన్న మిన్న. శ్రీపతియే చూ
వాపాలిటి మైశ్వర్యం. బోపుత్రా! కోరకుండ నొసరిన దదియున్." ౬౩౯
వ॥ అనియిట్లు వర్ణించుటయు నారదమునీంద్రుండు ౬౪౦
ఆ॥ "మాధవాలయమున మంత్రపూర్వకముగా దినదినమునఁ బెట్టు దివ్వెకంటె
నధికఫలద మెట్టులగును జాతుర్మాస్యయందుఁ బెట్టుదివ్వె యబ్జయోని!" ౬౪౧
వ॥ అనవుడు సురజ్యేష్ఠుండు ౬౪౨
సీ॥ "పులుఁగుతత్తడి కాతెపో యధిదైవంబు సంతతంబును నాకు సంయమీంద్ర!
చుట్టుకైదువుజోదె మా పూజనీయుండు నిరతంబు నాకు మునిప్రకాండ!
నును గాడ్పుదిండి పానుపుఁబండె ను మేటి ధ్యానింతు సతమేను దాపసేశ!
పసిడిపుట్టముదాల్చు పసఁగు వైకుంఠుండు నాకంటె నుత్కృష్టుఁ డోకుమార!
అట్టివారి కభీష్టమగు దీప మనఘుంబుఁ బాపహారకంబు భక్తవర్య!
అది విశేషముగను నల్ల చాతుర్మాస్యఁ గామసిద్ధికరము ధీవరాగ్ర్య! ౬౪౩
క॥ వెన్నుఁడు దీపమునంబలె జన్మముల సహస్రమునను సంతుష్టుండై
తన్ను భజించినజనులకుఁ దిన్నగ వరమీఁడు తనయ! తెలియునొ లేదో.
ఆ॥ అల్పమైనయట్టి ద్రవ్యమున దీపంబు నిల్పవచ్చు. ఫల మనల్పవృద్ధి.
హరిపరుండఁ బెట్టు నాదీపపుంబుణ్య మింత యనిగణింప నేరతరము? ౬౪౫
తే॥ తాన సర్వాత్మభావనఁ గరముశ్రద్ధ హరికిఁ బ్రతిరూపమైనట్టి యతికి దీప
దాన మొనరింపఁ బంకహాతని స్పృశింప. దట్టు లుద్యోతితంబగు నఖిలజనము.

ఆ॥ అట్లు దీపదాన మగుడుఁ ద్రయోదశఖుద్యుక్తిచేత హరికి వృష్టమగుచు
వెలయు నన్నమును నివేదింపవలయుఁ జూ భక్తియుక్తులగుచుఁ బ్రజలు తనయ!
ఆ॥ అమృతముం ద్యజించి యా యన్నముం గోరు జమరులును గృహస్థు నంగణంబు
గాచి యుందురెప్పుడుఁ గానఁ జాతుర్మాస్య నన్న మొసఁగవలయు హరికి ద్విజుఁడు.
సీ॥ కమనీయాతిమములౌ తమాలంపుటాకులం బొలుపారుచుండెడి పోకపండ్లు
స్వాదువులైనట్టి జంబూఫలంబులం దద్దయు మధురమౌ ద్రాక్షపండ్లు
తృప్తికరంబులౌ తియ్యమామిడిపండ్లఁ జాల స్థూలములైన జామపండ్లు
క్రొత్తదములైనట్టి దాడిమఫలములం దత్కాలసముదాహృత పదములను
జక్రపాణికి గరము సంతుష్టినొసరింప నర్ఘ్యమీయవలయు నధికభక్తి.
అంత నాచమనము నార్తిక్యమును నిచ్చి యఘంబు లెల్లఁ బ్రిసులుపొందె.
తే॥ శంఖతీర్థంబు గొంచుఁ దత్సలిలమందు ఫలములుంచి మధుద్వేషి ప్రీతికృతియగు
యతివరున కర్ఘ్యమిచ్చిన నద్ధిసప్తకాంబుదానఫలావాప్తి యగును బ్రజకు. ౬౫౦
క॥ పదునాలవ ఖుద్యుక్తిన యతిపదముల కొఁగంగవలయుఁ. బవపడి భక్తిక్
పదునైదవదగుఖుద్యుక్తినఁ బ్రదక్షిణము సేయనగును బాలుంతోడక్. ౬౫౧
తే॥ నాలుగుపర్యాయములు జగన్నాధరూపుఁడైన యతికిఁ బ్రదక్షిణమాచరింప
అద్ది జగతీత్రయంబున కగుఁ బ్రదక్షిణం. బటుల సర్వతీర్థాటనంబు నగును. ౬౫౨

—• సాయుజ్యచింతనభక్తి. •—

ఆ॥ యోగవేత్తయగుచు నొగిఁ బదునాఱవ ఖుద్యుక్తిచేత దేవఋషివరేణ్య!
స్వాంతమందు దేవసాయుజ్యచింతన సేయవలయు భక్తి క్షితిసురుండు. ౬౫౩
క॥ తనకును మధుసూదనునకు ననయము భావింపఁగూడ దాత్మను మూర్తిక్.
మను యోగవిదుఁడు దృశ్యంపన మూర్తామూర్తరూపుఁడగుటఁ దనూజా! ౬౫౪
ఆ॥ అతఁడు దృష్టుఁడైన యావల సదసత్స్వరూపమునను బ్రభవమై పొలిచెడి
క్రియ నివృత్తమగుఁ దనయ! తేజములలోన నాత్మ రవిగ నెంచునది సతంబు.
ఆ॥ ఏనె హరి యటంచు నెద నెప్పుడును విచారించునట్టి ద్విజవరేణ్యుఁడు సుత!
హరిశరీర మొంది యగును జీవన్ముక్తుఁ. డింతకన్నఁ జెప్ప నేమిగలదు. ౬౫౬
క॥ చాతుర్మాస్యను యోగసమేతుఁడు కావలయు ద్విజుఁడు మిక్కిలి. శ్రీయో
షాతయగు విష్ణునం దిది యాతతమగు భక్తియోగ మాత్మజ! వినుమా. ౬౫౭
ఆ॥ అట్టిభక్తియోగ మాపాతులకె కాక క్షత్రియవైశ్యులకును సముచితంబు.
స్త్రీలుఁ శూద్రజులును ద్విజగతిసంచార! దాని నాచరింపఁ దగరు తగరు." ౬౫౮
వ॥ అని చెప్పుటయు నారదుండిట్లనియె. ౬౫౯

క॥ "స్త్రీశూద్రుల కెదిధర్మము? శ్రీశుని సేవింపకుండ నెటు లవ్వారల్
పాశ్రిత్యము వహియించెద? కౌశితధృతి! ముక్తియెట్లు గాఁగఁ జెప్పుమయ్యా."

## సచ్ఛూద్రులు.

వ॥ అనవుడు బ్రహ్మదేవుండు ౬౬౧

క॥ "సచ్ఛూద్రులుసహిత మతిస్వచ్ఛములగు వేదములను జదువందగ దో
సచ్ఛీల! నరకమునఁబడుఁ దచ్ఛ్రవణంబునన. యేల తదుపరివార్తల్. ౬౬౨

పృథ్వి॥ పురాణపఠనంబునన్ మునివరేణ్య! తచ్ఛూద్రులా
చరింపఁదగదయ్య సంశ్రవణమున్ వినా యెంతయున్.
ధరామరముఖంబునం దవిలి యర్థ పాఠ గ్రాహ్య. మె
త్తతిన్ స్మృతుల విన్కియుం దగ. దిఁకేమి వాక్రువ్వనా" ౬౬౩

వ॥ అని వక్కాణించుటయుఁ గలహాశనుండు వెండియు నిట్లనియె. ౬౬౪

తే॥ "ఎవరు సచ్ఛూద్రులను ఖ్యాతి నెనసినారొ వారి వివరించి చెప్పంగవలయు దేవ!
ఎవరు సచ్ఛబ్దమున వాచ్యు? లెవరు శూద్రు? లిలను సచ్ఛూద్రనామ మదెట్లువచ్చె?"

వ॥ అని ప్రశ్నించుటయుఁ బంకజాసనుండు ౬౬౬

తే॥ "తుల్యకులరూపయును దశదోషరహిత యయినకన్యక వేదోక్తమైనవిధిని
పరిణయంబైన శూద్రుండు ధరణిలోన నగును సచ్ఛబ్దపూర్వుఁ డోయనుఁగుఁదనయా!

సీ॥ అంగంబులం దెందు హైన్యంబులేక పాత్రివత్యంబువహియింపఁ జాలుదాని
కుష్ఠంబు మొదలైన గొప్పజాడ్యములచే నిందితగాకుండ నెగడుదాని
పలుకుపల్కినఁ దేనె లొలుకంగ మాటాడు చెంతయు లలితయై యొసఁగుదాని
దశదూషణములకు స్థానంబుగాకుండఁ జాలుకుదనంబునం బరఁగుదాని
ఆగమోక్తవిధిం బెండ్లియాడినట్టి వాఁడు సచ్ఛూద్రుఁ. డతఁడు దేవముఖులకు వి
భాగకృత్తగును. దదూఢ ప్రథమ మెల్లపుణ్యకృతులం బ్రకీర్తితి పుత్ర! వినుము.

వ॥ దానితోడం గూడి చేయు ధర్మంబు సంపూర్ణఫలప్రదంబు. ౬౬౯

సీ॥ మఱి నమస్కారాంతమంత్రపూర్వకముగఁ బంచయజ్ఞము లాచరించుకొనుచు
ఎలమి నిష్టాపూర్తములను శ్రాద్ధాదికంబులను శుద్ధుండయి సలుపుకొనుచు
భృత్యులు మొదలైన బీదజనంబుల సంరక్షణమునందు సక్తులగుచు
ఆమ్నాయవిధిఁ బెండ్లియాడిన స్త్రీతోడి రతమాత్రమునఁ దృప్తమతులగుచును
కృష్ణు పావననామ సంకీర్తనమ్ము నేమఱక చేయు శూద్రునియెడల దేవ
తలును సంతుష్టులగుదురు తనుభవా! విశేష మతు హరి పవళింప శేషశయ్య.

తే॥ ఆడుదియుఁ జేయనగుఁ బంచయజ్ఞముల నమంత్రకంబుగ నారదవరానిచంద్ర!
పితరులకు దేవతలకును బ్రీతియగును బంచయజ్ఞంబులంబోలెఁ బతిసపర్య.

క॥ పతిరత దేహంబున దేవతలెల్లరు నుందురుగాన భార్యాభర్తల్
యుతులయిరె ధర్మకృతులను సతమును గావింపవలయు సంయమిముఖ్యా!
తే॥ ఉభయులుం గొల్చి యర్థింప నొసఁగినట్టు లొకరికొసఁగరు వేలుపు లోకుమార!
కాన నెల్లప్పుడుం బుణ్యకార్యములను సహితులైయుండవలయును సతియుఁబతియు.
క॥ చాతుర్మాస్యంబున సంప్రీతి సతీపతులు గూడి విష్ణుని భక్త్యా
న్వితంబుగ సేవించుట యోతనయా! భవ్య. మేల యుక్తులు వెక్కల్. ౬౨౪
తే॥ భర్తకున్న దర్ధభాగంబె తనమేన. నపర మూర్ధమైన యాత్మకులజ.
దర్ధకార్యమునకు నధికార మాపెది యగుట సర్ధధర్మ మదె ధరించు. ౬౨౫
తే॥ ఎవతె మృతుఁడైన పతితోడ నెలమి ననుగమించు నాపె పతివ్రతయంచుఁదెలియు
ముద్ధరించును గులమంతయును గుమార! యాపె యాత్మీయమైన మహత్త్వమునను.
ఆ॥ అన్యజాతివాఁడె యగుఁగాక తనుఁ బెండ్లియాడినట్టివాని ననుగమించి
అగ్నిఁజొచ్చునట్టి యాసాధ్వి కులమెల్ల నుద్ధరించుఁజుమ్ము యోగిచంద్ర! ౬౨౭
ఆ॥ పుణ్యపురుషు లుదకమునసుండి పాచిని దీరమునకు బలిమిఁ దీసినట్టు
లనుగమించువనిత యాత్మీయసాధు సముద్ధరింపఁగలుగు నోకుమార! ౬౨౮
క॥ ఒకజాతిపురుషుఁడును వేఱొకజాతిస్త్రీయుఁ బెండ్లి యొనరిచికొనినఁ
బ్రకటంబగుధర్మక్రియ నీఁక వారిరువురును ద్యాజ్యు. లేమనవలయుఁ. ౬౨౯
ఆ॥ ఎవరివర్ణమునకు నేర్పడియుండిన యాసుకర్మములు సమాచరించి
యశుభమొ శుభమొ పొందనగుఁగాని సంబంధ మించుకయును నుండ దిద్దటికిని.
ఉ॥ ఎక్కువదానిఁగాని మతి హీనకులోద్భవఁగాని పత్నిఁగా
నొక్కపుడుం బొనర్పఁదగఁ డుర్విని శూద్రుఁడటులొప్పనర్చి పెం
పెక్కఁడు. దానిఁగూడుకొని యేదియొనర్చినఁ గాదు తృప్తిదం.
బక్కట! తత్తనూజకృతమైనను నట్టులె వ్యర్థమయ్యెడిఁ ౬౩౧
ఆ॥ విలిచిచేసికొనిన జలజాక్షి దాసినా వాచ్యయగునుజుమ్ము వసుధలోన.
సంయమిప్రకాండ! సచ్ఛూద్రునధికారమందు మన దొకప్డు నమ్మృగాక్షి. ౬౩౨
క॥ ఏకన్నియ జనకునిచే శ్రీకరముగ నిచ్చి పెండ్లిచేయంబడునో
ఆకన్నియ పితృదేవార్చాకరణంబునకు నగును సాధక యొపుడుఁ. ౬౩౩
సీ॥ సల్లతులంబులు చాలంగఁగల్గియు వినయవిధేయతాన్వితయగుచు
పతిమీఁద నత్యంతభక్తిగల్గినదయి సచ్చరిత్రములతోడ సహితయగుచు
సద్వంశమందున జనియించినట్టిదై మతిమతి శోభాయమానయగుచు

ధర్మకార్యంబులం దత్పరయయి వివేకముదొట్టిగుణములు గలదియగుచు
వెలయుకన్య ధర్మవిధిచేత సద్బ్రాహ్మణుండు పెండ్లియాడఁజనును సుత ! ప
వితృములనుజేయుఁ బితృమాతృవంశంబు లట్టికన్య. యేమియనుదు నిఁకను.

క॥ ఇదియే సద్బ్రాహ్మణులవిధి. యదిచెప్పితి. వారికన్న నపకృష్టులకున్
పదితీరుల పెండ్లిండ్లును బదివిధముల తనుభవులును బరగెడి వినుమా. ౫౬

ఆ॥ నాలు గుత్తమములు నారద ! యవ్వివాహములలోన. మిగిలినట్టి నాల్గు
హీనజాతివారి కేర్పాటుచేసిరి యాద్యులైన ప్రాజ్ఞు. లది వచింతు. ౫౭

సీ॥ తనయ ! ప్రాజాపత్యమును బ్రాహ్మమును దైవ మార్షంబు గాంధర్వ మాసురంబు
ప్రాతిభంబును మఱి పైశాచనామంబు ఘాతన రాక్షసాఖ్యములు పదియు
అగునువివాహంబు. లౌరస క్షేత్రజుల్ క్రీత కానీనులు కృత్రిముఁడును
గూఢజ దత్త సహోఢజుల్ పౌనర్భవాపవిద్ధులు పదుం డాత్మజాతు.
లౌరసునికన్న హీనులైనట్టివారు హీనులకె పుత్రులై శుభ మీయఁగలరు.
ప్రకృతులంబోలె నీచులు పదునెనిమిదిమంది. తత్కరణీయధర్మములు వినుము.

సీ॥ విధియొండులేదుచూ వీరికిఁ బూజ్యులౌ క్షోణిదేవతల శుశ్రూషదప్ప.
క్రియ యనుక్తం బీనికృష్టుల కెదియును నంబుజనాభు ధ్యానంబుదప్ప.
స్మృతి యెది విధియింప దితరంబు వీరికిఁ జంద్రశేఖరుని యర్చనముదప్ప.
మంత్రంబులనువీరు మదినైనఁ దలఁచు టక్రమమగు దానధర్మములఁదప్ప.
శ్రద్ధనొనరించు దానధర్మముల కెపుడు నాశముండదు లోకంబునం గుమార !
శ్రద్ధలేకుండ నశుచిత సల్పెనేని యగును వైరస్యకారణ మదియె తుదకు. ౫౮

తే॥ హీనకులులకును నహింస ధర్మంబు. మహాఫలప్రదంబు. నందులోన
హరిపరుండ దేవతార్చకుఁడగుచు నహింసనూనఁ బున్నె మెన్నఁదరమె. ౫౯

క॥ అవిరోధులును సుదర్శను లవు సద్బ్రాహ్మణు లటు ధర్మ మనయము సేవిం
త్రివనీసురకుబ్రాహ్మణు నవితథమగు దానమునను యమికులచంద్రా ! ౬౦

తే॥ వృత్తి సద్బ్రాహ్మణులకు వృథగ నన్నృతములను బలుకక వాణిజ్యముం బొనర్చు
టింక వడ్డిని నూటింటి కెనుబదియవ పాలు గైకొను టెంతయుం బాడియగును.

ఆ॥ క్షుత్రియాదులందు సహపాదవృద్ధి గ్రహింపఁబడెడి సంయమీంద్ర ! పుడమి.
ఇటులొనర్పఁ గలుగ దించుకయును బాపబంధ మొకపుడేని ప్రజల కరయ.

తే॥ కల్యమున దేవతాపూజ క్రమముగాను ధరణిసురసేవనంబు మధ్యాహ్నమందు
స్వకృతులన్నియు నపరాహ్నసమయమందుసల్పునటువంటిమనుజుండు సౌఖ్యమొందు

సీ॥ గేస్తులైమనుచు సత్క్రియ లాచరించుచు నాతిథ్యమిచ్చుచు హరిఁ దలఁచుచు
పంచయజ్ఞంబులు భక్తిఁ గావించుచు దీనులం బోషించుచు దానమిడుచు
సాధులం గొల్చుచు సదపత్యముం గంచు క్షమవహించుచు సదాచారులగుచు
షడ్ద్వాదశాక్షరజప మొనరించుచుఁ ద్యక్తసంతాపమాత్సర్యులౌచు
శక్తికొలఁది భూతసంతృప్తి సేయుచుఁ ద్రయి పఠింపకుండ ధర్మపరత
వర్తిలంగవలయు వసుధ సచ్ఛూద్రులు స్వర్గలోకసుఖము వడయఁబొంటె. ౧౯౪
ఆ॥ అనయ మెవరు హరికి హరునకు భక్తులై యుందురో వారు స్వర్గమందుఁ బోయి
యుండఁగలరు దేవతోత్తములుంబోలె. హరిపరుండ నంత కతిశయంబు" ౧౯౫

— అష్టాదశప్రకృతులు —

వ॥ అని వక్కాణించుటయుఁ గలహాశనుండు వెండియు నిట్లనియె. ౧౯౬
క॥ "పదునెనిమిది ప్రకృతులటం చుదితమ్మవి యెవ్వి? వాని కుండిన ధర్మం
బెది? మఱియు వృత్తియెయ్యది విదితంబొనరింపుమయ్య విశ్వస్రష్టా!" ౧౯౭
వ॥ అనియిట్లు ప్రశ్నించుటయుఁ జతురాననుండు ౧౯౮
క॥ "తనకాలపుఁ బరిమితి మేల్కొను శ్రీహరి బొడ్డుదమ్మిలోపల నే మున్
జనియింపఁ బెద్దకాలంబున కాతఁడు సృష్టి సేయఁ బూని స్మరించెన్. ౧౯౯
మ॥ చతురాస్యంబులతోడఁ బంకజమునన్ జన్మించి తర్వాత నో
సుత! తత్కుక్షిఁ బ్రవిష్టుఁడై యిటునటుం జూడంగ బ్రహ్మాండముల్
శతము ల్కానఁగనయ్యె. నబ్బిపడి మెల్లన్ వెండి నేనంత వ
చ్చితిఁబో యీవల. కంతయున్ మఱచితిన్ సృష్ట్యర్థమౌ హేతువున్. ౨౦౦
ఉ॥ క్రమ్మఱ నాభినాళమున గర్భముజొచ్చి ప్రజన్ సృజించి యా
పిమ్మట వచ్చి యీవలకు విస్మృతిఁజెంది జడుండునా మనన్
ఖమ్మననుండి విస్ఫుటముగం "దపముండు" మటంచు నొక్క శ
బ్దమ్మగుడుం దపించితిని దద్దనటుం బదివేలయబ్దముల్. ౨౦౧
చ॥ మఱియును శ్రుతి స్వరూపమగు మంచివచస్సు తపోబలంబునన్
సురసరణిన్ వినంబడియెఁ జోద్యముగన్. భగవానుఁడైన శ్రీ
హరియును "రాజసంబయినయట్టి గుణంబును బూని చేయుమీ
సరవి నకల్మషంబయిన సర్గ" మటంచు నిటు లాజ్ఞయిచ్చెఁ దాన్. ౨౦౨
ఉ॥ మానససృష్టి పూర్వమున మత్కృత. మంత మరీచిముఖ్యులౌ
మౌనివరు ల్విసృష్టులయి మామకసృష్టికి బాసటైరి. త

త్రాసుల వేదరక్షకయిచూ సృజియించితి బ్రాహ్మణుల్ల. నీ
వా నయకోవిదాగ్రిణులయందుఁ గనిష్ఠుఁడవోయి నారదా! ౨౦౩

సీ॥ ఉపనిషత్సారంబు నొయ్యన గ్రహియించి జ్ఞానసంపూర్ణతం బూనినావు.
అన్నివ్యాపారంబు లవలీల వర్జించి విష్ణుభక్తుండవై వెలసినావు.
అజ్ఞసంగ్రహమునకై కర్మములఁ జేయు చొంటి బ్రహ్మము చూచుచుండినావు.
అంతరంగమున నహంకారమమకారములకుఁ జోటీయక నిలిచినావు.
అస్మదాత్మభవుల యందతిలోపలం జీవరవాఁడవగుచుఁ జెలఁగినావు.
ఇటు ద్విజాతులైన యీరల నెల్లర మనసుచే సృజించి మఱియు నేను ౨౦౪

సీ॥ ముఖకంజముననుండి మొనసి బ్రాహ్మణజాతి నిర్మించితిని మున్ను నేర్పుతోడ.
బాహుయుగ్మంబున బలవంతులైనట్టి రాజన్యు లుదయించి రోజనంత.
ఊరుద్వయంబునం దుత్పన్నమయ్యెఁబో యల వైశ్యజాతి ధనాఢ్యమగుచు.
పదములనుండి యేర్పడియెఁ దద్వర్ణత్రయేతరమగు శూద్రజాతియెల్ల.
అరయ్యెఁబ్రకృతులు మచ్ఛరీరాంశములను. బ్రాహ్మణులు క్షత్రియులును విద్వరులుమువురె
అల ద్విజాతులు. వారల కర్హమైన ధర్మముల వచియించెదఁ. దనయ వినుము.

సీ॥ చదివి వేదంబులు చదివించుటయు మఱి చేయించి జన్నము ల్సేయుటయును
ఇచ్చి దానం బొరయం డీఁ బట్టుటయు హరిం గొలుచు చుగ్రతపంబు సలుపుటయును
నిర్జితక్రోధుఁడై నిర్మలత్వంబునఁ బను లలోభంబునఁ బొనరుచుటయు
అనృతంబులాడక యార్యుఁడై బ్రహ్మంబు ధ్యానించు చోరిమిం బూనుటయును
ఈగుణముల సతము నెవ్వఁడు భూషితుండగునో వాఁడు విప్రుఁడనఁగఁబడెడి.
అతనికిం బ్రతిగ్రహము వృత్తియైనను దఱచుగా గ్రహింపఁ దపము చెడును. ౨౦౫

సీ॥ ఆమ్నాయపాఠంబు నాచరించుటయును సప్తతంతువులను సల్పుటయును
దానంబులను విప్రుఁ దనుపుటయును మఱి యుగ్రంబుగం దపం బుండుటయును
బ్రాహ్మణవరులపై భక్తిఁజూపుటయును విచ్చుకత్తులనె జీవించుటయును
స్త్రీబాలగోద్విజక్షితి పీడితులకెల్ల రక్షకుండయి బిట్టు రాజిలుటయు
క్షత్రియులకు ధర్మసరణి. యార్తత్రాణపరులుగాఁగ నుండ నరసి వార
లకు విధించినాఁడ. నిఁక వైశ్యధర్మంబు విను వచింతునీకు వివరముగను. ౨౦౬

సీ॥ అర్థార్జనంబునం దాఱితీరుటయును బశువులం బోషించి ప్రబలుటయును
కృషియొనరింపించి కృతకృత్యుఁడగుటయు విక్రియవ్యాపారవిదుఁడగుటయు
సురభూసురార్చనపరత వర్తిలుటయు సవనంబులం బెక్కు సల్పుటయును
దాతృతావిఖ్యాతి తా గడించుటయును సరిగఁ జతుష్క్రతు ల్సదువుటయును
వైశ్యధర్మంబులివి. కాఁపువార లింకఁ దగ నమంత్రకముగఁజేయ నగును నవార
హమును మద్దైవతశ్రాద్ధ మగ్నివిప్రకృతు భగర్చనములు నమస్కారమునను.

తే॥ శూద్రుఁడును బ్రొద్దుపొడుపున శుద్ధుఁడగుచు హరిపదంబుల కెఱఁగి భక్త్యతిశయమునఁ
 వీకఁ దద్గుణవర్ణనశ్లోకములను జదువ హరిరూప మొలయు నారద! యతనికి.
తే॥ వార్షికవ్రతకృత్తనవరతము తిథివారదైవతుఁ డఖిలజీవముల కన్న
 దాతయు గృహస్థుఁడగువాఁడు జాతిచేత శూద్రుఁడని చెప్పఁబడియెడిసుత! క్షితిపయి.
క॥ చాతుర్మాస్యవ్రతకృత్తె తనరెడు శూద్రజనుఁడు హరితనెనయు. సం
 ప్రీతి నమంత్రకముగనే నాతఁడు కర్మములఁజేయ నఘము లడంగున్ " ౨౧౧
సీ॥ శిల్పి ప్రజాపతి చిత్రకుండును నర్తకుండు వర్ధకి సూత్రకుండు రజకుఁ
 డొనామికుండును సూనిక కాల్వికుల్ కాష్ఠకరుఁడు చర్మకారకుఁడును
 గచ్ఛకుండును దంతుకార చక్రికులును ధ్వంసిక మత్స్యఘాతకులు మఱియు
 చండాలుఁడునునాఁగ సరిగ నష్టాదశప్రకృతులు వీరలు. స్వర్ణకార
 కాంస్యకార శిల్పి కార్ముక దారుక కుంభకారు లారుగురును నుత్త
 ములు. తురంగవాహి బలి ఖరవాహియు నుష్ట్రవాహకుఁడును నిష్టకలను ౨౧౨
సీ॥ కుదురుచువాఁడును గోపాలుఁడును నధమాధమపంచకం బనఁగఁబడెడు.
 రజకుండు చర్మకారకుఁడును భిల్లుండు కైవర్త నటుమేదక బురుడులును
 నేడ్గురు నంత్యజు. లెవనికి నెవఁడు వర్ణమున హీనుఁడో వాఁడు క్రమముగాను
 అష్టాదశముఁడగు. నఖిలప్రకృతుల నుత్తమమధ్యమాధమతం దిగ్భేద.
 మందు మణికార తాంబూలి తందులులును స్వర్ణకారక పుష్పలావకులు కంబు
 కుఁడును నాపితుఁడనఁగ నేడ్గురును సిల్పు. లుత్తములు వారిలోపల నోతనూజ!
సీ॥ స్నానంబునకు నొకసమయమంచని లేదు. హోమంబు విధియింప దొక్కస్మృతియు.
 తపమొనరింపంగఁ దగు నర్హతయు లేదు. నియమంబుపట్టుట నింద్యమగును.
 స్వాధ్యాయపఠనంబు సల్పఁగా రాదు. వషట్కారములు పల్కఁజనదు నోట.
 మడిమైలయనియెడి మాటలోఁబనిలేదు. పెండ్లిపేరంటము ప్రీతికొఱకె.
ప్రకృతులకుఁ బుత్ర! గురుపూజ యొకటి యుక్త. మన్ని వర్ణంబులకు నన్ని యాశ్రమముల
 కన్ని ప్రకృతులకును విష్ణునందు భక్తి కలిగియుండుట కడు శుభకర్మ మరయ.
ఆ॥ ప్రకృతు లెవ్విధమున భాసిలుచున్నవో శూద్రుఁ డెవ్విధమున శుద్ధుఁడగునొ
 అట్టిపుణ్యగాథ యంతయుఁ జెప్పితి. వినుము సావధానమనముతోడ. ౨౧౩
క॥ పరమపవిత్రంబగు నీపురాణమును శుద్ధమైనబుద్ధిఁ జదివినన్
 గురుముఖమున వినినను బాగ్దురితంబు లడంగుఁ. బొందుదురు హరిపదమున్.

— పైజవనోపాఖ్యానము. —

తే॥ శూద్రుఁడగు పైజవననామ సుజనవరుఁడు ధర్మమార్గమునకు విరోధంబు లేక
 ఉండ గార్హస్థ్యమున శుద్ధినొంచియుండె. నాలకింపుము వచియింతు నది మునీంద్ర!

సీ॥ తనధర్మమునఁ దాను దత్పరుండయియుండి యార్జించె నగ్గలంబైనయశము.
న్యాయమార్గమున భూర్యర్థంబు గడియించి యర్జించె. విప్రుల నబ్జనాభు.
క్షమవోలెనెంతయు శాంతిని వహియించి హితుఁడయ్యె జనముల కెల్లరకును.
కరము వివేకంబు గలిగినవాఁడయి వాదించె నేపట్లు వాస్తవంబు.
ఓతనూజ! తొల్లి త్రేతాయుగంబునం బైజవనుఁడనంగఁ బడెడిశూద్రుఁ.
డతఁడు కాశినుండి సతినొర్తుఁ గొనితెచ్చి వైజయంతిపురి వివాహమయ్యె.
సీ॥ సమరూపధనశీలజననంబునందున జనియించినది యా బిసరుహనయన.
చక్కఁదనంబున శచికిని రతికిని దులఁదూఁగునది యా మృదుపవిత్రిక.
అనసూయ మొదలైన యన్నుమిన్నలవంటి పతిరత యా శతపత్రవదన.
దేవతలను మహీదేవతలను సదా యర్చించునది యా మదాళిచికుర.
వైష్ణవవ్రతాది వరధర్మములఁజేయ శక్తిగలది యా భుజంగవేణి.
అట్టి శోభనాంగి యామ్నాయవిధిఁ బైజవనునిచేత లలి వివాహితయయి
చ॥ పెనిమిటితోడఁగూడి కడుఁబ్రీతి రమించె వినీతయై. యతం
డును నుచితంపుఁ గాలముల నూతనయౌవనయైన యా పెతో
ననుఁగుఁదనూజ! మత్తకరి హస్తినితోడను బోలెఁ దా రమిం
చెను. మఱి పూర్వపుణ్యమున శ్రీసము పేతుఁడుగూడ నై మనెన్.			౭౨౧
ఆ॥ స్వపరదేశములను జక్కఁగం జేయించె స్వీయజనులచేత బేర మంత.
అట్టు లర్థవృద్ధి యగుటయుఁ గోటికిం బడిగెయెత్తె నతఁడు. కొడుక! వింటె.
చ॥ తనయులు మువ్వు రాతనికిఁ. దండ్రికి భక్తులు. స్వీయధర్మముల్
బొనరుచుకొంచు విత్తమదము న్వహియింపక యుండువారలున్.
జనకుఁడు వారికిం దగిన చానలఁదెచ్చి వివాహ మాచరిం
చినఁ దమ యత్తమామలకు సేవలొనర్చిరి వార లెంతయున్.			౭౨౨
చ॥ ధనమును ధాన్యమున్ సుతులు తత్సుతులుం గడుఁగల్గి యిట్టులా
తనియలు బుద్ధిమంతమయి తద్దయు నొప్పడు దేవతాతిథుల్
దినదిన మర్చ్యమానులయి తృప్తినిజెందిరి. తద్గృహంబునన్
జని విముఖంబుగాదు ప్రిజ నారద! యేమివచింతు నీకిఁకన్.			౭౨౩
సీ॥ శీతకాలంబునం జేతి కబ్బినయంత ధనమిచ్చి బీదలఁ దనిపినాఁడు.
ఉష్ణదినంబులం దుదకంబు పోయించి యధ్వనీనులదాహ మార్చినాఁడు.
వర్షర్తువున మంచివస్త్రంబులిచ్చి దరిద్రులఁ గర మాదరించినాఁడు.
అపుడిప్పుడన కెప్పు డన్నంబు వెట్టించి క్షుధితులయెడ దయం జూపినాఁడు.
గుళ్ళుకట్టించి త్రవ్వించి కూపములఁ జెలువుల వేయించినాఁడు పైజవనుఁ డర్థ
వంతుఁడయ్యును సర్వదా వ్యసనములను బడక శివకేశవులపయి భక్తిగలిగి.
సీ॥ అకలంకమైన బ్రహ్మజ్ఞానసంపత్తిఁ "బరశివోహ" మటంచుఁ బలుకువాఁడు
తిట్టికొట్టినయట్టి చెట్టలతోఁగూడ సఖ్యంబుమైనుండు శాంతమూర్తి

నిరతంబునుం దపోనిష్ఠాగరిష్ఠుఁడై యూర్ధ్వరేతస్కుఁడ నొప్పుదిట్టి
అఖిలేంద్రియంబుల వశ్యంబుగావించుకొని యున్నయటువంటి కోవిదుండు
గాలవుఁడు సశిష్యగణుఁడయి యాపైజవనుని నిలయమునకు వచ్చుటయును
ఎదురుచని రొఱంగి మృదుమధురోక్తులం బలుకు చాసనంబుఁ జఱచి యంత

ఆ॥ "ఇపుడు సఫలమయ్యె నెంతయు నాజన్మ. మొదవె జీవితమున కుత్తమత్వ.
మిపుడు సఫలమయ్యె నెంతయు నాధర్మ. ముద్ధరించితీ వహో మహాత్మ! ౨౨౬

తే॥ నాదు పాపసహస్రముల్ నీదుదృష్టి పాటి కాలిచివైచెఁ దాపసవరేణ్య!
బహుకుటుంబికుఁడైన నాభవనమెల్లఁ జేరి నీచేఁ బవిత్రంబు సేయఁబడియె." ౨౨౭

క॥ అనిభక్తిం గనఁబఱచుచుఁ బొనరిచి యుపచారములను ముకుళితకరుఁడై
మను నా సచ్ఛూద్రునితో మునిశార్దూలంబు స్నేహమున నిట్లనియెన్. ౨౨౮

సీ॥ "కుశలమే సౌమ్య! నీకు? మది ధర్మంబున వర్తించుచున్నదే వదలకుండ?
అర్థానుబంధులై యలరుచునున్నారె దారపుత్రాదులందఱును సతము?
దాశార్హునందును దానంబునందును భక్తిగల్గివసింతె ప్రత్యహంబు?
హరిపాదతీర్థంబు శిరమునందునఁ జల్లుకొనుచుంటివా లేద దినదినమును?
విష్ణుపాదజలము వియదాపగాజలం బగును జూవె ద్వాదశాబ్దఫలద.
మద్ది ద్విగుణఫలద మగును జాతుర్మాస్య మస్తకమునఁ దాల్చు మనుజతతికి.

సీ॥ అవ్యాజభక్తిమై నాదినారాయణమూర్తికిం బొనరించు పూజనమును
బదుగురువినునట్లు బహిరంగముగఁ జేయు కేశవ సత్కథాకీర్తనమును
నానావతారము ల్పూని చరించు విష్వక్సేను మహిమంపు సంస్తవమును
అష్టాంగయుతముగా నాచరింపఁగఁబడు మాధవచరణ నమస్కృతియును
సచ్చరిత్ర! మోక్షమిచ్చుఁ జాతుర్మాస్య"నని వచించుటయును మునిని గూడి
ఇష్టగోష్ఠులఁబరితుష్టుఁడై కొంతసేపటికిఁ బైజవనుఁడు ప్రణతుఁడగుచు

క॥ "భవదీయకృపాదృష్టిని నవితథమయ్యెను మునీ! మదాశ్రమఫల. మ
ట్లవుఁగాక. యనామయమగు భవదుక్త్యమృతమును గ్రోల వాంఛించె శ్రుతుల్-

క॥ మిముబోటుల యాగమనము క్రమముగ సర్వార్థములను గల్పించెడి. నో
యమివర! చాతుర్మాస్యము సమీపగత. మేమికతము చనుదే నిటకున్? ౨౩౨

తే॥ తీర్థయాత్రాప్రసంగ మెద్దియయినను గలదొకో"యని వచియించుడు ముదితుఁడగుచు
ధార్మికుండును సత్యవాదరతుఁడైన పైజవననామ తచ్ఛూద్రుప్రక్కఁ దిరిగి ౨౩౩

క॥ "ఎన్నియొ నెలలే చన్నవి యన్నా! నాతీర్థయాత్రయందున. నత్యా
సన్నము చాతుర్మాస్యము. తిన్నగ మన్నిలయమునకె తిరిగెద నింకన్. ౨౩౪

క॥ తొలియేకాదశినాఁడట సలుపుదు నియమంబు నేను సచ్ఛూద్రవరా!
ఆల నారాయణుఁ బ్రీతుం జలుపుదు. సుకృతంబు నట్లు సంపాదింతున్" ౨౩౫

## —♦ సాలగ్రామ మాహాత్మ్యము. ♦—

క॥ అని గాలవముని యనుటయు విని పైజవనుండు వినయవినమితగళుఁడై
యనెను. "భూమిసురశ్రేష్ఠా! యనుగ్రహించి చెప్పుమయ్యా యడిగినదానిన్. ౨౩౬

క॥ శ్రుతులును స్మృతులుఁ బురాణము లితిహాసము లేనియుఁ బఠియించుటకై యో
గ్యతలేదునా. కనర్హుఁడ శ్రుతిసారజపంబునకును క్షోణిసుపర్వా! ౨౩౭

ఆ॥ కాన నాకుఁదగినకర్జంబె యొకటి మహాఫలంబుగలది యానతిమ్ము.
అదియె హరిపదుండినపు డాచరించిన ముక్తినొసఁగవలయు మునివరేణ్య!" ౨౩౮

క॥ అనవుడు గాలవముని యిట్లనుఁ. "జక్రాంకితపుటుఁడగు హరి సాలగ్రా
మనిషణ్ణు నెవరు నిత్యంబును గొల్తురొ ముక్తి వారిముందట నుండున్. ౨౩౯

శా॥ సాలగ్రామము మీఁదనిల్పి మనమున్ సత్కర్మ మొక్కింతయే
నాలోచించును గాక యక్షయఫలంబౌ నద్ది యెల్లప్పుడున్.
శ్రీలోలుండు పరుండియున్నయపు డారీతిం గృతంబైనచో
మేలౌ నంతకునెక్కు డట్లగుటఁ బేర్మిన్ దానిఁ బూజింపుమా. ౨౪౦

క॥ సాలగ్రామశిలయు మఱి మేలగు ద్వారావతిశిల మిక్కిలి భక్తిన్
మేళన మొనరిచి యొకచోఁ బూలం బూజించుజనుఁడు పొందును ముగితిన్. ౨౪౧

కం॥ సాలగ్రామశిలం బదివేలకొల త్సేసినట్టి వెంగలియేనిన్
హాళి నెటునుంచి కొలుచునొ చాలఁ బవిత్రమగుఁ జుట్టుస్థల మేన్గ్రోసుల్. ౨౪౨

ఆ॥ బ్రహ్మరూపమది. శుభమును. దేజఃపిండ. మడఁగు దానిఁజూడ నఘము లపుడ.
తీర్థములును నదులు దేవతా ల్తత్పార్శ్వమునఁ జెలంగఁ దీర్థతను భజించు. ౨౪౩

ఆ॥ తత్సమీపమునఁ గృతములైన సత్క్రియల్ సత్క్రియాత్వ మొందఁజాలు ననఘ
అంతకును విశేష మదియె చాతుర్మాస్య సంఘటించు నెడల. సత్యమిద్ది. ౨౪౪

క॥ సాలగ్రామశిల యెవనియాలయమం దుంచఁబడినదయి తులసీప
త్రాళిం బూజింపఁగఁబడుఁ గాలుం డవ్వానిగృహముకడ కరుగఁ డిఁకన్. ౨౪౫

ఆ॥ విప్రబాహుజులకు విశులకుసచ్ఛూద్రులకును బైజవన! కల దధికార.
మెట్టిసమయమందు నేని సాలగ్రామపూజనమున లేదుశో యొరులకు" ౨౪౬

క॥ అని యిటు వాక్రుచ్చుటయును విని పైజవనుండు "వేదవిద! స్త్రీశూద్రుల్
కునసాలగ్రామశిలార్చన మొనరుపఁదగరటంచు శ్రవణింతుఁగదే. ౨౪౭

క॥ ననుబోటి శూద్రజనముల కనఘా! యది యెవ్విధమున నయ్యెడిఁ బూజ్యం?"
బని ప్రశ్నసేయుటయు నోతనయా! గాలవమహర్షి తగ నిట్లనియెన్. ౨౪౮

తే॥ "అనిషేధ మసచ్ఛూద్రులందె కాని కాదు సచ్ఛూద్రవిషయము. కలరు సాధ్వు
లైన స్త్రీలకుఁ దత్పూజనాధికార. మిందు సందియ మొందకు. డిందు ఫలము. ౨౪౯

క॥ సాలగ్రామార్చనపరు లోలిం దనుపారిశుద్ధ్య మొంది వివేక
శ్రీలలితులగుచుఁ జిగురునఁ గాలునిపుటభేదనంబు గాంచరు దాసా! ౨౫౦

క॥ సాలగ్రామార్పితమగు పూలను శిరములధరించు పుణ్యాత్ముల పా
ప్కాలాచరితంబులయిన వేలకొలల్ తత్క్షణమున విలయముగాంచున్. ౨౫౧

క॥ సాలగ్రామాహ్వయశిలమ్రోలను దీపంబు వెట్టి మ్రొక్కెడి మనుజుం
డా లేఖపురి వసించెడు. నేలోపము దానికుండ దెయ్యెడనైనన్. ౨౫౨

క॥ సాలగ్రామగ హరికిం జాలం బంచామృతమున స్నపనముసేయన్
మేలౌ చాతుర్మాస్యను బూలం బూజింపఁ బడరుపో సంసృతిలోన్. ౨౫౩

ఆ॥ అమృతహేతు వమలుఁ డగుచు సాలగ్రామమున వసించు హరిని మనములోన
నుంచి భక్తి ధ్యానమొనరించువానికి ముక్తి యూటనున్న భూరిచుమ్మ. ౨౫౪

క॥ తులసీదళమాలికచే లలి సాలగ్రామశిల కలంకృతి సేయన్
ఫలియించుఁ గోర్కులన్నియు. నల చాతుర్మాస్యమునను నతిశయ మింకన్. ౨౫౫

ఆ॥ కాదు పుష్పమాల కరము సాలగ్రామమునకుఁ బ్రియము శూద్రజనవరేణ్య!
హరికి సార్వకాల మల తులసీదేవి వల్లభయును. శుభనివాసినియును. ౨౫౬

క॥ సాలగ్రామము విష్ణుం. డాలక్ష్మీదేవి తులసి. యందున నెపుడున్
సాలగ్రామంబునకది చాలఁబ్రియం. బంతకెచ్చు చాతుర్మాస్యన్. ౨౫౭

ఆ॥ గంధమిశ్రితోదకమున సాలగ్రామశిలను గడిగి లేఁత తులసిగుత్తు
లం దదర్చనంబు లలి నాచరింప నవాప్తకాముఁడగును నవని నరుఁడు. ౨౫౮

ఆ॥ ప్రథమపత్రమందు బ్రహ్మ ద్వితీయపత్రమున శివుఁడు గుత్తిఁగమలనాభుఁ
డలరుచుంట సదళమగు గుత్తి గ్రాహ్యంబు. దేవతాత్రయంబు సేవితంబు. ౨౫౯

క॥ జననాది త్రయకృత్తఘ్నమంజరి ధూపరాశిఁ దత్సాలగ్రా
మను బూజసేయునది సతమును. జాతుర్మాస్య మటియుముఖ్యం బందున్. ౨౬౦

క॥ తులసిం బూలం బూజిత మల సాలగ్రామ మెవ్వఁ డవలోకించున్
కలుషసహస్రంబులకుం దొలఁగి విశుద్ధాత్మతం జతుర్భుజుఁ గలయున్. ౨౬౧

తే॥ గండకీజలసంభవగ్రావగు హరిఁ దమి శ్రుతిస్మృతులను బురాణములచేత
నెవఁడు స్తుతియించు వాఁడు నుపేంద్రపదముఁ జేరు సచ్ఛూద్ర!యేమని చెప్పవాఁడ.

క॥ సాలగ్రామాహ్వయశిల గ్రాలుఁ జతుర్వింశతి ప్రకారంబుల. న
వ్వీలోకంబునఁ బూజ్యము. లాలింపుము వాని పేళ్ళ నభివర్ణింతున్. ౨౬౩

—• చతుర్వింశతి సాలగ్రామములు. •—

సీ॥ కేశవసంజ్ఞచేఁ గీర్తింపఁబడు నాద్య. మగు మధుసూదనాఖ్యము ద్వితీయ.
మవలిది సంకర్షణాభిధానంబగు. నగును దామోదరాఖ్యము చతుర్థ.
మగు వాసుదేవాఖ్య మాతరువాతిది. షష్ఠంబు ప్రద్యుమ్నసంజ్ఞగలది.
విష్ణునామంబున విలసిల్లు సప్తమం. బష్టమంబగు మాధవాభిధాన.
మవు ననంతమూర్తి నవమంబు. పురుషోత్తమాహ్వయంబు దశమ. మాదటుది య
ధోక్షజాభిధాన. మవలిది యగు జనార్దనసమాఖ్య మిష్టదంబు. మఱియు ౨౬౪

సీ॥ గోవిందనామ మగుఁ ద్రయోదశము. త్రివిక్రమనామకము చతుర్దశమది యగు.
అల శ్రీధరాహ్వయ మగుఁ బంచదశమది. యగు హృషీకేశాఖ్య మవలిమూర్తి.
సప్తదశాష్టాదశములు శ్రీనరసింహ విశ్వయోన్యభిధాన విశ్రుతములు.
పందొమ్మిదవది యా వామనాఖ్యాకంబు. నారాయణాభిధానం బవలిది.
పుండరీకాక్షనామకమూర్తి యిరువదొకటవది. పైదుపేంద్రాఖ్య నొప్పునదియుఁ
హరి యిరువదిమూఁడవది. కృష్ణాభిధాన మంతిమమది. మహాశూద్ర! యాలకింపు

క॥ సాలగ్రామ విభేదము లోలిని వచియించినాఁడ నోశూద్ర! యెవం
డాలించుదీనిఁ జదువును శ్రీలోలుఁడు వానియెడలఁ జేయును గరుణన్" ౨౬౫

—• దేవతలు శివదర్శనార్థము మందరగిరి కరుగుట. •—

క॥ అనియిటు వాక్రుచ్చుటయును జనువునఁ బైజవనుఁ "డార్య! సాలగ్రామం
బును శిలయే కాన సనాతనుఁడగు హరి గండకి నెటు తా శిలయయ్యెన్? ౨౬౬

తే॥ భవదనుగ్రహమున విష్ణుభక్తి నాకు దృఢతమంబయ్యెడిని బ్రహ్మబుషివరేణ్య!
తీర్థరూపులు మీరలు. దృష్టిపథ్యఁ బడినమాత్రన పాపము ల్పరిహరింతు. ౨౬౭

తే॥ తీర్థజలములఁ గ్రుంకి యేతీరుగాను బ్రజలు పావనులగుదు. రప్పగిది నేను
త్వద్వచోమృతపానముం దవిలి చేసి యగుదుఁ బావనుఁడను సంశయంబులేక"

క॥ అని వక్కాణించుటయును ముని యిట్లను. "హరి శిలాత్వమును లింగత్వం
బును హరుఁడుఁ బొందినట్లుగ వినఁబడు నితిహాసమొకటి. విను. వినిపింతున్.

తే॥ తొల్లి దక్షప్రజాపతి దుహిత సతిని శివుఁడు వేదోక్తవిధిఁ బెండ్లిసేసికొనియె.
అంతఁ గాలాంతరంబున నాకతండ్రి యాగమొక్కటి తలపెట్టి యందు నల్లు ౨౭౦

చ॥ పిలువ నుపక్రమించుటయు బిడ్డ తదధ్వరశాలకేగి బి
ట్టలిగి కృశానుధారణను బ్రాణములన్ నియమించి విగ్రహం

బిలపయి విడ్చె. విడ్చుచును హృత్సరసీరుహమందుఁ బ్రీతితో
వలిమల సంస్మరించెఁ బితృభాగము వీడి స్వభాగయుక్తయై. ౭౭౨
మ॥ తమచేఁ బూర్వ మొనర్పఁగాఁబడిన సత్కర్మంబొ దుష్కర్మమో
స్వమనంబుల్ మరణించుకాలమున నేస్థానంబునం జేర్చు న
శ్రమతం బోయి జనింతు రెల్లరును దత్స్థానంబునం గాన నా
దమనోద్ధశరీర యద్రిపతికిం బాఁ గూఁతురై పుట్టెఁ జూ. ౭౭౩
క॥ అటు పార్వతియై యాయమ నిటలాక్షుని మనమునందు నిల్పి తపం బు
త్కటముగఁ జేయంగడఁగెను నటజం బేర్పఱచుకొని త దుర్వీధ్రముపైన్.
చ॥ పదపడి వేయియేడులకు బ్రహ్మణుఁడై చనుదెంచి శంభుఁ డా
సుదతిని గర్మభావముల శోధనచేసి తపోవిశుద్ధగా
నెద గుఱుతించి దివ్యమగు నింకొకరూపునఁ జేయివట్టి "యో
ముదిత! భవత్తపంబునకు మోదముఁజెందితి. నేమికావలెన్ ?" ౭౭౫
చ॥ అని "గురుఁడైన నాదుపిత యాను బ్రమాణము నా" కటంచు న
య్యనఘ వచించుడున్ గిరిశుఁ డత్రిమహామునిఁ దొట్టి యేడ్గురన్
మునులను బంపె నచ్చటికి. మున్ సమయంబు వచించి వార లా
ఘనుని యనుజ్ఞఁదీసికొని గ్రక్కునఁబోయిరి శూలిపాలికిన్. ౭౭౬
ఆ॥ అంత లగ్నదినమునం దింద్ర హరి పద్మయోనిముఖర సురులు యోగసిద్ధు
లగ్నిదేవు నంద అగ్రమం దిడుకొని వచ్చి శంకరుని వివాహమునకు ౭౭౭
ఆ॥ తరలిపోవుటయును దదభిముఖంబుగాఁ జని నగాధిరాజు సంతసమున
మంగళంబులైన మధుపర్కముఖ్యోపచారములను వరుని గౌరవించి ౭౭౮
క॥ కృతకృత్యంమన్యుండై శ్రుతిచోదితవిధిని దనదు సుత నర్పింపన్
క్షితిసురవృతుఁడై యతఁ డాసతి పాణిగ్రహణ మెలమి సల్పినవాఁడై ౭౭౯
క॥ చేసెఁ బ్రదక్షిణ మగ్నికి. దాసా! విను. దానవేళఁ "ద్వద్గోత్రమె?" దం
చా సర్వేశ్వరు నడుగుడుఁ దాసిగ్గున మౌనముద్ర దాలిచెఁ బ్రహ్మ. ౭౮౦
ఆ॥ బ్రహ్మవచనమునను బరమేశ్వరుఁడు విధిశేషమును ముగించి శీఘ్రముగను
చరువుఁబుచ్చుకొనెడి సమయంబునం బంచవదనుఁడయ్యె. నేమనుద మెయ్యదియొ.
ఉ॥ తొమ్మిదికోట్లమోములను దోడనె పార్వతి తా ధరింపఁగా
"నమ్మకచెల్ల!" యంచు జన మచ్చెరువందె. నభమ్మునుండి స్థై
ర్యమ్మువహింపు మీవు శివ! యంబిక లజ్జితయయ్యెఁ. బంచజ
న్మమ్ముల నిన్ను వీడదిఁక. నాథుఁడ వీవె తదంబుజాక్షికిన్. ౭౮౧

చ॥ అమరులయుఁ గిరీంద్రులయు నన్వయము ల్కడు సంతసించె”నం
చమలములుం ద్రయీమయము లైన నుతు ల్వినవయ్యె. నవ్వివా
హ మిటులఁ బూర్తిఁ జెందుటయు హర్షముఁబొంది రమామహేశ్వరుల్
హిమగిరి పారిబర్హ మిడి యెంతయు వేడుకఁ బంపె నల్లునిన్. ౭౮౩

సీ॥ ఘనసహస్రస్తంభ కమనీయతమమును మణిమయవేదికా మండితమును
సుప్రశస్తప్రభా శోభాయమానమున్ సకలవస్తుసమృద్ధి సంయుతమును
మాణిక్యవిద్రుమ మాలికా కలితముం బారిజాతోద్యాన భాసురమును
నవకామధేను చింతామణిసహితమున్ మందరభూమిధ్రి మధ్యగతము
నైనగేహ మొకటి యావిశ్వకర్మచే నిర్మితంబగుడుఁ దిరిసేతుర్లు ధృత
శూలు లాత్మరూపులై లలితహిమయించు గణము లంగణమునఁ గాఁపు వెట్టి

ఆ॥ హరుఁడు కామవృద్ధికరమగు తద్దివ్యభవనమధ్యమందుఁ బార్వతీస
మేతముగ వసింప మెలమెల్ల మదనుండు వాయురూపమునను వచ్చియటకు ౭౮౪

క॥ “దండమునీకు వృషధ్వజ ! దండం బఖిలస్వరూప ! త్వత్పదములకున్.
దండమునీకు గణాధిప. దండం బర్పింతు నాథ! దయఁబ్రోవుము నన్. ౭౮౫

ఆ॥ నీవు లేనిజగము నిజముగా భూదేవి శవమువలెను దాను సంస్పృశించు.
నినువినా యొకింతయును సచరాచరమైన జగతి నున్నయదె మహేశ !

తే॥ ఈవు త్రిజగంబులను సృజియింతు. మఱియు నీవు రక్షింతు.హరియింతువీవ దేవ!
కరుణయుంచి యొనర్పుము కాయదాన”మనీ నుతించుటయును నీశుఁడతనిఁగాంచి

ఉ॥ “ఏగిరిమీఁద నావలన నెంతయు దగ్ధుఁడవైతొ యీవు ము
న్నాగిరిపైనె వెండియును నంగముఁదాల్పు”మటంచుఁ బల్కుడున్
దాఁ గమనీయదేహమును దాలిచి శూలికి శైలజాతకున్
వేగ నమస్కరించి యరవిందశరుండు కడున్ విధేయుఁడై ౭౮౬

ఆ॥ అభయుమామహేశ్వరుల కృపాదృష్టికిం బాత్రుఁడగుచు వారి పాలినుండి
యరిగి త్రిజగములను దిరిగె మహాతేజుఁడైన పంచబాణుఁ డనఘ! యంత.

ఆ॥ హర్షపూరితుండు నాకుంచిత శిరోరుహుండు మోహబలయుతుండు నగుచు
ఘూర్ణితేక్షణములఁ గుసుమాస్త్రుఁ డటు చరించుచుఁ దదంగములను జొచ్చెఁద్రుదకు.

క॥ దివ్యములగు నాసవములు భవ్యములగు గంధమాల్య పట్టాంబరముల్
దేవ్యంతికమం దుంచిరి యవ్యయముగ సురతవేళ నంతట సకియల్. ౭౯౧

ఆ॥ ఇట్లు తమకమునను నెంతయుం గ్రీడించు రాజమౌళి కొక్క రాత్రివోలె
వర్షశతము వెళ్ళవచ్చుటయును సురల్ తారకామరారి దాడి కోడి ౭౯౩

సుగంధి॥ తమ్మిచూలి శరణుఁజొచ్చి "తాత ! త్వద్వరప్రభా
వమ్మునన్ మదించి బిట్టు వైరమూని తారకుం
డిమ్మెయిం బరాక్రమించి యింద్రుఁ గెల్చి మూఁడులో
కమ్ము లేలుచున్నవాఁడు కంటె రౌద్రమూర్తియై. ౭౯౪

కం॥ త్రైలోక్యపూజితుండవయి క్రాలెడు నవ్వాని వధకుఁగా సదుపాయం
బాలోచింపవె" యనుచుం జాలనుతించుటయు నాభిజాతుఁడు ప్రేమన్ ౭౯౫

తే॥ "నేను వరమిచ్చివానికి నేనె మరల సంహరించుట కెమ్మెయి సాహసింప.
తానుబెట్టినచెట్టును దానె మరలఁ గొట్టివేయుట తగ దెట్టిదూర్తకేని. ౭౯౬

ఆ॥ కాన వానివధకుఁ గల దొక్క సదుపాయమాలకింపుఁడీక, లమ్మహాత్ముఁ
డగు మహేశువలన హైమవతీగర్భమందుఁ బుట్టినట్టి యర్భకుండు ౭౯౭

తే॥ ఏడుదినములవాఁడయియే వధించుఁ దారకాసుర" ననవుడు దైవతాళి
దానవులచేత నెంతయుం దాడ్యమానమగుచు నటనుండి మందరనగముఁ జేరి

మ॥ అట నీశానుగృహంబుముందటఁ ద్రిశూలాద్యాయుధోపేతులై
భటవర్గంబగు నందిముఖ్యగణము ల్పాలించుచుం గ్రాల ను
త్కటదుఃఖావిలమానసాంబుజులు సంత్యక్తాత్మసంస్థాయులై
విటపిచ్ఛాయ సమాశ్రయించి యచటన్ వేర్వేఱ నాల్మాసముల్ ౭౯౯

## —• పార్వతి యింద్రాదుల శపించుట •—

సీ॥ సకలభూతముల హృత్స్థలిఁ బార్వతిం గూడి యైదుమోములతోడ నలరువాని
అలఘు జటాజూట మావరింపఁగఁ దల బలుకిరీటము పెట్టి చెలఁగువాని
అజగవ శూల ఖట్వాంగాదికంబులం బదిచేతులం దాల్చి పరఁగువాని
కర్పూరముంబోలెఁ గడుగౌరమగు మేన వెలిబూదియలఁది భాసిలెడివాని
పాపజందెంబులం దొడ్డి పైని జింకతోలు గజచర్మముం గప్పి క్రాలువాని
ప్రతిమ నావాహనముచేసి భక్తిమై షడక్షరజపంబు సేయుచు నధికనిష్ఠ

కం॥ వ్రతచర్యఁబూని యీవిధి సుతపము గావించి" రనుడు శూద్రుఁడు మునితో
"వ్రతచర్యయనుచు నేగతిఁ గృతమగుచోఁ జెప్పఁబడునొ కీర్తింపఁగదే.

తే॥ తావక వచోమృతం బెంతతాగినను మహాత్మ! సంతృప్తిగాదయ్యె" నని యనుటయు
గాలవుఁడు పైజవనువంకఁ గరుణఁజూచి యెంతయును సంతసంబున నిట్టులనియె.

సీ॥ "మసనంపువెలిబూది మఱి పాపజందెంబు ఖట్వాంగమును బటికంపుఁబేరు
తలకాయపుత్రిలదండ కపాలంబు నచ్చెరువొదవించు నైదునోళ్ళ
సిగమీఁదఁబుట్టిన సొగసైన నెలరేక దొడ్డయేనికతోలు దుప్పటంబు
ఫణికుండలద్వయి బలువుగంటలజంట పులితోలుగోచి ము మ్మొనలవాలు

జపముసేయుటెమా వ్రతచర్యయనఁగ. నీ సులక్షణముల లక్ష్యమే మదుక్త.
మట్లు శతరుద్రజపమును నాచరించి యల మహావిష్ణువునుబోలె నధికభక్తి

ఆ॥ సోము వరదు షోడశోపచారంబుల నగ్నిముఖులైన యఖిలసురులు
వారి పరుండియున్న యానాల్గునెలలుఁ బూజించి కరము శుద్ధిఁగాంచుటయును

తే॥ సంతసించి జీవాత్ముండు సకలభూతదృక్కు నగు రుద్రుఁడిచ్చెను దీవి కాస.
మంత యోజించి తెలిగంటు లగ్ని దేవు సన్నుతించి ప్రసన్నుని సల్పుకొనిరి. ౨౦౫

మత్తకోకిల॥ కార్యసాధనతత్పరుండయి కర్మసాక్షి మహాద్యుతిన్
భార్య భర్త పరున్నచోటికిఁ బావురంబయి పోయి యా
శ్చర్యకార్యవశుంతలుంతనసర్వణాదులఁ దన్మన
శ్చార్యముం బొనరింపఁ గన్గొని చంద్రశేఖరుఁ డంతయున్ ౨౦౬

ఆ॥ హేతు వెఱిఁగి యూర్ధ్వరేతస్సు దాని వక్త్రమున వదలుటయును దాల్చి దాని
ఒక్కగంతులోన నుదవసితంబు వెల్వలికి దూఁకె నార! పావురాయి. ౨౦౭

ఉ॥ పావుర మావలం బడుడుఁ బార్వతి స్వశ్రమ మెల్ల వ్యర్థమై
పోవుట కాగ్రహించి సురపుంగవులం గని "పుత్రహీనతన్
గ్రావములై వసింపుఁడికఁ గావలు" లంచు శపించె. దీనులై
యావిడ కాళ్ళమీఁదఁబడిఁ బ్రార్థనసేసిరి వార లీవిధిన్.

సీ॥ తల్లివీవు సమస్తదైవతములకును సాక్షివీవు సమస్తజగములకును
జగదుదయస్థితి సంహారకర్త్రి వపర్ణవు నిత్యరూపవు వరేణ్య
వఖిలరూపవును మంత్రారాధ్యవును సనాతనవు వసుంధరవును వరదవు
భూతధాత్రివి మహాభూతాశ్రితవును స్వాహారూపమున నధ్వరాదిఫలద
వజహరీశ్వరాదులందున మంత్రయంత్రయుతవును నిరంజనవు మహేశ్వ
రివియు మంత్రబీజమువు విశ్వబీజలయస్థితివియు నౌదు వంబ! నీవు. ౨౦౯

కం॥ ఈవు మహాలక్ష్మివియును నీవు మహాకాళివియు సురేశ్వరివి మహా
దేవివియు మహారూపవు నీవు మహామాయవు జగదీశ్వరి వరదున్. ౨౧౦

ఆ॥ తపములను ధరించు దానవు దోషత్రయావృతోద్భవముల నధికశ్రేయ
మిచ్చునట్టిదాన విఁకను భూతప్రకృతిస్వరూపవును నుతింపఁదరమె. ౨౧౧

కం॥ మాయాబీజవరప్రదవై యిల బిల్వముల నెవ్వ రర్చింతురో యా
ధీయుతుల కిత్తు రాజ్యం బేయిష్టము నేని యిత్తు విఁక సిద్ధిదవున్. ౨౧౨

శా॥ చాతుర్మాస్యమున బిల్వపత్రముల నిన్ శ్రద్ధన్ సమర్పించు నే
భూతశ్రేణి మనోరథంబు లెపుడుం బూరింప సొంతంబుగా
శీతక్ష్మాధరసూతివై తి. వెదియున్ సిద్ధింపఁగంజేతు. వా
చాతుర్మాస్య మహాఫలప్రదము నీసంసేవ కాత్యాయనీ! ౨౧౩

చ॥ ఎవ రనయంబు లోకమున నీశ్వరుతోడను గూడియున్న నిన్
బ్రవిమలబిల్వపత్రముల భక్తిభజింతురొ వారలన్ వ్యథా
లవమును సంస్పృశింపదు, కొలల్దరిఁజేరవు. నేఁటినుండి నీ
వవుదువు జ్ఞానదాయినివి యట్లు యజించెడివారి కంబికా! ౨౧౪
కం॥ చాతుర్మాస్య మహాఫల మేతద్బిల్వం బుమామహేశుల యలఘు
ప్రీతికి విధివద్దత్తము. మాతా! యక్షయముగాదె మారే డవనిన్. ౨౧౫
మ॥ తులసీవృక్షమునందు లక్ష్మివలె నీదుశ్రీవ్రతం దీవు మం
జులవతా మూర్తిన్ సభీష్టదాత్రి వగుచుం జూపట్టుచుం. దందునన్
దులసీవృక్షము బిల్వవృక్షమును జాతుర్మాస్య సేవించినన్
ఫల మత్యంత" మటం చిటు లున్నరలు సంప్రార్థించి రీశాని నా౯ ౨౧౬
ఉ॥ పైజవనుండు గాలవుని ప్రక్కనుఁ జక్కగ మోము ద్రిప్పి "యే
యోజఁ దులస్యనోకహము నొంది వసించెడి లక్ష్మి? భూమిభృ
ద్రాజతనూజ బిల్వమున రాజిలనుండిన హేతువేమి? య
వ్యాజకృపన్ వచింపు మిదియంతయు" నా విని యాతఁడిట్లనున్. ౨౧౭
మ॥ "మును దేవాసురయుద్ధమందు బలదర్ప ద్దానవు ల్వేల్పులన్
మననీకుండుడు వారు భీతిఁ జని బ్రహ్మంగూర్చి జోహారొన
ర్చి నుతుల్సేయ నతండు "మీ మొగములం జెల్వంబు లోపించె. నే
మి నిమిత్తంబు మదీయగేహమునకున్ మీరందఱుం గూడిరాన్?" ౨౧౮
క॥ అన "నని నద్భుతకారులు దనుజు ల్మముఁ బుండు రేఁగ దంచుటవలనన్
నినువచ్చి శరణుఁజొచ్చితి. మనఘా! రక్షింపు" నాఁగ నతఁడిట్లనియెన్. ౨౧౯
ఆ॥ "ఎవరిపక్షమందు నేనుండఁజాల మీయుభయులందు నాకవిభువులార!.
ధర్మమాశ్రయించి తగనుండు మీమొ్రలఁ జెప్పెదను నుపాయ మిప్పు డొకటి.
క॥ హరిహరభక్తుల కొకపరి పరస్పరము వివాదమగుడుఁ బరమేశ్వరుఁ డ
చ్చెరువగురూపము దాలిచె హరిభక్తులతోడ నైక్యమందినవాఁడై. ౨౨౧
సీ॥ అర్ధదేహంబునం దంబుజనాభుండు శేషార్ధమున ఫణిభూషణుండు
ఏకత్ర కమలాలయేశుని చిహ్నంబు లన్యత్ర త్రిపురాభియాతిచిహ్న
లొక వైపువాహన మురగాంతకుఁడు మఱియొక వైపువాహన మక్షరాజు
వామార్ధగాత్రంబు వారివాహోభంబు కర్పూరగౌరంబు కడమతనువు
అట్టి హరిహరాత్మమగు రూపు దాల్చుడు జగము తదుభయైక్యసమతఁబరఁగ
జగము తదుభయైక్య సమమయి యారీతి భేదమతులనెల్ల బిలుకుమార్చె. ౨౨౨

## —♦ అశ్వత్థమహిమ. ♦—

సీ॥ అటు శ్రుతిస్మృత్యర్థహరులైన హైహయు లాఁగి ప్రపంచమున లేకుండ నైరి.
పాపండు లెల్ల రబ్రముఁ జెంది ముక్తిమార్గము వట్టి రాత్మమార్గముల వదలి.
తన్మూర్తి మందరధరమునం బ్రమథాదిపరివృతం బది మొద. ల్ప్రస్తుతము.
జగదుదయస్థితిసంహారకారిణి. యఖిలబీజంబు. ననంతకమును.
హరిహరాత్మకంబు. నఖిలయోగిధ్యేయ. మనయ మర్చనీయ. మఘహరంబు.
ముక్తిగోరు ప్రజయు సక్తిమై దాని ధ్యానించి పరమపదము గాంచఁగలదు. ౨౩౩
తే॥ ప్రాణికోటికి నాధారమగు గుణము లతిక్రమించిన హరిహరదేవమూర్తి
హరి పరుండంగ ధ్యానించినట్టివాఁడు నరుఁడు గాఁడిఁక వాఁడు నిర్జరుఁడె కాని.
కం॥ మందరగిరికిన్ బోయిన యందఱ కిష్టంబు లొసఁగు హరిహరుఁ" డని యీ
చందమున ధాత తత్సురబృందముతో నని యటనె యదృశ్యుండగుడున్ ౨౩౪
ఉ॥ మందరపర్వతంబున కమర్త్యులు వోయి యటన్ మహేశుఁ ద
త్సుందరి బిల్వభూమిరుహసుస్థితఁ దత్తులసీద్రుమస్థయౌ
నిందిర నందటున్ వెదకి యెల్లెడలన్ భ్రమియించి. రేమనన్.
ముందు ప్రపంచ మంతయును భూజమయంబచుమీ జఘన్యజా! ౨౩౫
శా॥ ఆవృక్షంబులు దేవతాంశములచే నావిర్భవంబంది యెం
తేవతిఁ గ్లెడి. వానిఁ దాఁకియె జనం బేనశ్చయత్యక్తమా.
గోవిందుండు పరుండినప్డు మఱియున్ ఘోరాఘము ల్వాయు. న
ట్లావేల్పు ల్నవుఁగాన కదిప్రి మనుచో నాకాశవా కిట్లనెన్. ౨౩౬
ఆ॥ "ఈశ్వరుండు శౌరి యెల్లభూతంబులమీఁదికరుణఁ జెట్లుమీఁదనుండు.
రందులోఁ గృపాళులౌచుఁ జాతుర్మాస్య వదలకుండనుండు వానియందు. ౨౩౭
ఆ॥ అట్లుగాన సేవ్య మశ్వత్థవృక్షంబు. మందవారమందు మఱియు సేవ్య.
మహరహంబుఁ జేయు నశ్వత్థసంస్పర్శనమునఁ బాతకంబు నాశమొందు. ౨౩౮
ఆ॥ పాలు నూగుపిండి బాగుగాఁ గలిపి యశ్వత్థమూలమందు భక్తితోడ
పోయునట్టివాని పూర్వికుల్ తృప్తాస్మయనుదు. శౌర! తన్మహత్త్వమే మెు. ౨౩౯
సీ॥ గంధపుష్పాదులం గరమలంకృతమైన యశ్వత్థ మఘరోగహరము కరము.
మానసంబున బిట్టు ధ్యానింపఁబడినట్టి యశ్వత్థ మఘరోగహరము కరము.
ఎంతయు భక్తిమై నీక్షింపఁగంబడ్డ యశ్వత్థ మఘరోగహరము కరము.
సేచనాదులచేత సేవ్యమానంబగు నశ్వత్థ మఘరోగహరము కరము.

తవిలి యనినట్టి వినినట్టి దాని పేరె యగ్గలము జ్ఞానదము పాపహారము కరము.
హరిపరుండినయాపుడైన మఱియువరము. ఇంతకంటెను వాక్రువ్వ నేరితరము.
సీ॥ అగ్గలంబగుభక్తి నర్ఘ్యపాద్యాదులం బూజ్యమానంబౌచుం బొల్చునదియు
పాదునం దెల్లప్డుం బరిపూర్ణమైయుండు కీలాలముల మున్గి తేలునదియు
అఖిలామయంబుల హరియించుచుం బ్రాణివిసరంబునకు సౌఖ్యమొసంగునదియు
సేచనాదులం దన్ను సేవించుజనముల కలుషంబులన్నింటిం దొలంచునదియు
నైన రావిమ్రాను నభిధానమేనియు నోట నుచ్చరింప నోచువారి
కమరవర్యులార! యమలోకభయ ముండ. దింతకన్నం జెప్ప నేమిగలదు. ౨౩౨
తే॥ కుంకుమమునను మలయజపంకమునను రావిమ్రానికిం బూసి యర్చనము సేయు
నట్టివానికిం దాపత్రియంబు తొలంగుం. గలుగు వైకుంఠపురమున గణతగూడ. ౨౩౩
శ్లో॥ దుస్స్వప్నం దుష్టచింతాంచ దుష్టజ్వరపరాభవాన్
విలయం నయ పాపాని పిప్పల త్వం హరిప్రియ॥ ౨౩౪
క॥ అను నీమంత్రముచే నేజను లశ్వత్థంబుపూజ సల్పెదరో వా
రను నెల్లపనులు సేయుచు ననుకూలుండగుచునుండు యముండనయంబున్. ౨౩౫
క॥ చాతుర్మాస్యంబునహరి ప్రీతిమెయిం బిప్పలమునం బీఠంబిడి ధా
త్రీతలసంగతనూతన శీతాంభఃపాయినాంగ సేవించుఁజూడీ. ౨౩౬
క॥ సలిలము హరి. సలిలతిచే నల హరియె మహారసంబు. నటుగావున మ్రాం
కులయం దెల్లపు డుండెడి జలజాక్షుండు కొలలందొలంచుం జాతుర్మాస్యన్. ౨౩౭
తే॥ సకలభూతగతుండగు చక్రపాణి జగతి కాప్యాయనంబును సల్పుచుండు.
అట్టి లశ్వత్థగతుండైనహరి కెరంగువారు పడ రెన్నటికింగూడ నారకమున. ౨౩౮
క॥ రావిం బావితతనుండై యేవాం డిల నాటు వానియేనశ్చయముల్
వేవేలైనను గానీ యావెంటనె విలయమొందు నాశ్చర్యముగన్. ౨౩౯
క॥ రావి సమస్తాగములం బావనము శుభప్రదంబుం బరికింపంగన్.
కైవల్యంబునొసంగెడి యావృక్షము రోపితంబు ధ్యాతము నగుచున్. ౨౪౦
ఆ॥ రావిం గాలువెట్టి కావలునకు బ్రహ్మహత్య సంఘటించు. నసవసరము
గం గుదించునట్టి కలుషాత్మకుండును నిరయమందుం గూలు నిశ్చయముగ. ౨౪౧
సీ॥ అశ్వత్థమూలంబు నాశ్రయించివసించు విష్ణుదేవుండు సర్వవేళలందు.
అశ్వత్థతరుగుల్మ మందుం బాయకయుండు కేశవుండు రవిప్రకాశమునను.
అశ్వత్థశాఖలం దారూఢుండై మీఱు నారాయణుండు తా ననారతమును.
అశ్వత్థపత్రంబులందుం గూరుకుంజెందు భగవానుండగుహరి పవ్వళించి.

మఱియు నశ్వత్థఫలముల మను ఘనముగ నఖిలదేవతలంగూడి యచ్యుతుండు.
కాన నశ్వత్థసంసేవ మానవులకు నహరహంబును గరణీయ. మఘహరమును. ౮౪౨

క॥ ఏనాఁడుచేయుపాపం బానాఁడే విలయమొందు నశ్వత్థార్చన్.
గాన సదా యది కార్యము. జ్ఞానప్రద మందు మఱియుఁ జాతుర్మాస్యన్. ౮౪౩

## — ♦ పాలాశమహిమ. ♦ —

సీ॥ ఆ యశ్వత్థమహీజమే హరి. పలాశానోకహంబున్ ఘన
చ్ఛాయం బాదిముఖైన కోవిదులచే సంసేవ్యమానంబు. త
చ్ఛ్రీయశ్శాఖి బహూపచారములచే సేవించినం బ్రీతి దీ
ర్ఘాయుర్మఖ్యసమీప్సితంబు లిడు. ఘోరాంహస్సులం గూలుచున్. ౮౪౪

క॥ మూఁడాకులుండు దానికి. నేడుక నడుమన్వసించు విష్ణుఁడు. వలనా
నూడును వేలుపుఁబెద్దయు జోడుగఁ గుడియెడమలందు సుఖముండు౹ సదా. ౮౪౫

క॥ మోదుగునాకులవిస్తరిలో దినదినమును భుజించులోకము పరమా
హ్లాదముతోడను వెయి హయమేధములం జేసిపడయు మేలును బడయున్. ౮౪౬

కం॥ చాతుర్మాస్యము సాంతము పూతమగు పలాశపాత్రమునఁ దిను మనుజ
వ్రాతము ముక్తికిఁ బాత్రంబై తీరును. లేదు సంశయం బిద్దానన్. ౮౪౭

ఆ॥ క్షీరముననో లేక నీరమ్ముననో ప్రతిభానువారమునను భక్తిఁ గడిగి
యా పలాశభూరుహమును జాతుర్మాస్యమున యజించుప్రజయు ముక్తమగును.

తే॥ పొద్దుటను లేచి కింశుకభూమిరుహముదరిసెనము చేసికొనియెడినరుఁడు గూడ
పాపములనుండి ముక్తుఁడై పరమపదము పడయు. నేమిటికిఁక బహుభాషితములు.

ఆ॥ కింశుకంబు సర్వగీర్వాణులకును నాధారభూత. మిఁకను ధర్మసాధ
నమును. దాని కేస్థలమున లోభంబుండు నాస్థలమునఁబూజ్య మాద్రుమంబు. ౮౫౦

తే॥ ఎవ్విధంబున బ్రాహ్మణుఁ డెల్లవర్ణములను ముఖ్యతముండయి పొలుచువాఁడొ
అవ్విధంబున బ్రహ్మద్రు వఖిలవృక్షముల మహోత్తమమయి ధాత్రి నలరుచుండు.

సీ॥ అద్దానిమూలమం దనయ ముండును హరం. డద్దాని స్కంధమం దలరు శౌరి.
అద్దానిశాఖలం దధివసించును రుద్రుఁ. డద్దాని పర్ణము లద్దె శివున
కద్దానిపూలలో నిద్దురించుఁ బురారి. యద్దానిపం ల్లాశ్రియము గణపతి.
కద్దానితొట యిల్లిల్ల గంగాపతి. కద్దాని మజ్జ దిగ్గాడు భవుఁడు.
తత్ప్రశాఖల నీశుండు తాండవించు. నప్పలాశము సర్వంబు హరహితంబు.
హరుఁడు కరుపాప్రధవుఁడైనట్లుబ్రహ్మరూపమగు నది సితవర్ణమై పరంగు. ౮౫౨

ఆ॥ అరివినాశనార్థ మఘపరిహారార్థ మభిమతాఖిలార్థ మది నిచింత్య.
మెల్లపాపములును నీఁగుఁ జాతుర్మాస్య దానిపూజ వినుతి ధ్యానమునను. ౮౫౩

శా॥ దేవస్తుత్యము దేవబీజమును నై దీపించుచుఁ మూర్తమై
తా వెల్గొందెడి బ్రహ్మ మైనయది యేతద్బ్రహ్మవృక్షంబు. సం
సేవింపందగు స్థాణురూపమగు నీచెట్టుఁ సదాశ్రద్ధ. స
ద్యో విచ్ఛిన్నములౌను బాపములు చాతుర్మాస్య సేవించినఁ. ౮౫౪

—• తులసీమాహాత్మ్యము. •—

ఆ॥ అలఘుఫలదయైన తులసి యద్గృహమున వేసి నీరుపోసి పెంచఁబడునో
తద్గృహంబునందు దారిద్ర్య మేమాత్ర ముండ దెన్నటికిని ఖండితముగ. ౮౫౫

క॥ తులసీదర్శనముననే కలుషంబులు తొలఁగు. హరికిఁ గడువల్లభయౌ
తులసి సుధాబిందువుచేఁ గలిగెను సంపద్వివృద్ధికరమగుపొంకెఁ. ౮౫౬

క॥ తులసీదళములతోడం గలితంబైనట్టి నీటికణ మొక్కటియే
బలుభక్తిఁ ద్రావువారల కలుషంబులఁ దొలఁచుశక్తి గలదయి యుండుఁ. ౮౫౭

సీ॥ ఎద్దానిమూలమం దెపుడు నుండును లక్ష్మి యత్స్కంధసంస్థిత యబ్ధిజాత
యెద్దానియాకులం దెల్లప్డు మనును శ్రీ యెద్దాని కొమ్మలం దెసఁగుఁ గమల
యెద్దానిపువులయం దిందిర నివసించు యత్ఫలవసతి దుగ్ధాబ్ధిజనిత
యెద్దాని పైబెర డిరవు హరిప్రియ కబ్జవాస చెలంగు యత్సుమజ్జ
దేనికుమ్కాష్ట వాను జగద్వ్యాపినికి స్వరూప మట్టి నిఖిలరూప
యైన తులసి యుత్కృష్టానందదాత్రి. తత్ప్రశకుండు చనఁడు యమునిపురికి. ౮౫౮

సీ॥ తల తులసీదళకలితము బొనరింప యమయాతనంబడ దవనిజనము.
వదనంబు తులసికిం బదము గావించిన నిర్వాణసుఖముబ్బు నిశ్చయముగ.
కరయుగి తులసిచేఁ గర మలంకృతముగాఁ దాపత్రయంబును దలఁగుదూర.
మెడఁ దులసీమాల పదిలమ్ముచేసినఁ గోరినకోరుకు లొక్కనలువాఱు.
అంసమందుఁ దులసి యారోపితంబైనఁ గలుషలిప్తతనులు కారు నరులు.
మెడను దులసిపేరు లిడిన జీవన్ముక్తుఁడగును జనుఁడు సంశయంబులేక. ౮౫౯

తే॥ అఖిలకార్యార్థసాధనియైనతులసిఁ బాపవారిణి నెవ్వాఁడు ప్రత్యహంబు
తద్దయును నీళ్లుపోసితాఁ దడుపుచుండు వాఁడు యమపురి కరిగెడివాఁడు కాఁడు.

కం॥ చాతుర్మాస్యమునందున నేతత్తులసీపలాశ కెక్కువభక్తిఁ
చేతులు మోడ్చినమాత్రన ప్రీతిం గైవల్యమొసఁగుఁ బృథ్వీపప్రజకుఁ. ౮౬౦

శా॥ వైతేయారి పయస్తరుస్థుఁడగుటం దర్శించి డెందంబునన్
భూతశ్రేణులమీఁదిపేర్మిఁ దులసీభూజంబునుం జేరె శ్రీ
ఏతద్ధేతువుచేత ధూతమగు ఘోరైనస్సహస్రంబులన్
చాతుర్మాస్యమునందు భక్తిఁ దులసీసంసేవ గావించినన్. ౧౬౧

కం॥ గోవిందస్మరణము తులసీవనసేవనము క్షీరసేచన మెపుడున్
పావనచాతుర్మాస్యను సేవానికి దుర్లభంబు. లేమనవలయున్. ౧౬౨

ఆ॥ చెట్టుచుట్టుఁ బాదుచేసి యయ్యది నిండ నహరహంబు వలసినన్ని పరులు
నీస్సువోసిపోసి నెమ్మిమైఁ బెంచెడివాని కులమె పూతమౌను బుడమి. ౧౬౩

కం॥ ఏవిధి నల తులసీద్రుమ తావలముగనున్నలక్ష్మి తా దినదినమున్
నే వృద్ధిఁబొందుఁ గ్రమముగ నావిధి ఫలియించు గేస్తు నాశాలతికల్. ౧౬౪

సీ॥ ఒకయమ్మ పెట్టె వేఱొకయమ్మ పెట్టలేదని యుండఁ డీక వర్ణి యాత్మలోన.
దారపుత్రాదులందఱి నెటుపోషింతునని యేడ్వఁ డీక గృహి మనమునందు.
కందమూలాదు లిందెందులే వెట్లని వందురఁ డీక నెద వననివాసి.
భిక్షు కెవ్వరు నేఁడు పిలువరై రెట్లొకో యని పరివ్రాట్టింక నగడుపడఁడు.
ఎవ్వ రేపని చెప్ప రెట్లీదినంబు గడచునో కో యంచుఁ బ్రికృతులు మిడుకఁబోరు.
తులసిపూజను శ్రద్ధమై సలిపిరేని హరి హరించును రాకుండ నన్నివెతలు. ౧౬౫

కం॥ బహురసపరిభావితవిగ్రహుఁడయి హరి యొకఁడె యెల్లతన్మజములందున్
విహిమించుచుండు. నాతనిమహిమంబును బొగడఁదరమె మతిశాలురకున్. ౧౬౬

కం॥ స్మరియింపఁబడిరె నిరతం బురుదుఃఖాదికము లంత మొందించెడి యిం
దిరయును తులసీనామకతరువరమునఁ దిరముగాను దా వసియించెన్. ౧౬౭

—* బిల్వోత్పత్తి *—

ఆ॥ బిల్వపత్రిమహత్త్వంబు వేనికేని జెప్పశక్యంబుగానిది యెప్పటికిని.
నిన్నుగురించి యున్నదియున్నయట్టు లేను వచియింతు నాలింపు మింద్ర! యిఁకను!

తే॥ గట్లరాయనిపట్టి యొక్కపుడు విహారమాచరించి శ్రమంపడి యాస్యఫలక
మున జనించిన చెమ్మటబొట్టొకండు భూతలంబునఁ బడవైచి పోవుటయును

ఆ॥ మలలమిన్నయైన మందగమందు మొల్చినది యొక్కమ్రాను చెలువుగలిగి.
వెంటి యొకప్డు డటకు విహరించుటకునుగా నరిగి గిరికుమారి యచటనచట

కం॥ తిరుగుచు నామ్రానుఁగని కర మాశ్చర్యంబువొంది కడుఁ బ్రేమసులై
పరఁగెడి జయకును విజయకు ధరణీజాతంబుఁజూపి తగ నిట్లనియెన్. ౧౭౧

ఆ॥ "దివ్యమగుచు నడవి దీపించు నియ్యది యేమిచెట్టొ కాని యెఱుఁగఁబడదు.
కరము సుందరంబుగానుండి యెంతయు సంతసంబుగొలిపె సకియలార !" ౮౨౨

చం॥ అనియిటులుచ్చరించుటయు నందు జయాఖ్యసఖీవతంస మి
ట్లనియెను. "దేవి ! తావకముఖాబ్జగళచ్ఛ్రమవారిబిందుసం
జనితమ యీమహీజ. మఘసంక్షయకారి. సమర్చనీయ. మి
య్యనుపమమైనవృక్షమున కాఖ్య విధింపుము నీవు చెచ్చెరన్" ౮౨౩

మ॥ అనియిబ్భంగివచించుడున్ గిరిజ "యోయబ్జాక్షి ! యీవృక్ష ము
ర్వీని భేదించి సముద్గతంబు. కనుకన్ బిల్వాఖ్య మిద్దానికిన్
జనుఁ. దత్పత్రము లాహరింప దొరయా. శ్రద్ధాయుతం బస్మద
ర్చనముంజేసినఁ గోరుకోర్కె యెదియున్ సంసిద్ధిగాంచుంజుమీ. ౮౨౪

ఉత్సాహము॥ బిల్వపత్రములనుజూచి ప్రీతి వానితోడ నన్
గొల్వఁదలఁచుమాత్ర ధనము గురియుచుండు వారికిన్.
చెల్వ మమరియున్న దాని చిగురు మెసవనెంచినన్
నిల్వ వఘసహస్రములును నిశ్చయముగఁ బ్రజలకున్. ౮౨౫

క॥ తల మారేడుదళాగ్రంబులతో నెవ్వాఁడు కలితముం జేసెడినో
బలువైన యామ్యయాతనవలని వెతలు కుడువఁబోఁడు వాఁడిఁక నెప్డున్" ౮౨౬.

కం॥ అనిపలికి పార్వతీదేవి నిజావాసంబుఁజేరె వేడుకతోడన్
వెను వెంట జయయు విజయయుఁ జనుదేర గణాన్వితముగ జంభవిభేది !

సీ॥ తన్మూలముననుండుఁ దగ గిరిజాదేవి. దాక్షాయణీదేవి దానిబోదె.
తచ్ఛాఖలను మను దాను మహేశ్వరి పార్వతీదేవి తత్పత్రములను.
గాయల నలరారుఁ గాత్యాయనీదేవి. పట్టు గౌరీదేవి భాసిలెడిని.
మధ్యవల్కలమున మఱియు నపర్ణయుఁ బుష్పంబులను దుర్గ పొలుపుగాంచు.
ఒప్పుశాఖాంగకంబుల నుమ క్రమముగఁ. బ్రాణిరక్షణపొంటె యుదారణిమయాక్ష
కాళ్ళు నవకోటిశక్తులు కంటకములఁ.గాన బిల్వంబు శ్రేష్ఠంబు కలుషహరము.

తే॥ పావనంబగు మారేడుపత్రములను జగముతల్లికిఁ బూజలు సల్పిరేని
ఏదికోరిన నయ్యదియెల్ల రూఢి నపుడ సిద్ధింపఁగలదు సహస్రనయన ! ౮౨౭

తే॥ అమ్మహేశ్వరి మోక్షదాయక విశుద్ధరూప గిరిజ పలాశభూరుహముఁజేరి
మనెడిశంకరు నీక్షించి తనదులీల నయ్యె శ్రీఫలరూప యేమందునింక॥ ౮౨౮

## —* పార్వతి విష్ణువును శపించుట. *—

మ॥ అని యిబ్భంగి వచించి స్పష్టముగ నయ్యాకాశవాక్కఁగ నిం
ద్రునితోఁగూడి సమస్తదేవతలుఁ జాతుర్మాస్యరాఁ దచ్చతు

ర్ఘనవృక్షంబుల కైక్యభావమున నర్ఘ్యంబిచ్చి పూజించి. రే
మనివాఱుత్రిత్తును దన్మహావ్రతము శూద్రా! నీకు నే నియ్యెడన్. ౮౮౦

క౦॥ చాతుర్మాస్యము ముగియుడు దైతేయద్వేషణులకు దర్శనమిడి సం
ప్రీతిని హరిహరదేవుఁడు కాతరులైయున్న వారిఁగని యిట్లనియెన్. ౮౮౧

క౦॥ "మీ రిఁకఁ జనుఁడు మహావ్రతధారుల! దైత్యాసు లఖిలదానవులను నే
మారిమసంగెద. మీయధికారములను ననుభవింపఁగఁడఁగుఁడు ప్రీతిన్." ౮౮౨

ఆ॥ అని యిటుల్వచించి యట నేకరూపులు నరిహరులును నైన హరిహరులు గ
ణంబులకును దిద్దివనాథులకును భేదబుద్ధి తొలఁగఁజేసి పుచ్చుటయును. ౮౮౩

క౦॥ ఆ తెఱఁగంట్లు విమానవ్రాతము పై నరిగి భేదవాదంబులు వో
ధూతాసురకృతబాధత స్వాతంత్ర్యంబునువహించి సౌఖ్యంపడుచున్. ౮౮౪

తే॥ పార్వతీశాపమున నైన భయముతోడఁ దన్మహేశ్వరి బిల్వపత్రములతోడ
బిట్టుపూజించి నుతిసేయఁ బ్రీతయగుచు నెంతయుం గృప నాదేవి యిట్టులనియె.

తే॥ "నాదుశాపంబు వ్యర్థంబుగా దయినను మీరు శిలలయియుందురు మేదిని. దివి
నొనవ దది పూలనమ్మినయూరలోనఁ గట్టెలమ్మినచందంబు గాకయుండ.

మ॥ నరలోకంబున రాతివిగ్రహముల నార్చించు చెల్లప్పుడున్
గన మర్చించెడివారికిన్ వరదులై ఖ్యాతిన్ సమార్జింతు రం
దఱుఁ బాణిగ్రహణంబునన్ విహితులౌ తత్తత్కుమారాళికిన్
సురలారా! ప్రజలొచుతిన్ లెద రచ్చోటం గుమార్యాళికిన్." ౮౮౭

మ॥ అని యిబ్భంగి ననుగ్రహించుటయు సర్వామర్త్యులుం దద్భయం
బున నష్టాత్మత భక్తవాంఛితములం బూరించుకొం చర్చలన్
సని. రింకం గసిదీర కంబిక రమానాథున్ స్వనాథుం గనుం
గొని పెల్చన్ స్ఫురితాధరోష్ఠయగుచుం గోపంబుతో నిట్లనున్. ౮౮౮

స్రగ్విణి॥ "రమేశా! నీవైనం దగదిదియనన్ రాదె శివుతో.
కుమారస్తం డై తా హేతువున శిలవై యుందుదు వికన్.
తమిస్రారాట్పూర్చుముండును నుపలహాధాత్ర్యమరశా
పమే లింగాకారంబగుటకయి పూర్వంబ మనుతున్." ౮౮౯

తే॥ అనినవిని విష్ణుభగవానుఁడమ్మహేశిఁ బార్వతీదేవి ననుకూలపఱచుకొనుచు
క్షోణితలమున నెన్నోస లోన్నక మ్రొక్కి యెంతయును స్తోత్రపూర్వకమిట్టులనియె.

సీ॥ "సతతము మహాదేవు సఖివై మహావ్రతదీక్షఁ బూనిన మహాదేవి వీవు.
సత్త్వరజోగుణసంస్థాయినివియైన సత్త్వతామసీశక్తి వీవు.
మాతృత్రయంబున మహితవై యుండెడి ఘనగుణత్రయవిభావినివి నీవు.
అఖిలజగద్వ్యాపకాద్భుతరూపవౌ మాయాదికంబుల మాతవీవు.

సర్వరూపవగుచు జనులకు సంతిచ్చు రూపసాధ్యవౌ నరూపవీవు.
ఆగమముల మాట నభినుతమైన యోంకారమీవు కావె కరితుభగీశ ! ౨౯౧
తే॥ లీల ఫలవేళ్వలో మహాకాళివియును లలి సరస్వతివియు మహాలక్ష్మివియును
నీవయాదు. వమట్కారమీవె. మతియు రాగిణివినీవయాను. విరాగిణివియు.
ఆ॥ భూతధాత్రి ! నీవుజోత. శుభా ! నీవునతి. విరాగిణీ ! ప్రణామమిదిగో.
శివ ! జోహారునీకు. చేకొనవికరాళి ! మత్కృతంబులౌ నమస్కృతులను ” ౨౯౩
కే॥ అనియిట్లు స్తుతించుటయును మనమున సంతోషమొంది మహిభృత్సుత్రా
త్రినుభవ పరమోదారంబును మిథ్యారోపసహితమును నగు నుడులన్.
౨౯౪
ఆ॥ “ నాదుశాప మోజనార్దన ! తిరుగదు నీయెడలనుగూడ నిశ్చవంబు.
ఉర్వినైన నీవు యోగీశ్వరులకుఁ గైవల్యదాయివగుచు వతిఁ లెదవు. ౨౯౫
కే॥ భక్తులకోరుకులొసఁగుచు వ్యక్తుఁడవయియే వసింతు వైకుంఠా ! యీ
ఉక్తార్థంబునఁ బావకశక్తి మతింతయాయియుండుఁ జాతుర్మాస్యన్ ౨౯౬
సీ॥ అంభోజసంభవు నసఁఖంగొమాత్రయై జనియించె నేయమ జగములోన
ఏయమ యగ్గలం బింపైనరాఘుల సారంబునుండి తా నేరుపడియె
స్వపయఃప్రవాహానుస్నాతుల కేయమ శ్రేయఃప్రదాత్రియై చెలువుగాంచు
తరుగని మధురపాథస్సులతోనిండి యేయమ రహిఁ బ్రవహించుచుండు
అట్టిగండకినది స్వచ్ఛమైననీట నయ్యెడిని నీనివాస మిం కియ్యకొనుము.
ప్రీతి నిరువదినాలుగుభేదములను గాంచుచుండు ప్రుగాణజ్ఞు లెంచినిన్ను. ౨౯౭
సీ॥ బంగార మాస్యంబునం గల్గి బుధులచే నవని సాలగ్రామ మనఁగఁబడెదు.
తేజంపుముద్దవై దీప్తివహించుచు వర్తులాకృతితోడ వతిఁలెదవు.
సర్వసామర్థ్యంబు సంగతంబైయుండ శ్రీసమేతుండవై చెలఁగఁగలవు.
ఉత్తమోత్తములైన యోగులకుంగూడ మోక్షప్రదాతవై మురియఁగలవు.
వేయిమాటలేల విష్ణూ ! శిలాగతుండైనయట్టి నీ కనూనభక్తి
సేవఁజేయుజనులు చింతించినదియెల్ల నొసఁగఁగలవు కరుణ నుర్వినీవు.
కే॥ శిలయందలరారెడి నినుఁ దులసీదళములను భక్తితోఁ బూజింపం
గలయట్టిమనుజులకు దవ్వులనుండదు మోక్షలక్ష్మి బూచులగొంగా ! ౨౯౯
కే॥ చక్రాంకితసర్వాంగ మవక్రంబును నైనశిలను వతిఁలు నిను నో
చక్రి ! సందర్శించిన యాకూరుఁడుగూడఁ జనఁడు యమునింటికిఁకన్ ” ౩౦౦
కే॥ అనివార్భుచ్చెను నుమ. యీయనువున. భగవానుఁడైన హరి యుపలత్వం
బెనసినవాఁడు. వచించితి ఘనసాలగ్రామమునకుఁ గల కారణమున్. ౩౦౧
కే॥ గోవిందుండు మహాశాపావృతుఁడై చనియెఁ దనదు నాలయమునకున్.
గౌరీవాత్మజాతయు మహాదేవుని శపియించి ప్రీణతిఁ దృప్తియుఁ బెట్టెన్.
తే॥ అట్లు భవభూతభవ్యభూతాదికృత్తు నఖిలసంస్థితినాశంబుఁ దవ్విధుండె.
కమలతోఁగూడి యతఁడును గౌరిఁగూడి శంకరుండును నాల్గువృక్షముల మనిరి.

## —♦ వృక్షమాహాత్మ్యము ♦—

తే॥ అనుడు శూద్రుఁ డిట్టులనియెఁ. "చాతుర్మాస్యమునను సర్వవృక్షములను దేవ
తలు వసించుటయును దద్వృక్షరూపులై యలరుచుండుటయు మహాద్భుతంబు.
క॥ భగవానుఁడ! యేసుర లేనగముల నివసింతురో వినం గోరినవాఁ
డఁ. గరుణయుంచి సవిస్తరముగ వక్కాణింపు" మనుడు మునియిట్లనియెన్. ౧౦౫
ఆ॥ "అమృతమందుఁ జలము ననఘ! చాతుర్మాస్య వేళ వృక్షరూప మెనసిసురలు
నానిఁ దాఁగుచుండ్రు. తత్పానమున మహాతృప్తియగును జూమ్ము దేవతలకు. ౧౦౬
సీ॥ ఎంతటిబలవంతు నేని యుద్ధంబునం దోటమింపఁగఁ జేయు నురుబలంబు
బలము పెంపొందింపఁగలిగి దుష్ప్రేక్ష్యమై యలరారునట్టి తేజోతిశయము
తేజంబునకు నుంత తీసిపోవనిభంగిఁ గడు రుచిరంబైన యొడలికాంతి
కాంతికిం దగినట్లు కనుముక్కు మొదలైన సకలావయవముల సౌష్ఠవంబు
వాని కన్నిటికిని వన్నె వెట్టెడి లఘువిక్రమంబు గలుగు సక్రమముగ.
తృష్ణదీర్పఁదగిన కృష్ణాంశసంభవపానమునను జేసి పైజవనుఁడ! ౧౦౭
క॥ నిత్యామృతపానంబున సత్యముగం గలుగుతృప్తి స్వల్పంబ యగున్.
నిత్యముఁ జేయఁగఁబడు తత్కృత్యంబును భోజనముగఁ గీర్తింతురు బుధుల్. ౧౦౮
ఉ॥ కావున నాల్గుమాసములఁ గ్రాలుచుఁ జెట్ల జగద్ధితంబుకై
దేవతలుం బిపాసఁ దమిదీరఁగ నీరమె త్రావుచుండ్రు. త
త్సేవన మెప్డుచేసినను శ్రేష్ఠమె. శౌరి పరుండఁ జేయు సం
సేవ మతిన్ విశేష. మటు సేవితమై తరు విచ్చు సౌఖ్యమున్. ౧౦౯
తే॥ నువ్వులును నీళ్ళుఁ బోసి యనోకహములఁ దడుపుచో నవి బహుకామదంబులగును.
క్షీరభూరుహములకు సక్షీరసలిలసేచనంబు శుభప్రద మోచతుర్థ! ౧౧౦
మ॥ తొలి నేఁజెప్పిన నాల్గుమాసములను చాతుర్మాస్యయం దెంతయున్
ఫలదంబుల్. వటమాశ్రయించి యజుఁడున్ గౌరప్రసూనాఢ్యమై
వెలయంగాంచు తిలంబునందు మని సావిత్రీమహాదేవియున్
వెలుచం బ్రాణుల కిచ్చుచుండ్రు వరము ల్ప్రేమించి శూద్రాపతీ! ౧౧౧
సీ॥ అత్యంతపారిశుధ్యముగల్గినవి తిలల్. ధర్మార్థములకు సాధనము తిలలు.
నిర్వాణహర్మ్యంపు నిశ్శ్రేణికలు తిలల్. కల్మషపరిహారకములు తిలలు.
ప్రచురమైనట్టి సత్ఫలమిచ్చునవి తిలల్. బలువైరులనుదోల్చు నాలులు తిలలు.
అఖిలపుణ్యంబుల నాదిమంబులు తిలల్. హరిహాయా ద్యమరధాన్యములు తిలలు.

కాన దానంబు లన్నింటిలోనఁగూడ నుర్విఁ దిలదానమత్యంత ముత్తమంబు.
హరిపరుండ విశేషించి యర్చనీయ మా తిలదుగ్రివు స్వశ్రేయసార్థిచేత. ౯౧౨

తే॥ హోమసంయుక్తముగఁ దిల లిచ్చునెడల బ్రహ్మహత్యాదులుం బటాపంచలగును.
సర్వకార్యార్థములకును సాధనములు తిలలు. సావిత్రినాఁ బ్రోక్తములు ధరిత్రి.

ఆ॥ తిలలతోడ స్వపితృదేవతలకుఁ దర్పణంబు చేయనగు జనంబు నిత్య.
మంతకంటెఁగూడ నల్లచాతుర్మాస్యమున విశేషముగను బొనరుచునది. ౯౧౪

సీ॥ తిలలతో హవనంబు సలుపఁగాఁగలిగిన శ్రేయం బమేయమై చెలువుగాంచు.
తిలపాదపమున కంజలిసేసి కొలిచినఁ బున్నెంబు కొంగునందున్న హొన్ను.
తిలవినిర్మిత భక్ష్యముల నారగించిన ధర్మంబునకు నౌను దావలంబు.
తిలపిష్టమున మేన నలుగిడుకొనియును సుకృతంబు నార్జించుఁజూ జనంబు.
శ్రద్ధఁ జేయు తిలల సంస్పర్శనమునను నగును వృషసనాథ మఖిలలోక.
మేలచాలఁ దిలసమీక్షణకృత్యంబు వృజినహరము పుణ్యవృద్ధికరము. ౯౧౫

క॥ చాతుర్మాస్యం గృతమగు నేత త్తిలసేవనమున నిలఁగల మనుజ
వ్రాతము ప్రీతిం గర మనుభూతాఖిలసౌఖ్యమగునుబో వైజవనా! ౯౧౬

ఉ॥ భూతహితంబుపొంటె యవభూరుహ మాశ్రిత మింద్రుచేతఁ ద
త్ఖ్యాతయవార్చ స్పర్శనము దర్శనముల్ సుకృతాప్తి కర్హమా
హేతువులౌచు వర్తిల్లెడి. నీయవలం బితృతర్పణంబు సం
ప్రీతి నొనర్పఁగాఁబడినఁ బేరిమి నయ్యది యక్షయంబగున్. ౯౧౭

సీ॥ సహకారవృక్షంబు రహిఁ బ్రజాపతులును మలయంబు గంధర్వకులపతులును
అగరును గణనాథుఁ డంబుధు ల్ప్రిబ్బలి యక్షులు పున్నాగవృక్షరాజ
మతిమధురాగమం బంబుజబాణుండు నాగకేసరమును నాగరాజు
లగ్ని రక్తాంజన మనిలుండు పూగంబు సిద్ధు లూడుగుఁ దాండ్రిచెట్టు యముఁడు
పనస గుహ్యకులును బదరిని రుద్రుండు గుహ్యకేశ్వరుండు కొండగోఁగు
వకుళ మస్త్రిపుండు వరుణుండు ఖర్జూరి నాశ్రయించియుంద్రు హరి పరుండ.

సీ॥ వసువులు మోరటి వర్తించుచుందురు. మెఱుము లశోకంబుమీఁద మనెడు.
అశ్వను లుమ్మెత్తయందున వసియింతుర్రి. గుగ్గులం బసురులకున్ నివాస.
మెలమి విశ్వేదేవతలు మధూకంబుపై విహరింతు రిదెమాకు విడిదియనుచు.
దాసనమ్రానిపై వాసంబుగావింతు రాదిత్యు లెల్లప్పు డాస్థతోడ.

కిన్నరు ల్మరీచ మున్నతతాళంబుఁ జామరావృతంబు సప్తఋషులు
అంబుదంబులెల్ల జంబూమహీరుహం బనుసరించియుండు రవరజాగ్ర్య! ౯-౧౯

క॥ జంబూద్వీపు వర్ణమునం దంబుజనాభునకుఁ దుల్య. మటుగానఁ దదీ
యంబులగు ఫలము లొసఁగి ద్విజుం బూజించినఁ జతుర్భుజుఁడు తృప్తిపడున్.

క॥ జంబూవృక్షముక్రింద ఘనంబుగ భూసురుల భోజనము చేయింపన్
పండిన వేడుకఁ బురుషార్థంబులు నాలుగును శార్ఙ్గిధరా దయసేయున్. ౯-౨౦

మ॥ చాతుర్మాస్య సభార్యులైన ద్విజులన్ శౌచాన్వితంబై జనం
బేతద్భూజముక్రింద భోజనము చేయింపన్ బలిధ్వంసి సం
ప్రీతుండౌఁ బురుషుండు నేరెడును లక్ష్మీనాథు ప్రీత్యర్థ మ
స్వీతార్థాంగిత వస్త్రభూషితముఁ గావింపం గృతార్థుండగున్. ౯-౨౧

తే॥ రాత్రిలనుమాటనే యెది ప్రాప్తనుగునో యెది వటాశోకభవమున నేరుపడునో
ఆఫలంబును నేరెడు నందె నొనరిపించు ద్విజభోజనంబునఁ గాంచు జనము.

ఉ॥ నేరెడుచెట్టుక్రింద నవనీసురులన్ భుజియింపఁజేయునాఁ
డారసి యేకభుక్తము సమాచరితవ్యము. వేయునేల. త
ద్భూరుహపూజనంబునను బుత్రులఁ బౌత్రుల నర్థజాతముం
గూరి జనంబు దేనఁ బ్రతికూలములేక వసింపఁగల్గెడిన్. ౯-౨౩

సీ॥ స్త్రీక్రియమాణంబు జిల్లేడు సూర్యచేతఁ బ్రపత్రికమునఁ జంద్రముఁడు మనెడి.
అంగారకునిచేత నాశ్రితం బల చండ్రి యుత్తరేణిని బుధుం డుండుచుండు.
రావి బృహస్పతి త్రావసించినవాఁడు. శుక్రుండు మేడిచెట్టాక్రమించె.
జమ్మి శనైశ్చరు సంతతావాసంబు. రాహుకేతులవి దూర్వయును దర్భ.
అతిపవిత్రి దూర్వ. పితృతర్పణోచిత. యచ్యుతునకు దయిత యన్వహంబు.
అంతకును విశేష. మల్ల చాతుర్మాస్య. దానిగరిమ నుడువ వేనివశము. ౯-౨౪

ఆ॥ పావనములలోనఁ బావనం బెయ్యది మంగళముల నేది మంగళంబు
ఏదిలేక పూర్తిగానియదు శుభకార్య మట్టిదర్భ యగు మహాఫలదము. ౯-౨౫

తే॥ యాజ్ఞికంబైన యెద్దాన నజహరీశు లాదిమధ్యాంతములను దా మధివసింత్రో
ముక్తికాముల కెయ్యది మోక్షరూప మట్టి దర్భద్రుమాఖ్యయు హాయినిడెడి.

గీ॥ కడమచెట్లఁ దక్కఁగలవేల్పులెల్లరు మనుదు రెలమి నాల్గుమాసములను
తీఁగెలను వసింత్రు దేవతాసతులును గొలుచుపరిజలు కోరు కోర్కులిడుచు.

తే॥ కాన సర్వాత్మభావనతో నరుండు సర్వవృక్షంబులను మఱి సర్వలతల
నను దినమును విశేషించి హరిపరుండు తత్ఱిని సేవింప జగమెల్లఁ దనియుఁ దాన.

సీ॥ వేదవర్జితముకంటె వృక్షసేవన మెంతయుని యలక్ష్యము సేయఁజనదు వణిజ-
ఆలుబిడ్డలమీఁది యతిమోహమునఁబడి తరుసత్త్రయోఁగమి తగదు గృహికి
మునినైతినని సదా మునుమూసికొని పితృపూర్చన విడఁగూడ దవనిమనికి
సన్యసించినవాని కన్యమేలయటంచుఁ జెట్ల నుపేక్షింపఁజెల్లదు యతి.
ఎల్లవారుగూడ నల్లచాతుర్మాస్య వానిపూజ సేయవలసినదియె.
పూజితంబులైన భూజంబు లపవర్గదాయకంబులగును దప్పకుండ. గా ౨౯

ఆ॥ సప్తతంతుముఖర సద్ధేతువును వినా నటకఁగూడ దొక్కనగముఁగూడ.
ముందె నటకఁగూడ దండుఁ జాతుర్మాస్య. నింతకన్నఁ జెప్ప నేమిగలదు. గా ౩౦

తే॥ ఏది ప్రశ్నించినాఁడవో యిపుడు నన్ను నెట్లు వేల్పులు దేవత్వ మెనసినారొ
అద్దియంతయు నీకు నే నానుపూర్వముగను వాక్రుచ్చినాఁడను సుగుణసూత!

సీ॥ హరికి నివాసమై యంహోనిరాసమై రమణీయభాసమౌ రావియొకటి
విధికి నికాయమై విస్తృతచ్ఛాయమై మహనీయమై పొల్చు మఱ్ఱియొకటి
సమశైత్యకారియై సకలరుగ్ఘారియై విశ్వోపకారియౌ వేమునొకటి
భక్షణీయపలాశఫలపుష్పసహితమై విహితమౌ తింత్రిణీవృక్షదశక
మటు కపిత్థ శ్రీఫలామలకానోకహములు మూఁడుఁ. జూడ యముని జూడ.
రఖిలపూజ్యుఁడైన హరి పూజితుండైన నఖిలజగమునరును నగును దృప్తి. గా ౩౨

—— శంకరుఁడు పార్వతిని బతిమాలుట. ——

తే॥ తాదృశుండైన కృష్ణుఁ డాధారముగను గృష్ణమధ్యాగ్రియులు నంగ జిష్ణుముఖ్యాద
సకలదానవరిపులును సకలపాదపముల శేయనింతు" రనుటయుఁ బైజవనుఁడనా.

ఆ॥ "ఎవ్వఁడలుగ లోకమెల్లను క్షోభించు నట్టిశివునిపైనె యలిగి కాళి
శాపమిచ్చి యెటు ప్రసాదంబువడసెను మగుడ మగనివలన మానిచంద్రి! గా ౩౪

క॥ భగవానుండగురుద్రుం డగజయగు స్వభార్యయిచ్చు నా శాపం బె
ట్లుగ్రహించె? వికృతరూపుండగు తా దివ్యాంగ మేక్రియను ధరియించెన్?"

క॥ అనవుడు గాలవుఁడిట్లను. "ననిమిషు లంబికకు జడిసి యాత్మీయములౌ
ఘనరూపంబు లదృశ్యము పొనరిచి ప్రతిమలను మనిరి భూలోకమునన్. గా ౩౬

ఆ॥ విష్ణువినుతయగుచు విశ్వసవిత్రి యంహోనిహంత్రియైన యుమ ప్రసన్న
యయ్యె వేల్పులకును. నావేలుపుల బలాత్కృతిని భవుఁడు శాప మెనయవలసె.

ఉ॥ శాపనియంత్రితుండయిన శంకరుచే బతిమాలఁ బడ్డడై
ఆపయి నాపై యిట్టులను. "నస్మదనుగ్రహంబొంది యీసురల్
లోపములేక యెందునను లోకులచేతను బూజ్యమానులై
పాపమువాపి వారికి శుభప్రదులౌదు. రిఁకేమి కావలెన్. ౯౩౯
ఆ॥ పెండ్లిపీఁటమీఁదఁ బెక్కండ్రముందఱ నాదుకరము పట్టినావు నీవు.
సప్తమండలములుఁ జనినావు నాతోడఁ. జేసినాఁడ వెవరుఁజేయని పని. ౯౪౦
సీ॥ నేలిమియరుగుపై విధ్యుక్తముగఁ బ్రతిష్ఠింపంగఁ బడినట్టి సెగలతోఁడు
పాలి కాముఖర సత్పాత్రిస్థపానీయ మాశ్రయించి వసించు నప్పతియును
భువనము లవుడునాల్గుఁ బూర్తిగా వ్యాపించి యలరారుచుండెడి యంబుజాక్షుఁ
డాత్మవల్లభలతో నన్వితులై యుండు దేవతలును మహీదేవతలును
దిక్చతుష్టయమున దీపించుచుండంగ నింతమందియెదుట నెంతయును స
భాస్థలంబునందు బాసలుగావించి యెట్లు వ్యభిచరించి తివు చెప్పుము. ౯౪౧
క॥ గురువులుగూడ జనౌఘముకరణి నసన్మార్గమందుఁ గాల్వెట్టెదరే
నెఱిఁగి ప్రబుద్ధులు నిగ్రహపరులగునదియనుచు శ్రుతులు పలుకుటలేదే. ౯౪౨
సీ॥ జనుఁడసన్మార్గసంచారియైనచోఁ గోడుకేని శాసింపఁగఁగవచ్చు.
గురువు దుష్పథమునఁ గ్రిమ్మఱఁ దొడఁగుచో శిష్యుఁడుం బట్టి శిక్షింపవచ్చు.
బ్రాహ్మణు లర్వించి పైని వీక్షించుచో భూపతి దండింపఁబూనవచ్చు.
పతి మంచిచెడ్డలఁ బరికింపకున్నచోఁ బత్ని శపింపఁ బాల్పడఁగవచ్చు.
నీచుచేతనేని నిగ్రాహ్యుఁ డెంతటిదండివాఁడుగూడఁ దప్పనడవ
ననివచించు వేద. మపథుం డపూజ్యుండు. సుపథుఁడగును బూజ్యుఁ డెపుడుఁబుడమి.
ఆ॥ ఎవఁడు స్వకులధర్మ మెంతయు విడనాడు వాఁడు పతితశబ్దవాచ్యుఁడగుచు
మరణమొందువెనుక నరకంబునం గూలి దుఃఖభాగమునను దూలుచుండు. ౯౪౪
తే॥ వేఁడు నాస్తిక్యమున జ్ఞాతిభేదమొనసి ధర్మసంత్యాగమొనరించి తాఁ జరించు
వాని మనుధర్మగతులగువారలెల్ల నిగ్రహింపంగవలయును నిశ్చయముగ. ౯౪౫
ఆ॥ వర్ణధర్మములును వంశంపుధర్మముల్ దేశధర్మములును నెశనుండు
వదలిపెట్టు వాఁడు వర్ణచ్యుతుండౌచుఁ బతితుఁడని వచింపఁబడెడిఁ బుడమి. ౯౪౬
సీ॥ గార్హస్థ్యసిద్ధికి ఘనకారణంబౌచుఁ బరఁగుచుండినయట్టి పావకునియు
ఆర్యు లనుష్ఠించు నామ్నాయచోదిత స్వస్వవర్ణాశ్రమాచారములయు
ఇది యిట్లుకావింతు నేనని మును రూఢి వాక్రుచ్చియుండిన వచనములయు
పుణ్యప్రదములంచుఁ బూనికమైఁ బట్టి వరుసఁ గావించెడి వ్రతములయును

త్యాగము జేయఁగూడదు తథ్యముగను. వీని త్యాగంబుసేసినవాని జనులు
తాము త్యాగంబుసేతురు తప్పకుండఁ. బతితుఁడని చెప్పఁబడును దద్భ్రష్టుఁ డింక.

సీ॥ భువనము ల్పదునాల్గు పొరలించిచూచినం గానంగఁబడఁడు నీ కన్నతండ్రి.
తల్లి యుదంత మంతకుమున్న యెవరికి శ్రవణంబులకును గోచరము కాదు.
అన్నదమ్ములునైన నగుపడ రెచటను సరిపోల్చుకొనియైన సంతసింప.
మావాఁ డితండంచు మాటయైన వచింపఁ డెవఁడును వచ్చి నీ యెట్టయెదుట.
ఏవిధంబైన నీవార్త యెఱుఁగఁబడదు. విసము తిం. దస్థిమాలను వేసికొందు.
పూసికొందు చితాభస్మమును దనువున. మనసుకొలుపదు నిను ముట్టుకొనుటకేని.

సీ॥ కంపుగొట్టెడి పచ్చిగజచర్మముం గట్టి తలనిండఁ బెంజడ ల్దాల్చినావు.
అణుమాత్రమైన మర్యాద యెఱుంగవు. గడెకొక్కనుడి నోట నుడువుచుందు.
వింటింటికింబోయి యెత్తెదు బికిరంబు. సద్వ్రతంబన్న నీచాయ సున్న.
పరికింప మిగుల నబ్రహ్మణ్యుఁడవు నీవు. కపటివి. దుష్టసంకల్పుఁడవును.
ఈదృశుఁడవగు నీతోడ నించుకయును గూడి సంభాషణము చేయఁగూడ దసగు.
మింక నామ్రోల నుండుటకేని తగ" వటంచుఁ గన్నీళ్ళు కాల్వలై యవనిఁ బాఱ.

ఆ॥ ప్రమథనాయకుండు బతిమాలుచున్నను వెక్కివెక్కి యేడ్చి వీడ కలుక
నమ్మహేశుచేష్ట లాక్షేపముంజేయు చివముపలకొమార్తె యిట్టులనియె. ౨౧౦

తే॥ "నీదుహృదయంబులోపల నిశ్చయముగ నార్జవములేదు. కాఠిన్య మూర్జితంబు.
భూసురుల యాసురుల నుడు ల్పల్లులనుచుఁ దోఁచె నాపయి నీచూపు దుష్టమతిని.

తే॥ వారలెల్లరు వంచింపఁబడినవారు వరుస నీచేతఁ. గావున వారిచేత
నీవు బాధింపఁబడె" దంచు నిల్లుపలికె గౌరి యుఱకుండుటయుఁ గాలకంధరుండు.

తే॥ నీతిమయ హేతుమద్వాక్యనిచయమునను సదుపచారంబులను సుప్రసన్నవదనఁ
జేసి మెల్లమెల్లగాను దచ్ఛైలపర్వతేశ్వరాత్మజ దువ్వుచు నిట్టులనియె. ౨౧౩

తే॥ "నిండుజాబిల్లి కీడైన నీముఖంబు నేల కలుషంబుఁజేసెదవే శుభాంగి!
తగదు నీకిది. సర్వభూతములమీఁదఁ గరుణఁజూపింపవలె హితకాంక్షతోడ. ౨౧౪

తే॥ ఎదియొ యొకకార్య మత్యంత మిష్టమగును గాక. పరపీడనము సేయఁ గడఁగఁజనదు.
భువనమంతయు నీకగుఁ బుత్రితుల్య. మఖిలభాగ్యవు నీవయా దఖిలరూప! ౨౧౫

తే॥ నేను దెఱగంట్లహితముకై నింద్యకర్మ మాచరించితి. నైనను నాత్మజుండు
గలుగునీ. కాప్రకారంబు గాకపోయినను ద్వదిష్టము పూరించెదను వచింపు. ౨౧౬

తే॥ నాకు నందటికంటెఁ బ్రాణములకంటెఁ గూడ నెక్కువదానవు చూడ నీవు.
అగ్గలంబు ప్రసన్నవై యాజ్ఞయిమ్ము చారుముఖి! నీదుకోరిక ల్సత్వరముగ"

ఆ॥ అనుడు దేవి యిట్టులనియెఁ. "చాతుర్మాస్య బ్రహ్మచర్యమంతుఁ బట్టఁజేసి
తగ మహావ్రతంబు ధరియింతువేని నే సుప్రసన్నవగుదుచూ మహేశ! ౯౫౮

క॥ వేలుపుల సమక్షంబున హేలం దాండవము సేసెదేని నైష్ణవమై
కాలు త్వదధాంగము నీఁజాలెదవేని గ్రమ్మఱింతు శాపము శంభూ! ౯౫౯

క॥ నను సంతసపెట్టుట కీయనువున వర్తించునెడల నగుదుఁ బ్రసన్నా
నన. నట్లుకానిఁబోఁడిక నిను నమ్మదు నాదుమనసు నిశ్చయముగ" నాఁగ. ౯౬౦

క॥ భగవానుఁడు ప్రీతుండై యగుఁగాకని బదులుచెప్పె. హర్షాన్వితయై
భగవతియు శాపమోక్షము తగుగతిఁ గావించెనపుడు దాసా!" యనుడున్

—— శివుని తాండవవర్ణనము. ——

తే॥ శూద్రుఁడిట్లను. "నాగయాచో నుడువుటయందు నీవు మహాక్లేశ మొందుచుంటి
కాని నీవాక్కు లాశ్చర్యకారకంబు. లెంతవిన్నను దృప్తికాదేమొకాని. ౯౬౧

క॥ అస్మదదృష్టంబున నాకస్మికముగ వచ్చినావు. గౌరీకథలన్
సస్మితవదనంబునఁ గడు విస్మయముగఁ జెప్పినావు విద్వదధీశా! ౯౬౩

సీ॥ బ్రహ్మాద్యమ్ముఖులతోడఁ బరివృతుండై మహేశ్వరుఁ డెట్లు నృత్యంబు సల్పినాఁడు?
ఎబ్బంగినైనది యేమి చాతుర్మాస్య? నేవ్రతం బపుడు గ్రహింపఁదగిన?
దుగ్రమైఁ బొడమిన నాగ్రహం బంతయు హిమవదద్రికుమారి కెట్లుపోయె?
క్రమ్మఱ నేవిధిఁ గలిగె ననుగ్రహం? బది కింవిధంబైనయది తలంప?
ఈయెడఁబడిన యెల్లప్రశ్నములకు దయను విస్తరించి తగినయుత్త
రము వచింపుమయ్య యమివరా! నీకన్నఁ బూజ్యకథకు లిలను బూజ్యమగుట"

క॥ అనవిని గాలవముని "యోగానఘా! యయుతాధ్వరముల నగునట్టిఫలం
బును గలుగఁజేయు నేత త్కథనము నితిహాసము విను కాంతు వచింతున్ ౯౬౫

క॥ చాతుర్మాస్యంబున శివుఁ డాతతమగు భక్తి మందరాహార్యమునన్
ఖ్యాతుఁడయి బ్రహ్మచర్యముఁ బ్రీతిం బూని వసియింప వేలుపులెల్లన్ ౯౬౬

ఆ॥ అరిగి యెరఁగి మోలి నానతకాయులై నిల్వఁబడుడు నట్టినిర్జరాళి
కద్రిజాభిహితము నంతయు వాక్రుచ్చి యింక నొక్కమాట యిట్టులనియె. ౯౬౭

క॥ "నాచేత నియుక్తంబగు ప్రాచీనాభినయమందు బాసటయగుచున్
మీచాతురి చూపింపుం డీచాతుర్మాస్యమునను నిందాద్యమరుల్!" ౯౬౮

ఆ॥ అనివచించి యంత నాషాఢశుక్లచతుర్దశిని భవానితృప్తిపొంటె
తాండవింపఁదొడఁగెఁ దన్మందరాచలశిఖరమందుఁ జంద్రశేఖరుండు. ౯౬౯

సీ॥ అంగిరో నారద వ్యాస దేవల శుక కర్దమ గౌతమ కశ్యపులును
క్రతు భృగు భార్గవరామ మరీచి వసిష్ఠ పులోమ ప్రచేతసులును
జమదగ్నియును బులస్త్యమునీశ పులహులు నత్తముఁడు నగస్త్యయోగి యత్రి

చారణ సిద్ధ యక్ష పిశాచ గుహ్యకాదిత్య సాధ్యాశ్విన దేవతలును
వసువు లింద్ర విష్ణు వాణీశముఖులును నందితురగు నర్తనంబుఁ జూచు
కోర్కి నచటి కపుడు గుంపులుగుంపులుగాను వచ్చి. రేమిగలదు చెప్ప. ౯౨౦
క॥ పదపడి నంది ప్రభృతులు పెదపెదముత్యములు నగలు పీతాంబరముల్
కొదలేకయుండ నొసఁగిరి ముదితస్వాంతమున నచటి మునిముఖ్యులకున్. ౯౨౧
తే॥ అంత వాద్యసహస్రంబు లగుచునుండ జయజయారావ మందఱు సలుపుచుండ
తాండవమ్మును బొనరించె ఖండపరశు. వీక్షణము సేసెఁ బార్వతి వ్యాప్తయగుచు.
క॥ జయ విజయ మంగళారుణ జయంతియను పేళ్ళఁ జెలఁగు సఖు లలరుచున్
స్మయమానవదనపంకజ యయి రాజిలె నద్రిజాత యనవరజ ! వింటే. ౯౨౩
క॥ ఏయమ కాయజమగు ద్యుతి ధీయుతులకుఁగూడ సంస్తుతింప నశక్యం
బాయమ సన్నిధి మనుట ధృతాయుతగుణమయి తనర్చె నఖిలజగంబున్. ౯౨౪
క॥ నానావక్త్రగణౌఘముచే నీక్షితుఁడయి పిశాచశేఖరవృతుఁడై
ఆ నీలకంఠుఁడయ్యెడఁ దా నెంతయు శోభగలిగి తనరెను దాసా ! ౯౨౫
క॥ బంగరుబెత్తము దాలిచి ముంగల నందియును గిరిశముఖుఁడును మని. రం
కం గంధర్వప్రభృతు లెసంగిరి చిత్తరువులోని సత్ప్రతిమలునాన్. ౯౨౬
తే॥ మాతఁడములుగాని శ్రీరాగముఖర తత్కుమారు లాకరొక్క దాగ్గురు మానవతులఁ
గలసి లీలాశరీరసంకలితులగుచు నేగుదెంచిరి పిత స్మరియించుమాత్ర. ౯౨౭
క॥ శ్రీరాగం బీశ్వరునకు నారూఢిగఁ బ్రథమతోక. మతిమోహాకరం.
బౌరాగ మాత్మదాయకమై రహి భ్రూమధ్యమునను నలరారెఁజూ. ౯౨౮
క॥ రెండవసంతు వసంతము. ఖండేందుధరుండు స్వీయకంఠగతంబై
యుండెడి విశుద్ధిచక్రమునుండి తదాత్మజు సృజించె నో పైజవనా ! ౯౨౯
ఆ॥ శివునిహృదయమందుఁ జెలఁగు ననాహతమనఁగఁబడెడి చక్ర. మచట విశ్వ
భూషణుఁడు తృతీయపుత్రుండు జనియించెఁ బంచమాఖ్యు నడలు వఁబడుచుఁగాడము.
క॥ నాసాదేశభవంబై భాసిలు భైరవము చాల భైరవమయి త.
న్నాసము. మణిపూరమునకు వాసము. తచ్చక్రమిచ్చు వడి మోదంబున్. ౯౩౧
క॥ పదిరెండు రాసులును నేఁబదివర్ణంబులును భములు స్వాధిష్ఠానో
దిదితంబులయి క్షణములో వెదఁజల్లినమాదిరిగఁ బ్రవృద్ధంబగుదున్. ౯౩౨
క॥ రేతస్సు ప్రవర్తిలె. నా రేతస్సుననుండి జగము సృష్టఁబయ్యెన్.
భూతేశోత్పత్తీంద్రియ మా తత రేతస్సె కాదె యంఘ్రిప్రభవా ! ౯౩౩
క॥ ఆఱవకుమారుఁడై నటనారాయణుఁ డుద్భవించె నత్యధికుం డా
ధారమున నీలుఁ. డతఁడు పురారికి వల్లభుఁడు. హరిపరాక్రముఁ డెన్నన్. ౯౩౪

కం॥ వారల నారులు ముప్పదియారుగురు పినాకి యుత్తమాంగంబునయం
దేరుపడినవారలు-విను మారాగప్రియుల పేరు లభివర్ణింతుఁ జ. ౯౮౫

కం॥ గౌరయుఁ గోలాహలియును గౌరియు ద్రావిడియు దేవగాంధారియు నిం
కారీతి మాళకౌశికి శ్రీరాగంబునకు ననుఁగుఁజెలియలు శూద్రా! ౯౮౬

తే॥ చరమమంజరియును గండగిరియు రామగిరియు నాందోళయును గౌశికియును దేవ
శాఖయును గూర్మిసతులు వసంతునకును బైజవననామ సచ్ఛాద్రి! పరమభద్రి!

ఆ॥ స్తంభతీర్థ త్రిగుణ సమవేరి వైరాటి కుంకుమయు నహింస కూర్చినట్టి
భార్యలుగను జెప్పఁబడిరిమా పంచమసంజ్ఞ రాగమునకు సచ్చతుర్థ! ౯౮౮

ఆ॥ భాష రక్తహంస భైరవి కర్ణాటకులును వేలగులియు గుర్జరియును
భైరవాఖ్యరాగపత్నులునాఁ జేరుకొనఁగఁబడిరి పైజవనసమాఖ్య! ౯౮౯

తే॥ మధుర కామోద బంగాలి మతియు నక్షినారికాఖ్యయు దేవాళిపేరిటిదియు
దేవగిరియును మేఘాఖ్యమై విలసిలు రాగమున కర్థదేహ లోహాగుణాఢ్య!

కం॥ వరియును దుంబియుఁ దోడిటకి మతియును మల్హారి సింధుమల్హారియునుఁ జ
వరుసగ నటనారాయణు గరితెలు మోడకియుఁ దోడుగా నాయగుదుఁ జ. ౯౯౦

కం॥ వీరందఱును బనివిని గౌరికి గౌరీశునకును గైమోడ్చి యటఁ జ
గూరిమి మగలంగూడి సచారుతనూవాహనముగ సంస్థితులగుదుఁ జ ౯౯౧

సీ॥ మద్దెలవాయించి మఱి చతురశ్రవాద్యంబువాయించి వనజభవుఁడు
తాళంబుగొట్టె మాధవుఁడు పిల్లనగ్రోవి సుస్వరంబుగనూఁది సురవిభుండు
పూర్వరవంబును నేర్పుతోడనుసల్పె యగ్ని పణవమొత్తె యశ్వినులును
ఘటవాదనముచేసి గణము లుపాంగవాద్యంబొనరించి చంద్రముఁడు రవియు
శృంగనాదమున భుజంగమవసువులు కనకశృంగనాదమునను సిద్ధు
లట్టు లెవరిచేతనైన యయ్యయివాద్యములను సురలు వార్ష జలధిఁ దేల్ప!

సీ॥ జెడలన్నియును విప్పి యొడలంతటంగూడఁ బరిశుభ్రమైనట్టి భస్మములఁది
పంచశీర్షములందు ఫణినిబద్ధంబులై డాలుడీల్కొను కిరీటములు పెట్టి
ఉరుహారములఁ గరం బొరయునట్లుగఁ దొడ్గి పదిచేతులం బది బాహుపురుల
భానుకోటిసమప్రభముఁ ద్రిలోకవ్యాపకమునౌ మహానటకాయమునను
పార్వతియును మునులభార్యలు మునులును నున్నతాసనముల నుండిచూడ
సప్తసుస్వరముల సకలగంధర్వులుం బాడ నాడెఁ గొండమైని శివుఁడు. ౯౯౨

కం॥ వారపాదతలాహతమై పురకాననసహితమైన భూచక్రముతో
గిరియును గిరగిరఁదిరిగెను నురునాదముచేసికొనుచు నోపైజవనా! ౯౯౩

క॥ ఎనుబదినాలుగుకరములు మునుసృష్టములయ్యె నపుడు పురహరుచేతన్-
ఘనసూతవందిమాగధజన మానవఘర్మవారి జననముగాంచెన్. ౯౯౬

ఆ॥ విశ్వగాత్రులైన వివిధగంధర్వులు భవునెడందనుండి ప్రభవమంది
ఈక్షకులకు ఋషుల కెంతయు నబ్రంబుగలుగఁజేసి. రేమిగలదుచెప్ప. ౯౯౭

క॥ కిన్నరు లత్యంతంబగు నన్నుల వర్ణంబుగురియ నటు న్వాల్గినెలల్
తన్నీలగ్రీవునిచేఁ జెన్నుగఁ దాండవము వరుసఁ జేయంబడుడున్ ౯౯౮

తే॥ నిర్మలాకాశశోభిత నీరజాతపిహిత కాసారముఖ ఫలవృక్షముల ర
వంతపాండుముఖచ్ఛవియగు శరత్తు చనియెఁ- గార్తికసితచతుర్దశియు వచ్చె- ౯౯౯

క॥ అపుడు మహానటుఁడెంతయు నిపుణతఁజూపుచు సమాప్తనిజనటనుఁడు కాఁ
గృపఁజూచి వికచసుందరలపనాంబుజయై యపర్ణ లలి నిట్లనియెన్. ౧౦౦౦

ఆ॥ "త్రిప్పరానియట్టి ద్విజశాపమునఁజేసి యెపుడు నీదులింగ మిలను బడునో
అపుడు నర్మదాపయఃపునర్జన్మమై విశ్వపూజ్యమగుచు వెలయు నద్ది. ౧౦౦౧

సీ॥ దేవదేవా! మహాదేవ! జగద్ధాత! శివశంకరా! నమస్కృతులునీకు.
బ్రహ్మణ్యదేవ! కపర్ది! నీలగ్రీవ! బ్రహ్మగర్భ! శుభ్ర! ప్రణతినీకు.
సితభూతిధర! పశుపతి! సవితా! సహస్రాక్ష! మహేశ! జోహారునీకు.
కృత్తివాస! హిరణ్యరేత! హరా! భవ! మూర్తభావన! కేలుమోడ్పునీకు.
కృష్ణ! శర్వ! పురుష! యీశాన! పంచాస్య! సూక్ష్మ! ధర్మ! భావ! జోతనీకు.
గణపతీ! కపాలి! గంగాధరా! గురూ! పూషదంతభంగ! మొగుపునీకు! ౧౦౦౨

సీ॥ రూప! నీరూప! విరూపాక్ష! భగలోచన! నిపాతి! గుణి! వందనంబునీకు-
భస్మజననకారి! బ్రహ్మరూప! మహాస్వరూప! యోగాచార్య! మ్రొక్కునీకు.
వైరాగ్యరూప! భవానీప్రియంకర! కాలచక్రి! చెంగనాలునీకు.
జగతీమహానందసంధాయకా! మహాపురుషపూజ్యా! చిన్నిపూవునీకు.
వామదేవ! విప్రవహ్నిముఖాగ్రి! యుగ్రా! యఘోర! చక్రి! యంధకాసు
రాపవర్గదాయకా! గుణాతీత! యీశ్వర! మృడా! నమస్సులిడుదునీకు. ౧౦౦౩

సీ॥ రచియింతునతి యమూర్తబ్రహ్మరూప! నీ. కాచరింతుఁ బురాంతకా! ప్రణామము.
మొనరింతునీకు సద్యోజాత! గిడిగిడి. చేతు మృగవ్యాధ! జేజె భక్తి.
కావింతుఁ జాగిలి ఘనయజ్ఞవిధ్వంస! మరలింతు శాపంబు మన్మథహర!
ప్రణుతింతువిశ్వేశ! బహువిధములను నిన్. క్షమియింపు మత్కృతాగంబు దేవ!"
అని స్తుతించుటయును నమరయుతంబుగా పార్ష్ణపూర్ణుఁడును సమాప్తతాండ
వవ్రతుండునగుచుఁ బైజవనా! భవుం డివముమలకొమార్తె కిట్టు లనియె. ౧౦౦౪

# న వ మా శ్వా స ము.

కం॥ "ఎవఁడేతత్త్వత్కృత మచ్ స్తవనంబును భక్తితోడఁ దాఁ జదువునో యో
యవనీధ్రతనయ! వానికి భువి నిష్టవియోగ మెపుడు పొసఁగదుచుమ్మీ. ౧౦౭

తే॥ పుత్రకలత్రాటు విత్తపరిపూర్ణుఁడగుచు నఖిలజాడ్యవివర్జితుండై యిహమున
నన్నివిధముల భోగంబు లనుభవించి పొందఁగలుగును దుదకు మత్పరము వాఁడు"

కం॥ అనియిట్లుపలికి యీశ్వరుఁ డనఘుంబును వైష్ణవంబు నగు వామాంగం
బును గాత్యాయని కొసఁగిన మనమున నుప్పొంగి యాకె మఱి గ్రహియించెన్.

సీ॥ ధృతకపాలకరంబు సితవర్ణ మంతటం గంఠార్ధమందున గరళయుతము
అభినవరుండమాలార్ధహారంబును బ్రహ్మాండకోటి కుత్పాదకంబు
ఉరుజటాభాసమానోత్తమాంగంబును గౌరశోభాకలాఖండరత్న
భాసావభాసితంబై సువర్ణాభరణాన్వితం బొకటు నహ్యాంగద మొక
టును సకృత్తివసనమును సదుకూలంబు నివల నవల నగుచు వృషభవాహ
నమును మత్స్యవాహనము నిరుప్రక్కలం గ్రాలఁ బొరిమదు లొకంటఁగలిగి

ఆ॥ ఒకటఁ జెలులతోడనొప్పెడిరూపంబుఁ జూచి బ్రహ్మఁదొట్టిసురవరేణ్యు
లలఘుభక్తి నట్టి యర్ధనారీశ్వరు నెంతయును స్తుతించు చిట్టులనిరి. ౧౦౯

సీ॥ "ఈవొక్కఁడవె జగంబెల్లెడ వ్యాపించి యఖిలదేహములందు నధివసింతు
జనకునివలె జీవసంరక్షకుండవు. జననివి. మఱి జీవసంజ్ఞకుఁడవు.
విశ్వసాక్షివి. మఱి విశ్వబీజంబవు. బ్రహ్మండముల వళపఱచికొందు.
జలరాశి నూర్ములచందంబునను మఱి పుష్కరంబులలోన బుగ్గలట్టు
లుద్భవించి నీదునొడల బ్రహ్మండమ్ము లడఁగు నీదునంగమంద మరల.
నొకొకప్డు నీదు నేత్రంబునుండియు ఫాలమందొకప్డు ప్రభవమగుదు. ౧౧౦

ఆ॥ ఇంకొకప్డు నీవు హిమవత్కుమారియుం బొందుసేసినప్డు పుట్టి జగము
సృష్టిసేయుచుందు. శివ! నీదునాజ్ఞ యందుందు మెపుడు సురల మందఱమును.

ఆ॥ అగు దనంతుఁడవు ననంతనై భవుఁడవు. నఖిలభంగమునకు నద్భుతంపు
రూపుదాల్తు దేవ! యోపరమేశి! నీ వశివములఁ బవిత్ర మాచరింతు. ౧౧౨

కం॥ శివములు నిచ్చుచునుందువు. భవానిరో! తపమ్ములకును ఫలమగుదువునీ.
వెవఁడు శివుఁడో హరివాఁ డెవఁడాహరి వాఁడె శివుఁడు. నిది నిజమనుచున్

ఆ॥ ఇట్లభేదబుద్ధి యించుకగలిగి యుష్మత్ప్రసాదమునను మాకు జనని!
దృష్టమును శ్రుతమగు త్రిజగముల్ లోపల బయల వ్యాప్తమగుచుఁ బరఁగెదీవు.

తే॥ భువనపూజ్యా! సురేశని! భువనవంద్య! యంబ! దేవేశి! దేవ! సాష్టాంగముగను
మ్రొక్కుచున్నార మందఱమును ననుగ్రహింపుఁ" డనిపల్కి చనిరి యథేచ్ఛ సురలు

కం॥ భవసింధుపోత మతుల మ్మరువు నేతద్దివ్యరూప మాత్మను జింతిం
ప విముక్తసంగమయి వైజవనా! బ్రహ్మమునఁగలయు జగ మేమందున్. ౧౧౬

## — లక్ష్మీనారాయణ మహిమము —

ఆ॥ ఈప్రకారముగను హిమవత్కుమారిక యిడిన శాపమునను నెల్లసురలు
సంతుపడయలేక సంతతం బెంతయు వంత ననుభవింపవలసె నార! ౧౦౧౭

క॥ సాలగ్రామము గండకి నాలీల మహేశలింగ మగు నర్మద. సు
శ్రీలలితములై స్వయముగఁ గ్రాలు నకృత్రిమములగుచు క్షమనవి రెండున్.

క॥ ఇరువదినాలుగువిధముల వరసాలగ్రామశిలల వర్తిల్లెడి శ్రీ
ధరుని బరీక్షింపఁగనగు. హరలింగం బేకరూపమయియే యుండున్. ౧౦౧౯

క॥ సాలగ్రామజనుస్థలమై లలివహియించునట్టి యాగండకి కీ
లాలము గోత్రిలియు నాడియు నోలిం బ్రహ్మ బ్రహ్మపదము నొందు ధ్రువముగన్.

తే॥ గండకీసంభవంబౌచుఁ గ్రాలునట్టి యాశిలను విధివత్తుగా నర్చితంబుఁ
జేసినట్టేడు యోగసంసిద్ధిపడసి శుద్ధ మానసుఁడగును సచ్ఛాద్రివర్య! ౧౦౨౧

క॥ ఎది నీవడిగినవాఁడవో యది యుదితమునీ. కీకన్ మహాదేవున కే
విధమున బ్రాహ్మణశాపం బొదవెనొ వచియింతు విను మహో పైజవనా!

క॥ హరతాండవసంబంధము ధరజాదేహార్ధవర్ణితంబును వాణీ
వర నుతియుతమును నగు నీవరకథ విని బరమగతిని బడసెదరు జనుల్. ౧౦౨౩

క॥ శ్లోకమొ శ్లోకార్ధంబో శ్లోకచతుర్థాంశమో విలుప్తవిరోధం
బై కౌటిల్యము మానము లేక పఠింప సుగతి యవలీల లభించున్. ౧౦౨౪

క॥ చాతుర్మాస్యంబున నే యేతత్కథ విన్నఁ జదువ నిల ధనపుత్రా
న్వితంబై జన మెంతయుఁ జేతశ్చింతితపదార్థసిద్ధిని బడయున్. ౧౦౨౫

తే॥ ఎట్లు బ్రహ్మాదిదేవత లెల్లఁ గూడి యర్ధనారీనటేశ్వరు నంతికమున
గీతవాద్యాభియోగంపుఁ గృతి నవాప్తసిద్ధులై రట్లు పైప్రజ సిద్ధినొందు.

ఆ॥ వానకాలములోన వాసుదేవమహేశ్వరాంబికల గుతించి యధికమైన
భక్తియోగ మాత్మపరిశుద్ధిమైఁ జేయు నరుఁడు కాఁడికన్ స్తనంధయుండు. ౧౦౨౭

క॥ గణపతిపూజ్యుఁడు. నారాయణుఁడు పరున్నప్పుడైన. నంతకుఁబూజ్యం
డణిమాదిసిద్ధులొదవెడు నణఁకువతోఁ జేయఁబడిన యాతనిపూజన్. ౧౦౨౯

ఆ॥ భాస్కరుం డొసంగు బహుళతరారోగ్య మర్చ్యమానుఁడగుచు నధికభక్తి.
అధికఫలదుఁడగును నతఁడు చాతుర్మాస్యఁ బూజ్యమానుఁడగుచు భూజనులకు.

క॥ ఏతత్పంచాయతనము ప్రీతిం బూజ్యంబు గృహికిఁ బేర్మిమెయిం ద
చ్చాతుర్మాస్యం బూజ్యము. చేతశ్చింతితము దాన సిద్ధించు వెసన్. ౧౦౩౦

సీ॥ అర్చితంబై యెది యఘములం బోకార్చి యర్చితంబుగఁజేయు నఖిలజగము
వినుతింపఁబడి యెది విలయితకలుషమై వినుతంబులం జల్పు విష్టపముల
చదువంగఁబడుచు యత్సంబంధిపద్యము ల్పంకంబు నవలకుం బాఱఁదోలు
ధ్యానింపఁబడి యెది మానసంబునఁబుట్టు వృజినంబులన్నింటి వెడలనడఁచు
అహరహమ్ముగూడ నట్టి సాలగ్రామఁ బరఁగు హరిని ద్వారవతిని గలిపి
కొలువ ముగితిగలుగు. నలఘుచాతుర్మాస్య దర్శనంబె మోక్షదాయకంబు.

కం॥ సాలగ్రామగహరికిం జాల నివేదింపఁబడిన శాల్యన్నంబుల్
మేలగు నభిషేకోదక మాలలి సేవింప నింక నడుగఁగవలెనే. ౧౦౩౨

ఆ॥ అగ్గలంపుభక్తి నల్ల సాలగ్రామశిలకు నర్పణంబు సేయఁబడిన
తిలలు బహుపవిత్రు సలుపుఁ-జాతుర్మాస్య నంతకును విశేష మవరజాగ్రి !

తే॥ వాఁడు లక్ష్మీసమేతుండు వసుధ నెపుడు-వాఁడు ధనధాన్యసహితుండు-వాఁడు భాగ్య
వర్ధ్గ్రహంబుల జనియించు-వాని శ్రీసనాథవిష్ణునిగా నెఱుంగవలెఁజుమ్ము. ౧౦౩౪

కం॥ సాలగ్రామస్థిత వనమాలిం బూజించువాని మందిరమందున్
శ్రీలక్ష్మి సుస్థిరంబుగ హాళిని వసియించు శూద్రిజా ! యేమందున్. ౧౦౩౫

తే॥ ఎంతవఱకచ్యుతుఁడు యజింపఁబడఁడో యంతవఱకె దరిద్రిత యవనిఁ బ్రజకు.
అంతదాఁకనె గర్జించు నఘచయంబు-నంతదాఁకనె క్లేశంబు లంగమందు. ౧౦౩౬

కం॥ ఆ గరుడధ్వజుఁ డెచ్చట బాగుగఁ బూజింపఁబడునొ పంచక్రోశం
బౌఁ గడుఁ బావన-మచ్చటి కేగఁగలే వశుభము లిఁక నేమనవలయున్. ౧౦౩౭

ఆ॥ అదె మహాతపంబు-నదియె మహాభాగ్య మదియె మోక్ష మెచట నాద్యుఁడగుచు
లలినహించునట్టి లక్ష్మీశు పూజనం బాచరింపఁబడునొ యలఘుభక్తి. ౧౦౩౮

సీ॥ ఏయింటిలోపల నెంతయు రాణమై వర్తించు దక్షిణావర్తశంఖ
మేమందిరంబున నెపుడును సుస్థిరంబగు లక్ష్మీనారాయణాత్మకంబు
ఏయగారంబునఁ గృష్ణసారంబగు తులసీమహీజంబు లలివహించు
ఏభవనంబున శోభాయమానమై ద్వారవతీశిల గూరియుండు
అచట శ్రీయు విజయంబు హరియు ముక్తి యుండుశ్రీలక్ష్మీనారాయణుండుతను య
జించువానికిఁ బుణ్యంబు నించు.వాఁడు క్షణంబున ముక్తుఁడౌఁ దప్పకుండ.

కం॥ చాతుర్మాస్యను లక్ష్మసన్వీతముగ మతింత యర్చనీయుండు హరి-యా
పీతాంబరధరు ధ్యానము పాతకహరమగుఁ గరంబు వైజవన ! వెసన్. ౧౦౪౦

కం॥ తులసీమంజరులను హరి నలచాతుర్మాస్యమున సమర్పించెడివా
రలు మరలం బుట్టరు-శ్రీఫలదళములఁ బూజసేయఁ బాపము లడఁగున్. ౧౦౪౧
ఆ॥ జగదధీశుఁడగుచు జగమెల్ల వ్యాపించి యెవఁడు సృష్టిలయము లెపుడుఁ జేయు
యత్నపూర్వకముగ నవ్వాఁడె సేవ్యుండు. కుంద దింక వానిఁబొందు జనము.

—♦ రామనామమంత్రమంత్రమహిమము. ♦—

సీ॥ వీరబాహుండును వీరభద్రుండును వీరసేనుండును భృంగిరాజు
రుచి తుటి నందీశ్వరుఁడు పుష్పదంతుండు కంటక విఘట వికంటకులును
మాలాధరోత్కటుల్ మణి హార కేశులు పాశధరుండు విభద్రుఁడును
నరసుండు శృంగియు నరక పుణ్యోత్కటుల్ కణప మహాభద్ర కాలపులును
కాల ధనప భద్రిక ధనద రక్తలోచన విరోచనులు వృషహానువుఁడును
పారద వికటాఖ్య పంచశీర్ష ధ్వాంక్షి సింహవక్త్ర దీర్ఘజిహ్వాముఖులు ౧౦౪౩
కం॥ తుండియు హంసక్రియును బ్రచండుండు మహోద్భుతుండు శాలిగ్రాహా
ఖ్యుండు త్రిశీర్షుఁడు మొదలగు దండిగణములు తిగకోట్లు తన సవిధమునన్
ఆ॥ భద్రకాళిఁగూడి "రుద్ర! జయజయ." యంచుచ్చరవము సేయుచుండ నొక్క
కాలమందు శివుఁడు కైలాసశిఖరమం దగజతోడఁ బరమమైన శ్రీని ౧౦౪౫
కం॥ భూతప్రేతపిశాచము లేతెంచి సమీపమునను నెంతయు నతి సం
ప్రీతుని జేయఁగ నుండుడుఁ దోతెంచె వసంతమటుకు ద్రివులు రహింపన్ ౧౦౪౬
సీ॥ క్రొత్తమొగ్గలతోడ సత్తతిఁ జెట్లు కరంబు ప్రకాశమానంబులయ్యె.
మందమందంబుగా మలయానిలము వీచెఁ. గవిచయంబునకయ్యెఁ గడుసుఖంబు
పుష్పించి కింశుకభూమీరుహముల్ వియోగిమానసముల నూపఁ దొడఁగె.
కామవికారసంక్రాంతంబులై బిట్టు ద్వంద్వముల్ క్రీడింపఁ దారసిల్లె.
అట్టి గాఢసమయమందు మనంబు లున్మాదయుతములగుట మదిఁ దలంచి
దండధారియగుచు దండను వసియించు నందికిం బినాకి నయనసంజ్ఞ ౧౦౪౭
క॥ సలిపిన నపు డాతఁడు "చాపలదోషము చాలుఁ జాలుఁ, బనివిని యికమీ
రలు తపముసలుపుఁడీ గణము లనుటయుఁ దపంబువారు మొదలిడి రంతన్.
ఆ॥ అపుడు విశ్వజననియైన భవాని "యీయక్షమాల నీదుహస్తమందు
సతముఁ గానఁబడెడు శంకరా! యేమిజపింతొ చెపుమ, కలిగె సంశయంబు.
సీ॥ నీవొకండవె కాదె నిఖిలభూతములకు నాదిముఁడవు సకలాధిపతివి.
జననియుం జనకుఁడుం గనబడఁ డెట నీకుఁ. బుట్టుంబులేనియుఁ జూడఁబడరు.

హరి యియ్యదియంచు సరిగ నేరు నెఱుంగ. రేనును నెఱుఁగ నీ కితరముండు.
టురుకష్టమున విడ్చు చుచ్ఛ్వాసనిశ్వాసములు జపించెదు నిత్య మలఘు భక్తి.
లేదు నీకంటె నన్యంబు లేశమేని. యేది మది నీవు ధ్యానింతో యేమొ నీకు
నేను ప్రాణప్రియనె యైనయెడల నాకు నుడువు మది దేవ! యని గౌరి యొడలు పుడికి.

ఆ॥ అడుగ శంభుఁ డిట్టులను. "హరినామసహస్రసార మెపుడు ధ్యాయమాన.
మవ్యథమున సప్తమావతారంబగు రాము నామ మెపుడు రహిఁ జపింతు. ౧౦౫౧

ఆ॥ బ్రహ్మరూపమైన ద్వాదశాక్షరము సనాతనంబు నేను నగకుమారి!
అక్షమాలఁ బూని యన్వహంబు జపింతుఁ బద్మనాభుకరుణఁ బడయుపొంటె.

క॥ ఇరువదినాలుగువిధముల ధరణిం బ్రాదుర్భవించి తనరారెడి శ్రీ
హరి సద్గుణములు నిరతముఁ గరమర్థిని మనన సేతుఁ గాంతామణిరో! ౧౦౫౩

తే॥ తద్గుణంబుల సారంబుఁ దతఫలంబుఁ ద్వ్యక్షరంబును గాయత్రియాన్వితము స
బిందువును నగు ప్రణవంబు డెందమందు సతము ధ్యానించుచుందు నోచపలనయన!

ఆ॥ వేదసారమిద్ది. విష్టపాధారంబు. నిత్యమును. జడంబు నిర్మలంబు.
ద్వ్యక్షరంబు. శాంత. మమృతంబు. సదూప. మమృతతుల్యమును. నియామకంబు.

ఆ॥ దీనిఁ దెలిసికొనినఁ ద్రెళ్ళు సంసారబంధనము క్షణములోన జనములకును.
జనమునుండి కల్మషసహస్రములు వాయు. నిదియె పరమగుహ్య మేణనయన!

ఆ॥ ఇదె మహోమహస్సు ముదితరో! లోకమం దిదియె దుర్లభార్థ మెంచిచూడ.
ఇదె త్రిలోకములకు నెంతయుఁ భూషణం. బిదియె జన్మకోటి నొదవునదియు.

ఆ॥ ఇందుబింబముఖిరో! యీద్వాదశాక్షరచింతనంబె యను శ్రేష్ఠమైన
జ్ఞాన. మందుఁ గూడ సరిగఁ జాతుర్మాస్యఁ జేయ బ్రహ్మదంబు. చింతితదము.

క॥ ఈయక్షరజస్తోత్రముఁ బాయక యెల్లప్డు మదిని వాక్కునఁ గ్రియ నే
ధీయుక్తుఁ డాశ్రయించునొ యాయన యిఁకఁ బుట్టఁబోవఁ డవనీస్థలిలోన్.

తే॥ ద్వాదశాక్షరమహిమంబుఁ దప్పకుండ వర్ణనము సేయుటకుఁ జతుర్వదనునకును
కాదుశక్యము. వేనోళ్ళ కాద్రివేయపతికి సహిత మశక్య మిప్పలి తలంప. ౧౦౬౦

ఆ॥ జప్యమైనయట్టి సన్మంత్రమియ్యది. స్తుతము ధ్యాతమగుచు క్షోణి సర్వ
మానసములను నఘము మాపుఁ. జాతుర్మాస్యమున విశేష మింక ననఘచరిత!

ఆ॥ శ్రుతుల స్మృతిపురాణతతుల ననుసార మీద్వాదశాక్షరంబు తథ్యముగను.
చింతితార్థసిద్ధి చింతనమునన యశో. యాయుష్యపుణ్యదాన. మమృతదంబు.

ఆ॥ ప్రణవసహితమైన ద్వాదశాక్షరమును విప్రబాహుజాతవిశులు మువురు
జపము సేయ మోక్షసామ్రాజ్యమబ్బు. స్త్రీశూద్రులకును దగదుచూ ప్రణవము.

ఆ॥ ప్రకృతులందఱికిని ద్వాదశాక్షరమంత్రజపము పనికిరాదు సత్యముగను.
విప్రభక్తి దాన విష్ణుకీర్తన కాయశోషణములె వారి సుగతిఁజేర్చు. ౧౦౬౪

ఉ॥ వారికి రామనామమె యవశ్యము జప్యము కోట్యతీతవా.
ఆరయ రామరామయను ద్వ్యక్షరమంత్రము సర్వపాప సం
హారకమౌను. నిల్వఁబడి యధ్వగుఁడౌచు శయానుఁడయ్యు నీ
శ్రీరఘురామకీర్తనము చేసిన విష్ణుగణత్వ మొందెడిన్. ౧౦౬౫

తే॥ రామయనియెడి రెండక్షరములమంత్ర మగుసుబో మంత్రకోటిశతాధికంబు
ప్రకృతులందఱికిని నది పాపనాశకముగఁ జెప్పంగఁబడియెడి హిమగిరిభవ !

క॥ చాతుర్మాస్యనె యగుచో నేతచ్ఛ్రీరామమంత్ర మెంతయు ఫలదం.
బీతీరు మంత్రరాజము చాతుర్మాస్యను లభించు సద్భక్తులకున్ ౧౦౬౭

తే॥ రామనామముకంటె నీరసఁ బ్రశస్తమగుచుఁ బఠనీయమైనది యగుపడ దెట
రామనామాశ్రయులకు నో రాజముఖిరో ! యామ్యయాతన యుండ దేమనివచింతు.

తే॥ విగ్రహంబులు మృతకముల్ విష్ణుకరము లైన దోషంబు లన్నియు నగకుమారి!
రామనామంబుచేనె విరామమొందు. సల్ప కీవిషయంబునం గర్చయింక. ౧౦౬౯

ఉ॥ స్థావరజంగమాత్మమగు సర్వజగంబున నంతరాత్మమై
యేయెడయుఁన్ రమించుట నృగేక్షణ ! రాముఁడునాఁ బ్రకీర్తితుం.
డా వరరామమంత్ర మఖిలార్థనుసాధక. మెల్లజాడ్యముల్
పోవును దజ్జపంబునను. బూర్ణజయంబు రణోర్విఁ గల్గెడిన్. ౧౦౭౦

ఆ॥ అఖిలతీర్థఫలద మారామమంత్రంబు. కామదంబుకరము క్ష్మామరులకు.
రామచంద్రయనుచు రామయటంచు నుదాహరింత్ర దానిఁ దద్జ్ఞజనులు. ౧౦౭౧

ఉ॥ ద్వ్యక్షరరామమంత్రజపతత్పరుకార్యము సిద్ధిపొందు వా
మాక్షి ! గుణాకరంబయిన యమ్మనురాజము రాము సత్కటా
క్షేక్షణగోరి వేల్పులును నెంతయుభక్తి జపింత్రుగాన నీ
వీక్షణమాది తజ్జపము నెల్లపుడుం బొనరించుచుండుమా. ౧౦౭౨

ఆ॥ రామనామజపము రహిమైనొనర్చువాఁ డఖిలకల్మషములఁ దక్షుఁడగును.
రామనామమునసె నామసహస్రజంబైనయట్టి పుణ్య మబ్బఁగలదు. ౧౦౭౩

క॥ చాతుర్మాస్యనుబదిరె ల్లైతత్పుణ్యంబు మిగులు. హీనకులుల దా
పాతకమంతయు దగ్ధంబైతీరును దజ్జపమున నదీంద్రసుతా ! ౧౦౭౪

ఆ॥ అంతరాత్మయైన యారాముఁ డివ్విశ్వమెల్లనిండి తేజ మినుమడింప
క్షణములోనఁ బూర్వజన్మార్జిత స్థూలసూక్ష్మపాపములను నుక్కఁజేయు.

## —* ద్వాదశాక్షరమాహాత్మ్యము. *—

ఆ॥ అని వచింప "ద్వాదశాక్షరమాహాత్మ్యమును సవిస్తరముగ వినుచు మనఘ!
ఉన్న వర్ణములును నొదవెడి ఫలమును నేను దానిఁజేయనైన విధము." ౧౦౭౬
క॥ అని గౌరి యడుగ శివుఁ డిట్లనుఁ "బ్రణవముతోడ ద్వాదశాక్షరమంత్రం
బును విప్రబాహుజోరుజు లనుదినము జపింపవలయు నంబుజముఖిరో! ౧౦౭౭
తే॥ స్త్రీలు శూద్రులుఁ బ్రణవముఁజొలిపోక యది జపింపంగవలయుఁజూ సదమలాంగి!
ప్రణవమునువీడి ప్రకృతులుఁ రామనామమో వడక్షరమో జప మొనరుచునది.
చ॥ క్రమమిది సర్వవర్ణులకుఁ గంజదళాక్షి! జపంబునందునన్.
క్రమమునువీడిచేయ నరకప్రదుఁడౌ విభుఁ డల్కఁబూను" నా
నుమయను. "నేఁ దిరిమాత్రి మదినుంచి జపింతును శ్రీశుఁ. గాని వా
క్యములకుఁగూడ గోచరముగాని తదాకృతి యెట్లెఱుంగుదున్" ౧౦౭౯
సీ॥ అనియిట్టు లడుగుటయును "నమోభగవతే వాసుదేవాయ" యన్ భానురాక్ష
రంబులు జపియింపు మంబుజముఖి! సదా. స్త్రీలకుఁ బ్రణవంబు చెల్ల" దనుచు
శివుఁడుత్తరంబిడె. శివ యంత "సప్రణవంబైనయప్పుడే ద్వాదశాక్ష
రంబగు. నాకుఁ దత్ప్రణవమం దధికారమే యుండదంటివి. యెట్టులింక
ప్రణవమందు నేను బడయుదు నధికార" మనుడుఁ జంద్రచూడుఁ డఖిలదేవ
తలకు నాది ప్రణవ. మల త్రిమూర్తులు నందు సతులఁగూడి యుంద్రు సంతతమును
క॥ అం దఖిలభూతములు నింపొందఁగ భాగానుసార ముండును. మఱి యా
చందంబునఁ దీర్ఘంబులు నంద నసించెడిని. బ్రహ్మమది. మోక్షంబున్ ౧౦౮౧
ఆ॥ ఎపుడునీవు దేవి! యెలమిఁ జాతుర్మాస్య హరినిగూర్చి తపము నాచరింతో
అపుడు ప్రణవసహితజపమునుగావింప యోగ్యయగుదు. వేమియున్న దింక. ౧౦౮౨
క॥ తపమునఁ గోరికిదీరును. దపమునన మహాఫలంబు దా ఘటిలియించున్.
తపమున సర్వము నగుఁ. దత్తపమే సులభంబుగాదు ధాత్రిఁ ద్విజులన్. ౧౦౮౩
క॥ కీరితి సౌభాగ్యంబును నోరిమి నిజ మాదియైన యురుగుణనికరం
బేరుపడుఁ దపమువలనను. జారుముఖీ! తత్తపం బశక్యముచేయన్. ౧౦౮౪
క॥ ఎపుడు తపము వర్ధిల్లునో యపుడే హరిమీఁదిభక్తి యభివృద్ధంబౌ.
ఎపుడది లేక కృతంబగు నపుడు తపంబునకు హాని యారంభమగున్. ౧౦౮౫
ఆ॥ ఎంతవఱకు విష్ణు నెద సంస్మరించి జిహ్వాంచలము పవిత్ర మాచరింతో
అంతవఱకుఁ దపము లబల! గర్జిల్లెడి జనుల దేహములను సంతతంబు. ౧౦౮౬

తే॥ ఎట్లు దీపము వెలిగింప నెంతగాఢమైనచీఁకటియైనను నాశమందఁగలదొ
అట్లు శ్రీహరికథనుండి యఘచయంబు పంచబంగాళమైపోవుఁ బద్మనయన !
ఆ॥ కాన హరిపరుండఁబూని చాతుర్మాస్య శుద్ధహృదయుఁడగుచు శోభనాంగి !
ప్రణవసహితముగను బఠియింపు మంత్రరాజమైనయట్టి ద్వాదశాక్షరంబు. ౧౦౮౮
ఆ॥ ద్వాదశాక్షరాధిదైవతంబయిన యా మాధవుండె ప్రీతమానసుండయి
బ్రహ్మరూపమగుచుఁ బరఁగు నఖండితజ్ఞానమొసఁగఁగలఁడు మానవతిరో !"

—* పార్వతి తపస్సు చేయుట. *—

క॥ అనియిటు నారదుఁడిచ్చుటయును విని చాతుర్మాస్యయందు వెడలి యయ్యును హిమా
వనిధరశిఖరంబునకును జనియెఁ దపంబును జరింప దానవరేణ్యా ! ౧౦౯౦
సీ॥ అష్టవిధంబైన యా బ్రహ్మచర్యంబు కడునిష్ఠమైఁ జక్క నడపుకొనుచు
నసనత్రయంబు సువ్రతమంచు భావించి తనశరీరంబునం దాల్చుకొనుచు
బాల్యమాదిగ నెట్టి బాసనైవర్తించు మంచిగాథలనొద్ద నుంచుకొనుచు
క్షమ లోనుగాఁగల సకల సద్గుణములు వీడిపోకుండఁ గాపాడుకొనుచు
శంకరునిగుఱించి సలిపినతపమునం బోలె మేటియొడలు తూలిపోవ
అల త్రికాలములను హరిశంకరుంగూర్చి సలిపెఁ దపము సమునులకో మాత్ర.
సీ॥ ఏపె యోగీశ్వరధ్యేయమై నట్టిల్లు నేపె భువనవంద్యయై పరంగు
ఏపె యా జనయిత్రి యీ ప్రపంచమునకు నేపెయే ప్రకృతిస్వరూప తాను
ఏపె తటిత్కోటి కెన తనుకాంతియం జేపె గుణాతీత యేపె విరజ
యస్మదాదులు పృథివ్యప్తేజఆశుగాసంతముల్ యూద్వాప్తి మూర్తులజగను
ప్రకృతికంటెఁ గూడఁ బ్రాక్తనత యేపె స్వాహాదిరూపమునను జనుఁదృష్టి
దాత్రి యేపె యాపె తపము చాతుర్మాస్యమునఁ బొనర్చి శుద్ధనైనది సఫల !

—* మునులు శివుని శపించుట. *—

ఆ॥ అద్రిరాజతనుజ యా ప్రకారంబుగా నుగ్రతపము సేయుచుండుటయును
హరుఁడు మునులచేత నవమానితుండయి దేశదేశములను దిరుగఁదొడఁగె. ౧౦౯౩
సీ॥ కూరుచుండునుబోయి చారుధరాజము లుప్పొదఁగాఁబడ వానినీడలందు.
సుస్నాతుఁడగుఁబోయి శుద్ధజలంబులై తేజరిల్లెడి మేటితీర్థములను.
ఈఁదులాడునుబోయి యుద్దరి యద్దరిం దన్నిపాటెడి యేళ్ళమిన్నలందు.
ఎగిరి దూఁకునుబోయి యెంతయేని యగాధజలములై విలసిలు కొలఁకులందు.
తాప మపనయింపఁ దత్ప్రకారంబుగా బలుశ్రమములు పడియుఁ ఫలము లేక
అలల లలిఁజెలంగు యమునానదిం బడెఁ గడకుఁ బోయి గరళగళుఁడు పూద్రి !

చ॥ పడి యవగాహితుండగుచుఁ బై జనకా ! యిఁక నేమిచెప్పుదున్
మృడునిశరీరమందుఁగల మేటిస్మరాగ్నిని దహ్యమానమై
పడి మతిబుద్ధిపోలె రహింబాసి కరుంగరు నల్లనై కనం
బడియెఁ దదాపగాజలము. పాదములంబడియాక యంతటన్. ౧౯౫

తే॥ "కరుణ సేయుము దేవేశ ! నిరతమేను నీకు వశురాల" ననవుడు నీలకంఠుఁ
"డీసుతీర్థంబునకువచ్చి యేవుమాంసుఁ డాడుఁ దదఘసహస్రము లీడిపోవు. ౧౯౬

క॥ హారతీర్థమనఁగనియ్యది ధరణిని విఖ్యాతమగుచుఁ దతపుణ్యంబౌ
నరుగు" మటంచని యచటనె హరుఁ డంతర్ధానమొందె యటుతరువాతన్ ౧౯౭

సీ॥ వలరాజు కడువేడ్క వచ్చి వసించెనా నంగంబు కడు మనోహరముచేసి
తుమ్మెదతెక్కులం దులఁదూఁగు నెఱులచేఁ గుదిరించి సొగసుగాఁ గొండసిగను
పాలమీఁగడఁబోలు భసితంబుచేఁ ద్రిపుండ్రములు లలాటమం దమరదిద్ది
డమడమయనిమ్రోయు డమరుకంబును గేళ్ళ నెంతయు వింత వాయించుకొనుచు
మునులపల్లియలకుఁ జని యాడువాండ్రలో నాడి పాడి నవ్వి యాత్మచాప
లంబుఁ జూపుచుం దదంబుజముఖులను మోహసాగరమున ముంచివైచె. ౧౯౮

తే॥ పతుల శుశ్రూషయును నింటిపనులు మాని యుఁడె పతియను భావన నగ్గలంబు
సరససల్లాపములు ప్రీతి సల్పుకొనుచు వెంటఁబడి రమ్మునీంద్రుల వెలఁదులకట !

క॥ మును లా దుశ్శీలంబును గనుగొని కినుకనువహించి కరములఁ గఱ్ఱల్
గొని "యీ యనయుండెవ్వఁడో చననీకుక పట్టుకొనుఁడు చంపుఁ" డటంచున్.

క॥ వెనుదగులుటయుఁ బలాయన మొనరించెను విశ్వమంతయును జీవాంశం
బున నిండియుండు శంభుఁడు మునులకు భీతిల్లి యపుడు మ్రుచ్చువిధమునన్.

క॥ జేయుఁడు గ్రాహ్యుఁడు భేద్యుం డాయన గానుండుటయును నాగ్రహమున శా
పాయుధులందఱుఁ దోయిఁటఁ దోఁషములు గ్రహించి దృష్టిదోవీథిని బోన్.

క॥ "యల్లింగముకోఱకై మునిపల్లియలం జొచ్చి మ్రుచ్చపగిదిని దుష్టుం
డిల్లాండ్రను హరియించెనో తల్లింగము ద్రెళ్ళి యిపుడ ధరఁ బడుఁగాతన్" ౨౦౩

మ॥ అని వాక్రుచ్చుడు వజ్రరూపధరమౌ నా శాపవున్నిష్పా చ
ప్పున నాధూర్జటి లింగము స్ఖలికి యిబ్భూమిం బడన్ వైచె. నే
మనుదుం. దద్భగవానుఁ డంత రుధిరవ్యాప్తాంగుఁడై బిట్టు వే
దనకుం దాళఁగలేక మూర్ఛమునిఁగెం దా నేలపైఁ గూలుచున్. ౨౦౪

ఆ॥ అట్లు మూర్ఛపోయి యవనిపైఁ బడుటయు మునులు తత్సమీపమునకుఁ జనిరి.
అఖిలభూతములును నమరులున్ భీతిల్లి, రకట ! సంచలించె సకలజగము. ౨౦౫

చ॥ శివుఁడతఁ డంచెఱింగి ఋషిసింహులు మానసమందుఁ గుందుచుఁ
వినతత "దైవ మెద్ధు మహనీయమ. యెంతటిఘోరకార్యముఁ
దవిలియొనర్చినాము సుమనఃపరిపూజ్యుఁడు సర్వసాక్షియౌ
భవు భగవాను మూఢులము పాపులమై గురితింపలేకహా! ౧౧౦౬.

సీ॥ ఎవ్వనిదేహమం దీయెల్లలోకము ల్వర్తిల్లు నా జగత్స్వామి హరుఁడు
నిర్వికారుండును నిర్విషయుండును నిరుపద్రవుండును నిర్మముండు
నిస్పృహుండును మఱి నిరహంకృతియు నైన శంభుండు కరము నజ్ఞాలదుర్బ
లులమైన మాచేతఁ దెలియంగఁ బడఁడాయె" నది యమ్మహేశ్వరు నంతికమున
కూరుచుండుటయును వారలఁగని పునశ్శాపభీతిచేత సరవి నతఁడ
దృశ్యుఁడగుచుఁ బఱచి దివికి గోలోక సంస్థితను సురభి సరిగఁ జేరఁబోయి

సీ॥ "జగదుద్భవస్థితిసంహారములఁజేయు నంబ! కైకొనుము నా యంజలులను.
రసభావముల నెల్లరం దృప్తిపెట్టెడి తల్లి పట్టుము నాదుదండములను
రసవిద్ధణంబుచే వెస నెఱుంగఁగఁబడు మాత! గ్రహింపు మస్మన్నమస్సు.
బలమును స్నేహముం బ్రజకుఁ బ్రసాదించు నమ! తీసికొనుము నాయర్చనముల.
జననివీవు రుద్రసముదాయమంతకుం. బుత్రివీవు వసుసమూహమునకు.
అనుజవీవు ద్వాదశాదిత్యులకు. వాంఛితార్థదాత్రివగుదు వందఱికిని ౧౧౦౮

సీ॥ తావకపదములం దా వేదములు నాల్గు స్తనములలోనఁ దత్సాగరములు
రవియును శశియును భవదక్షియుగమున రోమంబులను సురస్తోమములును
శృంగద్వయంబున శిఖరి సమూహంబు శ్రవణద్వయంబున స్పర్శనములు
నాభిని నీయూవ మాభీలఖురములం దాతాళ్వములు మూపుపైని బ్రహ్మ
తల సదాశివుం డెదం గేశవుఁడు మలమునను బన్నగములు మూత్రమందు
సాధ్య లష్టులందు జన్నంబు లగ్రభాగమునఁ బితృగణంబు గ్రాలుచుఁపుడు.

ఆ॥ ఫాలమునను మఱి కపోలంబులను యక్షకిన్నరులును గలిగి యున్న నీవు
సర్వదేవమయివి సర్వభూతవివృద్ధికర్త్రివగుచు నుందు గాదె యెపుడు ౧౧౧౦

సీ॥ ధృతివి పుష్టివి నీవు బుద్ధివి స్వాహావు స్వధవును సిద్ధివి శ్రద్ధవగుదు.
లక్ష్మివి కీర్తివి లజ్జవు కాంతివి మతివియు మఱి మహామాయవగుదు.
సకలమహార్థసాధకవు. ముజ్జగములఁగూడఁ ద్వద్రహితంబు కొంచెముండ
దగ్నిభట్టారకుం డాదిగాఁగలయట్టి యమరాదులకుఁ దృప్తి యాచరింతు.
స్థావరంబును జంగమమై విలసిలు భువనమంతయు నీచేతఁబూరితంబు.
అఖిలలోకంబులకు హితవయిననీవ యస్మదంగంబునకు హితవగుము తల్లి! ౧౧౧౧

## —♦ శివుఁడు వృషభావతారమెత్తుట ♦—

క॥ దేవేశ! నమస్కారము గావింతును. నాదుపూజ గైకొను మనఘా!
ఈ విశ్వార్తి హరించెడి యావా! స్తుతియింతు వరదనగుమీ దయతోన్. ౧౧౧౬

తే॥ విప్రశాపాగ్నిదగ్ధమై విగతశోభమైన నామేను శోభనా! యమృతజాత!
తిరిగి నిల్పుము కరుణ నీతేజుచేత" ననుచు నాగోవు సెంతయు నభినుతించి. ౧౧౧౭

క॥ వలగొని భక్తియుతంబుగ లలినొప్పెడి దాని మేన లయమగుటయు నం
దుల కెంతో సంతసిలి యది యాలఘుతరాత్మయు గర్భమందు ధరించెన్. ౧౧౧౮

సీ॥ తెఱగంటు లందఱుం దిరుగంగఁజొచ్చిరి యగ్గలంబగునార్తి కగ్గమగుచు
అవనీతలంబెల్ల నాధారశూన్యమై కడుభయంపడ జను లక్కడలఁదోడఁగ
సూర్యచంద్రులు ధూతశోభులై రెంతయుఁ జిమ్మచీఁకటి దెస లక్కుమ్మకొనఁగ
గాడు ప్రచండమై కన్నులువో వీచె వారిధు ల్క్షోభించె ఘోరముగను
స్థావరము జంగమంబైన సర్వజగము వేనిలోఁ గాలమందున విలయమొంది
తిరిగి కలుగునో యవ్వాఁడు ధరణిసురుల శాపమునఁ జేసి దగ్ధుఁడౌ సమయమందు

తే॥ అటు హతప్రాయమగుటయు నఖిలజగము యోజనాయామవిస్తృతి నున్నయట్టి
పుడమిఁ బడియున్న లింగంబుకడకువచ్చి మునిసహస్రంబు లత్యంతమును బనవుచు

క॥ అటునిటు లవలోకించుచు నెటుగూడను దృష్టిపథము నెనయఁడు శివుఁ. డ
ప్పటులింగంబును వేయేం డ్లటుఁ బదిలముచేసియుంచి రా ఋషివృషభుల్. ౧౧౧౯

ఆ॥ నెత్తుగొడిసికొనుచు నీరప్లుతంబయి యుండియున్న యట్టి యుగ్రలింగ
మును గుణించి శంకయొనరె నమ్మునులకు. దహ్యమానమయ్యె ధరణియెల్ల. ౧౧౨౦

తే॥ తన్మహాలింగ మట స్థాపితంబుఁజేసి నర్మదంజేసి రద్దాని. నర్మదాను
కౌరి యవ్వారియు. నమరకంటకంబు లింగమును. నంత నమ్మునిపుంగవాళి.

ఆ॥ "సేవ్యమానమైన శ్రీమ దేతల్లింగ మపనయించు నరక మవనిప్రజకు.
భూతములును గ్రహము లేతన్మహాపూజనమున భూపలాయనమును జేయు.

క॥ ఇక్కడ సుస్నాతుండై దక్కనపుణ్య మొగమునఁ బితృతర్పణముందా
నెక్కుడుశ్రద్ధం జేసినఁ జక్కగ ఫలియించు నరుని సకలేప్సితముల్. ౧౧౨౧

తే॥ నర్మదాలింగముల పూజనమునఁజేసి రుద్రమయదేహ మగుఁ బ్రజ రూఢముగను.
హరి పరుండినతరుణమం దాచరించు లింగపూజ విశేష మొసంగు ఫలము. ౧౧౨౨

సీ॥ అగు జన్మరాహిత్య మలఘుచాతుర్మాస్య సల్పంగఁబడు రుద్రజపమువలన.
తలఁగును గర్భవేదనము చాతుర్మాస్యఁ బొనరింపఁబడు శివపూజనుండి.
పుట్టు రెన్నటికి నిబ్భువిని జాతుర్మాస్య భవుమీఁద నవ్యాజభక్తినుంచి.
అమృతంబు సేవింతు రల్లచాతుర్మాస్య శంభుఁ బంచామృతస్నాతుఁజేసి.
భీముగుడిని దివ్వెఁబెట్టి చాతుర్మాస్య స్వకులకోటితోడఁ జనును దివికి.
మధువుతోడ నీశు మస్తకమునఁ జేయు సేచనంబు దుఃఖమోచనంబు. ౧౧౨౩

తే॥ చందనమలంది శ్వేతపుష్పములచేఁ గరంబు గైసేసి యగరుధూపంబు వేసి
నర్మదాజలలింగంబునన్ యజించు నరులు నరులనఁబడరింక హరులెకాని. ౧౧౨౪
క॥ ప్రాణప్రతిష్ఠచేసిన ప్రాణంబులులేని రాలె హరులగుచుండన్
ప్రాణములుగల శరీరులు రాణను హరులగుట యెంత రసఁ బరికింపన్. ౧౧౨౫
క॥ ఏతత్తీర్థంబున సంజాతంబయి పూతమగుచు జలధారణసం
శీతంబగు నీలింగము చాతుర్మాస్యను యజించు జనుఁడా శివుఁడౌ. ౧౧౨౬
ఆ॥ నరగణంబు మఱియు నర్మదామరకంటకాఖ్యతీర్థమునను నధికనియతి
గలిగి జలకమాడ నలఘుచాతుర్మాస్యఁ జని త్రివిష్టపమున మనెడి నెపుడు."
కం॥ అని విశ్వక్షోభమునకుఁ బనవుచుఁ బద్మాసనమునఁ బ్రాణాయామం
బును బట్టి నిశ్చలంబుగ మనమున ధ్యానించి రయ్యుమాప్యాదయేశున్- ౧౧౨౭
కం॥ పదపడి యింద్రాద్యమరులు కదలి ద్రుతం బమరకంటకమునకుఁ జని బి
ట్టాదవెడిభక్తిని నానతవదనులగుచు ఋషిగణంబువలను మొగంబై ౧౧౨౮
ఆ॥ "బ్రహ్మవిదులు గురులు బంధవిముక్తులు నవనిసురులు నైన యట్టిమీరు
ఎఱఁగుచున్నవార మేము మహేశ్వరులార యో ద్విజాతులార! భక్తి. ౧౧౩౦
కం॥ గుణరూపులుమీరలు. మఱి గుణాకరులు - త్రిగుణములకుఁగూడ నతీతుల్.
గుణమయభావములఁ బ్రతిక్షణమును నసుబుద్బుదములు క్ష్మాచక్రమునన్-౧౧౩౧
సీ॥ ఈరు వాగ్జలధార వృజినుల శుచిచేతు. రప్పాపముల భస్మమాచరింతు.
మీవాకె చురకత్తి. మీ రోర్మి భూసము. లాగ్రహసమయమం దగ్నితుల్య.
లీరె సమర్థ లనేకంబులై నట్టి శక్తులఁ బడఁగొట్ట క్ష్మాతలమున.
త్రిదివాదిలోకము ల్చేర్ప మీరే గతి. యెట్కార్య మేని మీకే సుసాధ్య.
మీరె సత్కర్మకారకు లెంచిచూడ. మీరె సత్కర్మనిరతులు. మీరె మోక్ష
కాంక్షులగు మనుజులకు సత్కర్మములను ఫలమునిచ్చెడివారలు పాలులార! ౧౧౩౨
తే॥ వాగయోమయశస్త్రమ్మువట్టియునికి యంపుడీయబలంబు లోకోత్తరంబు.
ఈరలు తరింతు. రితరుల నెంతయును దరింపఁజేతురు. మిమ్ము వర్ణింపఁదరమె-
కం॥ త్రేతాగ్నులు సతతము మీచేతం దర్పితములగు. విశేషించి తద
ర్చాతత్పరులై యుందురు చాతుర్మాస్యమున ఫలము సమధిక మొందన్. ౧౧౩౪
కం॥ సావిత్రీమంత్రజపము కావించుచునుందు రెపుడుఁగావున మీ ర్క్రో
ధావిలులగుచో సకలాంగావళి నశియింపఁజేయరయ్య విలీలన్. ౧౧౩౫
ఆ॥ విప్రశాపమూర్వి వితథంబుగావుండ వఱలుచుండు ననంతవఱకుఁగూడ
తులిశశూలదండములతోడఁ బలిలేదు హరిహయునకు హరున కంతకునకు. ౧౧౩౬
ఆ॥ అగ్ని కానఁబడెడి యఖిలపదార్థముం దగులబెట్టుఁగాని ధరణిసురుఁడు
శాపమునను జేసి జాత మజాతమ్ము నెల్ల బలిమిమై దహింపఁజేయు. ౧౧౩౭

తే॥ శస్త్రమునఁ గొట్టఁగాఁబడి చచ్చునట్టివాఁడు సహితము క్రిమ్మఱవచ్చుఁగాని
ధరణిసురశాపవహ్నిచే దగ్ధులైనవారు నారకమునుండి రారు మరల. ౧౧౩౯

కం॥ సురలకు మధుధాన్యంబుల సరిగన్ భేదించునట్టి సామర్థ్యములే.
దరసిన వాక్శస్త్రమునను కఱకఱ జగమెల్లఁ దఱుఁగఁగలరు మహీసురుల్.

ఆ॥ అట్టివార లగుదు రస్మద్గురు ల్విశ్వకర్తలార! భువనకర్తలార!
ఈశ్వరుని వినాగ నేమును లోకము ల్వనవుచుంటి. మెఱుకపఱవుఁ డతని" ౧౧౪౦

కం॥ అనివినుతించుటయును మును లనఘుండగుశూలపాణి యాత్మభయమునన్
జని సురభీగర్భంబున జనియించుట యెఱిఁగి విబుధసంఘంబునకున్ ౧౧౪౧

క॥ స్వాగతమొసఁగి తదన్వితులై గోలోకమున కరిగి రమరాధ్వమునన్.
వేగ నటులేగి యందఱు బాగుగఁ గనుగొనిరి యచటి భద్రము లెల్లన్. ౧౧౪౨

క॥ పరమాన్నకర్దమంబుల సురుచిరఘృతనదులఁ దేనెసోనల దధిసుధా.
కరులగు పూర్వజగణముల మరీచిఘృతసోమపులను మఱిఁగాంచిరహో! ౧౧౪౩

సీ॥ నంద నందిని మేధ్య నర్మద సుమనస సకలప్రియ సుశీల శాంత నీల
కామిని ధర్మద వామన లంబిక ధనద తరేయిక శాంత కృష్ణ
దీర్ఘశృంగ సురూప దీర్ఘనాస సునాస చారుచంపక దుర్విమహ్య వినత
అభినత సుదతి జయారుణ కుండోఘ్ని గౌర హిరణ్యద గౌరవదన
లోనుగాఁగల యావులలోననుండి యవల కివలకు నురికెడి యర్కతేజు
సౌరభేయుని గని నీలసంజ్ఞుఁ బ్రీతి నింద్రముఖదేవతలును మునీశ్వరులును

సీ॥ " ఈ వెల్లగోత్తల కెంతయు దేవుండ. వగుదు జగద్గోప్త. వాదిముఁడవు.
విష్ణుము లోప్రకొర్చి విజ్ఞానమిడెదవు. ధర్మరూపత నమృతంబునిడెదు.
హరియించెదవు నీవ యఖిలజాడ్యములను. ధనమును శ్రీనిచ్చి తనుపు, దీవ.
జగము సుఖింపఁజేయఁగఁ బ్రవృత్తుండవు. తేజంబులకు నీవ దివ్యధామ.
మతిబలా! సౌరభేయ! శృంగాగ్రమందుఁ దాల్తు వుమతోడి కైలాసధరము నీవు.
వేదమయుఁడవు వేదాత్మ వౌదు నీవు. వేదవేద్యుఁడవును వేదవిదుఁడ వీవు.

సీ॥ వేదయానుఁడవును. వేదరూపుఁడవును. దగ స్తుత్యుఁడవును వేదములచేత.
త్రిగుణంబులకుఁ బరుం డగుదు గుణాకరుండవు. నీదు యాథాత్మ్య మెవఁడెఱుంగు
ఆగుదీవు భగవంతుఁడవు దేవ! వృషభమున్. వృషలుండు నిన్ దూఱు వెకలి తలఁప.
వీఁడును గాళ్లచే వృషభమున్ స్పృశియించువాఁడును బడు రౌరవంబునందు.
ఆఁకటం దప్పి నాక్రాంతమగుచునుండ మిగుల భారంబువహియించి వగచుచుండఁ
గాంచి యెవ్వఁడు నిర్దయాక్రాంతుఁడగునో వానిమతి శాశ్వతంబయి వఱల దింక.

ఆ॥ పితరులఁ గుఱించి ప్రీతియుతంబుగా నైలకొకడె కెవరు మహిని బెంట్లి
యాచరింతొరి వారియన్వయమునఁ బుట్టువాఁడు నరకమునకుఁ బోఁడు పోఁడు.

సీ॥ ఎల్లలోకంబుల కీవ యయ్యెదు గతి. యీవ తండ్రివి. పరమేశ్వరుఁడవు.
నినువినా జగమెల్ల నిర్వీర్యమైపోయి తత్క్షణముననె విధ్వస్తమగును.
బరయును బశ్యంతి వైఖరి మధ్యమ యను చతుర్విధ సువాక్యముల కీవ
ఈశ్వరుండవటంచు నెల్లభూతములకుం దృప్తిసేయుదువంచుఁ దెలియు బుధులు.
కాత్మవని బ్రహ్మమని ధర్మమని జగంబుఁ బర్వియుండెదవనియు నిను బ్రజ యెఱుంగు.
జీవరూపంబునను నిత్య మీవు మూఁడులోకముల నిండియుండుదు వేకముగను.

తే॥ నాల్గుకొమ్ములు మఱియును నాల్గుకాళ్ళు రెండుతల లేడుహస్తంబు లుండి ముత్తె
ఱంగులం గట్టఁబడు ధర్మరాశియైన వృషభమునుగాఁగ నిను వేదవిదుఁ డెఱుంగు.

సీ॥ ఆచ్ఛేద్యుఁడు నభేద్యుఁ డప్రమేయుఁడు మహాయశుఁ డశోచ్యుఁ డబాహ్యుఁడనుచు
బౌరాణికాగ్రణుల్పలుకుచుందురు. త్వదాధారమంతయుఁ.ద్వదాధారము ర్వి.(నిన్ను.
యుష్మదాధారులై యున్నారు దేవత. లగు యుష్మదాధార మన్నృత” మనుచు
స్తుతియించి సుప్రసన్నతఁ బ్రణతుండగు కఱకంఠునకుఁ గృతాగసులు విప్రు
“లెవని మృతదినమున కేకాదశాహమం దిల వృషోత్సనంబు సలుపఁబడదొ
శ్రాద్ధశతము శ్రద్ధ సలుపంగఁబడినను వాని ప్రేతతనువు వదల” దనుచు ౧౧౪౦

ఆ॥ వర మొసంగి మఱియు స్వల్పరుషాక్రాంతమయి చరించు నమ్మహావృషభము
ముడ్డురెండు శూలమునఁ జక్రమున నంకితంబొనర్చిరపుడు ధరణిసురులు ౧౧౪౧

ఆ॥ దేవగుప్తమైన యావృషరాజంబు గోగణంబునడుమ వేగ విడిచి
ముక్తకోపులగుచు మునివరు లనిమిషుల్ స్వస్వధామములకుఁ జనిరి వేడ్క ౧౧౪౨

ఆ॥ ఇట్లు కామవశత ఋషిసతీలోలుఁడై శివుఁడుగూడ వారి ధవులచేత
బలిమిమై శపింపఁబడి నర్మదాజలంబున శిలామయత్వ మెనసె” ననుచు. ౧౧౪౩

గద్య॥ ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్ష సంప్రాప్తోభయ భాషాపాండిత్య
రసవత్కవిత్వనిధాన హారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాం
బికాగర్భశుక్తిముక్తాయమాన విద్వత్సభావిష్కృతావధానవిధాన
జానపాటి పట్టాభిరామాభిధాన సమాంధ్రీకృతంబగు
శ్రీస్కాందమహాపురాణాంతర్గత
నాగరఖండంబునందు
నవమాశ్వాసము.

---



# నాగరఖండము.

## దశమాశ్వాసము.

---:o:---

క॥ శ్రీకాశీరామేశమహైకైశ్వర్యప్రదాత! యెన్నియొమాఱుల్
ప్రాకటభక్తినొసఁగు నుపాకాసా! శోకనాట్యాంబుశరాశా! ౧

### నీలవృషభ లక్షణము.

తే॥ అవధరింపుము శైవనాఖ్యసూద్రిఁ "దక్షతాకృతిగ్లైనట్టి యావృషభము
నీలసంజ్ఞకమెటులయ్యెఁ గాలవ! వచియింపు" మనుచుఁ దయ నమ్ముని యిట్టులనియె.

ఉ॥ రంగునఁ జెట్టినై కరము రాజిలునట్టి మొగంబుఁ దోఁకయుఁగా
బంగరుపూఁతపూసినటు పాండురమై మతిగట్టెలన్నియుఁగా
శృంగయుగంబుఁ దెల్లనయి చెన్నలరారు వృషంబు నీలసం
జ్ఞంగను నిర్విధంబునను శాస్త్రవిదు ల్వచియింతురి శూద్రిజా! 3

సీ॥ కమనీయతరములౌ కాళ్ళునాలుగు గల్గి యందితో సామ్యంబునొందునెద్ది
ధర్మదేవతవోలెఁ దాఁదోఁచుచుండెడుఁ బరికించుమాత్రన ప్రజలకెద్ది
నీలలోహితమైన నిజచిహ్నములచేత స్వాంతము ల్హరియింపఁజాలునెద్ది
ఖురచిహ్నములయందుఁ దఱచుగం గపిలమై ముద్దుసేయుచునుండుఁ దద్దనెద్ది
దేనివిశ్వరూపుఁడైన జనార్దనుం డలఘువేదమంత్రములను నిత్య
మర్చితంబుఁ జేయు నది నీలసంజ్ఞకం. బదియె పంచవదనుఁడైన శివుఁడు. ౪

క॥ తద్దర్శనమాత్రంబునఁ బెద్దగసిద్ధించు వాజపేయఫలం. బిం
కద్దీ సమర్చితమైనం దద్దయు జగమెల్ల నర్చితంబగుచుండున్. ౫

క॥ ఆనీలవృషభమునకున్ జానగుగ్రాసమునఁ దృప్తిసలుపం బడుచో
నీనిఖిలమైనజగమును బా నాప్యాయనముగాంచు దాస! నిజముగన్. ౬

కం॥ సాలగ్రామముకథ యిది. కోఁగళుఁడు లింగమైన కథ యిది. గానన్
సాలగ్రామము లింగముఁ బూలంబూజించువారు పొందరు వ్యథలన్. ౭

శా॥ చాతుర్మాస్యము భేదభావనముచే శ్రద్ధన్ విశేషించి యా
భూతేశున్ హరిఁబూజసేయువలయుం బూజింపఁగంబడ్డవా
రై తామిద్దరు స్వర్గమోక్షముల వా. రగ్నిస్థిరాజీవగో
వాత్రిస్థైకదుమారమాధవసమర్చన్ ముక్తి హస్తస్థమౌ. ౮

సీ॥ వేదతత్పరుఁడయి వేదోక్తపూర్తేష్టకర్మము ల్సేయింపఁగడఁగు నేని
పంచాయతనపూజఁ బాయక నిత్యంబుఁ గోరి తత్తీర్థంబుఁ గ్రోలు నేని
సత్యవాగ్వాదంబు సల్పుటయందుఁ దా నోర్మి బద్ధశ్రద్ధనుండు నేని
మనసీడ్చి నల్లఁ జనక యాలోలుఁడై పాత్రంబునం దృప్తిపడయు నేని
జ్ఞానముఖరగుణంబుల సహితుఁడగుచుఁ దగఁ బ్రవర్తించె నేని శూద్రులు బొందు
స్వర్గతిం బొందు. ద్వాదశాక్షరజపంబు కంటె వానికిఁ దపము లేదన్య మరయ. ౯

ఆ॥ మంత్రవర్జితముగ మధువైరికిన్ షోడశోపచారపూజ యొనరుచునది.
అవ్విధంబుగానె యఘహంత్రియగు పూజ చండికోద్భవునకు సల్పవలయు" ౧౦

కం॥ అనియిట్లు మునియు శూద్రుఁడు ననుకూలములైన యట్టి యా యా కథలన్
వినుచుచు వినుచు వసింపఁగఁ జనె రాత్రి యంతలోన సంయమి! యంతన్ ౧౧

కం॥ సచ్ఛూద్రుఁడు లేచి మునిం దచ్ఛిష్యుల నర్హపూజఁ దనుపుటయును వా
రచ్చటఁ గుస్వాశ్రమంబున కిచ్ఛమెయిని సత్వరముగ నేగిరి తనయా! ౧౨

కం॥ ఎవఁడిది యంతయు కొంతయు తవిలి వినును వినుచు మతి యూఁదాఁ జదివిఁ చున్
భువి వానిచేత నార్జితమవు పుణ్యంబునకు నాశ మనునది కలదే"

## —◆ శివుఁడు పార్వతికి ద్వాదశాక్షరమంత్రోపదేశము చేయుట ◆—

కం॥ అని చెప్ప వనజభవుఁగని యనఘుఁడు నారదుఁడు "ద్వాదశాక్షరజపమున్
ఘనతరిచి నాల్గెలలకె గిరితనుభవ యెటు యోగసిద్ధిఁ దాఁబడసెంబితా!" ౧౪

కం॥ అనియడుగుటయు నతం డిట్లనుఁ. "జాతుర్మాస్య గిరిజ హరిపయి భక్తిన్
ఘనముగుపి ప్రశ్రంగంబున ననయముఁ దపమాచరింప నారంభించెన్. ౧౫

సీ॥ దేవతాతతికెల్ల సేవనీయాయయ్యెఁ గావించె దేవతాసేవనంబు
ద్విజాలయందతికిని భజనీయయయ్యును భజియించె మిగుల నాద్విజకులము

కుచములలో నెల్లను శుచి తానయయ్యును భక్తిం దచ్చుచిం గడుం బరిచరించె
గోరాజవాహను కూరిమిసతియయ్యుంగొలు వంగడంగ నాగోగణమునె
దండియశ్వత్థమునకుం బ్రదక్షిణించె నతిథిసత్కారములం గరం బాచరించె
భగవదుపదిష్టమంత్రజపంబు సేయుచును భవానీమహాదేవి మునివరేణ్య! ౧౬

సీ॥ నీలమేఘము డాలు సరసించు నెమ్మేనం బచ్చనిహొంబట్టు బట్టంగట్టి
మకుటకేయూరాది మణిమయాభరణంబులం దత్తదంగంబులన్ ధరించి
కరముల నాల్గింట ఖడ్గగదాశంఖచక్రముల్ నాలుగు సరిగంబట్టి
శ్రీవత్సకౌస్తుభశ్రీ మేళనమునను కమలసూర్యకోటి కాంతిగలిగి
వ్యాప్తలోకత్రయంబయ్యు వైనతేయు పై నధిష్ఠించి శతపత్రపత్రనేత్రుం
డై నవిష్ణుండు "దేవి! నీయభిమతంబుం దెలుపు శుభమగు"నని ప్రీతిం బలుకుటయును

క॥ "దేవా! యేజ్ఞానంబున నావర్తనముండ దింక నత్యతులంబై
తా వెలసెడి యాజ్ఞానము కావలయును నాకొసంగంగదె దయ"ననుచున్ ౧౮

తే॥ సర్వమంగళ వచియింప శార్ఙ్గధరుండు శ్రీవాణి హొనరించియిట్లను. శైలతనయ!
ఎవండు తా దేవదేవేశుండొ వచియింపంగలండు తద్భగవంతుండె కరుణ నీకు. ౧౯

సీ॥ సర్వసాక్షియెవండు సంహారకంబునం దంతర్బహిర్వ్యాప్తుడగు నెవండు
జగములసృజియించి సాకెడి నెవండు పవిత్రులందెల్లం బవిత్రుండెవండు
ఆద్యంతములు లేని యాలధర్మ మెవ్వండు ధర్మాదికముల కధ్యక్షుండెవండు
అజుండయ్యు నెవండు మూర్తామూర్తరూపంబులో జన్మముల నెత్తి తోంచుచుండు
అక్షరత్రయసంసేవ్యమైన బ్రహ్మ మెవండు వాండె భవత్ప్రష్టమవువిషయము
తాను వచియింపంగలవాండు కాని వాకుం దాద్ప్రగధికార మింతయున్ లేదుగౌరి;

ఆ॥ అనియిట్లువచించి హరి యాంతరుండుడు నంతలోన నచటి కతిరయమున
సార్వకామికముగ సంచరించువిమానవరముమీంద నెక్కి వచ్చె శివుండు. ౨౧

ఆ॥ సకలభూతసంఘసహితుండై శివుండట్లు వచ్చుటయును హైమవతి స్వకీయ
సఖులయెదుట నతని సత్కృతుంగావించెం జక్రపాణి మిగుల సంస్తుతించె. ౨౨

ఆ॥ సంస్తుతించి యట్లు శంకరు మెయి లయంబగుడు నతండు వ్యోమయానమందె
యుండి "తృప్తిపడితి నోగౌరి! నీయెడ. మంతనమున కేగి మతివచింతు" ౨౩

క॥ అనిపలికి యాశివ కరమును దనకరమునం బట్టుకొని ముదమున విమానం
బుననుంచుకొని రయంబున బొనరిచె దూరప్రయాణమును శంభుం. డటుల్ ౨౪

సీ॥ శతపత్త్రములతోడ సరితూఁగుచుండెడి యాఱుమోములతోడ నలరువాని
ఒకసారి మెఱసిన యొక కోటిమెఱుములవలెను గనుంగొనఁబడెడివాని
దివ్యరూపంబుచే దేదీప్యమానుఁడై ప్రస్తుతిఁగొను మహాబలమువాని
వహ్నిచే వహియింపఁబడిన వీర్యమునుండి యుదయించి తెల్లనం దున్నవాని
స్తన్యమిచ్చి యల్ల షట్కృత్తికలచేతఁ బ్రత్యహంబుఁ బెంపఁబడెడివాని
గంగకడుపులోనఁ గదలక మనువానిఁ బ్రీతిఁ గనియె నామె పిల్లవాని. 33

॥ కని "వత్స ! రార"యనుచుం గొని కరములరెంటితోడఁ గూర్మి విమానం
బునఁ దనదు నెడమతొడపయిఁ గొనకొని కూర్చుండఁబెట్టుకొని సంతృప్తిన్

॥ "చిరకాలము జీవించుచుఁ జిరకాలము బిట్టు సంతసించుచు బంధూ
త్కరమును సంతసపెట్టుము చిరకాలమటంచు రెండుచేతుల వానిన్ 3౪

॥ గాఢాలింగన మాచరించుకొని యా గాంగేయు మూర్ధంబులన్
బ్రీతిన్ మూర్కొన వాఁడు లేచి పితృ సత్పాదంబులన్ వ్రాలి ని
ర్వ్యాజోర్వ్యంజలియౌచు నిల్వఁబడుడున్ ద్యోయానమ ద్రోజ నా
రూఢుండౌ శివు కన్నసన్నల బహుస్తోత్రస్వినుల్ దాఁటుచున్ 3౬

॥ లక్షయోజనముల లలితజంబూద్వీప మొప్పు రెండంతలౌ నుప్పుసంద్ర
మంతకు రెండంతలైన కుశద్వీప మింతకిమ్మడియైన యిక్షుసింధు
వంతకు ద్విగుణమైనట్టి క్రౌంచద్వీప మంతకినుమ్మిక్కిలియౌ సురాబ్ధి
అద్దానికిని రెట్టియైన శాకద్వీప మంతకు రెట్టియౌ నాజ్యజలధి
సరిగ దానిమించు శాల్మలిద్వీపంబు దానిఁగూడమించు దధిపయోధి
అంతకెక్కుడైనయట్టి ప్లక్షద్వీప మౌలి దానిమీరు పాలకడలి 3౭

॥ ఉత్తర కురుదేశములకు నెత్తగు గట్టులకు బ్రహ్మఋషివరులకు న
త్యుత్తమలోకంబులకు నుపాత్తైశ్వర్యులగు సాధ్యయక్షాదులకున్ 3౮

॥ ఇరవులైనయట్టి యీద్వీపముల సాగరముల దాటిఁ చనియెఁ గ్రమముగాను
పుత్త్రి ! యవ్వి యాఱు భూతలస్వర్గంబులని వచింప సంశయంబులేదు. 3౯

॥ అచటిభూమి కొంత హైరణ్యమును గొంత రాజతమును నగుచు రాజిలు సుత !
తియ్యనైనపండ్ల కయ్యది తెంకి. యింకేమిగలదు సర్వకామదంబు. ౪౦

॥ ఇంటింటఁ గల్పవృక్షము లింటింటను రత్నఖచిత హేమాభరణాల్
కంటఁబడుచుంటఁగాదొకొ పంటవలఁతియనుచుఁ బిల్వఁబడు ధర ప్రజచే.

క॥ ఆపాలకడలి శ్వేతద్వీప మ్మద్దానిలోన దివ్యము శతశృం
గోపేతము నమితదుర్గమమై పర్వతమొండు రమ్యకాహ్వాయ మమరుఙ్.

క॥ ఆకొండశిఖరమందున నాకౌశపుయాన మాపె నా శ్రీకంఠుం.
డేకాంతభూమియన నదెకా కలహాశనమునీంద్ర! ఘనగుణసాంద్రా! ౪౩

సీ॥ అమృతపూర్ణఫలంబు లంతటు వ్రేలాడు చెట్లచేఁ జుట్టును సేవితమును
స్వర్ణమయంబైన సన్నని యిసుకచే నావల నీవల నావృతమును
అనిలవశంబున నసకృదాగతమైన పాలకరుల్లచేఁ బావితమును
మణిరత్నఖచితమై మాక్షికమును జాలు స్ఫటికోపలంబున స్థాపితమును
నైన తచ్ఛిఖరస్థ సింహాసనమునఁ గూరుచుండి గిరీశుండు కుధరరాజు
తనయ కి ట్లుపదేశించె ధ్యానయోగ మగ్నిభవుఁడగు గుహుఁడును నాలకింప.

సీ॥ "గోప్యంబులందెల్ల గోప్య మయ్యది గౌరి! మంత్రరూపము. విష్ణుమధ్యమంబు.
ప్రణవసమేతంబు. ద్వాదశాక్షరము. నమాయంబు. మఱి మాఘమాసహితము.
అసకృదక్షరమును. నక్షరత్రయయుక్త. మాగమపరమును. నగ్రియుతము.
విశ్వపావనమును. విష్ణుగమ్యము. తురీయకల నశేషబ్రహ్మండయుతము.
అమలమంత్రత్రయసమన్వితము నిరీహులైన మునులకు సేవనీయంబు బొడ్డు
నుండి శీర్షంబుదాఁక నఖండసుఖద మల మహావిద్యచేత సమర్చితంబు. ౪౬

సీ॥ జ్ఞానరూపము సుఖాశ్రయమును నైనట్టి ప్రణవమ్ము ధ్యానించి ప్రథమమందు
సర్వగబ్రహ్మంబు చక్కఁగా నెఱిఁగి గాత్రంబును బిట్టు శోధనముచేసి
పద్మాసనంబున బాగుగాఁ గూర్చుండి కరములు రెండును గరము ముడిచి
చర్మమయంబైన చక్షుస్సులను మూసి క్రొన్నన జ్ఞానమఙ్ కన్ను దెఱచి
సూర్యచంద్రతటిత్కోటిశోభ ద్యోతితాఖిలుని సదసద్రూపు నవ్యయు శివు
తద్విరాట్టును జిత్తపద్మమునఁ జింత సేయ మరల జనింపరు క్షితితలమున.

ఆ॥ కొలఁదికాలమేని కోరి చాతుర్మాస్యమందుఁ దాదృశంపు ధ్యానయోగ
మాచరింపఁబడిన నద్రిరాజతనూజ! కల్మషముల కచటుఁ గలదెచోటు? ౪౭

ఆ॥ హరి యమోఘవీర్యమైన యీ మద్రూప మెవనిచే నిమేష మీక్షితంబొ
జన్మశతకృతాఘసంచయసంక్షయకరణమునకుఁ బ్రభువు తరుణి! వాఁడు."

క॥ అని యి ట్లుపదేశించుడు "ననఘా! యా ధ్యానయోగ మవలంబింతుఙ్.
వెనువెంట జ్ఞానయోగంబునుగూడ సమాశ్రయింతుఁ బూనికతోడఙ్. ౪౮

ఆ॥ ఎట్టు లమరినగుదు నట్టుల విధియింపు మీశ !" యనుచు నాతఁడిట్టులనియె.
"ఆద్యమంత్రసార మామ్నాయసారమౌ ద్వాదశాక్షరమును దగ జపింపు. ౫౦

ఆ॥ ద్వాదశాక్షరముల నాదిదౌ నోంకార మఖిలవేదములకు నాది. యఖిల
కార్యములను సిద్ధికరమును నఖిలబ్రహ్మాండయాజకంబు నబ్జవదన ! ౫౧

తే॥ దానివర్ణము సితము ఛందస్సు మధువు బ్రహ్మ ఋషి పరమాత్మయై పరఁగుచున్న
యట్టి గాయత్రి దేవత యఖిలకర్మములను వినియోగ మోహిమాచలకుమారి ! ౫౨

ఆ॥ క్షయము లేనిది సదసద్రూపమును విశ్వమంత్రయుతము బ్రహ్మమయపుబీజ
మోదయితరో ! వేదవేదాంగతత్త్వాఖ్య మని యెఱుంగనగును వరసి దీని. ౫౩

ఆ॥ పీతవర్ణ మప్పు బీజంబు రెండవయక్షరముగాఁగ మను నకారమునకు.
కుందరదన ! మనసు ఛందస్సు వినియోగ మలఘుకాలకూటహరణమందు ౫౪

క॥ మోకార మవనిబీజము ప్రాకటతేజంబు రక్తవర్ణము నగుచున్
శ్రీకౌశికఋషియుతమై వీఁకను ధనదానమునను వినియోజితమౌ. ౫౫

ఆ॥ అల మరీచి ఋషి యనంత బీజంబును బంచవిధములైన వర్ణములును
ఎల్లభోగములను నిచ్చుట వినియోగ మలభకారమునకుఁ గలికిమిన్న ! ౫౬

తే॥ అనిలబీజము హేమరక్తాభము మఱి యల భరద్వాజఋషితోడ నన్వితమును
జాపకుల కాదిభోగదం బోపడంతి ! యైదవదియౌ గకార. మిట్లాలకింపు ౫౭

౦॥ సురమంత్రిఋషి వకారము సురపథబీజంపు కుందసుమధవళ మ్మునై
పరఁగు మహాబలమగుచును విరిబోఁడీ మోక్షదముగ వినియోజితమౌ ౫౮

॥ అంగిరస్సు ఋషిగ నల్ల తేకారంబు సోమబీజమగుచు శోభిలెడిని.
వికచపద్మనయన ! విద్యున్మయంబది. రహితకామ్యకర్మ. మహహ ! వింటె.

॥ వాకారంబు భవాని ! దివాకరబీజంబు ధూమ్రవర్ణంబుఁ బుల
స్త్యాకాంతంబు మనోజవమై కాంతినియుక్తమగుచు నతిసుఖదముగన్. ౬౦

॥ అక్షరంబు జపాకుసుమాభముఁ బులహాశ్రితంబు మనోబీజ మర్ఘదంబు
దుర్విభవ్యాంబునగును నిందుసమవదన ! యలసుకారం బిఁకేమంచుఁ దెలుపువాఁడ.

॥ అగును దేకార మోగౌరి ! హంసరూప మధ్వగమున నియుంక్తంబు నఖిలవర్ణ.
మగునుజూ సిద్ధిబీజ మింకడుగనేల ? యది మహాసత్వమనికూడ ననఁగఁబడెడి.
వాకార మెపుడు నిర్మలమై కైవల్యంబునిచ్చు. యజమానుఁడు తా
కైకొనును బీజభృత్త్వం బోకాత్యాయని ! ప్రచేత యోగి ఋషియగుఁజూ.
పింగవర్ణంబునన్ మహాబీజమును యకార. మనయంబు భూచింత గౌరి ! సర్వ
కృత్యముల వినియోగంబు. ఖేచరియును భూచరియును మహాసిద్ధిపో క్రియముగ.

క॥ గాయత్రియె ఛందస్సగు నీయన్నింటికిని గూడ నిభయానా! యింకన్
కాయన్యాసక్రమమును నీయాత్మకు గోచరింప నేవచియింతున్. ౬౫
సీ॥ ఓంకారమును నెల్లయెడలునందు నకారమును బూతభక్తా పాదములను రెంట
మోకారమును గుహ్యమున భకారము నాభి నల గకారము హృదయంబునందు
కంఠమధ్యమున వకారంబు తేకారవాకారములఁ గరద్వయమునందు
ముఖజిహ్వలందున మొనసి సుకారంబు కర్ణద్వయమున దేకార మట్టి
కన్నుదమ్ములరెంట వాకారమును యకారమును మస్తకమున నీక్రమముగాను
పదియు రెండక్షరంబుల బాగుగా న్యసింపవలయు శిలోచ్చయశ్రేష్ఠపుత్రి! ౬౬
ఆ॥ యోనిధేనుముద్రి లాగి లింగముద్రయుఁ బట్టవలయుఁ బిదపఁ బద్మనయన!
ఆచరింప నేతదఖిలంబు నిత్యంబుఁ గలుషములకుఁ జోటుగలదె యింక. ౬౭
క॥ ఇది ధ్యానకర్మయోగము ముదితా! యింక ధ్యానయోగమును జెప్పెద. నీ
మది యేకాగ్రంబొనరిచి కుదురుగఁ గూర్చుండివినుము. కోలలు నశించున్.
ఆ॥ ద్వాదశాక్షరమును వేదశబ్దబ్రహ్మభవము ధ్యానయోగము విరిబోఁడి!
ధ్యానమునను శుద్ధతం బొందుఁ జూ ప్రాణి. ధ్యానమునను యాత్మలోనఁ గలయు.
ఆ॥ అఖిలసిద్ధిగూడనగు ధ్యానమునఁజేసి. దర్శనంబునిచ్చుఁ దాను హరియు.
అట్లుగాన ముగుద! యాధ్యానయోగంబు సావలంబ మమర సేవితంబు. ౭౦
సీ॥ అప్రతర్క్య మగాత్ర మనుపమాన మగోత్ర మజ మనీశ మఖండ మనయ ముదిత
మఖిలగతము ధర్మ్య మవికల్పము నగాధ మనవరతోజ్వల మమలతమము
విభ్రాంతికరణంబు విరహితద్వంద్వంబు సాక్షిమాత్రము శుచిస్ఫటికనిభము
సౌదామినీకోటిసమమును బ్రహ్మండశతకారణంబును శాశ్వతమును
సహకళంబును దురత్యతిశాయి నభము ధ్యాతయును ధ్యేయముఁగూడఁ దానయగుచు
దృశ్యము సదృశ్యమును నయి తేజరిల్లు తేజమును దేజమునఁజేసి తెలిసికొనుము."
ఆ॥ అనుడు గిరికుమారి "యనఘ! యోగజ్ఞానరూపమును నమూర్తమైనదంగు
తన్మరాసురారిస్థానంబు లభ్యమెట్లగునో యానతీయు"మనుడు శివుఁడు ౭౧
సీ॥ "శిరసు ప్రధానంబుచెలి! గాత్రములయందు. ధరియించుచుండునంతయును శిరసు.
శిరసు పూజించెడినిరతంబుదేవుని. శిరసుచే నఖిలంబు సేవితంబు.
ధరియింపఁబడియెడి శిరసుచేఁదేజంబుఁ ధరియించుచుండెడి శిరసు బలము.
ఒనరింపఁబడియెడి యోగంబు శిరసుచే. శిరసునందుండెడి జీవితంబు.
మూర్తమునకు మఱియమూర్తంబునకుఁ గూడ శిరముస్థూర్ధ్వఁ. దురముక్షితి. రసాతలంబుపదము. లిద్ది లలితహా బ్రహ్మండమునకు రూప. మేమియనుదునింక. ౭౨

క॥ యోగము హృదయగ్రంథిని బోఁగొట్టు. మమత్వశత్రువును దునుమాడున్.
యోగీంద్రు మదిని లాగుట కేగడు సరికిని నశక్య. మేమందు నిఁకన్. ౯౮

ఆ॥ చెన్నలువమూసిబిట్టి చెలి! నాదరూపంబు వెదకు చెప్పుడుఁ దలను బదియవదగు
ధ్యానమున మనంబు స్థాపించువాఁడెపో యమలుఁడైన యోగి. యతివిరాగి. ౯౯

క॥ అదియే ప్రణవాగ్రింబగు. నదియే శాశ్వతము బ్రహ్మ. మదియె యనంతం.
బదియే యమృతం బుద్దిమ. మదియే నాదస్వరూప మచలకమాక్షి! ౧౦౦

ఆ॥ ఘ్రాణవాయు ఘోష. మేణాక్షి! యయ్యది. జాఠరాగ్ని యందు సత్వనంబు.
భూతసంచకంబు భూరినినాసంబు. జ్ఞానరూపమును ననంశయముగ..

క॥ ఈపదము నొందఁగ లిగిన నో పార్వతి! భవవిముక్తి నొలయును గాని
ఏపట్టు యోగసిద్ధిప్రాప్తకమగు నద్ది దుర్లభం బీజగతిన్.

ఆ॥ అట్లు చరము నచర మగు విశ్వమంతయు బ్రహ్మరూపమగుచు భాసిలెడిని.
కృష్ణసేవచేత విజ్ఞానమును చేరి యోగసిద్ధిబు వ్యాప్తమయి రహించు.

క॥ యోగీశ శ్రేష్ఠుండగు యోగుని శిరమున వసించు పంకజనాభున్
యోగ మునఁ జేరిన ప్రాణములు భోగి కిరీటంబు సంచిప్రశస్తము మాయన్. ౧౦౪

తే॥ ఎప్పుడు తాను సక్తుఁడు నై యుఁజిమ్మి కర్మములలోఁ బ్రవర్తింపఁగలఁడో మనుజుఁ
డప్పుడే జీవించువారల కగును మోక్షుదుండు తత్జ్ఞానమయయోగి తోయజాక్షి!

క॥ ఎప్పుడు మది నిర్మలమగు నెప్పుడు సుఖకారమండ దీదేహమునం
దెప్పుడు హరిభక్తుండగు నప్పుడు విడు కర్మబంధ మతిసులభముగన్. ౧౦౬

తే॥ జరుపుకొంచునె కర్మముల్ శాంతమైన మానసముగల్గియుండెడి మానవులకు
యోగమయమైన సంసిద్ధి యొలయఁగలదు క్ష్మాధరాధీశపుత్రి! నిస్సంశయముగ.

క॥ గౌరవయుతమగు స్థానము సారెకుఁ గగ మనుభవించు సన్మతి తానీ
ధారుణి జీవించుచు నే చేరి హరిని విడువఁబడును జెడుకర్మముచే ౧౦౮

తే॥ నిత్యనైమిత్తికములైన నిఖిలకర్మముల సకామతఁ జేసినఁ గలుగదు సుఖ
మందుఫలనను దుఃఖతాపాభివృద్ధి యగుటయే కాని నిత్యసౌఖ్యంబు లేదు.

ఆ॥ కర్మములకునెల్లఁ గైటభమర్దనుం డీశ్వరుండుగాఁగ నెఱుఁగు జేసి!
అఖిలకర్మములను నాత్మయందుఁ ద్యజింప సంసృతిం ద్యజించు జనము వినుము.

ఆ॥ విష్ణునందుఁ జేయు వివిధకర్మార్పణం బేని లదో యదియె యుద్ధతపము
అదియె పరమయోగ. మద్దియే విజ్ఞాన. మింతకన్నఁ జెప్ప నేమికలదు. ౧౧౧

ఆ॥ అట్లు కృష్ణార్పణంబుగా నాచరించు నిర్మలపు యోగమే యగు నిర్గుణంబు.
ఊర్జితంబగు శుభమిచ్చు యోగమనఁగ నట్టి నిష్కామకర్మంబె యగును జుమ్ము.

తే॥ ఎంతవఱ కాత్మవంశమం దెట్టి విష్ణుభక్తుఁ డుదయింపఁడో యంతవఱకుఁ బిండ
దానతత్పరులైన పితాళ్ళుగూడఁ గరము సంసారమందునఁ దిరుగుచుందురు.

ఆ॥ ఎంతవఱకుఁ బ్రజల కిటువంటి హరిభక్తి గలుగ దంతవఱకె కలుషములును
బీజములును గూడ బిట్టు గర్జించెడు. నలఘుతీర్థసేవ యంతవఱకె. ౧౧౪

ఆ॥ కనులు మూసి యెవఁడు కావించు యోగంబు వాఁడె జ్ఞాని యోగివరుఁడు గూడ.
ఉరుతరాధ్వరముల నొనరించువాఁడును విష్ణుభక్తియుతుఁడు వీఁడె చూడ. ౧౧౫

సీ॥ గోమేధ మొనరించు గొప్పవాఁడైపోవు వాకును నియమించి వఱలుతోన
అశ్వమేధఫలంబు నవలీలఁ గాంచుఁబో మది నిగ్రహించి తా మనుటతోన
సౌత్రామణిమఖంబుఁ జలిపినవాఁడౌను సంకల్పవిజయంబు సలుపుతోన
నరయజ్ఞమునవచ్చు నురుకీర్తిలభియించుఁ గాయ ముత్సర్జింపఁగలుగుతోన
ఇంద్రియముల పేరి యీయైదు పశువుల హతముఁజేసి దేవుఁడగు నిరంజ
నుని నెఱింగినట్టి ఘనయోగి కో దేవి! యోగమహిమ మేమియుండు నింక. ౧౧౬

తే॥ వాఙ్మనఃకర్మదండంబు వరుసఁజేసి యోగనిష్ఠుండుగానున్న యతిముఖ్యుండు
బ్రహ్మరూపంబుతోడను బ్రదుకునప్పుడె తా సమాప్తిని బొందు భూధరకుమారి!

ఆ॥ కర్మబంధములను గడు బాధ్యమానుఁడౌ జ్ఞానహీనజనుఁడు సంతతమును.
జ్ఞాని కర్మములను జరుపుచునే ముక్తి నొందు. నిదియె భేద ముభయులకును.

కం॥ ఎప్పుడు గురువులచేతను జెప్పంబడు బ్రహ్మమందు శ్రేష్ఠస్థానం
బప్పుడె ముక్తుండగుఁ దాఁ దప్పకనరుఁ. డొడలెయుండు ధరపయి నింకన్. ౧౧౯

కం॥ ఎప్పుడు బ్రహ్మంబునఁ దాఁ జప్పునఁ గలియును జనుండు సంపూర్ణుండై
అప్పుడె బ్రహ్మద్రుమమునఁ గప్పంబడి కర్మవృత్తి కనఁబడకుండున్. ౧౨౦

తే॥ మును లవాంతరపర్వము లున్ముఖ్యముగ నెఱుంగవలయును సర్వగా మునిభాంగ!
మతి శ్రుతిస్మృతితతి మోక్షమార్గ మరసి ద్విజులు గుర్తింపవలయుఁజూ ఱిన్నగాను-

కం॥ నాలుగు ద్వారంబులచేఁ గ్రాలెడి నగరంబుభంగిఁ గనఁగు మోక్షం
బోలలన! శమాదులు పరిపాలింత్రా ద్వారములను బాయక యెపుడున్. ౧౨౨

ఆ॥ శమము సిద్ధచార సంతోషముల్ సాధుసంగ మనెడిపేళ్ళ సతతమ వటం
నుండి ముక్తిపదము నొందించు తచ్చతుర్ద్వారచరులె సేవ్యతములు మొదల్లు.

కం॥ వీరల వశపఱచుకొనన్ నేరుచువారలకు సిద్ధి నీరేజముఖీ!
దూరమున నుండ. దందునఁ జేరవ కైవల్యపదము. చెప్పితి నీకున్. ౧౨౪

ఆ॥ యోగసిద్ధి విష్ణునురుభక్తిచేత ధర్మాచరణముచేత నగును బ్రాహ్మ-
మదియె మనుజవరుల కగును సంపూర్ణమౌ జ్ఞాన. మిందు లేదు సంశయంబు. ౧౨౫

క॥ జ్ఞానముకొఱకై విద్యాస్థానములఁ జరించునరుఁడు సద్గురువలనన్
మానుగ దీపార్చిస్సమమై నెగడెడి జ్ఞానమొందు నప్పుడె యబలా! ౧౨౬

ఆ॥ ఒకముహూర్తమేని వికసద్ధృదబ్జమం దెవఁడు చింతసేయుఁ దవిలి లయము
వానిచేతఁ జేయఁబడిన పాపసహస్రములు క్షణంబులోన విలయమొందు. ౧౨౭

ఆ॥ విష్ణుభక్తుఁడెపుడు విపుల రాగద్వేషకోపలోభములను రూపుమాపి
సకలమందుఁ దాను సమదర్శనుండయి యుండు. వేఱుభంగి నుండఁ డతఁడు.

ఆ॥ సర్వజీవులందు సంపూర్ణమగు దయ వేనిమదిని స్థైర్యమూని యుండు
అసయ మెప్పఁ డగు సదాచారవంతుండు యోగి వాఁడు. దుఃఖ మొందఁ డెపుడు.

క॥ మాయాదిపటలహీనత యావద్భవసం బసత్యమను నిశ్చయమున్
హేయజనసంగరహితత యీయవియగు యోగసిద్ధి కిల లక్షణముల్. ౧౩౦

క॥ మమతాశ్రయాశసంయోగము నరులకుఁ దాపదాయకము. తద్వహ్నిన్
శమగుణవిశిష్టతాయోగమునం జల్లార్పవలయుఁ గడుయత్నమునన్. ౧౩౧

ఆ॥ చేష్టచేఁతలను నిషేధించు మనసె యింద్రియములను సముద్ధరింపవలయు.
లోహధన్వి తాన్యలోహంబు తీక్ష్ణతంబొందుభంగి నవియుఁ బొందు శుద్ధి. ౧౩౨

ఆ॥ కాయమున విశుద్ధికరయగు బుద్ధి దా దేయ గ్రాహ్య యనఁగ ద్వివిధ. మందు
సంత్యజింపవలయు సంసారవిషయిక. బ్రహ్మమందుఁబెట్టి పడయు శుభము.

క॥ రూప మరూపము కేశవరూపం బవ్యక్త మవ్యృతరూపంబును నా
ఆ పరమాత్మ నివేదిత మోపర్వతరాజతనయ! ఊర్జితవినయా! ౧౩౪

ఆ॥ ఇట్లెఱుంగు యోగి యేణాక్షి! సంసారబంధమున విముక్తి పడయ నేర్చు.
ఘనగురురూపదేశమునఁగాక యయ్యది దుర్లభంబు వేఱుత్రోవనుండి. ౧౩౫

క॥ ఎయ్యెడఁ బ్రసన్నుఁడగు గురుఁ డయ్యెడ విశ్వంబు సర్వ మగును బ్రసన్నం
బయ్యావ్యయ్యన కగు తుష్టియె తొయ్యలి! పితృదైవతముల తుష్టి తలంపన్. ౧౩౬

ఆ॥ జ్ఞానసహితమైన సత్క్రియ మోక్షసిద్ధికిని లక్షణంబు దేవి! వినుము.
తత్క్రియాధిపతి సదా విష్ణువే కాని నెఱపునట్టిజనుఁడు నిష్క్రియుండె. ౧౩౭

తే॥ ద్వాదశాక్షరచక్రంబు దక్షతనయ! చక్ర మంహఃపలాశనచక్రమునకు.
దండ మున్మార్గసంచారితండమునకు. తత్పరబ్రహ్మవస్తు ప్రదర్శకంబు. ౧౩౮

తే॥ ద్వాదశాక్షరరూపమై తనరునట్టి యిదియె యగును బరబ్రహ్మ మిందువదన!
ప్రేమపాత్రంబులగుట నీబిడ్డనికిని నీకు వ్యక్తంబొనర్చితి నేను దీని. ౧౩౯

క॥ యోగిధ్యానాత్మకమును శ్రీగురునై భక్తినుంచి స్వీకర్తవ్యం
బౌఁగాన దీనిసారము బాగుగఁ జింతింపవలయు భావములోనన్. ౧౪౦

క॥ చాతుర్మాస్యమునందున యేతత్సారంబు భక్తి నెదఁ జింతింపన్
బ్రీతిం గోటిభవార్జిత పాతకము హరించి పరమపద మిడు హరి తాన్ ౧౪౧

## —♦ మత్స్యేంద్రనాథజననము ♦—

క॥ అనియిట్లు పార్వతికి శివుఁ డనుపమయోగంబు నొడువునవసరమున నా
ఘనకలశవార్ధిమధ్యంబుననుండి మహాఝషంబు పొడకట్టె టయన్ ౧౪౨

సీ॥ ఊర్జితంబైన మహోదరంబునఁజేసి మిఱుమిట్లుగొలుపుచుం బరఁగుదాని
అర్గలంబు విశాలమగు నురస్థ్సలమునే యొగుబుజంబులుచేసి యీఁదుదాని
తత్పూర్వమున జగత్త్రియమందుఁ దనచేత బాగుగా నెఱుఁగంగఁబడనిదాని
హుంకృతిదప్ప యహంకృతియనునది లేశంబు మదిలోన లేనిదాని
తనవిమానంబుమీఁది కెంతయును నెగురు మీనుఁ గనుగొని యప్పు డీశానుఁ డాత్మ
తేజమున స్తంభనముచేసి "దివిజుఁడవో నరుండవో చేఁపకడుపులో నుండి నావు.

క॥ దేహాంతరమందుండుట కేహేతువుకలదో ? ఇంత కెవ్వఁడవో నీ ?
వాహోపు బైడుఁ జెపు"మని స్నేహంబునుజూపుకొనుచు శివుఁ డడుగుటయున్

క॥ "గండాంతయోగమున నొక యండజయానకు జనింప నాయుమ 'యీపి
ల్లండు కులాంతకుఁడగునఁట. యుండఁదగఁడు మనో'కటంచు నుచ్ఛృంఖలతన్

తే॥ మగనితోడను మిక్కిలి తగవులాడి పాలమున్నీట వేయింప భక్ష్యబుద్ధి
మీనుచేఁ దత్క్షణంబున మ్రింగఁబడియుఁ జాకయున్నాఁడ నిటు శతసమల నుండి.

క॥ అమృతముగురిసెడి త్వద్వాక్యములను విన జ్ఞానయోగ మలవడియెను. మూ
ర్తమును నమూర్తము నెఱిఁగితిఁ. గ్రమముగ నావలను వత్తుఁగరుణింపుమిఁకన్

క॥ వాగమృతవృష్టి నాపై బాగుగఁ గురిసితివి సత్కృప న్నీ. వటులే
ఈగౌరీదేవియు ననుఁ దాఁ గరుణం జూచుచుండెఁ. దఱుఁగేమి యిఁకన్." ౧౪౩

మ॥ అని మీనంబు వచింప నీశ్వరుఁడు "ర మ్మాలస్యమింకేల ? ప్రా
జ్ఞని విప్రేంద్రవు నీవు. పూజ్యుఁడ" వనన్ సౌందర్యవంతుండుఁ గాం
తిని జంద్రుం బురడించునట్టిఁడును నై దివ్యంపు గంధంబుతో
డను గర్భంబుననుండి వెల్వడియెఁ జూడన్ దేవియున్ దేవుఁడున్. ౧౪౪

ఆ॥ చాలఁ గష్టమైన క్షణములో వెల్వడి మత్స్యగంధమైన మంచిదగుడు
పార్వతికిని మఱియుఁ బరమేశ్వరునకును బ్రణతిఁజేసి నిల్వఁబడియె నతఁడు.

ఆ॥ కడుపులోననుండి కమనీయమగుమూర్తి నపుడె బయటఁబడిన యట్టివాని
ముదముతోడ నెత్తి ముద్దాడి తొడపైని గూరుచుండఁబెట్టుకొనియె గౌరి. ౧౫౧
ఆ॥ పరమహర్షమునను పార్వతీనాథుండు పత్నియొద్దనుండు బాలుఁగాంచి
మత్స్యవలన జాయమానుఁడౌకతమున మత్స్యనాథసంజ్ఞ మాన్యుఁజేసి ౧౫౨
సీ॥ "కనుగొనఁగలవునీ వనుపమానజ్ఞానయోగసాగరపార హోగుణాఢ్య!
గెలువంగఁగలవునీ వలఘుకామాద్యంత రరిషట్క మో భూమిసురకుమార!
శోభిల్లుదువునీవు క్షోణీస్థలమున ద్వంద్వాతీతుఁడవుగాను యమివరేణ్య!
ఛేదించుదువునీవు చిచ్ఛస్త్రమునను నాశాపాశములనెల్ల సత్యశీల!
ఉపచరించిబ్రహ్మ మొయ్యు జీవన్ముక్తి నొందఁగలవునీవు యోగివర్య!"
అనివచించి యసకృదభివాదకుండైన యతనిఁ గొంచు మందరాద్రి కరిగె. ౧౫౩
ఆ॥ అంత మత్స్యనాథుఁ డంబను వలగొని కార్తికేయు బిడ్డఁ గౌఁగలించి
వెడలిపోయె. దీని వినినఁ జాతుర్మాస్య నశ్వమేధఫలము నందు జనము. ౧౫౪

## —♦ తారకాసురవధ ♦—

క॥ అల్లారుముద్దుగా సతి పిల్లండగు కార్తికేయుఁ బెంచుచునుండన్
తల్లికడఁజేరి యాతం డుల్లము రంజిల్లఁ గ్రీడ లొనరుపసాగెన్ ౧౫౫
సీ॥ కంఠపట్టంబెత్తి కర ముచ్చరవముతోఁ జక్కగాఁ బాడు నొక్కొక్కమాటు
పండ్రెండుచేతులుం బైకెత్తి స్వేచ్ఛపై మిక్కిలి యాడు నొక్కొక్కమాటు
ఎట్టినిపై మాయ నిసుము పైఁ జల్లుకొం చురుకులువెట్టు నొక్కొక్కమాటు
గణసహితంబుగం గానలఁబడి చెట్ల నుయ్యాలలూఁగు నొక్కొక్కమాటు
తల్లిదండ్రులఁ గనుగొని మెల్లమెల్ల నొద్దకరుదెంచు సవినయ మొక్కమాటు
అమితతేజఃపరాక్రముఁ డక్కుమారుఁ డాటపాటలఁ దవిలి మహాద్భుతముగ.
క॥ ఈలీలం గ్రీడించుచు బాలుం డట నైదునాళ్ల ప్రాయమువాఁడై
కాలునెడ నింద్రుఁ డాదిగ వేలుపు లెల్లరను మిగుల విహ్వలులగుచున్ ౧౫౭
క॥ అరుదెంచి మహాదేవుని బరిపరివిధముల నుతించి భయకారణమున్
సరిగ వచియించి తారకుఁ బరిమార్పం గొమరుసామి బాసట వేడన్ ౧౫౮
తే॥ జాహ్నవీగర్భమునయందు శంకరుండు సైన్యములకెల్ల నధ్యక్షు సలిపె నతని..
దేవదుందుభులట మ్రోసె. దివమునుండి పుష్పవర్షము గురిసెఁ బ్రభూతముగను.
ఆ॥ నీరుసాప తనదు నిరుపమానంబైన శక్తి వాహనంబు శైలరాజు
నిడుదు శక్తిధరుఁడు వడిలేచి గణకోటిపరివృతముగ ననికి బయలువెడలె. ౧౬౦
ఆ॥ మునిసమూహములకు మ్రొక్కి యతం డప్పుతాప్రవతికిఁ జేరి దండువిడిసి
శంఖమొత్తుటయును జనుదెంచెఁ దారకాసురుఁడు సంత సూఁదుచును రయంబ

ఉ॥ తారకు వెంటనంటి ఘనదైత్యసమూహము శంఖనాదసం
పూరితపద్మజాండమయి పోరన యుద్ధ ముపక్రమించుడున్
వారికి వీరికిన్ నడచె వారనిపో. రపు డాతి తేయులే
మోఁటిరి స్కందుసాయమది మిక్కుటమాట. నిఁకేమిచెప్పుదున్. ౧౬౨
తే॥ వాహనారూఢులై యనివార్యశౌర్యగర్వమునఁ బోరిపోరి రక్కసుల పిండు
ఛిన్నభిన్నంబుగానయ్యెఁ జిట్టచివర విష్ణుచక్రంబుచేతను విబుధవరాని! ౧౬౩
క॥ నెత్తురు నదులైపాఱఁగ నత్తిరున నసురమూఁక లఱవఱలగుడున్
సత్తిఁ బ్రయోగించె గుహుఁడు తత్తారకనామధేయదైత్యునిమీఁదన్. ౧౬౪
చ॥ సరథముగా ససారథిగ శక్తి తదాశరు మట్టగించుడున్
ధరఁబడు వారితీరుఁగని తక్కటిరక్కసులెల్లరున్ భయా
తురత రసాతలంబునను దూఱిరి. చేరి నిలింపులందఱున్
పరిపరిరీతులం బొగడి పాడిరి తత్ప్రభుకీర్తి వెల్గఁగన్. ౧౬౫
క॥ భేరీభాంకరణంబులఁ బూరితమయ్యెను జగంబు. పూవులసోనల్
జోరునఁగురిసె. నిఁకేమని పేరుకొనుదు గెలుపుగొనిన వేల్పులతీరుల్. ౧౬౬
ఆ॥ ప్రాప్తవిజయులైన భవపురోగామరు లమరసేనమీఁది యాధిపత్య
మొసఁగి గుహున కప్డు డొనరించి రభిషేక మెల్లలోకములకు నెఱుకపడఁగ.
ఆ॥ అంత గౌరి కొమరు నాలింగనమొనర్చి హర్షగద్గదోక్తు లతిశయిల్ల
చెలులతోడఁగూడి చెలఁగి మాంగల్యంబు లాచరించె ధన్యనైతిననుచు. ౧౬౮
తే॥ ఏడుదినములపాలుఁడై యీవిధమునఁ దారకాసురు వధియించి తల్లిదండ్రు
లకుఁ బ్రమోదంబు సేయుచు లలిపసించె మందరాచలశిఖరంబునం దతండు. ౧౬౯
క॥ అమితద్యుతిమంతుండగు కొమరు సకాలమునఁ బెండ్లికొమరుంజేయం
గ మదిందలంచి శంకరుఁ డుమతోడంగూడి యతని కొగి నిట్లనియెన్. ౧౭౦
ఆ॥ "తగినయీడువచ్చెఁ దనయ! నీకిప్పుడు. ప్రీతి వలయుకన్నెఁ బెండ్లియాడు.
పురుషధర్మమిది. అపూర్వవిహారము ల్సలుపు మమరయానములఁ జరించి"
క॥ అని యిబ్భంగిని పామరజనసులభంబైనయట్టి సరణిసె తన్నున్
జనుసును జనకునివాక్యము విని షాణ్మాతురుఁడు నవ్వి వే యిట్లనియెన్. ౧౭౨
క॥ "దృశ్యండ నేనె యంతట. దృశ్యాదృశ్యంబులందు దేనిగ్రహింతున్?
సశ్యమని దేని నిడుతును? వశ్యము నీ కెదియు. దీని వచియింపు గురూ! ౧౭౩
క॥ సర్వస్త్రీలనుగూడం బార్వతితో సమము గాను భావింతు నెదన్.
శర్వసమానులు పురుషులు. మార్వలుకంబోక నన్ను మన్నింపు మిఁకన్. ౧౭౪

## కుమారస్వామి వైరాగ్యమూని తపస్సుచేయుట.

కం॥ నీవు గురుండవు. నన్నుం బ్రోవుము మతి నరకకూపమునఁ బడకుండన్.
తావక మైన కృపం గదె యీవిజ్ఞానంబునాకు నేర్పడె నభవా! ౧౭౫

కం॥ కరదీపుఁడు వస్తువుఁగని కరణంబుం దాఁ ద్యజించుకరణిని యోగీ
శ్వరుఁడు పరమాత్మవస్తువు నెఱుఁగుచు సంసారమునకు నీవలనుండున్. ౧౭౬

తే॥ సర్వగంబగు బ్రహ్మంబు చక్క నెఱిఁగి వేనిచేతను గ్రియలెల్ల విడువఁబడునో
దాని యోగిగ నెఱుఁగఁగవలయుఁగాదె యవగతాశేష! హృతదోష! యప్పి [విభూష!

కం॥ జ్ఞానంబె దుష్ప్రాప్యము మానవుల. కదెట్లో కలుగ మతిమంతుం డ
జ్ఞానిని నిల్వకొనందగుఁగానీ పోఁగొట్టుకొనుట ఘనమగునొక్కో? ౧౭౮

సీ॥ నిర్గుణబ్రహ్మంబ నేనుగానీ యహంభావంబువహియించువాఁడఁ గాను.
ఉంటి నెప్పటినుండియో యంతియే కాని కన్నతల్లియునాకుఁ గానఁబడదు.
అందఱికిని దండ్రి నగుదు నే నేకాని నాకులేఁ డొకతండ్రి లోకమందు.
సకలభూతములకు సముఁడనౌదునుగాని లే రిష్టబంధువుల్ వేఱ నాకు.
భువనభిన్నభావముం బొందితిని ద్వత్ప్రసాదసిద్ధమైన జ్ఞానమునను.
ఈ ముముక్షువున కిఁకిద్పృథువిధములౌ వాక్యములను జెప్పవలదు వలదు" ౧౭౯

కం॥ అని వైరాగ్యముఁబూనిన జనని కదుం గోపగించి "చాలుం జాలున్
తనయ! ఇదియేమిరా" యని కనుకని యేమేమొ చెప్పఁగాఁ గడఁగుటయున్ ౧౮౦

ఉ॥ తల్లికిఁ దండ్రికిన్ గుహుఁడు శ్రద్ధయుభక్తి నమస్కరించుచున్
మెల్లగఁ గ్రౌంచపర్వతమువీఁదికిఁ బోయి యొకాశ్రమంబునం
దుల్లమునందు బ్రహ్మమున యుంచి జపించెను ద్వాదశాక్షరం
బెల్లజగంబు మిథ్యయని యెంచుచుఁ బిల్లఁడయయ్యె నారదా! ౧౮౧

ఆ॥ మొట్టమొదట ధ్యానమునఁజేసి యఖిలేంద్రియములఁ దనయధీనమందు నిలిపి
మమతఁ బాఱఁదోలి మహనీయమైనట్టి జ్ఞానయోగమూనె షణ్ముఖుండు. ౧౮౨

ఆ॥ విఘ్నరహితముగను వేవేగ నణిమాదిసిద్ధు లతని చెంతఁ జేరుటయును.
తద్గుణంబుగాంచి తద్దయుం గ్రుద్ధుఁడై హితముగ బుద్ధిఁ గొనుచు నిట్టులనియె. ౧౮౩

కం॥ "నాయొద్దకుఁగూడను దుర్ధీయుక్తత వచ్చియుందురేని శాంతిని మ
తాప్రియులగువారి కెప్పుడుఁ జేయకుఁ డభిభూతి మీరు చెప్పితిఁ గానన్" ౧౮౪

చం॥ అనియిటు చెప్పి శాంతిగరి నాగుహుఁ డుండు టెఱింగి జ్ఞానయో
గ నియతి నాత్మజుండు తనకంటె ఘనుండని జ్ఞానియౌటచే
ననుకొనె శంకరుండు. పరమాద్భుతమందెను. గాని యద్రిరా
ట్తనుభవ పుత్రశోకపరతం గృశియించె నిఁకేమిచెప్పుదున్. ౧౮౫

కం॥ శుభవాక్యామృతమున నా యిభగమనం గూడఁ దేర్చె నీశ్వరుఁ డో యా
త్మభవా! యీతన్మహిమము ప్రభవంబగుఁజూమ్ము పాపపరిహారమునన్. ౧౮౬
ఆ॥ కర మభేదబుద్ధి హరియో హరుండో ధ్యానింపఁబడి ఘనార్తినిన్ హరింత్రు.
వారె భేదబుద్ధి వర్తించువారికిఁ బరమశత్రువులుగఁ బరిణమింత్రు॥" ౧౮౭
వ॥ అనియిట్లు బ్రహ్మ నారదునకుఁ జెప్పిన మాహాత్మ్యము విస్తరించి మీకు వక్కాణించితి. ఇంక నేమివినవలతురు" ౧౮౮

## —♦ భీష్మపంచకమాహాత్మ్యము ♦—

కం॥ అనియిట్లు సూతుఁడు పలుకుడు మునులు "హరి పరుండునపుడు ముఖ్యముగాఁ జే
యనయిన వ్రతములు నియమము లనఘ! యసంఖ్యాకములు దయం జెప్పితి. నో!
ఆ॥ అలసులైన ప్రజల కవ్వాని నన్నింటి జరుప నెవ్విధమున శక్యమగును?
వ్రతమొ దాన మేనొ యతిసుకుమారులుం జేయఁదగిన దున్నఁ జెప్పు" మనుడు ౧౯౦
వ॥ "సుకుమారశరీరుఁడై నియమంబుల నెఱపుట కశక్తుఁడైనవాఁడు విఖ్యాతమైన భీష్మపంచకం బాచరించునది. కార్తికశుద్ధైకాదశీతిథిం బ్రొద్దు పొడవకమున్న లేచి నిర్వర్తితకాల్యకృత్యుండై వాసుదేవపరాయణత్వమున నియమంబుఁ బూని యుపవసించునది. శక్తిచాలనిచో శక్తివంచనము లేకుండ స్వర్ణంబును హవిష్యాన్నంబును హరిభక్తులైన యవనీసురుల కర్పించునది. ఏనుదినంబులు నీప్రకారంబుగా వ్రతంబు చరించి
సీ॥ కర్పూరసహితమై కచ్చూరమిళితమై కర మొప్పు చందనగంధ మలఁది
అగరువు గుగ్గిల మాది దిగాఁగలయట్టి తగినద్రవ్యంబులం బొగలు వేసి
పాయసాపూపాది బహుభక్ష్యములతోడి పలు మహానైవేద్యములను బెట్టి
సత్కథాకీర్తన శ్రవణాదికములచే రాత్రివేళల జాగరములు చేసి
భక్తి జలశాయిరూపుఁడౌ పద్మనాభు నైదునాళులు పూజించునది క్రమముగ.
ఆఱవదినంబునను సువర్ణాన్నవస్త్రదానములఁ దన్పునది భూమిదైవతముల. ౧౯౨
వ॥ అంత నంజలింబట్టి "నియమంబులన్నియు నిర్వర్తించితిని గాన వ్రతపరిపూర్తి ననుగ్రహింపు"డని యవనీసురుల యాచించునది. "వ్రతం సువ్రతము" స్తని వారును వక్కాణించునది. పదపడి బ్రాహ్మణులం బంపించి కాయశుద్ధిపొంటె సకుశోదకపంచగవ్యప్రాశనపురస్సరంబుగా భుజించునది. ఎవఁడీవ్రతం బీవిధంబునం గావించు వానికి బహుపుణ్యంబు ప్రాప్తించు. నైదుదినంబులు నాహారంబు వర్జించియే యాచరించిన నది శతగుణంబయ్యెడు. ౧౯౩

సీ॥ ఆద్యదినంబునం దగరుసఁ బోగవేసి జాజిపూవులఁ బూజ సలుపవలయు.
మఱునాఁటిధూపంబు మంచి గుగ్గిలమున. మారేడుదళముల మహితపూజ.
మూఁడవదివసంపుఁ బోగ కప్పురంబున. అరవిందములచేత నర్చనంబు.
నాలుగవయహస్సునం దగరపుఁ బోగ. సంపంగివిరుల ప్రసాధనంబు.
పంచమమున లవంగంపుఁబట్టిపోగయు భృంగరాజంబునం బరిష్కృతివిధాన.
మాఱవదియగు పాడ్యమి నన్నియు నుపయోజ్యములు పోగ. కన్నిటం [బూజ్యుఁడు హరి. ౧౬౪

శ్లో॥ జలశాయీ జగద్యోని శ్శేషపర్యంకమాశ్రితః
అర్ఘ్యం గృహ్ణాతు మే దేవో భీష్మపంచకసిద్ధయే.

వ॥ అను మంత్రంబున హరి కత్యంతభక్తి నర్ఘ్యంబిచ్చునది. శ్రవణమాత్రంబున వ్రతనియమఫలప్రాపకంబగు భీష్మపంచకం బంతయు మీకు వక్కాణించితి.” ౧౬౫

## అశూన్యశయన వ్రతమాహాత్మ్యము

కం॥ అని సూతుఁడు వాకొనుటయు మును “యింద్రుఁడు సుష్టుఁడైన మురహరుఁ బ్రీతుం
బొనరుప నొనరించియుండిన యనఘుంబు నశూన్యశయనమను సువ్రతమున్. ౧౬౬

ఆ॥ తత్ఫలంబుగూడ దయఁ జెప్పియుంటిరి. ఎపుడు తద్వ్రతంబు నెవ్విధిం జ
రించుటొప్పు? విస్తరించి దానివిధాన మానతీయు” మనుడు నక్కథకుఁడు ౧౬౭

వ॥ “శ్రవణనక్షత్రసహితంబగు శ్రావణ బహుళద్వితీయం బ్రాతఃకాలంబున లేచి పాపిష్ఠులతోడను పతితులతోడను మ్లేచ్ఛులతోడను సంభాషింపకుండ స్నాతుండును ధౌతాంబరధరుండును శుద్ధుండును నై మధ్యాహ్నంబున జలశాయిని సమీపించి

శ్లో॥ శ్రీవత్సధారిన్ శ్రీకాంత శ్రీధామన్ శ్రీపతేఽవ్యయ
గార్హస్థ్యం మా ప్రణాశం మే యాతు ధర్మార్థకామదం
పితరో మా ప్రణశ్యంతు మా ప్రణశ్యంతు చాగ్నయః
దేవతా మా ప్రణశ్యంతు మత్తో దాంపత్యభేదతః
లక్ష్మ్యా వియుజ్యతే కృష్ణ నకదాచి ద్యథా భవాన్
తథా కళత్రసంబంధో దేవ మా మే ప్రణశ్యతు
లక్ష్మ్యా హ్యశూన్యం శయనం యథా తే దేవ సర్వదా
శయ్యా మమా ప్యశూన్యాస్తు తథా జన్మని జన్మని.

వ. అనుమంత్రంబున నాత్మాభీష్టంబు నివేదించుచుం బూజించి వివర్జితవిత్తశాఠ్యంబుగా విప్రునర్చించునది. ఇబ్భంగి నక్షారభోజనంబుగను విశేషించి తైలవర్జితంబుగను భాద్రపదాశ్వయుఃకార్తిక మాసంబులందుఁగూడ జగన్నాథుండును నచ్యుతుండును నగు జలశాయిని సంసేవించునది. సమాప్తమగుటయు సఫలవ్రీహి నగు శయ్యను సవస్త్రకంబుగను ససువర్ణదక్షిణంబుగను సభక్తికంబుగను సర్వాంసహా

మరునకు సమర్పించునది. ఇట్టివ్రతం బెవ్వఁడుచేయు నానియెడల శక్తునియెడలం బోలె జగద్గురుండగు జలశాయి సంతుష్టుఁడయ్యెడు. అతనికి జన్మజన్మంబులను నశూన్యశయనంబు సిద్ధించెడు. అశూన్యశయనవ్రతంబుననుండి యజ్ఞానంబునఁగాని జ్ఞానంబునఁగాని యష్టమాసంబులు నాచరించిన యఘం బంతంబునొందు. పుత్రహీనయౌఁ గాకవంధ్యయు నీ వ్రతంబుచేసినఁ బుత్రులఁబడయుదురు. విధవ గావించిన విష్ణు ననుగ్రహంబున విగ్రహశుద్ధి వెనువెంట సంప్రాప్తించు. నిష్కాములచే నీ వ్రతము కృతమయినఁ జాతుర్మాస్య నియమాచరణంబున నొలయు ఫలంబు కలిగెడిని" ౧౯౯

## మంకణేశ్వరమాహాత్మ్యము

ఆ॥ అనుడు "వేనిలోని యవగాహనంబున నఖిలతీర్థఫలము ప్రాప్తమగునొ
హాటకేశ్వరంబునందలి యా ముఖ్యతీర్థములను నీవు తెలిపినావు. ౨౦౦

ఉ॥ అచ్చటి ముఖ్యలింగముల నన్నిటిఁ దెల్పితి. వేని దర్శనం
బిచ్చునొ సర్వలింగసమవేక్షణపుణ్యము వానిఁ దెల్పు" మం
చచ్చుపుభక్తి మౌనిజను లందఱుఁ బ్రశ్నము సేయ నీఁదటన్
సచ్చరితుండు సూతజుఁడు సాంద్రకృపామతి వారి కిట్లనున్. ౨౦౧

సీ॥ "మంకణముని తపోమహిమ నేర్పడినట్టి మంకణేశ్వరనామ మహితలింగ
మనవరతంబు సిద్ధార్చ్యమానంబౌచు సిద్ధేశ్వరంబనఁ జెలఁగు లింగ
మల గౌతముఁడు తొల్లి నిలిపియుండినయట్టి గౌతమేశ్వరమను ఖ్యాతలింగ
మధ్వరసమయమం దజుఁడు స్థాపించిన యా కపాలేశ్వర మనెడి లింగ
మిచ్చు నొక్కటొకటి యెల్లలింగంబులు నిచ్చుఫలము సంయమీంద్రులార!
అందు మంకణేశ్వరాఖ్యలింగ మహాత్వమును వచింతు వేఱ వినుఁడు శ్రద్ధ. ౨౦౨

వ॥ మఱియు నాతురయుక్తంబైన తల్లింగంబును శివరాత్రి నుపవసించి పూజించి జాగరంబు గావించిన జనంబునకు సర్వలింగసందర్శనంబువలని ఫలంబు సమకూరుటకు సంశయముండదని శంకరుండు స్వయముగా వచించియున్నవాఁడు" ౨౦౩

ఆ॥ అని యిటు ల్వచింప నాద్విజుల్ "శివరాత్రియనఁగ నెపుడువచ్చునది? తదీయ
మహిమ మెట్టి?" దనుచు రహిని బ్రశ్నించుడు సూతసూతి కరము ప్రీతుఁడగుచు

వ॥ మాఘబహుళచతుర్దశినాఁటి రాత్రి శివరాత్రియని చెప్పంబడియెడి-అప్పుడు సర్వలింగములయందును సాంబశివుఁడు సంక్రమించినను విశేషించి మంకణంబున విలసిల్లెడు"

క॥ అని నుడువుటయును ముని "తెలుపు డనఘా! శివరాత్రి నేమహాత్ముఁడు నిర్మిం
చెను? బహుఫల మేలయ్యెను? కనికరమున విస్తరంబుగాఁ జెప్పు" మనన్ ౨౦౪

## —♦ శివరాత్రిమాహాత్మ్యము ♦—

వ॥ ఇచట మీకుఁ బూర్వము భృగ్యయజ్ఞునకును నశ్వసేనునకును నడచిన సంవాదరూపమగు గాధను వాకొన్చెద. ధర్మపరుఁడును వేదవేదాంగపారగుఁడును నానర్తదేశాధిపతియునై తొల్లి యశ్వసేనుఁడని యొకరాజుండెడి. నాయశ్వసేనుఁడు దినక్రమమునవచ్చు కలికాలమును వీక్షించి కుతూహలంబున భృగ్యయజ్ఞుదిక్కు మొగంబై ౨౦౭

కం॥ "కలికాలంబున శ్రమముంగలిగింపకె యధికపుణ్యకరమును బాపం
బుల నెల్లం దెగటార్పంగలదియు నగునొక్క వ్రతము కరుణంజెపుమా ౨౦౮

ఆ॥ నరుల కాదియుగమునం ద్రేత ద్వాపరమందుఁ గొలఁదిఁ యాయు వరసిచూడ
కలియుగంబురా నిఁకంగూడఁ గరమల్పమనుట కేమిసంశయంబు గలదు?

ఆ॥ కాననేండ్లుపూండ్లు కావింపఁదగినట్టి వ్రతముకాక యొక్క వాసరంబె
చేయఁదగినదున్నఁ జెప్పుమీ భృగ్యయజ్ఞాభిధానమహీసురాగ్రగణ్య! ౨౧౦

కం॥ రేపటిపని యీదినమును మాపటిపని పగలెచేయు మతిమంతుఁడుతా.
పాపిష్ఠమృత్యువాఁగునొకో పనికాకున్ననైన నోమహనీయా!" ౨౧౧

వ॥ అనివచించుటయు నుదారబుద్ధియగు భృగ్యయజ్ఞుండు దివ్యచక్షుస్సువునఁ దడవువీక్షించి ౨౧౨

తే॥ "అనఘ! శివరాత్రినాఁనుక్కె కామ్యకవ్రతము సమస్తాఘనాశక మమితపుణ్య.
మపుడొనర్పఁగఁబడు దానహవనజపములెల్ల నక్షయఫలము లిఁకేమికలదు?

సీ॥ అప్రాప్తతనుజాతుఁడైన మర్త్యుండు తా నాప్తతనూజాతుఁడగును రాజ!
పుట్టుదరిద్రుఁడై పొక్కుడు జనుఁడు తా నత్యంతధనవంతుఁడగును రేఁడ!
అల్పాయురన్వితుఁడైన మానవుఁడు తా నధికదీర్ఘాయుష్కుఁడగు దునీఁడ!
అరితిరస్కృతుఁడైన నరనాయకుండు తా నరివీరులను గెల్వనగు ధరేశ!
ఎవ్వరేకోరికంగోరి యీవ్రతంబుసేయుదురో వార లాకోర్కె శీఘ్రముగను
పొందుదురు. కోర్కెలేకుండఁబొనరుచుప్రజ పొందు నిశ్రేయసంబు నోభూమిపాల!

ఆ॥ దానధర్మములను దగనాచరింపని పిసినియేని రాత్రి వేళ జాగ
రంబుచేయ వత్సరం బొనరించినయఘమునుండి ముక్తుఁడగును భూప! ౨౧౪

కం॥ స్థిరములు చరములునగుచుం బరఁగెడి లింగంబులందుఁ బరిపూర్ణుండై
హరుఁడుండు రాత్రియగుటను ధరణిని శివరాత్రియందు్రదాని నభిజ్ఞుల్. ౨౧౫

కం॥ లోకానుగ్రహకాంక్షను నాకేశుఁడు చంద్రచూడు "నందితురంగా!
ఈ కలికాలము సకలాఘాకర. మటుగాన యుష్మదర్చన వలనన్ ౨౧౬

ఆ॥ జనులు పూతులగుచు సంవత్సరాంహస్సునుండి ముక్తులగుట కుర్విమీఁది
కరిగి యొక్కదివస మధివసింపుము దేవ! నిన్ను మిగుల వేడుచున్నవాఁడ. ౨౧౭

ఆ॥ అంతవారిచేత నర్పింపఁబడినది వేల్వఁబడినదియును నేగ మాకు
చేరఁగలదు. మున్ను వారిచ్చుచుచ్ఛిష్ట మఖిలమకట! వ్యర్థమగుచునుండె. ౨౧౯

కం॥ కలికాలమున నశుద్ధాత్ములచే నీఁబడు ప్రభూతమును శంకర! మా
కు లవంబేనియుఁ జెందదు. తిలకింపు" మటంచుఁ గరము దీనతఁబలుకన్ ౨౨౦

కం॥ శితికంఠుఁడు "మాఘాసితచతుర్దశీతిథిని రాత్రి శాస్త్రస్థలమునకున్
శతమన్యూ! సంవత్సరకృతపాపవిశుద్ధికొఱకుఁ గృపతోడను నేన్ ౨౨౧

కం॥ స్థిరచరలింగంబులనెల్ల రహింజని సంక్రమింతు. లలి నయ్యెడ నే
నయుఁ డసన్మత్పూజనమును జరుపు నఘోరాయముఖ్య సన్మంత్రములన్ ౨౨౨

కం॥ పాపవివర్జితుఁ డగునతఁ. డీపగిదిని వ్యక్త్రములను హితమతిసుమనో
ఘూపాదులనర్చించి మహాప్రజ యీ వలయు నర్ఘ్య మీ మంత్రమునన్ ౨౨౩

శ్లో॥ గౌరీవల్లభ దేవేశ సర్వాద్య శశిశేఖర
వర్ష పాపవిశుద్ధ్యర్థ మర్ఘ్యో మే ప్రతిగృహ్యతాం.

కం॥ పదపడి యశనము వసనము మొదలగు ద్రవ్యములచేతఁ బూజించి గుణా
స్పద! విత్తశాఠ్యమును విడిచి దక్షిణ యొసంగవలయు క్షితిదేవులకున్. ౨౨౪

ఆ॥ ధర్మకథలతోడఁ దాండవంబులతోడ జాగరంబు రాత్రి సలుపవలయు.
ఒక్కయేడు చేసియుండినయఘమువోఁ దద్వ్రతమ్ము పాటితమ్ము చుమ్ము"

కం॥ అనవిని వేలుపులెల్లరు ఘనమోదముతోడ గరళకంఠునకున్ మ్రొ
క్కినవారయి తమయిండ్లకుఁజని శివరాత్రిమహిమంబు శాస్త్రస్థలిఁ దెలుపన్

కం॥ నారదుఁబంపించుటయును ధారుణియెల్లంజరించి తన్మని ప్రజలన్
గూరిచి బోధించెఁ. గడుం బేరువహించె శివరాత్రి పృథివీశ! యటన్. ౨౨౭

కం॥ ఈ విషయంబున నొకకథ వేవచియించెదను విన్మ. విఖ్యాతంబౌ
పావనమై మిశవనమున వావిరి నొకలుబ్ధకుండు వసియించెను దాన్. ౨౨౯

ఉ॥ ద్యూతము మున్నుగాఁగలుగు దుర్వ్యసనంబులఁ జిక్కువాఁడు వి
ఖ్యాతికివచ్చెఁ జౌర్యమున. నట్లుచరించి చరించి యంతఁ దా
నాతత పుణ్యదాత్రియగు నాశివరాత్రిని భక్తులౌ జనుల్
ప్రీతి శివాలయస్థులయి పెక్కురు జాగరణంబు సేయఁగన్ ౨౩౦

ఉ॥ "సొమ్ములుపెట్టుకొన్న యొకసుందరి తాగుడినుండి వచ్చుచో
హుమ్మని పట్టికొట్టి యెటులో హరింపఁగనా" నటంచుఁ జి
త్తమ్మున నిశ్చయించుకొని తత్సవిధస్థలినుండు కర్ణికా
రమ్ముననెక్కి గుప్తముగ రాతిరియెల్ల వసించె నేమనన్. ౨౩౧

ఉ॥ ఏకడనుండి యెవ్వరిత యీవలకుం జనుదెంచునో యటం
చాకుజనుండు శీతమున కార్తిని జెందుచుఁగూడ దానిపైన్
వీఁకవసింప నించుకయు నిద్దురపట్ట దొకర్తయేని తా
నా కథవింటమాని బహిరాగతకా దిఁక నేమనన్వలెన్. ౨౩౨

కం॥ తానెక్కి కూరుచుండిన మ్రానునకుం గ్రిందనొక్క మహనీయత్వం
బూనిన లింగంబుండఁగ నానీచుఁడు తోఁచితోఁచ కాకులఁ బూలున్ ౨౩౩

ఆ॥ త్రెంచివైచుటయును దిన్నగా నవి శివలింగమందుఁ బడియె లీలఁబోయి.
జారచోరసంఘసంకటకారుఁడై యంతలోనఁ బొడిచె సర్పముండు. ౨౩౪

కం॥ అంతట స్త్రీలుం బురుషులు శాంతమనస్కతను లేచి శంకరునకు న
త్యంతమ్ము మ్రొక్కి స్వస్వనిశాంతములకుఁ జనిరి హరహరాయను నుడులన్. ౨౩౫

కం॥ ఆ దొంగవాఁడుగూడను వేదిగి గన్నెరునుండి విహ్వలమతియై
ఏదెసకో పలాయితుఁడయి తాఁదనువును విడిచెఁ గొంతతడవునకు నృపా! ౨౩౬

తే॥ అంత యాదృచ్ఛికంబుగనైన యట్టి జాగరాదుల వలననే వేగనాతఁ
డల దశార్ణాధిపతియయ్యె. నంతఁబోక యయ్యె జాతిస్మరుండును. నహాహా! వింటె.

కం॥ పిత్రుపైతామహ సకలక్షితినాయకతన్వహించి శీఘ్రంబుగ ను
న్నతి మునుపూజించిన పశుపతిలింగంబునకుఁగట్టెఁ బ్రాసాదంబున్. ౨౩౮

కం॥ ప్రతిసంవత్సరమును నాక్షితిపతి శివరాత్రి నుపవసించి పురాణం
బితిహాసంబును వినుచుం గృతజాగరుఁడగుచు వచ్చెఁ గేవలభక్తిన్. ౨౩౯

సీ॥ సుస్నాతుఁడును బరిశుద్ధాంశుకచ్ఛన్నుఁడు పవిత్రుఁడునునయి యుపవసించి
తొంటి మంత్రంబులతోడను శివలింగమున కష్టప్రాజనమును బొనర్చి
ఆటపాటలతోడ హరకీర్తనముతోడ రాత్రియంతయు జాగరంబొనర్చి
రమణీయ శేమపదార్థ ప్రదానంబుచే ధరణీదైవతములఁ దనియఁజేసి
నిజనివాసంబునకుఁ బోవు నృపతి నొకటఁ బులహగాలవ గార్గ్యాది పుణ్యమునులు
తచ్ఛివాలయమున వచ్చిదర్శనంబు నిచ్చుటయును వారికెల్లర కెరఁగి భక్తి ౨౪౦

కం॥ తదనుజ్ఞాతుండై యట ముదమునఁ గూర్చుండుటయును మునివరులెల్లన్
సదయతఁ బురాణగాథలు చదివి వినిచి కొంతవడికి క్ష్మాపతితోడన్ ౨౪౧

ఆ॥ "రాజ! యడుగువార మోజ నినొక్కటి దేవునెదుట నిజముదెల్పవేని"
అనుడు "నట్లె చెప్పెదను మీకు నాతోడెటింగియున్న" ననుచు నృపతి పలికె.

ఉ॥ అంత మునీంద్రులిట్లనిరి. "ఇలాధిప! దానముఁదొట్టి యెన్నొ య
త్యంతము నాచరించుటకు నర్హములైనవి యుండ వాని నీ

వెంతయు వీడి జాగరమునే పొసరింపఁగవచ్చుచుందు కా
లాంతకునాలయంబునకు - నందలిసత్తయెఱుంగ మెద్దియో. ౨౪౩

ఉ॥ గోప్యముగాకయున్నది కొంచెము మాకును జెప్పుమయ్య కా
శ్యప్యధినాథ!" యంచునిటులాడ విలక్షణమైన నవ్వుతో
"గోప్యమ. యౌను గాక. మునికుంజరులార! వచింతు దేవసా
మీప్యమునన్ వచింతునని మీకడ వాకొనియుంట" నంచటన్ ౨౪౪

సీ॥ తొలుతటి భవమున దొంగయైశివరాత్రి వచ్చియీగుడిలోనఁ జొచ్చుటయును
యాదృచ్ఛికంబుగా నవనీతహాముక్రింది శివలింగమున కర్చ సేయుటయును
ఉపవాసకృశతమైఁ గృపణభావమునూని యొగినందు జాగరంబుండుటయును
పూర్వజన్మజ్ఞానమును వీడ కియ్యెడ భూపాలకునియింటఁ బుట్టుటయును
వరుసగావచింప వాచంయము లేమ్మెలు మేలటంచుఁ బొగడి మిక్కుటముగ
దీవనంబులిచ్చి వావిరినారాత్రి జాగరంబుసల్పి చనిరియవల. ౨౪౫

క॥ అట్టేడుగూడ శంభు నుదారతఁబూజించి యోగధారులయెడలన్
గౌరవముఁ జూపి జాగర మారాతిరి సల్పిచనియె స్వాలయమునకున్

కం॥ శివరాత్రి యీవిధంబున నవనీతలమందు వెలసె. నటుగావున నీ
శివరాత్రి నామకవ్రత మెవరికినిం గార్య. మింక నేమనవలయున్. ౨౪౬

సీ॥ నలుని దిలీపుని నహుషుని మాంధాత ధుంధుమారు యయాతుఁ దొట్టినృపులు
శ్రీసరస్వతి శచి సీత యరుంధతి సావిత్రి మేన ద్రుపదసుత స్వధ
స్వాహా ప్రభావతి సంప్రీతిగాయత్రి రంభాదికాప్సరల్ రతిమొదలగు
నుత్తమస్త్రీలు దామొనరించి యీవ్రతం బాప్తస్వకాములై యలరియుండి.
రెవరు భూతినిచ్ఛయింతురో కలికాల మీవ్రతంబు వారి కింకముఖ్య.
మెవ్వఁ డీసుగాథ నీశ్వరుసన్నిధిం జదువు వానికిల్బిషంబు వాయు. ౨౪౭

ఆ॥ గంగననుకరించు ఘనతీర్థములు లేవు లేవు శివునిబోలు దైవతములు
క్షితిని గానఁబడదు శివరాత్రితోసమంబైనతపము. సత్య మరయనిద్ధి. ౨౪౮

ఆ॥ నిఖిలరత్నమయము నిజముగా మేరువు. నిఖిలవిస్మయములనిలయము తప.
మఖిలధర్మరూపమగును దా శివరాత్రి. అశ్వసేన! ఇంత కధిక మెద్ది? ౨౫౦

కం॥ గరుడుఁడు పక్షులకుంబలె సరిత్తులకునెల్ల నల్లసాగరుపోల్కిన్
వరధర్మంబులకెల్లను ధరణిని శివరాత్రి దాఁ బ్రధానంబు నృపా! ౨౫౧

## —♦ తులాపురుషదానమాహాత్మ్యము ♦—

ఆ॥ కాన నుభయలోకకాంక్షియౌ విద్వత్ప్రమాంసుఁ డో మహీశ ! మనమునందు
చంద్రచూడు నిల్పి శ్రద్ధ నీశివరాత్రివ్రతము నాచరింపవలయుఁ జుమ్మ" ౨౪౨

ఆ॥ అనుడు నశ్వసేనుఁ "డార్య ! సిద్ధేశ్వరమహిమ మెల్ల నాదుమదికి బోధ
కావచింపుమయ్య, కరము కుతూహలపడుచునుంటి నేను భావమందు" ౨౪౩

ఆ॥ అనిన భర్తృయజ్వుఁ "డనఘ ! సిద్ధేశ్వరోత్పత్తి మున్న విశదపఱచియుంటి.
తగ వచింతు నిపుడు తద్దేవు దర్శించి చేయు దానమునను జెందుఫలము. ౨౪౪

కం॥ ఇలయెల్ల నేలనగుఁ బో తులాపురుషదానమునను దోడన యన "నే
లలి సలుపవలెనో చెపు మత్తులాపురుషదాన" మనుచు దొర ప్రశ్నింపన్ ౨౪౫

సీ॥ "రవియును జంద్రుండు రాహుకేతువులచే గ్రసియింపఁబడినట్టి కాలమందొ
మకరకర్కటకంబులకు గ్రహనాథుండు సంక్రమించెడి పుణ్యసమయమందొ
చంద్రుండు పూర్తిగా సంక్షయంబందిన వరతిథి యగు నమావాస్యయందొ
పావనజలములౌ భాగీరథీముఖ హ్రదినీ పుణ్యతీర్థములయందొ
విషువమందొ సాధువిప్రుల కీతులాపురుషదాన మెలమి జరుపవలయు.
నని ప్రశంసఁజేతు రార్యులు భూపాల ! వినుము దాని తెఱఁగు వినుతు నింక. ౨౪౬

కం॥ ప్రాగుత్తరముల వాలై బాగుగఁ గనఁబడుచునుండు పావనదేశం
బేగి పదియాఱుమూరలతోఁ గావింపఁగవలయు దొర ! మండపమున్. ౨౪౭

ఆ॥ దాని నడుమను యజమానుని మూరతో మూరెఁడెత్తు నాల్గుమూరల పొడ
వు వెడలుపును గలిగి పొలిచెడి యరుగొకం డమరిపింపవలయు నశ్వసేన ! ౨౪౮

కం॥ నాలుగుదిక్కులయందును నాలుగుమూరల చదరపు నాలుగుకుండా
లోలిని నైశాన్యంబగు మూలను నొకమూరకుండమును మఱియొకడున్ ౨౪౯

ఆ॥ వేయఁజేసి యచటఁ బిడివెత్తిమూరెఁడు గ్రహములుంచవలయుఁ గాశ్యపీశ !
ఇద్దరిద్దరినిగ నెల్లకుండంబులయొద్ద ఋత్విజులను నుంచవలయు. ౨౫౦

తే॥ తచ్చతుర్వేదశాఖల ధరణిసురుల ద్వారమున నేల్పవలయును వహ్నియందు.
లలిని దగ్గింగమంత్రంబులను జపంబు శక్తియున్నంత యష్టైక సలుపవలయు. ౨౫౧

ఆ॥ మూరలావు నాల్గుమూరల పొడవును గలుగు రెండు స్తంభములను వేది
ప్రక్క నుత్తరముగఁ బాఁతించి యా దెబ్బతీక ట్టై వాని నడుమఁ బెట్టవలయు. ౨౫౨

సీ॥ మంచిగందపుమ్రానో మఱి దేవదారువో మారేడువృక్షంబో మఱ్ఱిచెట్టొ
చండ్రయో యశ్వత్థశాఖియో తుమికియో టేఁకుమ్రాఁకో యటు శ్రీకగములు.
ఈయెన్మిదింటిలో నేదేని యొకదానితో రెండు స్తంభము లూఁగుచుకొని
యూట్లు రెండుండిన యొకత్రాసు రచియించి స్నాతుఁడై శుభ్రవస్త్రములు దాల్చి

శ్వేతమాల్యానులేపనాన్వితుఁడగుచు లోకపాలురఁ బూజించి యాక్రమముగ
గంధమాల్యాదికంబులం గంబములకుఁ బూజ గావింపవలయును భూమినాథ! ౨౬౩

తే॥ తులకుఁ బుణ్యాహవాచన మెలమి సలిపి తనువునంగల సకలాయుధములతోడ
ప్రాఙ్ముఖంబుగఁ బడమటిపార్శ్వమందు నిలిచి యంజలి జోడించినిశ్చలముగ ౨౬౪

శ్లో॥ బ్రహ్మణో దుహితా నిత్యం సత్యం పరమ మాశ్రితా
కాశ్యపీ గోత్రతశ్చైవ నామతో విశ్రుతా తులా. ౨౬౫

త్వం తులే సత్యనామాసి స్వాభీష్టం చాత్మన శ్శుభం
కరిష్యామి ప్రసాదం మే సాన్నిధ్యం కురు సాంప్రతం. ౨౬౬

మ॥ అను మంత్రంబు జపించి యంతఁ దులయం దారూఢుఁడై శక్తియుం
డినయంతక్ రజతంబొ పుత్తడియొ యన్నంబైన స్వాభీష్టవ
స్తు నికాయంబొ సమార్జితంబయిన దచ్చో నొండుశిక్యంబునన్
తనతోఁ దూఁగెడునంతయో యధికమో ధాత్రీశ! పెట్టింపనౌ. ౨౬౭

తే॥ ఉట్టిలోఁ గూరుచుండి యయ్యోజ నంత నభిమతంబగు దేవత నాత్మఁ దలఁచి
తత్ప్రియంబుగ సతిలాక్షత కలధౌతముగను విడువంగవలె జలములను జలము.

ఆ॥ ఉట్టివలననుండి యొయ్యన దిగి యంతఁ దక్కనుట్టినున్న తత్సమస్త
మవనిసురుల కొసఁగు నవ్వాని పున్నెంబు నవహితుండవగుచు నాలకింపు. ౨౬౮

సీ॥ జ్ఞాత మజ్ఞాతమో సకలపాపంబును బొలియించు నీతులాపురుషదాన.
మెంత యతీతమో నంతపాతకమును విరియించు నీతులాపురుషదాన.
మఖిలాపదలఁగూడ నంతంబునొందించుఁ ద్వరలోన నీతులాపురుషదాన.
మాధిని వ్యాధిని నావలఁదఱుముఁబో నరపాల! యీతులాపురుషదాన.
మొదవ దాత్మీయబంధువియోగ మెడ్డు నీతులాభారమునఁజేసి భూతలేంద్ర!
మఱియుఁ గలియుగమున దీనిమహిమ మింతయని వచింపంగఁ దగను కాదవనినాథ!

సీ॥ ఇక్ష్వాకువంశమం దెనలేని సత్కీర్తి స్థాపించినట్టి దిలీపనృపతి
కరసహస్రంబుచే నరితిరస్కృతిసల్పి యలరిన కార్తవీర్యార్జునుండు
పృథివిని నేర్పుమైఁ బృథుగోవుగంజేసి యోషధులం బిండియున్న పృథువు
చక్రవర్తులలోన సమధికంబగు ఖ్యాతి గొనియున్న యల పురుకుత్సరాజు
మఱియుఁగొందఱు నీతులాపురుషదాన మాచరించి మహాధన్యులైనవార.
లట్లుగావున సిద్ధేశ్వరాంతికమున ముఖ్యకర్తవ్య మియ్యది భూమిపాల! ౨౭౦

తే॥ క్షితిప! శ్రీహాటకేశ్వరక్షేత్రమందుఁ గల సకలతీర్థములు దేవనిలయములును
నొకటి సిద్ధేశ్వరుఁడు నఱియొకటి యనుచు బ్రహ్మచేత వచింపంగఁబడిరెమునుపు.

క౦॥ ఆదేవుని దర్శనమో కాదేశ దత్స్పర్శనంబో కా కర్చనమో
ఏదేని తక్కున్నయునీఁదగు సమధికఫలంబు నిచ్చునృపాలా ! ” ౨౭౨

## —♦ భూదాన మాహాత్మ్యము ♦—

వ॥ అని యిట్లు భర్తృయజ్ఞుండు వాకృచ్చుటయు నానర్తదేశాధిపతి ౨౭౩

క౦॥ “ ఏకర్మం బొనరించినఁ బ్రకటమగు చక్రవర్తిపద మేతద్భూ
లోకమునఁ బడయనగునో వాకొను మోసంయమీంద్ర! వరగుణసాంద్రా! ” ౨౭౪

వ॥ అని యడుగుటయు వెండియు భర్తృయజ్ఞుండు ౨౭౫

సీ॥ ఉగ్రతపం బెంతో యొనరించినంగాక మహీపతియగునె సామాన్యముగను ?
నియమంబు లెన్నియో నెఱవేర్చినంగాక యూరక యున్నదే యొడయఁడగుట ?
దానంబు లెన్నియో తగఁ జేసినంగాక జననాథుఁడగుటకు సాధ్యమగునె ?
వ్రతము లనేకముల్ కృతములైనంగాక ప్రాభవంబబ్బునే ప్రజలకెందు ?
అట్టి దుర్లభమైనట్టి యవనివిభుత పొందినట్టి హిరణ్మయభూమి గౌత
మేశ్వరునియొద్ద శ్రద్ధమై నిచ్చెనేని చక్రవర్తియు నగునంచుఁ జాటె నలువ.

సీ॥ దైవతములకును దగుసహాయముచేసి పేరుఁ గాంచెనట్టి పురూరవుండు
దశవదనాద్యుగ్రదైత్యుల దర్పంబు నణఁచిన కార్తవీర్యార్జునుండు
శ్రమములన్నియు నోర్చి సత్యమును గాపాడఁజాలిన యల హరిశ్చంద్రరాజు
కురుపాండవాదుల కురువంశకర్తయై పరఁగియుండినయట్టి భరతనృపతి
ధుంధుమారుండు మాంధాత తొల్లి చక్రవర్తు. లవ్వార లాచక్రవర్తిపదము
గౌతమేశ్వరుసన్నిధిం గనకమయమయిన మహిం దగ నిడియె కా యొనసియుంట!”

వ॥ అనవుడు నశ్వసేనుండు ౨౭౮

క౦॥ “ భగవానుఁడ! యాభూమి నొసఁగఁదగు విధి యేదో చెపుమ. సత్యంబుగ నే
నగుదును దాదృగ్దాతను బగతుర నిర్జించి చక్రవర్తినగుటకుఁ ” ౨౭౯

వ॥ అని వాకృచ్చుటయు భర్తృయజ్ఞుండు మఱియు నిట్లనియె. ౨౮౦

తే॥ “ పలశతంబో తదర్ధంబో పంచవింశతిపలములో స్వర్ణమును బెట్టి తీరిపింప
వలయు వర్తులముగ నుర్వి. సలుపఁదగదు విత్తశాఠ్యంబు భూదానవిధిని భూప! ౨౮౧

సీ॥ లవణేక్షుదధిదుగ్ధభువనమయంబులై చెలఁగుచుండెడి సప్తసింధువులను
కులయ మహేంద్ర హిమవద్గాదినాగము లలిగిన తన్న స్తనులగిరులను

జంబూ కుశ క్రౌంచ శాకాదికంబులౌ దీపించు నర్యోఢుద్వీపములను
న్యగ్రోధనీపజంబ్వాదివృక్షములను గంగమున్నగునట్టి ఘననదులను
మేరుగిరి మధ్యమందుండఁ జారుతరముగాను బంచఫలంబులకేని కోదవ
గాని బంగారమునఁ జేయనైన భూమియందుఁ జిత్రింపఁదగు నంతటన్ దునీఁడ!

తే॥ అట్లు సౌవర్ణమయభూమి నమరిపించి కుండతులు తోరణంబును మండపంబు
గ్రహమహీసురపూజకుఁగా రచించి యరుఁగు వేయింపవలె మధ్యమందు సరిగ.

ఆ॥ అచటఁ బంచగవ్యమాచరించి ప్రతిష్ఠితంబుఁజేయవలయు ధాత్రి నంత
పావమానముఖ్యబహుమంత్రములను జేయింపవలయు స్నాన మింక వరుస. ౨౮౪

తే॥ అట్లు స్నానంబుచేయించి యంబరము ధరింపఁగంజేసి చక్రిఁ బూజింపవలయు.
అట్లు పూజించి ధౌతాంబరావృతుఁడయి యంజలింబట్టి నిల్చి తదగ్రమందు ౨౮౫

శ్లో॥ త్వయా సంధార్యతే విశ్వం జగ దేత చ్చరాచరం
తవ దానం కరిష్యామి సాన్నిధ్యం కురు మేదిని. ౨౮౬
శరీరేష్వపి భూతానాం త్వం దేవి ప్రథమం స్థితా
తత శ్చాన్యాని భూతాని జలాదీని వసుంధరే. ౨౮౭
యే త్వాం యచ్ఛంతి తే భూయ స్త్వాం లభంతే నసంశయః
ఇహలోకే పరేచైవ పార్థివం రూప మాశ్రితాః. ౨౮౮

కం॥ అను మంత్రంబులచేతను ఘనముగ స్తుతియించి జలముగైకొని శ్రీవి
ష్ణుని హృదయపీఠిఁజేరిచి కనుదమ్ములు రెండుమూసి కడుభక్తిమెయిన్ ౨౮౯

శ్లో॥ పాతాళా దుద్ధృతా యేన పృథ్వీ సా లోకకారిణా
అస్యా దానేన చ సదా ప్రీయతాం మే జనార్దనః ౨౯౦

కం॥ అను మంత్ర ముచ్చరించుచు మును చేఁగొనియున్న సలిలమును సలిలమునన్
కొనకొని విడువఁగవలయును. చన దది బ్రాహ్మణునిచేత, క్ష్మాత్రపయి విడువన్

శ్లో॥ ఆగతాచ యథాన్యాయం పూజితాచ యథావిధి
అస్మాకం త్వం హితార్థాయ యతేష్టం తత్ర గచ్ఛతాం. ౨౯౨

కం॥ అను మంత్రంబున భూదేవిని వేగమ సాగనంపి విప్రులకున్ భ
క్తిని దా "నసాద్రివేదా" యను మంత్ర ముచ్చరించు చర్పింపఁగనౌ. ౨౯౩

కం॥ ఈవిధిచే భూదానము గావించినయట్టిరాజు ఘనకులమున నేన్
భూవర ! రాజ్యభ్రంశం బేవడి ఘటియింప. దింక నేమనవలయున్. ౨౯౪

కం॥ ఎవరు స్వరాజ్య భ్రష్టత నవమానముఁ బొందుచుంద్రొ యవ్వా రెపుడున్
సవినయముగ భూదానం బవనీసురులకుఁ బొనర్పనట్టిరు తలఁపన్. ౨౯౫

తే॥ అట్లుగావున విశ్వప్రయత్నములను జేయవలయును భూదాన మోయిలేశ!
స్వయముగాఁ జేయకున్నను బరులొసంగునుర్వియైనను హరియింపకుండు టొప్పు.

కం॥ ఏతత్పృథ్వీదానం బాతతపుణ్యము ప్రశంస్య మత్యుత్తమముౘ.
శ్రోత్రలకైనను రాజేంద్రా! తద్దేహస్థ దుష్కృతంబుల నణఁచుౘ. ౨౯౭

కం॥ దాన మటులుండుఁగాక మహీనాయక! ప్రేరణంబు నెక్కువపని. అ
జ్ఞానౌఘనాశనంబగు దాన. ఇఁకేమని వచింతుఁ దన్మహిమంబుౘ. ౨౯౮

సీ॥ భూదానమహిమచే నేఁడుఁబో దాతకుఁ గాయిక మానసిక వ్యథాళి.
భూదానమహిమచేఁ బుత్రులుం బౌత్రులు సమకూరుదురు దాత కమితముగను.
భూదానమహిమచేఁ బొల్పారుఁ దద్దాత సౌందర్యవంతుఁడై జగతి మిగుల.
భూదానమహిమచే మేదురంబగు మేధ యలవడియెడిదాత కశ్రమమున.
ఇట్లకంటకముగ నేలి స్వారాజ్యంబు పడయు శాశ్వతంపుఁబదవి తుదకు.
దీని విన్నవాఁడు నౌను జూ భూదాత జన్మజన్మమున నసంశయముగ. ౨౯౯

చం॥ నరపతి భూమిదానము ఘనంబుగ నెచ్చటఁజేసినౘ మహీ
శ్వర! యగుఁ జక్రవర్తి యొకజన్మమునం దదెభూమి గౌతమే
శ్వరు నెదుటం బ్రదత్తమయి జన్మశతంబులనిచ్చుఁ దత్పదం.
బరసి తదీశుముందటనె యయ్యది యీఁదగు నట్లుగావునౘ" 300

వ॥ అనివాక్రుచ్చె. శ్రవణమాత్రంబున జనుల పాతకంబు హరించు తత్క్షేత్ర
వర్తియగు నాల్గవ కపాలేశ్వరమహత్త్వంబు వినుండు". 301

మ॥ అని యిబ్భంగి వచించుచుౘ మునులు "సూతా! యాకపాలేశ్వరం
బనులింగం బిల యత్ప్రతిష్ఠితమొ యేయర్థంబు తద్దర్శనా
ర్చనలం బ్రాప్యమొ గానఁగూడఁ గరుణాసాంద్రుండవై మాకు వా
కొనవే" యంచిటు ప్రశ్నఁజేయుటయు సౌభాగ్యంబైన యాతండనుౘ. 302

వ॥ "ఈకపాలేశ్వరదేవుం దొల్లి యింద్రుండు స్థాపించె. పాపపురుష దాన
వశంబునను గపాలేశ్వరప్రభావంబునను దత్పురశ్రేష్ఠుండు బ్రహ్మహత్యం బాపుకొ
నియె ననిశ్రుతి వాక్రుచ్చుచున్నయది. 303

తే॥ "హాటకేశ్వరమునకేగి హరుని గాంచి హేమమయమైనవిగ్రహం బిచ్చువాని
పూర్వసంచితదుష్కృతపుంజమెల్ల నంతమొందెడి. ఇట సంశయంబులేదు" 304
వ॥ అని దక్షిణామూర్తిసన్నిధిం దత్పురాచార్యుండు వక్కాణించె." 305

కం॥ అనిసూతుఁడువచియించుడు విని శౌనకుఁదొట్టిమునులు వినయాన్వితులై
"అనఘ! సహస్రాక్షున కేయనువునఁ బ్రాప్తించె బ్రహ్మహత్య? తెలుపవే.

సీ॥ అటఁ గపాలేశ్వరుండనుసంజ్ఞ దేవున కేకారణంబుచే నేరుపడియె ?
తత్ప్రభావంబున దైవతవిభున కెప్పగిది నష్టంబయ్యె బ్రహ్మహత్య ?
ఏమంత్రములు చెప్పి యేవిధిచేఁ బాపపురుషదానంబును జరుపవలయు ?
తత్కపాలేశ్వరు దర్శనపూజనంబులనుండి కలిగెడి ఫల మదెద్ది ?
ఇయ్యది సమస్తమును మాకు నెయ్యమున వచింపుమీ సూతసుత! శ్రవణింపనుంటి"
మనికుతూహలమున నిట్లులడుగుటయును నీశు ధ్యానించి యతఁడప్పు డిట్లులనియె.

—♦ ఇంద్రుండు వృత్రాసురునితోఁ బోరాడి సఖ్యంబుచేయుట ♦—

వ॥ "మహాభాగులారా! విన్న మాత్రంబున వృజినమోచకంబగు పురాతనగాథం గీర్తించెద. తెలిసికాని తెలియకకాని జన్మజన్మాంతరకృతంబులై యీాదినంబువఱకు శేషించియున్న కలుషంబులుసహితము తత్కపాలేశ్వరదర్శనంబునసె తలంగు. ఇది నిక్కంబు. తొల్లి త్వష్టకుఁ బులోమదుహితయగు విభావరివలన వీర్యవంతుండగు వృత్రుం డుదయించి బాల్యమంద బ్రాహ్మణభక్తిపరాయణుండును సర్వజనప్రియుం డును ధర్మాత్ముండును బరిత్యక్తరాక్షసభావుండును నై పుష్కరారణ్యంబునఁ బరమ సమాధిం దపంబుండి చతుర్ముఖు సంతోషపెట్టి యతండు దర్శనమిచ్చి యేమి కావలయు నడుగు మిచ్చెదననుటయు. ౩౦౮

శా॥ "సంతోషించిన బ్రాహ్మణత్వమిడుము. మిచ్ఛాపూర్తియగా నాకు. సా
ధింతుఁ దాన మహోన్నతంపుఁబదముఁ దేవా ! అసాధ్యంబుగా
దెంతేఁ దానికి. తత్సమాన మిల నా కింకొండు కన్పట్టు. ద
త్యంతం బుత్తమదైవమన్న ద్విజుఁడేయౌఁగాక. వేయుండునే. ౩౦౯

కం॥ కానఁ ద్రివిష్టపరాజ్యంబేని తదన్యంబు నాదుహృదయంబునఁ గాఁ
కానఁబడ. దీఁదలంచితి వేనిం గృప నిమ్మ భారతీశ్వర ! దానిఁ" ౩౧౦

వ॥ అనినవిని పరమేష్ఠి తుష్టుండై బ్రాహ్మణత్వంబు దయచేసి ౩౧౧

శా॥ "బ్రహ్మత్వం బిడినాఁడ నీకుఁ దనయా ! వాంఛించిన ట్లే. నీఁకఁ.
బ్రహ్మణ్యుండగు బ్రాహ్మణుం గనిన సంభావించుచుండంగనౌ.
బ్రాహ్మణ్యం బిల సుప్రసన్నమగుచో బర్హిర్ముఖౌఘుంబు నౌ.
బ్రహ్మిష్ఠుండగు బ్రాహ్మణోత్తముని గొల్వంజూడు మట్లౌటచే" ౩౧౨

వ॥ అనియానతిచ్చుటయు వృత్రుండు బ్రాహ్మ్యలక్ష్మీసముపేతుండును బ్రహ్మచర్యా పరాయణుండును నై వెండియుఁ దపంబునకు దొరకొనియె. అంత నిందుండు మహాత్ములగు మనుజాశనుల నందఱను మట్టుపెట్టి సమకట్టి దుసంతతిచ్ఛే దంబునకు జంకి వారు పరాభూతులై దుఃఖించుచు స్వస్థానంబులు వదలి వృత్రుని తల్లిం బురస్కరించుకొని తత్సవిధంబున కరిగి యతనిచే సాగమనకారణం బడుగఁబడి.

ఆ॥ "ఏము సురలచేత నెంతయు జితులమై శరణుపొందినార మరసి నిన్ను.
ఎచటికేగువార మితరత్ర ? నీకన్న దిక్కు మాకు వేఱ చిక్క దెందు" ౩౧౪

వ॥ అనిన విని వృత్రుండు ౩౧౫

క౦॥ "దేవతలం జంపెద. మీ తాపులకున్ మీరు పొందు తడయక యసురుల్ !
నీవెందుల కేతెంచితివో వక్కాణింపుమమ్మ గోరాజనయిత్రీ !" ౩౧౬

వ॥ అనివచించుటయుఁ దల్లి యిట్లనియె. ౩౧౭

ఉ॥ "వంశమునిల్వ నా నుడువువాక్యము నీకుఁ బ్రమాణమైన ని
స్సంశయ మిష్ట వచ్చి తగ నల్పము దారపరిగ్రహంబు. ఈ
అంశమ నేను జెప్పునది. ఆత్మభవుండు ప్రసూవచః పరి
భ్రంశుఁడుగాకయుండుటయె పాడియు నీతియు నోఁ దనూభవా ! ౩౧౮

ఆ॥ మగఁడుబ్రదికియుండ మానినీజనులకుం దల్లిబ్రదికియుండఁ దనయులకును
అన్యదైవముండ. దవ్వారినడిమీఱి నలుపు సెట్టిధర్మములును వృధయె. ౩౧౯

సీ॥ భస్మంబులోపల విస్మయావహముగా వేల్వంగఁబడిన హవిస్సువోలె
ఒక్కండపోయి యెడరుకాననములోన రొద మోఁదుకొం చేడ్చు నేడ్పుమాడ్కి
చాలకాలమునుండి చవుడువాఱిన నేల విత్తంగఁబడినట్టి విత్తుపోల్కి
పుట్టంధుమ్రోలకుం బోయి యేమేమియో యభినయించుచునాడు నాటభంగి
చెవిటివానియొద్దఁ జేరి మృదుస్వరబహుళముగను బాడు పాటపగిది
జననిమాటదాఁటి పోనరించునటువంటి యఖిలధర్మములును వ్యర్థ మరయ. ౩౨౦

క౦॥ మిక్కిలిదురపిల్లెడినను జక్కఁగ బోధించి బంధుజనులందఱు నీ
చక్కికిఁబంపఁగవచ్చితి. అక్కరణి నొనర్చు మాత్మజా ! గుఱియున్నన్. ౩౨౧

క౦॥ మాటికి మాటికి సెక్కుడుమాటలతో నేమిపని కుమార ! ఒకండే
మాట. పితౄఋణం బెప్పాటం దొలఁగెడినో యట్లు పనివిను మింకన్" ౩౨౨

వ॥ అనినవిని దానవులలో మహావీర్యుండును బ్రాహ్మణ్యవిశిష్టుండును నగు వృత్రుండు శ్రుతిస్మృతులంగల "న మాతు ర్విద్యతే పర" మనునర్థంబుఁ జిత్తంబునం జింతించి వల్లెయని కృతప్రతిజ్ఞుండై వివాహంబుఁజేసికొనుటయుఁ ద్వష్ట తుష్టుండై లెక్కింపనలవికాని యనేకజాతుల రత్నంబులును వెండిబంగారులోనగు సకలలోహంబులును బ్రసాదించి హాస్త్యశ్వరథకోశాఢ్యంబుగా స్వరాజ్యమం దభిషిక్తుం గావించె. అట్లభిషిక్తుఁడగుట యాలకించి యతని బంధుగులగు నసురులు పాతాళంబునుండియు గిరిదుర్గంబులనుండియు స్థలదుర్గంబులనుండియుంజనుదెంచి బర్హిర్ముఖులతోడ బద్ధవైరులగుట బహుక్రోధపూరితులై ప్రోత్సాహ పెట్టుటయు వృత్రుండు పరనిష్ఠాదనార్థమై పాకనాశనభవనంబుపైఁ బ్రయాణభేరి వేయించె. అతం డాహవంబున కరుదేరుట యాకర్ణించి యమరవిభుండును నాత్మనుష్పాంగి యఖిలదేవతాసహితంబుగా

నభిముఖుండై నడచుటయు నహర్నిశంబులు నయ్యుభయుల కతివిశాలంబగు మేరు
పృష్ఠమం దారబ్ధంబగు పోరఁ బరాజితులగుచుండు సురాళిం దిలకించి బృహస్పతి
బిడౌజు దిక్కు మొగంబై ౩౨౩

చం॥ శతమఖ! ఏలచేసెదవు సంగర మూరక. ముందఱం జతు
ష్షష్ఠితులును వేన్క సఖ్యమగుచున్ ధను వొప్ప బలద్వయంబుతో
యుతుఁడయి భీకరాకృతిని యుద్ధ మొనర్చుచునున్న వాఁడు వీఁ
డతులితవిక్రముండయి. జయంబుఘటిల్లదు నీకు కావునన్ ౩౨౪

కం॥ సంధియొనరించుకొని స్నేహాంధుండై యుండుటయును నయ్యెడ నెదియో
రంధ్రంబు వెదకి యీపరిపంథిం దెగటార్పు మింద్ర! పవిచేత నొగిన్. ౩౨౫

సీ॥ అన్నపానీయాదులందు విషము పెట్టి ప్రేమఁజూపుచుఁ దినిపించిగాని
దేహంబుమఱచి నిద్రించుపట్టున శయ్యఁజేరి యేదో హత్యఁజేసియేని
కన్నకూఁతునొసంగి తన్నళినాక్షి ద్వారమున నెయ్యదో కుట్ర నెమకియేని
మంత్రకాఁడైన బ్రాహ్మణు దానమునఁ దన్పి కావించు నభిచారికమున నేని
ఒట్టుఁబెట్టి నమ్మనట్లులుసలిపియేన్ బ్రికటమైనమాయఁ బన్నియేని
చంపఁదగును శత్రు శాస్త్రమం దీయాఱుపాయములును జెప్పఁబడుటఁజేసి" ౩౨౬

వ॥ అనిబోధించుటయు నింద్రుండు ౩౨౭

ఆ॥ "అట్టులైనయెడల నరిగిస్వయంబుగా సంధిగూర్పవిూవు సత్వరముగ.
నీదువాక్యమునను నేస్తంబుఁజేయు నాతోడ దానవుండు ధ్రువముగాను" ౩౨౮

వ॥ అనవుడు నాంగీరసుండు వృత్రు డాయంబోవుటయుఁ దద్దైత్యుండును స్వయం
ప్రాప్తుండగు నతని విలోకించి సర్వదా బ్రాహ్మణభక్తుండగుటఁ బ్రహృష్టుండై ప్రణా
మం బాచరించి యుచ్చైర్ఘోషంబున ౩౨౯

ఆ॥ "స్వాగతంబునీకు క్ష్మాసురాగ్రేసర! ఏమిచేయవలయు? ఏమియాజ్ఞ?
కరము ప్రియులు జన్నిగట్టులునా. కట్లుగాన నుడువు మున్నకార్యవిధము" ౩౩౦

వ॥ అనిపలికిన బృహస్పతి యిట్లనియె. ౩౩౧

ఉ॥ "దైవవశంబు సర్వమును దానవనాయక! సంగరంబునన్
నీవె జయింతొ వాసవుఁడె నిన్ను జయించునొ తోఁచ దెరికిన్.
కావున నాదుమాటవిని క్ష్మాతల మీవు దివంబు నాతఁడున్
కైవస మాచరించుకొని కయ్యము మాని వసించు టర్హమా" ౩౩౨

వ॥ అనియిట్లువాక్రుచ్చుటయు వృత్రాసురుండు ౩౩౩

ఆ॥ "బ్రాహ్మణాగ్రగణ్య! భవదుక్తవిధమున నడచువాఁడ నేను నయముతోడ.
శక్రుతోడ నాకు సఖ్యంబు గూర్పుమీ యిపుడ నీవు దైవతేశుతోడ. ౩౩౪

—* ఇంద్రుఁడు కపటోపాయమున వృత్రు వధించుట. *—

వ. అని వక్కాణించుటయు నుదారబుద్ధియగు బృహస్పతి యింద్రుం దోడ్కొనివచ్చి వృత్రాసురునితో సంధానంబొనరించె. దేవరాక్షసాధిపతు లుభయులును బరస్పర మత్యంతమైత్రి చేసికొని ముదంబున స్వస్వనికేతంబులకుం జనిరి. పదపడి వాసవుండు సర్వదా రంధ్రాన్వేషణంబు గావించుచు వృత్రు ప్రచ్ఛన్నమున నించుకేని లోపంబు గనుఁగొనఁజాలక తత్ప్రతాపంబున దహింపఁబడుదునను భీతి నతని పాలికిం బోనశక్తుండై మరల గీష్పతిని విలోకించి. 33౫

ఆ. "వృత్రుఁ గనులువిప్పి వీక్షించుటకుఁగూడఁ జాలకున్నవాఁడ సంయమీంద్ర!
ఆత్మతేజమునను నంతటన్ వ్యాప్తుఁడౌ వాఁ డిఁకెట్లు నాకు వధ్యుఁడగును? 33౬

ఆ. కానఁ దద్దురాత్ము ఘనతేజమును సహింపఁగదగు నుపాయముం గృపాళు
వగుచుఁ జెప్పుమయ్య యాంగిరసా! వాని బిలుకుమార్చవలయు భీతిఁదొలఁగి"

వ. అని సవినయంబుగా విన్నవించిన విని సురాచార్యుండు తడవు ధ్యానించి యిట్లనియె. 33౮

ఉ. "వాని శరీరమందుఁ గడు వర్తిలుచున్నది బ్రహ్మతేజ మ
ద్దానను దేఱిచూచుటకె త్వన్నయనంబులు చాలకున్న. వా
దానవు సంహరించుటకుఁ దగ్గ యుపాయ మొకండు చెప్పెదన్
నేను. మదుక్తభంగిఁ జని నీవు వధింపఁగవచ్చు లీలమై. 33౯

కం. ప్రాచీసరస్వతీనది చూచితివో లేదొ? దాని శుభ్రతటమునన్
వాచంయమవర్యుండు దధీచి తపోనిష్ఠ విధి నుతించుచునుండెన్. 3౪౦

తే. పుష్కరారణ్యమునఁ బెద్దప్రొద్దునుండియుండె నాబ్రహ్మఋషి. వానికి సురులందు
గోఁతవుకైన వార్ధకాన్వితుఁడగుట. వెనుకదీయఁడు దేహంబు విడుచుటకును.

కం. శతయోజనోచ్ఛ్రితం బా క్షితిసురుని కళేబరంబు. శీఘ్రముచని యో
శతమఖ! అడుఁగు తదస్థులు. వితసేయక ప్రాణములను విడిచి యొసంగున్. 3౪౨

ఆ. వానివలన నీకు వజ్రమన్ పేరిటి యాయుధంబు సిద్ధమగును. దాన
చంపఁగలవు నీవు శత్రునౌ వృత్రు సుత్రామ! త్రిదివధామ! తథ్యమిద్ది. 3౪3

ఆ. బ్రహ్మతేజమునను బరిబృంహితంబగు నస్థికలను రచితమైన వజ్ర
ముపశమింపఁజేయు నురుతరవీర్యుఁడౌ వృత్రుతేజముం ద్రివిష్టపేశ!" 3౪౪

వ. అనినవిని హరిహయుం డఖిలామరసంయుతుండై కోటితీర్థంబుల కాటపట్టగు ప్రాచీసరస్వతీప్రాంతస్థ పుష్కరారణ్యంబునకుం బోయి మునిగిసలుం బాము

లును తేళ్లును సింహంబులు నెలుకలుం బిల్లులు గుడ్లగూబలుం గాకులు వేని తపఃప్రభా
వంబున సహజవైరంబులు వీడి ససంతోషంబుగాఁ బరస్పరం బాడుకొను నా దధీచి
మహాముని యాశ్రమంబుం బ్రవేశించుటయు నతండు వృద్ధశ్రీఃపురోగులగు వేలు
పులం దిలకించి సంతసించి యెదుర్కొని యర్ఘ్యమిచ్చి ముహుర్ముహురాచరితప్రణా
మండై పురుహూతు నుద్దేశించి.

కం॥ "నావలననుండి యేపని కావలసి మదీయమగు నికాయంబునకున్
దైవతయుతముగ వచ్చితొ వావిరి సెలవిమ్ము వాసవా! యొనరింతున్" ౩౮౬

వ॥ అని యనుటయు నింద్రుండిట్లనియె. ౩౮౭

కం॥ "ఇంటికివచ్చినవానికి వెంటనె యాతిథ్యమిచ్చుట విధి. భవదస్థుల్
కొంటకువచ్చితి నిడు. తెఱగంటులపని సిద్ధిఁబొందఁగల దద్దానన్." ౩౮౮

వ॥ అనినవిని దధీచిమహాముని యుప్పొంగి. ౩౮౯

కం॥ "అహాహా! నాకు సమానుఁడు మహి నొక్కఁడుగూడలేఁ. డమర్త్యేశుఁడే నా
గృహమునకువచ్చె నర్థిగ బహుపుణ్యుఁడ నేను. బహుళభాగ్యాన్వితుఁడన్. ౩౯౦

కం॥ అనవరతము సురరక్షణమునకై వినియోగపడఁగఁబోవు మదస్థుల్
కనుగొనఁ గడు ధన్యంబులు. కొనుమవి. అసువులను నిన్నుఁగూరిచి విడుతున్"

వ॥ అనిపలికి యమ్మహర్షి తత్క్షణంబ ధ్యానంబుఁబూని బ్రహ్మరంధ్రద్వారం
బునఁ బ్రాణంబులు విడుచుటయు నాత్మపరిత్యక్తమై యాతని యంగంబు పుడమి
పయిం బడియె. నంత హరిహయుం డాయన యస్థులు గ్రహియించి విశ్వకర్మతో
నిట్లనియె. ౩౯౧

కం॥ "ఈయస్థులచేతను వజ్రాయుధమును నీవు చేయనగు వడి. నే నా
యాయుధముతోడఁ బోయి యజేయుండగు వృత్రుమేను చించువిధమునన్" ౩౯౩

వ॥ అనినవిని దేవశిల్పి యాఱువూలలును నూఱుగనుపులును గలిగి నడుమ
సన్నమై భయంకరాకృతిం బొలుచు వజ్రాయుధంబు నిర్మించి సహస్రాక్షునకు సత్వ
రంబుగా సమర్పించుటయు దానిం గైకొని యతండు వృత్రుండు సమాధిగనుండుగుట
చారులవలన నెఱింగి సంధ్యాసమయంబునం జని వెనుకనుండి యయ్యాయుధంబున
వానిం గొట్టి సందిగ్ధతన్మరణుఁడగుట భయంబునం బరువెత్తి నిర్జనంబును గుల్మసంవృ
తంబును నగు నొక విషమస్థలంబున సర్వంబును వృత్రమయంబుగా భావించుచు
డాఁగియుండె. సురసిద్ధచారణగంధర్వు లతనిఁ గానక వెదకివెదకి యెట్టకేల కా
గుల్మమధ్యంబునం బొడగాంచి ౩౯౪

తే॥ "సపరివారంబుగా వృత్రు సంహరించియును నీకేల భయంపడెదో బిడౌజ!
వృత్రకళేబరమునుగూడ మేము గంటిమి. మరుగుటెం. నేమ్ములు నిక నురరిఁగిహరినముగ"

వ॥ అనిపిలుచుటయు రాక్షసశ్రేష్ఠుండగు వృత్రు మరణశ్రవణంబున మేను గగుర్పొడువ గుల్మంబునుండి బయలువెడలు పురందరు దుర్గంధభూయిష్ఠుఁ దేజోవిహీనుఁ దిలకించి లోకగురుండగు బ్రహ్మ దైవతముల నందఱ దగ్గఱకుఁజీరి ౩౫౬

ఉ॥ "వింటిరె? బ్రహ్మభూతుఁడగు వృత్రు నితం డెదిరింపలేక తా
నొంటి సమాధినుండఁగ నయోగ్యతఁబోయి వధించెఁ గాన వె
న్నంటెను బ్రహ్మహత్య. ఇఁకఁ ద్యాజ్యుఁడు. త్యాగము సేయరేని మీ
వెంటఁబడుం గొలల్. నిజము విప్పివచించితి మీకు నియ్యెడన్. ౩౫౭

ఆ॥ బ్రహ్మహంతఁ దగుల భాషింపఁ బాపంబు వచ్చుఁగానఁ బోయి వాసవునకు
దూరదూరమంద వేఱుగా నుండుఁడీ విబుధులార! మీరు విని మదుక్తి. ౩౫౮

ఆ॥ అతని ముట్టుకొనుట యట్లుండఁగాక. సంభాషణంబుగూడఁ బాపహేతు.
వంతె కాదు. వాని యవలోకనమె కూడ. దఘముచుట్టుకొనెడి నంగువలన" ౩౫౯

వ॥ అని వచించుటయు నింద్రుండు విని తథాభూతంబగు తన తనువు చూచుకొని
దైన్యంబునం జతుర్ముఖునకు దండమర్పించి ౩౬౦

కం॥ "నీకింకరుండ. నీవే నాకీయింద్రత్వ మిచ్చినాఁడవు కానన్
లోకేశ! బ్రహ్మహత్యం బోకార్పవె పాచితంబు పాసరిచి కరుణన్" ౩౬౧

వ॥ అని వేడికొనిన నంబుజాసనుం డిట్లనియె. ౩౬౨

ఉత్సాహము॥ "అష్టషష్టితీర్థములను నాడుకొంచు 'బ్రహ్మహన్
దుష్టుఁడను' నటంచుఁ బైఁడితోడఁ బాపపూరుషా
కృష్టవిగ్రహము రచించి యిమ్ము మంత్రవత్తుగన్
శిష్టుఁడైన బ్రాహ్మణునకు శీఘ్రముగ శతక్రతూ! ౩౬౩

ఉ॥ నీటమునుంగుమాత్రమున నీకరమందలి తత్కపాల మె
చ్చోటను గ్రిందికిం బడునొ పోయగ మేర్పడు నీకునచ్చటు
ప్పాటఁ దొలంగిపోవుఁ జెడువాసన. ఆవనతీర్థమందు వే
నాఁటు మిఁకం గపాలము పినాకధనుర్ధరు పేర నిష్ఠమై. ౩౬౪

ఉత్సాహము॥ పంచవక్త్రమంత్రములను బాగుగం బఠించి స్థా
పించి యాకపాలమునకుఁ బ్రీతిఁ బూజ సేసి యా
కాంచనంపుఁ బాపపురుషు నగముభక్తితోడఁ దన్
మంచిబ్రాహ్మణున కొసంగు మఘవ! శుద్ధుఁడౌదిఁకన్" ౩౬౫

వ॥ అనినవిని యమ్మరుత్వంతుండు వృత్రు కపాలంబుఁ గైకొని యటుపయిని మిది తీర్థంబులం గ్రుంకుచుఁ గ్రమంబుగా హాటకేశ్వరంబునకుఁ బోయి విశ్వామిత్ర హ్రదంబున మునింగి యుపలకుపచ్చుటయు నా వృత్రకపాలంబు చేతినుండి తనంతఁ

దాన క్రిందఁబడియె. నంత సర్వపాపహరంబులును బుణ్యంబులును నగు "సనోజ్జా తంప్రపద్యామి" మొదలగు పంచవక్త్రమంత్రంబులచే నక్కపాలంబుం బూజించి దుర్గంధవిముక్తుండును దేజోవంతుండును నయి వెలుంగు నిందుశేఖరుని సద్దైవతంబుగాఁ జతురాననుండు చనుదెంచి బ్రహ్మహత్యచేఁ బరిత్యక్తుఁడైనట్లు భావించి

ఉత్సాహము॥ "పంచవక్త్రమంత్రములఁ గపాలమును భజించితీ
వంచితముగఁ గాన బ్రహ్మహత్యతొలఁగిపోయె. చే
సించియున్న పాపమును నశించుఁ. గనక మునను జే
యించి యిమ్మ నీశరీర మింద్ర! విధియుతంబుగన్" ౩౬౭

వ॥ అనివాక్రుచ్చుటయు వహ్నియని హేమమయంబగు నాత్మీయపుత్రబింబము ను గర్తాతీర్థవాసియు నాహితాగ్నియు సుహోత్రుండును వాతాభిధానుండను నగు వసుధామరున కొసంగుటయు నాగరులా బ్రాహ్మణు డాయంజని. ౩౬౮

కం॥ "ఛీఛీ! సాంగోపాంగము నీచేఁ బఠియింపఁబడిన నిఖిలశ్రుతులున్
నీచా! వ్యర్థములయ్యెను. మాచెంతకు రాకు మీవు. మము ముట్టకుఁడన్" ౩౬౯

వ॥ అని నిందించుటయు సుపమన్యుకులోద్భవుండగు నా బ్రాహ్మణుండు చిన్నవోయి యింద్రునితో నిట్లనియె. ౩౭౦

ఉ॥ "తావకపాపపిండము ప్రదత్తము నాకు సురాధినాథ! స
ద్భావమునన్ గ్రహించితిని దానిని. గాని ధనేహఁ గాదు. భూ
దేవతలెల్లరున్ ననుఁ బదింబదిగాఁగ శపించుచున్న వా.
రీవును జూచుచుంటి. వికనెట్లు ప్రతిగ్రహ మాచరించెదన్? ౩౭౧

కం॥ నీయది నీవే కైకొను. పోయెద. నటు తీసికొనక పోయితివేన్ శా
పాయుధమును నీమీఁదను వేయంగలవాఁడ నిపుడ వేలుపుఱేఁడా!" ౩౭౨

వ॥ నావుడు శునాశీరుండు

తే॥ "వేదవేదాంగవేదియౌ విప్రజనుఁడు కలుపుఁగాక ప్రతిగ్రహ మిల నొకప్డు.
పాతకంబంటు దాతనిం బద్మపత్రముల నగస్థిత జలబిందువుల విధమున. ౩౭౪

ఉ॥ కావున లేదు. నీకిపుడు కల్మష మెవ్వరు నిన్ను దూరిరో
ఆ వసుధామరుల్ వలుపు నన్ని సుకార్యములం బ్రధానతన్
నీ వెవహింతు. తత్సుతులు నీసుతవర్గము నాజ్ఞలోన సుం.
డీవిధి వారి సంతతియు నేగుచునుండుఁ గ్రమ క్రమంబుగన్. ౩౭౫

కం॥ నీమాటలేక నాగరభూమీసురు లెంతమాత్రపుం బని సేనిన్
తా మొనరించిన వ్యర్థంబౌ మతిమతి బూడిఁబోయు నాజ్యముభంగిన్ ౩౭౬

## కపాలమోచన మాహాత్మ్యము

ఆ॥ ఈప్రదేశమింక నిలను గపాలమోచనమటన్న ఖ్యాతి నెసయఁగలదు.
ముక్తులగుదు రిచట ముందు కపాలంబు నాత్మఁదలఁచి శ్రాద్ధమాచరింప. ౩౭౭

కం॥ పితృపక్షంబున నట్టిటఁ బితృదైవతములగుతించి పెట్టెడిశ్రాద్ధం
బతిశయఫలప్రదంబగు క్షితిగీర్వాణా! ఇఁకేమి చెప్పఁగవలయున్. ౩౭౮

ఉత్సాహము॥ స్థానబాహ్యులైనద్విజుల సంతతిని జనించు ప
ద్మాసనలను బ్రీతిఁ బెండ్లియాడి త్వాత్కులోద్భవుల్
నా నియోగమున సమస్తనాగరక్రియల సదా
పూని వ్యవహరింపఁదగిన పూజ్యులగుదు రగ్రజా! " ౩౭౯

వ॥ అనిచెప్పి వెళ్ళిపోవుటయు వాతాభిధానబ్రాహ్మణుం డా యింద్రుని వలననుండి ప్రతిగ్రహించిన విత్తంబు పెట్టి దేవదేవుండగు శివునకు దేవళంబు గట్టించె. అంతఁ బాకశాసనుండు నాగరబ్రాహ్మణుల నుద్దేశించి. ౩౮౦

పంచచామరము॥ " కపాలమోచనంబునన్ పగాహ మాచరించి యీ
కపాలిపూజసేయు బ్రహ్మఘాతకుండుగూడఁదా
విపాపుఁడౌను గాన దీన విప్రులార! స్నాతులై
అపాస్తదోషులై రహింపుఁడాజ్ఞయిచ్చినాఁడ నేన్" ౩౮౧

వ॥ అని వక్కాణించె. ఆ వాతాభిధానబ్రాహ్మణుం డంద యాశ్రమం బమర్చుకొని యభవు నర్చించుచు నధివసించె. అది మొదలుకొని తమ యేకోలఁది కార్యంబును నతఁడుచెప్పినచొప్పున నాగరు లాచరింపంగడంగిరి. ఈకారణంబున వాతుండు ద్వితీయమధ్యగుండయ్యె. మహాత్ముఁడగు మఘవున కీర్తిగ్రంబున బ్రహ్మహత్యారూపపాతకంబు నష్టమైనవిధంబును జదువువారికిని వినువారికిని బాపనాశకం బగు నీ కపాలేశ్వరమాహాత్మ్యంబును సర్వంబు మీకుంగా వాక్రుచ్చితి. తొల్లి యానర్తుండు భర్తృయజ్ఞుం గనుంగొని ౩౮౨

## పాపపిండప్రదాన విధానము

సీ॥ " ఎడఁదఁ దోఁపఁగనీక హితువాక్కు విననీకమనెడిమూర్ఖత్వంపుమహిమముననో
ఇది యిట్టులగునటం చెఱుఁగంగరానీక మనసుఁ గలంచు ప్రమాదముననో
తారుణ్యవశమునఁ దాఁ దటస్థించి యుగ్గలమైన కామాంధకారముననో
మహిత తమోగుణమాహాత్మ్యమునఁజేసి మన మావరించిన మాంద్యముననో
అఘముఁజేసి దాని కర్హప్రాయశ్చిత్త మాచరించుకొననియట్టివార
లయ్యఘంబునుండి యవుడ విముక్తులౌ పుణ్యమును వచింపు భూసురేంద్ర! ౩౮౩

ఆ॥ లోభ మోహవివశులై భూమి వర్తిల్లు జనము పాపపిండమును నొసంగ
విధిని జెప్పుమయ్య విద్వద్వరేణ్య! నే యేను నీయనుంటి దానిఁ గాన" ౩౮౪

వ॥ అని వక్కాణించుటయు భర్తృయజ్ఞుం డిట్లనియె. ౩౮౫

సీ॥ "ఇరువదైదుపలాల హేమంబు గరఁగించి యాత్మీయ ప్రతిబింబ మమరించి
అపరపక్షంబున నవగాహ మొనరించి లలితమౌ తెల్లచేలములు ధరించి
మండపాదికమును నుంచిగం గూర్పించి యా స్వీయ ప్రతికృతి యచట నుంచి
తత్స్వరూపమునకు ధాత్ర్యాదికమునకు వక్ష్యమాణములయి వఱలు పృథివి
మొదలుగాఁగల మేటి యిర్వదియునాల్గు తత్త్వముల పేళ్ళ చదువుచుండత్వరతను
పూజగావించునట్టువంటి పూరుషుండు పూర్వకృతపాతకమునుండి ముక్తుఁడగును.

మంత్రము॥ ఓంపృథివ్యైనమః అద్భ్యోనమః ఓం తేజసేనమః ఓం వాయవేనమః
ఓం ఆకాశాయనమః ఓం ఘ్రాణాయనమః ఓం జిహ్వాయైనమః ఓం చక్షుషేనమః
ఓం త్వచేనమః ఓం శ్రోత్రాయనమః ఓం గంధాయనమః ఓం రసాయనమః
ఓం రూపాయనమః ఓం స్పర్శాయనమః ఓం శబ్దాయనమః ఓం వాచేనమః
ఓం పాణిభ్యాంనమః ఓంపాదాభ్యాంనమః ఓంపాయవేనమః ఓంఉపస్థాయనమః
ఓం మనసేనమః ఓం బుద్ధ్యైనమః ఓం చిత్తాయనమః ఓం అహంకారాయనమః.
ఓం క్షేత్రాత్మనేనమః ఓం పరమాత్మనేనమః ౩౮౬

ఆ॥ ధూపటన్న దాన ధూప మగ్నిజ్యోతిరనెడిదాన దీప మమరఁజేసి
అటు "యువాసువాస" అను మంత్రమున వస్త్రముల ధరింపఁజేయవలయు వరుస.

సీ॥ అర్ధాంగి చెంతత్తి యతిభక్తిఁబోనెడి విమలనీరములఁబాదములు గడిగి
చెలువైన మేల్జరిచెఱఁగులుగలయట్టి రమణీయ పట్టాంబరములు గప్పి
అంసద్వయము కరం బావహించెడిభంగి దళమైన నూత్నాంగదములు వెట్టి
సింగంపుమూతులఁ జెలఁగు మేల్మి పసిండి కడియముల్ హస్తయుగ్మమునఁదొడిగి
ఉంచి పదివేళ్ళకుం బది యుంగరములు మఱియునుం గొన్నిరత్నగ ల్బహుసనిచ్చి
వేదవేదాంగవిదుఁడగు విప్రునకుఁ ద దాత్మపిండంబు నర్పింపనగు నృపాల!

శ్లో॥ ఏష ఆత్మా మయా దత్తస్తవ హేమమయో ద్విజ
యత్కించి ద్విహితం పాపం పూర్వం భూయాత్తవాఖిలమ్॥ ౩౯౦

శ్లో॥ యత్కించి ద్విహితం పాపం త్వయా పూర్వం మయాహి తత్
గృహీతం మూర్తిరూపం తత్తత స్త్వం పాపవర్జితః॥ ౩౯౧

క॥ అను నేతన్మంత్రద్వయ మనఘా! దాతయుఁ బ్రతిగ్రహముఁజేసినయా
యనయు యథాసంఖ్యంబుగ వనవలయును. ఇది విధాన మాదానమునకు. ౩౯౨

ఆ॥ తత్ప్రతిగ్రహీత తనియమవిధంబుగా దక్షిణయు నొసంగి యాతఁడంబ
సాగనంపవలయు క్ష్మాపాల! ఇబ్భంగి సలుపఁ గలుష మెల్ల విలయమందు ౩౯౩

సీ॥ బరువంతయును దింపఁబడినవాఁడున్న నంత నలకనయ్యెతోఁచు నంగ మెల్ల.
క్రొత్తనెత్తురువట్టి యత్తఱి సకలావయవములఁ జేయుఁ దేజోభివృద్ధి
కలలోన సితవస్త్రగంధమాల్యావృతి మఱియు స్త్రీ పురుషులం దఱచు గాంచు
శుభ్రగోవృష భోక్ష్వ శుద్ధతీర్థంబులుం బ్రత్యక్షమగుచుండుఁ బ్రతతమిస్రి.
ఇటు పురాకృతకిల్బిషం బెడలినందు కొలయు నమ్మక మాత్మార్చ యొసఁగుమాత్ర
వినినయంతన కల్మషమును హరించు పాపపిండప్రదానంబు ఫణితమయ్యె. ౩౯౪

కం॥ ఈ పాపపిండదానము భూపాలక! ఎచట నేని పొనరుపఁబడుఁగా
కీపుట్టువునం జేసిన పాపము హరియింపఁగలుగుఁ బ్రజ కది యరయన్ ౩౯౫

ఆ॥ అక్కపాలమోచనాహ్వయక్షేత్రమం దాచరింపఁబడిన నది సహస్ర
భవములం బొనర్పఁబడినట్టి పాతకంబుల నశింపఁజేయఁగలది యగును ౩౯౬

ఆ॥ వేది మండపముల విధిని దొల్లింటివిధంబుగానె చేయఁదగును గాని
కలవిశేష మింక గాయత్రిచే హోమమాచరింపవలయు నవనిపాల!" ౩౯౭

—♦ ఇంద్రద్యుమ్నోపాఖ్యానము ♦—

వ॥ అని యిట్లు భర్తృయజ్ఞుం డశ్వసేనమహీపతినిగురించి చెప్పియుండె. ౩౯౮

సీ॥ అలఘు మార్కండేశ్వరాభిధానంబైన దివ్య మహేశ్వర దేవతయును
అఖిలపాపంబుల హరియింపఁజాలు నింద్రద్యుమ్న కేశ్వర దైవతమును
నిఖిలరోగంబుల నిర్మూలమొనరింప నేర్పడినట్టి పాలేశ్వరుఁడును
ఘంటునిచే నిల్పఁగాఁబడు కతమున ఘంటశివఖ్యాతిగల భవుఁడును
ఇంకఁ గలశేశ్వరుఁడు వానరేశయుతుఁడు నొయ్య నీశానశివుఁడును నున్నవారు
కలియుగంబునఁగూడఁ బూజలనొనర్చు జనుల కోరికలం దీర్చుకొనుచు నచట.

వ॥ వారు పూజనంబునను కాక దర్శనంబునన సర్వరోగవివర్జితంబుగా జనుల
దీర్ఘాయువులఁ జేయు బహుపుణ్యంబులగు లింగాకారంబుల నెసంగుచున్నవారు."

కం॥ అనియిట్లు రోమహర్షణి వినుచుటయును శౌనకాది విద్వద్విప్ర
శ్రీ నికాయం బాచరితంబును సాంతము తెలియఁగోరి మొగి నిట్లనియెన్ ౪౦౧

సీ॥ "లింగప్రతిష్ఠ పొసంగఁ గావించిన మార్కండసంజ్ఞుండు మఱియెవండు?
ధార్మికుండైన యింద్రద్యుమ్న నాముఁ డేకాలమందున్న భూపాలకుండు?
పాలకాఖ్యుండు తా భక్తినియుక్తి నెవ్వట్ల సంస్థాపించె భార్గవేశు?
ఘంటాహ్వయుండైన ఘటికుఁ డేయన్వయంబును బావనముఁ జేయ జననమందె?

వానరాన్వితముగ వర్తించు కలశుఁ డీశానుఁడును మఱెవ్వ ! రానతిచ్చి
దానమంత్రములును దత్త దుదంతంబులును వచింపు" మనుడు విని యతండు ౪౦౨

వ॥ "దేని వినినమాత్రంబున జనము దీర్ఘాయువై యెవ్విధంబునను నపమృత్యువు గాంచదో యెయ్యది భర్తృయజ్ఞునిచే వానరాధిపతియగు నశ్వసేనునకు వచియింపఁబడియెనో యా పురాతనగాథ నేను మీకుఁ గీర్తించెద. మార్కండుఁడను ప్రథమసంకీర్తితుఁడగునతని పవిత్రచరిత్ర మీకుఁ జెప్పియుంటి. ఇఁక నఖిలనృపాలమానితుండగు నింద్రద్యుమ్నుఁ డెట్టిప్రభావముగలవాఁడయినదియుం జెప్పెద ౪౦౩

సీ॥ ఆత్మవస్తు వెతింగి యనవరతం బంద రమియించుచుండెడి రాజయోగి
ఆర్తిగూరినయట్టి యఖిలలోకమునకు నాశ్రయంబిచ్చెడి యధికదాత
కష్టమంచనక తా శిష్టరక్షణమందు జాగరూకతనుండు సత్ప్రభుండు
నానాధ్వరంబులం బూనికమైఁ జేసి కడుఖ్యాతినందిన కర్మఠుండు
అఖిలభూతహితుఁడు నగుచు దుర్భిక్షంబు వ్యాధి చోరబాధ యాత్మరాజ్య
మందు లేకయుండ నరసి యింద్రద్యుమ్నుఁ డేలె నేల మును మునీంద్రులార !

సీ॥ ఆది నగ్నిష్టోమ మాచరించె నతండు సల్పె షోడశికాఖ్య సప్తతంతు
వుక్థాఖ్యయాగంబు నొనరించిమించెఁదా. చేసె సౌత్రామణి భాసురముగ.
వాజపేయంబులు వరుసగాఁ గావించె. రాజసూయంబులు రమణఁజలిపె.
అశ్వమేధంబులు నాచరితంబులు. పౌండరీకములు నిర్వర్తితములు.
ప్రతిశరత్తుగూడఁ గృతము చాతుర్మాస్య. తారలకును వర్షధారలకును
నదులలోని యిసుకనలుసులకుం బోలె సంఖ్యయున్నె యతని సవనములకు !

వ॥ దానంబులం గావించె. అందు విశేషించి తీర్థంబులం జలిపియున్నవాఁడు. షణ్మరులకు సదక్షిణంబుగా మృష్టాన్నంబులు వెట్టించె. ధనార్థులగు బ్రాహ్మణుల ద్వారంబున బ్రాహ్మణుల కర్బుదసంఖ్యల కన్యాదానంబు లొనరించె. అతఁడు కట్టించిన దేవాలయములేని గ్రామంబుగాని పట్టణంబుగాని తీర్థంబుగాని కనుపట్టదు.

తే॥ "రేపు హరివాసరం బదిపాపహరము బాలవృద్ధులుదప్ప నప్పట్టి నెవరు
భోజనముచేయఁగూడ. దయోవ్యాజ నుపవసింపకుండిన వారికి శిక్ష నిజము॥" ౪౦౪

వ॥ అని దశమీతిథి నిశీధి నేనుంగుపై డంకా గట్టించి నగరమం దంతటను సాటింపఁజేసెడివాఁడు. రాజర్షి యగు నయ్యింద్రద్యుమ్నుఁ డంతఁ గొంతవడికి వారి ప్రసాదంబున సఘాతికశరీరంబుగా బ్రహ్మలోకంబునకుంజని వేయి కల్పంబులుండుటయు నప్పు డంబుజాసనుండు స్వయంబుగా నతనిఁ జేరం బిలిచి "యిఁక నింద్రుండం జనదు భూలోకంబున కరుగు"మన నతండు. ౪౦౫

తే॥ "ఏల నీలోకమునుండి యిట్లు వేగఁ బాపహీనుఁడనగు నన్నుఁ బంపెదయ్య?
కారణంబును నామీఁదఁ గరుణయుంచి యానతీయుము లోకేశ! అఘవినాశ!"

వ॥ అని వేఁడుటయు నజుండిట్లనియె.

చ॥ "తావకకీర్తి ప్రస్తుతము ధాత్రి నశించిన దెంతదాఁకఁ ద
ద్భూవలయంబునన్ యశము పూర్తిగ నుండునో యంతదాఁక నే
దైవతలోకమందుఁ బ్రజ తా వసియింపఁగనౌను. చేయుమీ
క్ష్మావిటు నుండ నెంచిన మహిన్ మఱి కీర్తివచ్చు నైదముల్. ౪౧౦

కం॥ ఈకారణమునఁజేసియె లోకులు దేవాలయంబులుం జెఱువులు వా
పీకూపంబులు మొదలుగ వీఁక స్వనామాంకితముగ విరచింతురు భువిన్" ౪౧౧

వ॥ అనియిట్లు వాక్రుచ్చుచుండ నప్పపాటులో నన్నరేంద్రుండు భూతలస్థ
మగు కాంపిల్యనగరమున వచ్చిపడి యచ్చటిజనులం బొడగాంచి. ౪౧౨

కం॥ "ఎక్కడిది యీప్రదేశం? బిక్కడఁ బాలించునట్టి యేలిక యెవ్వాఁ?
డిక్కోటిక పేరదెయ్యది? ఒక్కొకటి వచింపుఁడయ్య యో జనులారా!"

వ॥ అనవుడు వారలిట్లనిరి. ౪౧౪

కం॥ "ఇది కాంపిల్యంబనుపురి. సదయుఁడు పృథివీజయుండు క్ష్మాపతి. దేశం
బుదితం బానర్తంబని. ఎది నీవిటురాను హేతు? వెవ రీవు బుధా!" ౪౧౫

వ॥ అనియిట్లు మరలఁ బ్రశ్నించుటయు నమ్మహీపతి. ౪౧౬

కం॥ "ఇంద్రద్యుమ్నాహ్వయ భూమీంద్రుఁడ. వైజరుకదేశ మేలెడువాఁడన్.
సాంద్రంబగు రోచకపురమం దుందును. అవ్వి యెచటనల రెడుఁ జెప్పుఁడా."

వ॥ నావుడు మఱియు నప్పౌరులు. ౪౧౮

కం॥ "ఎఱుఁగము పేమానగరం. బెఱుఁగము తద్దేశమును. మహీశుండని యే
పురుషునిగూర్చి యడిగితో యెఱుఁగము మేమెన్నడుం ద దింద్రద్యుమ్నున్"

వ॥ అనిచెప్పుటయు వెండియు నింద్రద్యుమ్నుండు. ౪౨౦

తే॥ "తన్మహీశునో దేశంబో తత్పురంబో యెఱిఁగియుండిన దీర్ఘాయు వెవ్వఁడేని
ప్రకృత ముండినఁ జెప్పుఁడో పౌరులార! అలసింపక. అడుగుదు నతని నేని"

వ॥ అనిన విని జనులు. ౪౨౨

ఆ॥ "కల్పసప్తకంబు గడపి మార్కండేయుఁడనుమునీంద్రుఁడొక్కఁ డనఘచరితుఁ
డున్నవాఁడు ప్రకృత మ నైమిశంబునం దతనినడుగు. మెఱుఁగనగును నీవు"

వ॥ అని నుడువుటయు నయ్యైకిమీఁదు తత్క్షణంబ వ్యోమమార్గంబునం జని
నైమిశారణ్యవాసియగు మార్కండేయునకుఁ బేరెలుంగునఁ బ్రణామంబు నివేదించి.

కం॥ "ఇంద్రద్యుమ్నుండను నృపచంద్రుని గనుగొంటె ? లేక శ్రవణపథమునేఁ
బొందిరముగఁ జొచ్చినాఁడె ? మునీంద్ర ! చిరాయువనివినుటఁ బ్రచ్ఛించితి నిన్."

వ॥ అనియడుగుటయు సుధర్ముం డిట్లనియె. ౪౨౭

ఆ॥ "కల్పసప్తకమునఁ గనఁ దదింద్రద్యుమ్ను. వినఁగూడ వినను వీని పేరు.
ఇంక నేమియనుచు నేను వక్కాణింతునయ్య పాప మేలయడుగుచుంట ?"

వ॥ అనినవిని యతండు నిరాశుండై వైరాగ్యమవలంబించి మరణింప నిశ్చయించుకొని కట్టియలం బ్రోగుచేసి నిప్పువెట్టి యందుఁ బడఁబోవుటయు మార్కండేయుండు. ౪౨౮

కం॥ "చావకుమీ. నీతోడం గావించెదఁ జెలిమి. ఇంక గతశోకుండవై
జీవించెద. విటు లేటికిఁబాపం బ్రియతింతొ చెప్పుమ. యని ప్రతిసేతున్" ౪౨౯

వ॥ అని యూఱడించుటయు నింద్రద్యుమ్నుండు. ౪౩౦

కం॥ "అల కాంపిల్యాహ్వయపూర్ణ్విలదయుబు చిరజీవియనుచు నిన్ జెప్పఁగ నీ
లలి నింద్రద్యుమ్నస్థితి తెలిపెదవని యిటకు వచ్చితిని మునినాథా !" ౪౩౧

కం॥ నాకీర్తి లేశమేనియు లోకంబున లేకయుండ టోఁ గుందుచు నే
నీఁకను జీవింపఁగవలె ? ఈకారణమునను జేసి యే మరణింతున్. ౪౩౨

వ॥ అని తన నిశ్చయంబు దెలుపుటయు నమ్మునీంద్రుండు కరుణార్ద్రచిత్తుండై యియ్యది వృథాశ్రమంబని తలంచి ౪౩౩

—♦ నాడీజంఘుచరిత్ర ♦—

కం॥ "అటులగుచో దహియింపకు మిటు దేహము. తెలిసికొనెద నే నాస్వప్ర. నా
కన్నటు నాడీజంఘుండను పటుబక ముస్న్యది పెద్దప్రాయముగలదై." ౪౩౪

కం॥ నాకుం బ్రాణస్నేహితుఁ డాకొంగ లరిముడయుఁ. డాతఁ డాతని నెఱుఁగుం
గా. కిపుడ రేంగుడముపద యాకొండల గాయునొద్ద నతఁడు వసించున్. ౪౩౫

తే॥ "సాధుసందర్శనంబును సల్పనెడల నుండునే నేని లాభంబు ఖండితముగ.
నిష్ఫలం బెన్నటికిఁ గాదు. నిక్కమిట్టి. ఆత్మహాసనంబు మానుకొ మన్మగుగు డిమ్ము"

వ॥ అనిచెప్పి యమ్మహర్షి యింద్రద్యుమ్నుం దోడ్కొని యాకాశమార్గంబున హిమవంతంబున కరుగుటయు బకంబు ప్రహృష్టాంతరంగంబుతో వచ్చెడి మార్కండేయుం గనుంగొని యెదురేగి స్వాగతంబిచ్చి పూజించి. ౪౩౬

ఆ॥ "బ్రహ్మవిద్వరిష్ఠ ! బహుపుణ్యుఁడను నేను గరుణ నీవువచ్చు కారణమున.
హితుఁడవై నీకు నేమియాతిథ్యంబు చేయవలెనొ చెప్పుము. సిద్ధముంటి" ౪౩౭

వ॥ అనిపలుకుటయు మార్కండేయుం డిట్లనియె. ౪౩౮

శా॥ "నాకంటెం గడుఁ బెద్దవీవు కన. ఇంద్రద్యుమ్నుఁడన్ రేఁడు తా
నీకంటెం బడెనొక్కొ యెప్పుడయినన్ ? నీ శ్రోత్రిమేన్ జొచ్చుచో
వాకో. నీమిత్రుఁడు నాకు స్నేహితుఁడు. తద్వార్తన్ వినన్వచ్చె. సు
శ్లోకా ! చెప్పకయున్న మృత్యువెనయుంజూ. అందుకై వచ్చితిన్ ." ౪౪౦

వ॥ అనవుడు బకంబు. ౪౪౧

మ॥ "పదియున్ నాలుగు కల్పము ల్దలఁప నా ప్రాయంబు మానీంద్ర ! ఇ
య్యది యాథార్థ్యము. విస్మృతంబులును గా పష్టిన్న పూర్దేశరా
ణ్ణాదనద్యద్రిముఖంబు లన్నియును. ఇంద్రద్యుమ్ను సందర్శనం
బది యట్లుండఁగఁ బేరుగూడ విన. ఏమంచింక వాక్రుచ్చుదున్ ." ౪౪౨

వ॥ ఇంద్రద్యుమ్నుం డిట్లనియె. ౪౪౩

ఉ॥ "కొంగవు నీవుచూడ. అధికుండవుగా. వయినన్ మహాద్భుతం
బుం గలిగించు నాయువును బొందుటకుం గల కారణంబు నా
కుం గృపతోడఁ జెప్పఁగదె. గొప్ప తపంబె యొనర్చినావొ. త
క్కుంగల దానధర్మములు కోరి యొనర్చితివో విహంగమా !" ౪౪౪

వ॥ బకం బిట్లనియె. ౪౪౫

ఉత్సాహము॥ "దేవదేవుఁడైన వాసుదేవు నేను దొల్లి యా
జ్యావృతుం బొనర్చుకతన నబ్బెనింతయాయువు. విం
కీవిహంగమత్వ మేల యొనసెనని స్తుటందువేన్
దైవవశత విప్రశాపదగ్ధుఁడైతి. ఏమనన్ ? ౪౪౬

తే॥ పూర్వమేను జమత్కారపురవరమున బ్రాహ్మణుల పిల్లవాఁడనై ప్రభవమంది
బాల్యలౌల్యవిశిష్టతం బ్రబలినాఁడ. అయ్యకుం బ్రీతిపాత్రంబు నైనవాఁడ. ౪౪౭

ఆ॥ అట్టి నాదుతండ్రి యాఖ్యఁ బారాశర్యుఁడనఁ బ్రసిద్ధినందినట్టివాఁడు.
వెట్టి నాకుఁ బేరు విశ్వరూపుండని. బకుఁడనంగ నింకనొకటి కలదు. ౪౪౮

ఆ॥ అట్లుకొంతకాల మరుగ నాజనకుచే మకరసంక్రమణ సమయమునందు
సమ్యగర్చితంబు జాగేశలింగంబు దీసి నేతిలోన వేసినాఁడ. ౪౪౯

చం॥ తెలతెలవాఱ నాదుపిత దిగ్గునలేచి కృతావగాహుఁడై
తొలుతఁ గృతాహ్నికుండగుచు ధూర్జటిపూజన మాచరింపఁగన్
తలఁచి యదృష్టలింగుఁడయి "దాఁచితి వీవె తనూజ ! ఎచ్చటో
వలసినయన్ని యప్పచులు పైశివ యిచ్చెదఁ జెప్పవే" యనన్ ౪౫౦

ఉ॥ భక్ష్యముమీఁది లక్ష్యమునఁ బక్వన నేఁజని యాజ్యకుండికా
కుక్ష్యుపవిష్టలింగమును గొంచరు దెల్చియు బాల్యచేష్టలన్

కం॥ "శిష్యుఁడుగఁ బ్రవేశించి యదూష్యుండని నమ్మకంబు దోఁచెడిరీతిన్
పేర్మిపృత్త్వంబును జేయుచు బుష్యంగననున్ హరింతు నెవ్విధినైనన్" ౪౬౨
కం॥ అని నిశ్చయించుకొని యమ్మునిని డగ్గఱి నేను "దపము పొనరించెదనిం
దనఘా! దీక్షయొసంగవె జనియించెను నాకు రోత సంసారమునన్. ౪౬౩
సీ॥ తెచ్చిపెట్టెదనీకుఁ బచ్చనిదర్భలం బిత్రుదేవతలఁ దృప్తిఁబెట్టుపొంటె.
తెంపిపెట్టెదనీకుఁ దెల్లని పుష్పము ల్శివపూజ సేబవ త్సేయుపొంటె.
కొట్టిపెట్టెదనీకుఁ గుదురైన సమిధల విత్తహోత్రములోన వేల్చుపొంటె.
రాల్చిపెట్టెదనీకు రసవత్ఫలంబుల దేవతాళికి నివేదించుపొంటె.
నింపిపెట్టెదఁ బాత్రిలనిండ నీర"మని ధరామరవటుఁడనై యతివినయము
తోఁపఁబల్కుటయును నమ్మిపాపమతఁడు నాకు దీక్షయిడెన్ యథాన్యాయముగను॥
కం॥ అనయము రంధ్రాన్వేషణమును బొనరుచు కుటిలచిత్తమున నుండియు న
మ్మునినిం దత్సహధర్మిణిఁ దనిపితి దినదినముఁ జేసి తగ శుశ్రూషన్. ౪౬౫
కం॥ ఒకనాఁ డా సుతపస్విని ప్రికటార్తవయగుచుఁ బోయి పర్ణకుటీరా
నకు దూరమందుఁ బడుకొని యకలంకమనంబుతోడ నట నిద్రించెన్. ౪౬౬
తే॥ నమ్మి సుఖనిద్రఁజెందు నా యెమ్మెలాడి నెత్తికొనిపోవుచుండుడు నత్తపోతె
నున్న నామేని సంస్పృష్టి నొడలు తెలిసి దొంగశిష్యుఁడనని యెడఁదం గ్రహించి
ఉ॥ ఏడుచుచున్ "దురాత్ముఁడయి యీ మనశిష్యుఁడు నన్ను బల్మిమై
ఈడిచి పైనివేసికొని యేగుచునుండినవాఁడు నాథ! నీ
వేడ వసించితో ? దవుల కేగకమున్నె యిటేగుదెంచి యీ
గాడిదబారినుండి ననుఁ గాచుకొనం బ్రియతింపుమీ వెసన్" ౪౬౭
ఆ॥ అని వచించుటయును నానవలామగం "డుండు ముండుమోరి ముండకొడుక !
అనుచుఁ బెక్కుమాటు లదలించి మద్గతిస్తంభనంబుఁ జేయఁజాలె నపుడు. ౪౬౮
కం॥ చిత్తరువున వ్రాయంబడు నెత్తరినా నిల్వఁబడితి. ఇంచుకయును గా
లెత్తం జాలని తాద్భ క్స్వాతావిరహితుని డాసి సంయమి యంతన్ ౪౭౦
ఆ॥ "కొంగజపముఁజేసి కొనకు మదంగన దొంగిలించితీవు దుష్ట ! కాన
అంగలార్చుకొనుచుఁ గొంగవై పడియుండు"మని శపించె. ఏమియాడిగ దింక ?
కం॥ పదపడి నామైనే జూచెదఁగద కొంగనయియుంటి నీయన. అయినన్
కుదురుకొనియుండెఁ బ్రాకృత్ప్రకృతి. అది యెప్పటిదైనయీశ్వరానుగ్రహమో.
కం॥ ననుఁదాఁకినందులకుఁగా మునిసతి యెంతయును జిత్తమునఁ గొంటవడిన్
పనవి సచేలస్నానము పొనరించి ననుఁ గూర్చి కోపమున నిట్లనియెన్. ౪౭౩

కం॥ "ముక్త్రై నిదురించెడి ననుఁ బట్టికొనం గూడునటుగ పాపీ! శిష్యం
ద్దట్టు ఘమముఁజేరి తుదకీ చెట్టుంజేసి. ఇవి కొంగచేష్టలు కానన్ ౪౭౪

శా॥ నా నాథుం డనినట్లు కొంగవయి యుండన్ నేను శాపించితి" నం
చా నారీమణి యుక్తిన్ శపించుటయు నత్యంతంబు దుఃఖించుచున్
నే నాగాలవు రెండు పాదములపైనిన్ వ్రాలి యిట్లంటి. "నో
మానినీ! పాలకనాయక ప్రియుఁడన్. మన్నింపవే నన్నుఁ గన్. ౪౭౫

కం॥ గణకోటికి నాథుఁడ. నొక దణిపనికై యిటకు వచ్చి తావక రూపా
న్మణిఁ గాంచి కామవశతను గణియింపక యిట్టికృతికిఁ గడఁగితిని విభూ! ౪౭౬

కం॥ అవినీతునకుం బ్రాప్తం బవుఁ గాక యదృష్టవశత నైశ్వర్యము. ల
య్యావి నిల్వకొనఁడు నావలె నవలేపభరంబునూని యంత్యనుడనుకన్. ౪౭౭

సీ॥ మధురస్వరంబ కా మంచిదౌ రూపంబు కాకతుల్యములైన కోకిలలకు.
మహిత పాతివ్రత్యమక చారురూపంబు భరతఖండస్థలో భామినులకు.
అలఘువిద్వత్తయే యగుఁగా సురూపంబు పుడమిఁ గురూపులౌ పూరుషులకు
హెచ్చిన క్షమయ కా యచ్చమౌ రూపంబు ధన్యులై వర్ధిల్లు తాపసులకు.
కాన దీనుఁడగుచుఁ గాళ్లపైఁ బడినాఁడ. ఇంక నన్ననుగ్రహింపు" మనుచు
మాని తానుగూడ మాహేశ్వరం డెటుఁ జుట్టునుగఁ దలంచి యిట్లనియె. ౪౭౮

ఆ॥ "సత్యవంతుఁడగుచు క్షమనైఁ జమత్కారపురిని గలఁడొకండు భూసురుండు.
భర్తృయజ్ఞుఁడనుచుఁ బ్రజపిల్చు నాతనిం. ద్వద్వృతత్వ మతఁడు తెలుఁగఁజేయు"

చం॥ అనియిటు శాపమోచనము నమ్ముని నాకు వచించెఁ గాని యిం
కను బకదేహమున్ విడుచు కాలము దగ్గతి రాకయుండుటన్
కనుకని యట్లయుంటి. స్మృతికంబళిదానము లే ననంఖ్యగన్
పానరిచియుంటి నిర్విధము పూర్ణగతి రాయువునన్ జెలంగితిన్" ౪౮౦

వ॥ అని యిట్లాత్మీయ చరిత్రంబు నాళీజంఘుండు వక్కాణించుటయు నింద్ర
ద్యుమ్నుండు వెండియు నిట్లనియె.

కం॥ "ఇంద్రద్యుమ్నకథామృతముం ద్రావుట కొఱకె నేను మునిచే నిటు ప
క్షీంద్రా! కొనితేఁబడితి. నిఁకం ద్రిమ్మరు టేల పుడమిఁ గడతేఱ నిటన్. ౪౮౧

తే॥ ప్రతినవట్టియుంటి వితగ నింద్రద్యుమ్ను చరిత మెఱుఁగకున్నఁ జత్తుననుచు
కాన నాజ్ఞయిమ్ము కలసి మార్కండేయు. భ్రష్టయశుఁడ. నగ్నిఁబడఁగలాఁడ.

కం॥ ఇంద్రద్యుమ్న మెఱుంగక యుండే ప్రియుక లేని యనుచు నొట్టిడుకొని ధా
త్రిం దిమ్మరి చిఁక బ్రతికిన నంద్రిసదా యన్వృతవాదియని నను లోకుల్"

వ॥ అని పలుకుచుండు మార్కండేయుండు నాళీజంఘుదిక్కు మొగంబై

శా॥ "నీకంటెం బెదవాని నింకొకని నేనిం జెప్ప. మీతండు సు
శ్లోకుండోటఁ దదర్థమై యరిగి తచ్ఛ్రద్ధాత్ముఁ బ్రశ్నింతు. నే
నేకాంతాతనిఁ దోడితెచ్చితిని! ఎట్లింకన్ సహాయుండ నీ
వీఁకన్ సన్నిధినుండ నొక్కరుఁడె యప్పిత్రంబునం జొచ్చెదన్ ౪౪౬

ఆ॥ ఇంకనొకవిశేష. మే నిన్నుఁ బ్రశ్నింతు. మందునగ్నిదూఁకి మ్రగ్గుచుండు
నతని నుద్ధరింప కాశ్రియంబున కేను జనుటయెట్లొ చెపుము సఖుఁడ! నీవె"

వ॥ అని వాక్రుచ్చుటయు నయ్యుసవుని నిశ్చయంబుం దెలిసికొని వీరి కెట్లు మేలు కలుగఁజేయుదునాయని తడవు విచారించి దారువులం జేరుచుకొని పావకంబునఁ బ్రవేశకాములగు మునిజనపతులం దిలకించి మార్కండేయు నుద్దేశించి నాళీజంఘుం డిట్లనియె. ౪౪౭

—♦ గుడ్లగూబ వృత్తాంతము ♦—

ఆ॥ "బ్రదుకఁదలఁచితేని ప్రాజ్ఞ! నేఁజెప్పినపగిది నడవు. మేల తెగువఁజేతు?
స్మరణమునకువచ్చె సరిగ నింద్రద్యుమ్ను నెఱిఁగియున్నవాఁడు హృదయమునకు.

కం॥ నాకున్ జ్యేష్ఠుఁడు. మిత్రి. ములూకము. చిరజీవి. మతియు లోకారాధ్యుం
డాకైలాసమున న్మసె. సాకల్యముగం బఠించె శాస్త్రములెల్లన్ ౪౫౦

తే॥ చావ సంసిద్ధమైయుండి సర్పమట్లు కరము బుసకొట్టుకొనుచును గనులువాయ
నేమ్చ నీతని గైకొని యేగుదెమ్ము. చనుద మచ్చటికిపుడ యో మునివరేణ్య!"

వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు మార్కండేయుండు సబకంబుగా నింద్రద్యుమ్నుం దోడ్కొని కైలాసాచలంబునకుం జనియె. ప్రాకారవర్ణాహ్వయంబగు నా గుడ్లగూబ సంగాతియగు కొంగ కెదురేగి స్వాగతంబిచ్చి విశ్రాంతుఁడైన యతని బలుమయం గౌఁగిలించుకొని యింద్రద్యుమ్ననకును మార్కండేయునకును స్వాగతంబుచెప్పి నాళీజంఘు నుద్దేశించి ౪౫౨

తే॥ "మిత్రమా! నీవువచ్చిన మేటికార్యమెద్ది? నీతోడ నాయొద్ద కేగుదెంచి
యున్న వీరెవ్వ? రత్యంత ముత్తములుగఁ గానఁబడుచున్నవార లాకారములను"

వ॥ అని ప్రశ్నించుటయు నాళీజంఘుండిట్లనియె. ౪౫౪

తే॥ "ఇతఁడు మార్కండుఁడను పేర నెసఁగువాఁడు. భువనములమూఁటఁ బ్రఖ్యాతిఁ
[బొందినాఁడు.
అమ్మహాదేవు కరుణచే నష్టసిద్ధులితని కరగతములు. చెప్ప నేమికలదు? ౪౫౫

ఆ॥ ఈద్వితీయుఁ డతని కెంతయు సఖుఁడంట. ఎటుఁగ నానుపూర్వ్య మేను గూడ.
వచ్చినాఁడు నాదువసతి కింద్రద్యుమ్నుఁ బ్రస్తుకాముఁడగుచు నష్టతోడ. ౪౫౬

తే॥ గాలవర్షితనూజయుఁ గడుఁ బతివ్రతయు సుదర్శనసంజ్ఞయుఁ దనదు నైదు
ప్రాణములకంటెఁ బ్రియయునౌ భార్యతోడఁ గరము చక్కని సుతతోడఁ గానఁబడియె.

సీ. కనఁబడి కనఁబడ కనుమాన మొదవించు కడుసూక్ష్మమైన నెన్నడుముతోడ
సంపంగినూనెవాసనల దిక్కులఁ జిమ్ము చక్కని మృదుశిరోజములతోడ
నునుదొండపండున కెనయై రహించెడి రమణీయ మధురాధరంబుతోడ
చెవిదాఁక వ్యాప్తమౌ చేరెఁడుచేరెఁడు తరళాక్షి పంకజద్వయముతోడ
అలరు తద్భార్గవునిసుత యస్మదక్షులందుఁ బడుటయుఁ బడియెఁబో యసమ్యానంగు
అలరుటమ్ములు నెమ్మన. అప్పు "డీకె యెవ్వ"రని ప్రశ్న సేసితి నేను బ్రీతి.

తే॥ "ఈమె భార్గవు కొమరిత. ఇంతవఱకుఁ బెండ్లి కాలే"దటంచుఁ దత్ప్రియసఖీజ
నంబు వాక్రుచ్చుటయు నేను నయముతోడ మునిని దగ్గఱి చేతులు మొగిచి నిలిచి

మ॥ అభ్యర్థింప సవర్ణుఁడౌ టెఱిఁగి రూపాభావినౌ నాకు వా
ల్లభ్యంబొప్ప స్వపుత్రి నిత్తుననియెన్ లావణ్యవారాశిఁ. ద
ల్లాభ్యాపేతసుభాషితంబు విని లోలస్వాంతయై కన్య మా
త్రిభ్యాసంబున క్షణంబ చని లజ్జాక్రాంతయై యేడ్చుచున్. ౫౧౬

మ॥ "అమ్మా! చూడు. విరూపికిచ్చునఁట నన్నయ్యారె! హా యయ్య. జీ
వమ్మెల్లొప్పుట యుత్సహింప నిఁక నేన్. వైశ్వానరంబేని వే
గమ్మే చొత్తు. విషమ్మునేని తినుదుం గా" కంచు వాక్రుచ్చుచున్
రమ్మంచావిడ కూఁతుతోడఁ బతిపార్శ్వమ్మేగి తా మెల్లనన్. ౫౧౭

॥ "చక్కని చుక్కయై మఱియు సద్గుణలక్షణము ల్గలట్టిదై
ఒక్కతెబిడ్డ యుండె మన కోప్పదయేశ్వర! అట్టిదాని నే
ముక్కిడివానికో యొసఁగఁబోలునె" యంచు వచింప భార్గవుం
డక్కమలాయతాక్షిని మహోగ్రమహాదృష్టిని గాంచి యిట్లనెన్. ౫౧౮
"చీ! ఆతఁడు పురుషుండై పోయె. ఇఁకేమనఁగవలయు? పుత్రిక నిమ్మం
చీయన ప్రార్థించెను. నే నీయం దలఁచితిని. ఏల యీ వడ్డెదహో!" ౫౧౯

॥ అని శాసించి త్రియామయామ నతఁ డసహ్యక్రాంగితో బిడ్డతో
తనయింటన్ శయనించె. ఎల్లరును నిద్రించెంద. తయ్యర్ధరా
త్రిని నిద్రించెడిదాని నెత్తుకొని పేర్కొం గొంతదవ్వేగి యీ
కోన కాపాలిక యేడ్వఁ గూడితినిబో కూర్రత్వ మేపారఁగన్. ౫౨౦

దానితండ్రి చిత్రభానూదయము కాకపూర్వమందె లేచి పుత్రిఁ గాన
"కచట నాదుబిడ్డ? ఎవ్వఁడు హరియించె?" అనుచు మునులు పెక్కు రనుగమింప.
। అనుగుజాడలఁబట్టి యయ్యడవి వెదకఁజొచ్చుటయు ధృతమంగళసూత్రముగను
ఎంతయును సిగ్గుచేఁ దలయెత్తలేక యేడ్చుతతోఁ కిలస్వన యెదుటఁబడియె.

చ. పదపడి క్రోధయుక్తుఁడయి భార్గవుఁ "డాసురధర్మమూని దు
ర్మాద్రుఁడ! మదాత్మజాతను హరించితి. కమ్మసురుండ" వంచుఁ గీ
డొదవ ననుఁ శపించుటయు "యుక్తమె యియ్యది? నీవ యిచ్చితి
ముదితను నాకు. ఎత్తికొనిపోతిని దానిని నేను రాతిరిన్. ౪౨౩

ఆ॥ ఎవఁడు తనదుబిడ్డ నిచ్చెదననిముందు నుడివి యవల వాని కిడఁడొ వాఁడు
ప్రళయవేళదనుకఁ బడియుండు ఘోరమౌ నరకమందు దుఃఖభరముతోడ"

క. అని నేను వచించుటయును విని పశ్చాత్తాపపడుచు వినయంబున న
మ్మునివర్యుఁ డిట్టులనె. "నీవనినదియంతయును సత్యము య్యెడిఁ గానీ. ౪౨౪

క॥ నేననునది మైత్రేయను. దానికి నెప్పుడును నన్యథాత్వము లే. ద
ద్దానంజేసి యులూకమవై నవయఁగవలయునీ వహాయన నింకన్. ౪౨౬

ఆ॥ భర్తృయజ్ఞుఁడనఁగఁబడు నొక్కహాఱుండు పుట్టుఁ గొంతకాలమునకుఁ బుడమి
తదుపదేశమహిమఁ దలఁగు యుష్మదులూకభావ. మింకఁ బొమ్ము. పనవుటుడిగి.

చ. అనియిటు లుచ్చరించుటయు నైతి నులూకము నేను. కాని ప్రా
క్తనమయినట్టి జ్ఞానమది తాను దొలంగక నిల్చియుండె. త
న్మునిసుత రూపవర్జిత నను న్విడనాడి రయంబ హవ్యవా
హనమున దూఁకి రూపయుతమౌ నిజదేహము నా సె. ఏమనన్. ౪౨౭

ఆ॥ తగ నఖండబిల్వదళములచేత శంకరుని బూజచేయుకారణమున
ఇటు చిరాయునైతి. ఇది మామకీనమౌ సత్యమైనయట్టిచరిత మనఘ! ౪౨౯

క॥ అత్యంతదుర్లభంబగు కృత్యమెయగుఁగాక. నాదుగృహమున కిపుడీ
వత్యాతురతను వచ్చితి. సత్యము వచియింపు. దాని సలుపఁగనుంటిన్" ౪౩౦

వ॥ అనియిట్లు ప్రాకారవర్ణాహ్వయంబగు గుడ్లగూబ నుడువుటయు నింద్రద్యుమ్న
మహీపతి ౪౩౧

క॥ "మ్రిందఁ గృతనిశ్చయుఁడనగు నం ద్రిప్పుచునున్నవాఁడు నాడీజంఘుం.
డింద్రద్యుమ్ను నెఱుంగ బుధేంద్రా! భవదంతికమున కేతెంచితి నేన్. ౪౩౨

ఆ॥ అతని కీర్తిగాని యన్వాయముగాని యెఱిఁగియున్నఁ జెప్పు మీవు నాకు.
లేనిచో జ్వలత్కృశానుమధ్యంబునం జొచ్చువాఁడ. బలిమిఁ జచ్చువాఁడ.

ఆ॥ కాకయున్న మఱియొకండు చిరాయుష్కుఁ డున్నఁ జెప్పు. మతనియొద్దకేగి
అడుగు వాఁడ. అతఁడైన నింద్రద్యుమ్ను నెఱుఁగునో మఱింక నెఱుఁగననో"

వ॥ అని ప్రాకారవర్ణునితో భాషించుచుండ నడుమ నాళీజంఘుం డిట్లనియె.

ఆ॥ "మంచి దీతఁడన్నమాట. నీకంటెఁ బెద్దయగువాఁడు విదితుఁడయిన యెడల
చెపుము. లేకయున్న నిపుడ మార్కండేయుతోడ నగ్నిఁ బడఁగలాఁడ నేను.

ఆ॥ ఈవు చూచుచుండ నిట్లు కాఁబోవుట తెలిసి దివినొ భువినొ కల చిరాయు
నొకనిఁ జింతసేయు మోమహాభాగా! చిరాయు వీవుగూడఁ గనుటఁ జేసి. ౫౩౭
తే॥ అకట! కొండంత యాశపెట్టుకొని నీదు నింటికే తెంచియున్నవాఁ డీప్రమాంసుఁ
డిఁక విశేషించి మిగులనా కిష్టుఁడైనయట్టి మార్కండమౌనితా నరుగు దెంచె.
క॥ ఉన్నవి నూఱులు వేలును నున్నతభూధరము లిచట. యోగీంద్రులు తా
రున్నారటఁ జిరజీవులు. క్రిన్న విచారింపు వారికడ కేగి సఖా! ౫౩౯
క॥ లేకున్న నిట్లు నీతఁడు వ్యాకులతం బ్రాణములను వదలంగలవాఁ
డీకృతి యిందద్యుమ్ననకే కా కగు హితము మాకు నిరువుర కనఘా!"
వ॥ అని యిట్లు వచించుటయుఁ జావ సంసిద్ధుఁడైన యీతని నిశ్చయముం దెలిసి
కొని యాగుడ్లగూబ దయార్ద్రహృదయంబై. ౫౪౧
క॥ "ఇట నీవు దిటము చెడి మదిఁ దటుకున మరణంబు చెందఁ దలఁచితి వేనిన్
తృటిలోనఁ జేర్చెదను బద యటవీయుత గంధమాదనాద్రికి నిన్నున్. ౫౪౨

—* గృధ్రోపాఖ్యానము *—

ఆ॥ అచట నొక్క గ్రద్ద యలరారు. నాకంటెఁ బెద్దదద్ది. కరము ప్రియము నాకు.
ఎఱిఁగియుండవచ్చు నీ శ్రేని. తద్వార్తఁ దెలుపవచ్చు మనకుఁ గలవిధమున"
వ॥ అనినవిని మార్కండేయనాళీజంఘు లిరువురును. ౫౪౪
క॥ అయ్యా మేమును నీతోఁ జయ్యన వత్తుము తదద్రి సవిధంబునకున్.
మయ్యెడి యగ్నిం బడకిఁక. ఇయ్యండజ మెఱుఁగవచ్చు నింద్రద్యుమ్నున్.
వ॥ అనినవిని యమ్మహోలూకం బత్యంతాశాబద్ధుండై యెల్లరతోడఁ గూడి గంధ
మాదనంబునకుఁ జనుటయు గృధ్రశ్రేష్ఠము వారిం దిలకించి యెదురుచని యందఱ
కును నంజలిజోడించి ప్రహృష్టంబై యందు ముందఱనున్న గుడ్లగూబం గూర్చి
క॥ "స్వాగతమే నీకు మహాభాగా! కనఁబడితి నాకు బలునాళ్ళకు. నీ
తోఁగూడ వచ్చుచుండిన యీగుణవద్ద్వితయ మెవ్వ? రెఱుఁగం జెపుమా"
వ॥ అని ప్రశ్నించుటయు గుడ్లగూబ యిట్లనియె. ౫౪౭
క॥ నాడీజంఘుండను నీ నీడోద్భవవరము నాదు నెచ్చెలి. అతనిన్
గూడి కడుమైత్రినుండెడివాఁ డీమార్కండనామ వాచంయముఁడున్. ౫౪౯
శా॥ ముల్లోకంబులఁ జేరుమ్రోసినతఁ డీమున్యగ్రగణ్యుండు తా.
చెల్లెం బ్రాయము సప్తకల్పములు. తచ్ఛిష్యుండఁ టీతండు. ఏ
తల్లాలిత్య మెఱుంగ నేను. తనువున్ దగ్ధంబుగావింపఁబో
మెల్లం దోడ్కొనివచ్చినాఁడ నిటకున్ మేల్సేయు నాలోచనన్. ౫౫౦

క॥ ఇంద్రద్యుమ్నుండను భూమీంద్రుని స్థితి తెలియఁబడిన నీతఁడు బ్రదుకుఁ
సౌందర్యమగు నిష్పుకలలోనం ద్రుతముగఁ జొచ్చుఁ గానినాఁడు ద్విజేంద్రా.

ఆ॥ ఈ వెటింగియున్న యెడల నింద్రద్యుమ్న భూమిపాలు నునికి పొసఁగఁజెప్పుము.
కరము పెద్దవాఁడ వరయ నాకంటెనీ వంచు నడుగ నరుగుదెంచినాఁడ. ౫౫౨

వ॥ అనియిట్లు గుడ్లగూబ వక్కాణించుటయు గద్దయిట్లనియె. ౫౫౩

క॥ ఇంద్రద్యుమ్నుండను నృపచంద్రుని నేఁ గాంచియెఱుఁగ. శ్రవణించి యెఱుం
గం ద్రిజగంబుల నెచట బుధేంద్రా! ఏమనివచింతు నిఁక నీతోడన్. ౫౫౪

వ॥ అనిన విని యారాజు వ్యాకులితాంతరంగుండై మరణింప నిశ్చయించుకొని గృ
ధ్రంబుం గనుంగొని.

క॥ "ఏకర్మముచే నింతగ నీ కాయువు ప్రాప్తమయ్యె? నిక్కముచెప్పుమా.
ఆకర్ణించి పదంపడి భీకరమగు జ్వలనమునఁ బ్రవేశింతు లలిన్" ౫౫౬

వ. అనియడుగుటయు వెండియు గృధ్రంబిట్లనియె. ౫౫౭

తే॥ ఏఁ జమత్కారపురి రత్నశృంగగిరి సమీపమునఁ దొల్లి కోఁతినై మెలఁగియుంటి.
అటనె రాజిలు చిత్రేశ్వరాభిధాన మందరసమ శివాలయముం దడవుచు. ౫౫౯

ఆ॥ ఆశివాలయంబు సంతికమునఁ గల దొక్కతోఁట. ఎపుడు నుండు దాన
పూలు పండ్లు. గానఁ బురజనప్రియమయ్యె. అయ్యె స్త్రీజనమున కతిప్రియంబు.

క॥ ఆతోఁటలోనఁ బౌరవ్రాతము జానపదచయము వైశాఖమునం
దేతెంచి మహోత్సవమును బ్రీతిం గావించి రనఘ! శ్రీకంఠునకున్. ౫౬౦

ఉ॥ ఊయలవేసి వృక్షమున కొప్పు తదుత్సవవిగ్రహంబు నం
దాయతినుంచి కొంతతడి యూచుచుఁ బాడుచు నూఁపి యిండ్లకున్
బోయిరి వార లందఱును. పూవుయు నస్తధరంబుమీఁదికిన్
బోయెను. నేను బోయితిని బో యపు డుయ్యెలయున్న చోటికిన్. ౫౬౧

క॥ పోయి సుమనోహరంబగు నా యుయ్యెల యూఁపుకొనుచు హర్షముతో నా
రేయి వసించుడు వచ్చిరి కోయని యఱచుచు రయంబ కొందఱు పౌరుల్.

క॥ వచ్చి భయపెట్టి కట్టెలు తెచ్చి ననుం జావఁగొట్టు దేవర నూఁపన్
వచ్చిన పుణ్యపు మహిమను జెచ్చెరఁ గోటీశుఁడైన క్షితిపతి యింటన్. ౫౬౩

క॥ పుట్టితి. కుశధ్వజుండని పెట్టిరి తల్లియును దండ్రి పేర్. పూర్వంపుం
బుట్టువున నెవఁడనైనది యెట్టటుచేసినది యెడఁద కెఱుకయి యుండెన్.

ఆ॥ శర్మవశత నన్నుఁ గన్నట్టి కోటీశుఁ డమరపురికిఁ జేర్మి నరుగుటయును
పడసినాఁడ నేను బైతృకంబైనట్టిరాజ్యం మేలినాఁడఁ బాజ్యముగను. ౫౬౪

క॥ గురువరుఁ డుపదేశించిన పరశివసిద్ధాంతమంత్రవారము జపముల్
జరుపుచు స్వేచ్ఛను జాగేశ్వరు నూఁపుచునుంటిఁ గృత్తివాసు మహేశున్.

తే॥ పెద్దయయుంబ్రొద్దునకుఁ గడుం బ్రీతుఁడగుచు గట్టువిల్తుఁడు "నీమదిఁ గల మనోర
థంబుఁ జెపుమ కుశధ్వజ! తప్పకుండ నిత్తు"నని పల్కుటయును నే నెరఁగి భక్తి.

తే॥ "ఈశ! సంప్రీతిఁ జెందితివేని నన్ను స్వీయగణములలోపలం జేర్చుకొనుము.
మూడుజగముల నేలుటకూడ నాకుఁ గాదభీష్టము ప్రస్తుత మేదియేని" ౫౬౭

చ॥ అనివచియింప నన్నుఁ బ్రమథాధిపుఁ డంబరయానసంస్థితుం
బొనరిచి యద్దెసె తోడుకొనిపోయె స్వలోకము. తత్కృపాబలం
బున గణకోటిఁ జేరి తమి బుద్ధికి నచ్చినచోటికెల్లనున్
జని విహరించుచుం జైత్రవసంతసమాగమవేళ వేడుకన్. ౫౬౮

ఆ॥ చల్లగాడుపులకు స్థానమౌ నీ గంధమాదనాద్రిపై విమానవరము
నుండి దిగినవాఁడ నో మహాభాగ! అప్పట్లఁ గరము కనులపండువుగను. ౫౬౯

సీ॥ పిడికింటిలోపలం గడు సుళువుగఁ బట్టఁదగిన సెన్నడుముతోఁ దనరుదాని
పరిపక్వమగు దొండపండునకద్దియౌ నధరంబుతోడ బిట్టలరుదాని
శతపత్రములతోడ సరిచేయఁదగిన కన్నుందోయితోడఁ జెన్నొందుదాని
పార్వణశర్వరీట్ప్రతిమానమైనట్టి నెమ్మొగంబునఁ జాల నెగడుదాని
చారుతరములైన మారేడుపండుల ననుకరించు గుబ్బచనులదాని
వలువలొలిచి చెలులఁ గలసి జలక్రీడలాడుదాని నొక్కయబలఁ గంటి. ౫౭౦

చ॥ కని మరుబారిఁజిక్కి తమకంబున నేలకు డిగ్గి యా మునీ
ట్తనయు కరంబుఁ బట్టుకొని తత్సహితంబుగ వ్యోమయాన మె
య్యన మతి యెక్కిపోవుటయు నాకె సఖుల్లని యగ్ని వేశ్యతో
"అనఘ! భవత్తనూజ నొక యంబరచారి హరించి యేగెడిన్" ౫౭౧

చ॥ అని మొఱవెట్టుడుం దపసి యార్చుచు న య్యుటజంబునుండి ది
గ్గున నివలం బడన్ దుమికి క్రూరముగన్ గగనంబువంకఁ గ
న్గొనుచును "నుండుముండు" మని కోపముతోడ నదల్చుకొంచు స్తం
భన మొనరించె మామకవిమానము నావల కేగకుండఁగన్. ౫౭౨

ఉ॥ అంతటఁబో "కకామ, మతి యాటలధోరణి నుండుపిల్ల నీ
వింతభయంబులేక హరియించితి మాంసము గద్దలాగునన్
హంతక! పెద్ద గద్దవగు"మంచు శపించె నిఁకేమిచెప్పుదున్.
చింతిలుచుం దదంఘ్రిసరసీజములంబడి నేను బిమ్మటన్. ౫౭౩

ఉ॥ కన్నియ నప్పగించి "అనఘా ! భవదాత్మజ యీమెయంచు నే
నెన్నడు గుర్తెఱుంగ. ఇఁక నేలశపించెదు నన్నుఁగ్రద్దఁగన్
క్రన్న ననుగ్రహింపు"మనికాళులు రెండును వీడకుండుడున్
సన్నుతుఁ డమ్మునీశ్వరుఁడు శాంతివహించి గ్రహించి యట్లనెన్. ౫౭౪

శా॥ "నానోటన్ వచియింపఁబడ్డయది యేనాఁడున్ వృథాగాదు కా.
దైనన్ ధారుణి భర్తృయజ్ఞుఁడనువాఁ డావిర్భవింపంగలం.
డానిర్లిప్తుఁడు పెద్దప్రొద్దునకు శాపాంతంబు గావించు" నాన్
నే "నెట్లు ఘటించునో కో"యని యన్వేషించు చక్కాలమున్ ౫౭౫

ఉ. ఉండినవాఁడ. ఆపురుషుఁ డుర్వి నదృష్టుఁడు. నశ్రితుండు. నా
అండజభావపుం తుతి నిరాశుఁడనై తిని. గద్దనాటకై
ఉండినకారణంబు మఱియుం జిరజీవనకారణంబు నీ
రెండును నీకుఁ జెప్పితిని శ్రీయుత ! ఉన్నది యున్నయట్లుగన్" ౫౭౬

వ॥ అనవుడు నింద్రద్యుమ్నుం డిట్లనియె. ౫౭౭

క॥ "సెలవిమ్మునాకు శీఘ్రమ. జ్వలనమునంబడి యథేచ్ఛఁ బ్రాణమువిడుతున్.
కలిగెను వైరాగ్యం. బీయిల బ్రదుకుట కుత్సహింప నేనిఁక నార్యా !" ౫౭౮

వ॥ అనివక్కాణించుటయు గృధ్రిం బాత్మగతంబున ౫౭౯

ఆ॥ "నాసమీపమునకుఁ దా సుహృద్యుతముగా వచ్చినాఁడు కాన వాస్తవముగ
చేతనైనయంత చేయనా నుపకార మితని. కిట్లు చావనీయఁదగదు." ౫౮౦

వ॥ అని చింతించి దాక్షిణ్యసహితంబై యింద్రద్యుమ్నునితో నిట్లనియె. ౫౮౧

## –: మార్కండేయాదుల కింద్రద్యుమ్నునెఱింగినతాఁబేలు కనఁబడుట :–

క॥ "నిప్పులలోపలఁ బడకుమ యెప్పుడు. నామాటవినుమ. యింద్రద్యుమ్నున్
తప్ప కెఱింగినవానిం జెప్పెద. నాకంటె నతఁడు చిరజీవి యగున్." ౫౮౨

వ॥ అనియిట్లు వచించుటయు మఱియు నింద్రద్యుమ్నుండు ౫౮౩

క॥ "ఎవరయ్యా నీకంటెను భువి వయసునఁ బెద్దవాఁడు ? పూర్తిగ దీనిన్
శ్రవణింప వేడుకయ్యెడు. వివరింపుము గృధ్రరాజ ! వేగమ నాకున్" ౫౮౪

వ॥ అని యడుగుటయు గద్ద యిట్లనియె.

క॥ "కలదల మానససరసున బలువగు తాఁబేలు దానిపేరియము నాకున్
దెలియదు. మంథరకాహ్వాయ. మిలనది యెఱుఁగంగవచ్చు నింద్రద్యుమ్నున్."

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయు మార్కండేయుండుమున్నగు మువ్వురును జావ
సంసిద్ధమైన ఙ్మాపాలుం గనుంగొని ౫౮౭

శా॥ "ధీమంతుండగు గృధ్రరాజునుడి యెంతే యుక్తమైయున్న. దా
తా మేలున్న సరస్సు దగ్గఱకు సోత్కంఠంబుగం బోద. మీ
బా మింకన్ విడిపోవుఁ దప్పక మహాభాగా! వ్యధన్ వీడుమీ.
శ్రీమత్త్వంబున కాదికారణ మనిర్వేదంబయం డ్రిబ్బుధుల్" ౪౯

వ॥ అనినవిని యాపుడమిఱేఁ డతికష్టంబున మరణంబునుండి బుద్ధి మరల్చుకొని యందఱితోడను గంధమాదనపర్వతంబునుండి పయనమై యైదుగురును నాకాశ మార్గంబునం గ్రమముగా మానససరస్సమీపమునకుఁ బోవుసమయమునం దా కూర్మంబు యాదృచ్ఛికంబుగా వేఁడిమి ననుభవించుటకు నీటినుండి నిర్గమించి యుండియు వచ్చెడివారి నెల్లరం దడవు వీక్షించి తెలిసికొని పరాఙ్ముఖంబై మగుడ జలంబున డాఁగుటకుఁ జనుట తిలకించి గృధ్రం బిట్లనియె.

క॥ "ఓ మహామిత్రమ! ననుఁగని యాహా! అట్టు మొగము వెట్టె దదియేమయ్యా?
గేహాగతుఁడగునీచుఁడె స్నేహితుఁడటు సజ్జనులకు క్షితిఁ బూజ్యుండా" ౫౦

వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు నక్కమఠంబు జలంబులందుండియె తలమాత్రము
వెళ్ళఁబెట్టి సవినయంబుగా గ్రద్దం గనుంగొని ౫౧

చ॥ "నినుఁగనికాని లేక మఱి నీ వెనువెంటనువచ్చు మువ్వురన్
గనుగొనికాని యేత దుదకంబున నేను శరీరగోపనం
బొనరిచియుండ. విన్ము విహగోత్తమ! ఐదవపూరుషుం గనుం
గొని భయమంది యీవిధము గుట్టుగనుండఁగ నీటఁ జొచ్చితిన్. ౫౨

క॥ ఇంద్రద్యుమ్నుండను నృపచంద్రుం డితఁ. డితనిచేత సంతతమును బ
క్షీంద్ర! మును పాచరితములు రంధ్రంబుగ నధ్వరములు రోచకపురిలోన్. ౫౩

క॥ ఏఁపంతయుఁ గాలె నిదంభూపతికృతయజ్ఞవహ్నిఁ బూర్వమునా. కా
రోపితయశుఁడగు నితని సురూపము గన భయము మరల రూపము దాల్చెన్"

వ॥ అని వచించుచుండ బ్రహ్మపనుపున దివంబునుండి దేవదూత వచ్చి ౫౪

ఉత్సాహము॥ "రమ్మురమ్ము బన్మకడకు రాజఋషివరేణ్య! నీ
విమ్మహిం ద్వదీయకీర్తి యింతయుండినను సమ
గ్రమ్ముగన్ స్వలోకమునకు రయమ తోడితెమ్మటం
చమ్మహాత్ముఁ డాజ్ఞయిచ్చె. నట్లుగాన లెమ్మికన్. ౫౬

క॥ ఆరోహింపు విమానము శ్రీమరమణా! తద్విరించిసమ్ముఖమునకున్
చేరిచెద నిన్నుఁ గొనిచని. ఆరయ దుర్లభము పరుల కాలోక మహా!" ౫౭

వ॥ అనివక్కాణించుటయు నింద్రద్యుమ్నుం డిట్లనియె.

సీ॥ నాకీర్తి తానెఱుంగక కొంగఁ గలపిన ధన్యు మార్కండేయ తాపసుఁడును
తాను నెఱుంగక తనకంటెఁ బెద్దయౌ ఘూకముం జూపిన కొంగ దణియు
తనకును నీచెయ్వి తరముగా నిదియౌటఁ గ్రిద్దఁ బ్రశ్నించిన కౌశికమును
తత్త్వం బెఱింగిన తాఁబేటి చెంతకు నిందఱం జేర్చిన గృధ్రపతియు
నాదుకీర్తిఁ బ్రకటించి యైదుగురిని రమణ బ్రతికించినటువంటి కమఠవరము
నైదుగురు నైదుప్రాణంబు లరయ నాకు. వారలు వచ్చెదను. రాను వారివిడిచి,

వ॥ అనిపలుకుటయు దేవదూత ౬౦౧

క॥ "వీరందఱు శివగణములు. చేరిరి ముని శాపవశత క్షితితలమునకున్
భూరమణ! ఉమారమణు హజారముఁజొచ్చెదరు మరల శాపాంతము కాన్.

ఆ॥ కాన వీరివిడిచి గ్రక్కున రమ్ము పోవుదము భూప! బ్రహ్మపదమునకును
అర్థ వు విడిచి వీర లన్యత్ర యరుగుట కిష్టపడరు చెప్ప నేమికలదు?" ౬౦౨

వ॥ అనినొడువుటయు వెండియు నింద్రద్యుమ్నుం డిట్లనియె. ౬౦౩

ఉ॥ "ఈవిధమైన నింక నట కే నరుదేరను నీవు వెళ్లిపొ
మ్మేవిధ మేనుగూడఁ బ్రమథేశగణంబును గాఁగలాఁడనో
ఆవిధ ముద్యమింతు. స్థిరమా యెట నెన్నిదినంబులున్న? ఎ
ప్డో వసుధాస్థలంబునకు నూర్ధ్వపతు ల్పడనెట్టకుందురే?"

వ॥ అనియిట్లు వాకుృచ్చుటయు దేవదూత మొగము చిన్నఁజేసికొని సవిమానంబుగా బ్రహ్మలోకంబునకు వెడలిపోయె. ఇంద్రద్యుమ్నుండు సవినయంబుగాఁ గూర్మం బుదిక్కు మొగంబై. ౬౦౪

ఆ॥ "చెప్పుము కూర్మరాజ! స్వీయపూర్వకర్మంబు. ఎట్టులింతప్రాయ మేరుపడియె?
ఏమికర్మమీవు కామించి చేయ నీకమఠతనువు నీకు ఘటనమయ్యె?" ౬౦౫

వ॥ అనియడుగుటయుఁ దాఁబే లిట్లనియె. ౬౦౬

తే॥ "నేఁ జమత్కారపురిని శాండిల్యుఁడనెడి బ్రాహ్మణులపిల్లవాఁడ భూపాల! తొల్లి
కట్టినాఁడను గుడియొండు కాలినట్టియిటికెలను బెట్టి యాటలాడుట నొకపుడు.

మ॥ అట జాగేశ్వరలింగముం గ్రమముగా నారోపితంబయ్యె. ఆ
దట భక్తిన్ సహడింభకుండనగుచుం దల్లింగపూజన్ మహో
ర్చటిఁ గావించితిఁ బ్రత్యహంబు నిదియున్ బాల్యంపుఁగ్రీడాళి నొ
కృటి. విధ్యుక్తమునన్ సమంత్రకమునుం గాదెంచిచూడన్ విభూ!

క॥ ఒక కాలంబున జీవములకుఁబాసి జనించియుంటి లలి వైదిశనా
మక పురమున విప్రుఁడనై. ప్రకటితమైయుండె నెడఁదఁ బ్రాగ్జనివిధమున్.

ఉ॥ అందున నేను శంకరునియం దతిభక్తిగలాఁడనౌచు నం
దందుఁ జరించి కొంతధన మార్జనచేసి యొకాలయంబు బి
ట్టందముగా రచించితిని. అందొకలింగము నిల్పి ప్రత్యహం
బుం దగఁబూజసేయుచును బుచ్చితి నిట్లొకకొంతకాలమున్. ౬౧౧

సీ॥ బ్రహ్మచర్యమె పరిపాలించితినిగాని పెండ్లాడి బిడ్డలం బెంచనైతి.
భిక్షాన్నముననె సంప్రీతిఁజెందితిఁగాని పాయసాదుల నాసఁజేయనైతి.
బ్రహ్మవిద్యనె శ్రద్ధఁ బఠియించితినిగాని యల్పవిద్యలజోలి కరుగనైతి.
పరశివునే యెప్డు భజియించితినిగాని తద్భిన్న మాత్మలోఁ దలఁపనైతి.
తత్ప్రభావమునను దదనంతరభవంబునందు సార్వభౌముఁడైతి నేను.
పొసఁగియుండెనపుడు పూర్వజన్మజ్ఞాన మవనిపాల! ఏమియనఁగవలయు?

కం॥ అంతటఁ గైలాసాచలమంతంత మహాలయంబు లస్మద్రాజ్యం
బంతటఁ గట్టించి యుమాకాంతుఁ బ్రతిష్ఠించి పూజఁగావించితి నేన్. ౬౧౩

ఆ॥ అట్లుచాలకాల మర్చింపనర్చింప సంతసించివచ్చి శంకరుండు
నగు మొగంబుతోడ ననుఁగాంచి రాజర్షి! ఎంతయును మృదూక్తి నిట్టులనియె.

కం॥ "జయదత్తపార్థివోత్తమ! అయినది సంతృప్తి నాకు. అడుగుము నే నే
మి యొసంగవలెనో. తావకమయిన మహాభక్తి కేమియైనను నీనా." ౬౧౪

చం॥ అనియిటు చంద్రచూడుఁడు దయన్ వచియింపఁగ దోసిలొగ్గి యౌ
వనసహితంబుగా మృతివివర్జముగా మన వేడుకొంటి. ఓ
దినమణితేజ! వల్లెయని దృష్టిపథంబును దాఁటె నాతఁ డే
మనివచియింతు? అంతఁ బ్రమదాంబుధివీచుల నోలలాడుచున్. ౬౧౫

ఆ॥ ఇచ్ఛవచ్చినట్టు లే జరామరణముల్ లే కకంటకముగ లోకమందు
తిరిగి పెద్దప్రొద్దు స్త్రీమోహమునఁబడి మఱచితిని సకాలహరసమర్చ. ౬౧౬

ఉత్సాహము॥ కానఁబడినయట్టి యందగత్తెనెల్లఁబట్టి నే
నూనశరునియాహవమునఁ జొక్కి చొక్కఁజేసితిన్.
మానవులకు శాసకుఁడను. మఱియు మృత్యుభయము లే.
దోనరేంద్ర! ఏమియడ్డమున్న దుర్వి నాకికన్. ౬౧౭

శా॥ ఆదుర్మార్గము సాగుచుండుటయు హాహాకారముల్వ్యాప్తి ని
ర్వేదంబొంది యముండు రుద్రకడకున్ వే పోయి కేల్మోడ్చి "ఓ
హోదేవా! జయదత్తుపూజలకు నీ వుల్లంబునన్ మెచ్చి సో
న్మాదుండైమన నిత్యయౌవనునిగం గావించి తింకేమనన్? ౬౧౮

కం॥ వాఁడాయౌవనమదమునఁ జేడెల బల్మిమెయిఁ బట్టి చెఱచుచునున్నాఁ
డేడం బాతివ్రత్యము చూడంబడ దేఖగలదు క్షోణి మహేశా! ౬౨౦

క॥ సహజంబుగఁ గాకున్నను మహిపతిభయమున జనం బమార్గగమయ్యెన్.
తుహినాంశుధర ! భయంపడఁ డహహా ! నా కించుకయును నతఁ డేమందున్.

క॥ కావున భూలోకంబున యావద్ధర్మంబు నష్టమగులోపలనే
ఆవసుధేశుని దుర్ణయ మీవు నివారింపవలయు నీశ్వర ! కరుణన్” ౬౨౨

మ॥ అని వాక్రుచ్చుటయున్ మహాగ్రహముతో నన్వీతుఁడై శూలి నన్
తనసాన్నిధ్యముఁ బిల్వఁబంచి వెస భీతస్వాంతతన్ దోసిలో
గ్గి నిజాంఘ్రిద్వయి వ్రాలుచున్ వణఁకుచున్ ఖేదంబుగావించుచు
న్నను శాంతింపక శాపమిచ్చె నెపుడుం దాఁబేలవై యుండఁగన్. ౬౨౩

చ॥ పదపడి దైన్యమూని కడుఁ బ్రార్థనసేయఁగ నెట్టకేల కా
సదయుఁడు షష్ఠికల్పమున శాపవిముక్తినిబొంది క్రిమ్మఱన్
మొదలిటివేసు బొల్చి తన ముఖ్యగణంబులలోన నుండఁగన్
ముదలయొసంగె. కూర్మమయి పోయితిఁ దక్షిణ మంబురాశికిన్. ౬౨౪

ఉ॥ పోయి సదా తదంబువులఁ బొక్కుచునుండఁగ నుర్వి కొక్కటన్
రాయఁడవైతి వీవు. సవనంబులొనర్పఁదలంచి దీర్ఘపుం
గాయముతోడ నబ్ధియుదకంబుననుండిన నన్నుఁదెచ్చి య
త్యాయతమౌ ప్రదేశమొక డారసి స్థాపనఁజేసి తచ్చటన్. ౬౨౫

ఉ॥ స్థాపితు నన్ను మంత్రముల స్తంభనఁజేసి చలింపకుండఁగన్
వీఁపునవేదు లేర్పఱచి వేల్చు చొనర్చితి వేలజన్నముల్.
క్ష్మాపతి ! దగ్ధమయ్యె నధికంబుగ నాదుశరీర. మెంతొ సం
తాపముఁజెందుచున్ బహుదినమ్ములునుండితి నివ్విధంబునన్. ౬౨౬

ఆ॥ ఎట్లు తొల్లి పాప మేఁజేసియుంటినో యట్లు మరలఁ దాప మనుభవించి
ప్రమథనాథుకరుణఁ బ్రాణాలతోమాత్ర మున్నవాఁడ. వింటె యొానరేంద్ర !

ఆ॥ హరునియలుకవలన నయ్యది యంతయు ననుభవింపవలసె. అంతఁగొంత
వడికి నీవుపోతి వనజాసనుని చెంకి. కిల సమస్త మయ్యె జలమయంబు. ౬౨౮

తే॥ వసుధ యవ్విధ మేకార్ణవం బగుటయు నటునటుం బ్లవమానుఁడనగుచు నేను
మానససరస్సుఁజేరితి మానవేంద్ర ! ఏఁబదియు నాలుంకల్పంబు లిపుడు నాకు.

ఉ॥ నాలుగుకల్పము ల్గడచినం గమఠత్వము వాయు నింక భూ
పాల ! మదానుపూర్వ్యమిది. ప్రాక్తనమైన భవన్మఖానల
జ్వాలలు నేఁటికిం గనులఁ బ్రాకినయట్టులె యుండె. కావునన్
నీళులలోపలం బడితి నే నిన్నుఁ గన్గొని భీతిఁజెందుచున్. ౬౩౦

క॥ పగవాఁడవె నీ. నైనను స్వగృహంబున కతిథిగాఁగఁ జనుదెంచితి. దే
నిగుఱిచివచ్చితొ చెప్పుము. సుగుణాన్విత! శక్యమైనచోఁ గావింతున్. ౬౩౧

కం॥ నిఱుఁగొనిపోవ విమానమె చనుదెంచె. మఱలఁజనవు స్వర్గంబునకున్?
జనపతు లిందులకేకద పొనరింతురు ధర్మములను బుడమి మునీఁడా!” ౬౩౨

వ॥ అనియిట్లు వక్కాణించుటయు నింద్రద్యుమ్నుండు ౬౩౩

కం॥ “స్వర్గాదులనుండి వియన్మార్గంబునవచ్చి మరల మహిఁ బడవలె. త
ద్దుర్గతులు నావలె. దపవర్గముగుఱిచియె యతింతు వచ్చెడిదనుకన్. ౬౩౪

కం॥ గేహంబునకరుదెంచిన దేహుల యీహితము నీవు తీర్చెదుకద! ఓ
హాహా! నీకంటెం బెదయౌ హితుఁడుండిన వచింపు మటులైన వెసన్”

వ॥ అనియడుగుటయుఁ గూర్మం బిట్లనియె. ౬౩౬

తే॥ “లోమశుండనుబ్రహ్మర్షి భూమిపాల! ఒక్కఁడున్నాఁడు నాకంటె నుర్విఁబెద్ద
అతని విన్నాఁడ-కన్నాఁడ. అల నదీతటంబునందున్నవాఁడు యోగంబువట్టి.”

వ॥ అనియిట్లువాక్రుచ్చుటయు మఱియు నింద్రద్యుమ్నుండు ౬౩౭

కం॥ “అటులైన రండు పోదము తటమున నందఱముఁ గలసి తన్మునికడకున్.
“పటుకాయ! ఇంతకాలం బెటుబ్రతికి” తటంచు నడిగి యెఱుఁగుద మంతన్.”

## ఇంద్రద్యుమ్నాదు లార్గురును లోమశునొద్దకుఁ బోవుట

వ॥ అని యందఱుం గూడి యాకాశపథంబునం జని ౬౩౮

సీ॥ పర్ణాస్తరణమైనఁ బైభాగమున లేక యుర్విపైఁ గూర్చుండియున్నవాని
పూని యుచ్చైర్ఘోషమున సస్వరంబుగా స్వాధ్యాయపాఠంబు సలుపువాని
శ్రద్ధాసమేతుఁడై సమిధాజ్యములతోడ వీతిహోత్రమునందు వేల్చువాని
గడ్డిపోఁచల సవ్యకరముచే నీడకై గొడుగుగం బైఁ బట్టుకొన్నవాని
అక్షమాలను గుడిచేతియందుఁ దాల్చి యెంతయును నిష్ఠమై జపియించువాని
బ్రహ్మచర్యాదితపముల బలుశ్రమము సహించువాని మహాత్మునిఁ గాంచిరపుడు.

వ॥ అట్లుకాంచి యమ్మహాత్మునకు వలగొని కూరుచుండుటయు నాతండు
స్వాగతంబిచ్చి. ౬౪౧

ఆ॥ “ఎవరు మీర? లిచటి కేటికే తెంచితి? రున్నపని యొనర్పనుంటిఁగాన
సకలమును రయంబ చక్క వచింపుఁడీ నరవియచ్చరాంబుచరములార!” ౬౪౨

వ॥ అని ప్రశ్నించుటయుఁ గూర్మంబిట్లనియె. ౬౪౩

కం॥ “ఈయనఘాత్ముఁడు మార్కండేయాహ్వయబ్రహ్మఋషి. మునిప్రవరా! వి
న్నాయుఃస్సు కల్పసప్తక. మీయేలిక యితని చెంత కేతెంచి మొదల్. ౬౪౪

కం॥ “ఇంద్రద్యుమ్ననివార్త మునీంద్రా! ఎఱుఁగుదె” యటన్న నెఱుఁగక తనకం
టెం ద్రిచతుఃకల్పాయుస్సాంద్రంబగు నీబకంబు సవిధముఁజేర్చెన్. ౬౪౫

చ॥ అతఁడు నెఱుంగ కిమ్మునివరావనిపాలుర నిర్వ్వరన్ సమా
ద్యుతిఁదనకంటెఁ బెద్దయగు నేతదులూకముచెంత కేంతయున్
ద్రుతముగఁ దోడితెచ్చుటయుఁ దోడ్కొనివచ్చె నతండుగూడఁదా
నతని నెఱుంగ కింకను జిరాయువటంచును గద్దపాలికిన్. ౬౪౭

క॥ ఏఁబదియునాలుకల్పములే బ్రదికెనుగాని యతఁడు నింద్రద్యుమ్నున్
తాఁబోడఁగాంచియెఱుంగం డోబుధ! ఆకారణముననుండి రయమునన్ ౬౪౮

ఉ॥ నేఁ దనకంటెఁ బెద్దనని నిక్క మెఱింగినమిత్రిపాటుచే
నాదెస కవ్విహంగమము నల్వురఁ దోడ్కొనివచ్చె. వచ్చిన
య్యైదుగురున్ సుదూరమునయందువసించుచునుండఁ గాని యీ
క్ష్మాదయితుం డెఱుంగఁబడఁ జక్కఁగ లోమశవాని చంద్రమా! ౬౪౯

క॥ ఇంద్రద్యుమ్నుం డితఁడే మునీంద్రా! నిక్కమిది. పూర్వమెంతయు నీరా
ట్చంద్రుండు పుడమికిందను నం ద్రియిమంత్రముల బంధనంబోసరిచి తాన్

ఆ॥ మీఁద వేదికలను మిక్కిలి వేయించి హోమమాచరించె నోమునీంద్ర!
తన్మఖాగ్నిచేత దగ్ధంబు మత్పృష్ఠ. మాభయమున నీళ్ళయందుఁ బడితి. ౬౫౧

ఆ॥ న్యాయనిష్ఠురంబులాడు నీగ్రద్ధకుం గలవిధంబులెల్లఁ దెలిపినాఁడ.
ఇంతలోన నచటి కేతెంచెను విమాన మూర్ధ్వలోకముననునుండి యార్య! ౬౫౨

ఉ॥ వచ్చినయవ్విమానమును వైళమ మమ్మలవీడి యెక్కఁ డీ
సచ్చరితుండు. పోవఁ డల స్వర్గముగూరిచి. ప్రశ్న సేయ న
స్మచ్చిరజీవితంబుమితి చక్కఁగఁజెప్పితి. అంతకంటెనున్
హెచ్చగునాయువున్నయతనిం గనఁగోరిన నిన్నుఁజూపితిన్. ౬౫౩

క॥ కావున నిన్నిపు డేతజ్జ్యావిభుఁ డెదియడుగఁగలఁడో యద్దానికి నో
పావనచరిత! సదుత్తర మీవలె నీయాఱుగురును కృతకృత్యులుగాన్" ౬౫౪

వ॥ అనవుడు లోమశుం డింద్రద్యుమ్న దిక్కుమొగంబై ౬౫౫

ఆ॥ "అడుగుమడుగుమయ్య యనఘ! ఇంద్రద్యుమ్నధరణిపాల! అడుగఁదలఁచియున్న
అడిగినది యవశ్య మరసి వక్కాణింతు. ఏలసంశయించె దింకనీవు?"

వ॥ అనివచించుటయు నింద్రద్యుమ్నుం డిట్లనియె. ౬౫౬

తే॥ "మట్టమధ్యాహ్నమం దీవు బట్టబయట నెండకాలంబునం దిట్లులుండినావు.
మంచిగృహమునుగట్టింప మతి ప్రియత్నమేలకావింపవైతి మునీంద్ర! చెపుమ"

వ॥ అనియిట్లు ప్రశ్నించుటయు నాలోమశమహాముని ౬౫౭

ఉ॥ నాతలిదండ్రు లిర్వురును నాకొఱకై పడు పాటులెల్ల నా
కాతతపాపకారణములై కనుపట్టుచునుండె-అంతఁ బ్రి
ద్యోతితపాంచు యపావనము తోఁచుడు నొక్క నిశీథమందు ని
ర్భీతిని వారలన్ విడిచిపెట్టి వడిం జనుదెంచితిన్ విభూ! ౬౭౩

ఆ॥ సంతసించుచంత సర్వదా బ్రాహ్మణీతీర్థసలిలములను దెచ్చి భక్తి
ఏ నొనర్చినాఁడ నీశాను నభిషేకముం ద్రికాలముల నరేంద్రచంద్ర! ౬౭౪

సీ॥ నీవారధాన్యము ల్నేఁ బక్వమొనరించి తిన్నవాఁడనుజుమీ కొన్నినాళ్ళు.
అల నక్కదోసకాయలఁ గోసికొనితిని యున్నవాఁడనుజుమీ కొన్నినాళ్ళు.
బదరీఫలంబుల భక్షించుచును నపాయున్నవాఁడనుజుమీ కొన్నినాళ్ళు.
అవని రాలిన యాకు లాహారముగను గైకొన్నవాఁడనుజుమీ కొన్నినాళ్ళు.
మఱి శిలోంఛవృత్తి కర మవలంబించి మన్నవాఁడఁజుమ్మి కొన్నినాళ్ళు.
కష్టమనక యిట్లు కావించి తనుయాత్రి శివుని గొలువఁ గొలువఁజవర కతఁడు.

చం॥ దరిసెనమిచ్చి మేఘునినదంబుననొప్పెడివాక్కుతోడ "నీ
జరిపినపూజనంబునకు సంతసమొందినవాఁడ వత్స! దు
ష్కరమగు కార్యమేనియును సల్పెద. యుష్మదభీష్ట మేదొ స
త్వరముగఁ జెప్పు" మంచనుడుఁ దచ్చరణంబులవ్రాలి నే నటన్. ౬౭౬

తే॥ పేరలుంగున నానాప్రకారములుగ సన్నుతుల్సేయుచును "నన్ను జరయుమృతియు
బాధయకుండంగఁజేయవే హర!" యటంటి ఈశ్వరుండంత నన్నుఁగూర్చి యిట్లులనియె.

తే॥ "ఎవ్విధమునను నమరత్వ మిలను లేదు. కాన నీజీవితమున కేదేని వత్స!
ఒక్క మర్యాదయొనరింపుమోయి. నేను దానికిన్ సమ్మతింతును దప్పకుండ."

చం॥ అనియిటు లాజ్ఞయిచ్చుటయు నంజలిచేసి "మహేశ ! విన్మ నా
మనవి ఒకొక్క కల్పమున మత్తనురోమ మొకండొకండు భూ
మిని బడిపోవుఁగాక. ఇటుమెల్లగ నన్నియు నూడిపోవుడున్
గొనకొని యుష్మదీయగణకోటిని జేరిచికొమ్ము నెమ్మి నన్." ౬౭౯

కం॥ అనవుడు భగవానుఁడు ననుఁ గనుగొని "అట్లయగుఁగాక. కమలాసనము
ఖ్యనిలింపులు కాలత్రయమునఁ గొలిచెడి నాదులింగమును నీవింకన్. ౬౮౦

తే॥ బ్రాహ్మణీతీర్థజలముల బాగుగాను నిత్య మభిషేకపుంగ్రియ నెఱపుచుండు
మంతఁ నాకొక్క పాత్ర మెంతయగునొ యంతయాయువు గలవాఁడ వగుదువీవు.

కం॥ ఇతరుండైనను నన్నిటుఁ బ్రీతిదిన మభిషిక్తుఁజేసి పరిపూజింపన్
గతపాపుఁడగు. ఒకపుడును నతనికి నపమృత్యువుండ దవనీవిబుధా! ౬౮౨

ఆ॥ మచ్ఛరీర మొక్కమరి పూజచేసినన్ బ్రహ్మతీర్థమందుఁ బరఁగుచున్న
మధురవారి యొక్కమరి గ్రోలినను దక్షిణంబ పాపమెల్ల నాశమొందు." ౬౮౩

క॥ అని యానతిచ్చియాతఁడు చనె అది మొదలిచట నేను శంకరలింగం
బును బూజించుచునుంటిని. కనుకనె నే నింతయాయుగలవాఁడయితిఁ. ౬౮౪

ఆ॥ శివునికృపయె నాదుచిరజీవనమునకు హేతు. వింతెకాని యింతకంటె
ఇతరమైనహేతు విసుమంతయును నుండ దోమహీశ ! చెప్ప నేమికలదు ?"

వ॥ అని వచించుటయు నింద్రద్యుమ్నుండు ౬౮౬

క॥ నేనును నీతోపాటుగ మానివరా ! కొలుచువాఁడ మతి యీలింగం
బీనిర్మలదేశమువిడి పోనెచటికి. ఇద్ది నాదుపూనికి వినుమా" ౬౮౭

వ॥ అని నొడువుటయు లోమశుండిట్లనియె. ౬౮౮

ఆ॥ అట్లెయాచరింపుమయ్య యింద్రద్యుమ్న ! అభిమతార్థసిద్ధి యగును నీకు.
దుర్లభార్థమెద్ది ధూర్జటిభక్తులై యుండునట్టివారి కుర్వియందు ? ౬౮౯

క॥ నాడీజంఘప్రముఖుల నేఁడే పొందనుము సొంతనిలయమ్ములకుఁ.
నాడగ్గఱఁ దాఁజేటిం గూడుకొని వసింపుమీవు కోరికదీరఁ" ౬౯౦

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయు మార్కండేయనాళీజంఘాదు లందఱును
నింద్రద్యుమ్నుదిక్కు మొగంబై ౬౯౧

ఆ॥ "అరుగ మేముగూడ నవనీశ ! నినువినా మానివాసములకు మరలనిపుడు.
ఈవు పూజచేయు నీలింగమున కేముఁ బూజచేయుచుందు మోజ నిటను" ౬౯౨

—♦ బకాదులకు నారదుండు కనఁబడుట. ♦—

వ॥ అనిపలికి యందఱును లోమశు నాశ్రమంబునం దాలింగంబునకుఁ ద్రికాలం
బులయందును బ్రాహ్మణీతీర్థజలంబులచే నభిషేకించుచును బద్మంబులచేఁ బరిపూ
జించుచును నివసించి కొంతకాలంబునకుఁ దీర్థయాత్రాప్రసంగంబున నం దరుదెంచిన
నారదమునిం బొడగాంచి యర్ఘ్యపూజ లాచరించి విశ్రాంతుండైన పిమ్మట వినయ
సమేతులై ౬౯౩

ఆ॥ "కొంగ మొదలుకొని విహంగమత్రయముఁ దాఁబేలుఁ బూర్వమందు శూలిగణము
లేము నలువురము మునీంద్ర ! శాపభ్రష్టులమయియుంటె మిట్లు లలిని వీడి.

తే॥ అనఘు సంవర్తు దర్శన మాచరింప శాపమోచనమగునంచు స్వాంతములను
గంపెడాశమహాముని ! కలదుమాకు. తెలియదొక్కింతయేని యాయనఘు నునికి.

సీ॥ ఎట్టిరూపముతోడ నిమ్మహీస్థలమునం దతఁడుండునయ్య యోయజతనూజ !
ఎంతయొత్తుననుండు నేమి గుర్తించుటకాపారికాంక్షి యోతాపసాగ్ర్య !
ఎటువంటినడతతో నీ నిరాబారి తా సంచరించుచునుండు సంయమీంద్ర !
ఏమహాస్థలమునం దెంతయు నాసక్తి నతఁడు వర్తించు మున్యగ్రగణ్య !

అతఁడెచటనున్నయది నీవెఱుంగుచోఁ దెలియఁజెప్పుమయ్య కలహభోజి !
నీవుఁ దెలియకుండ నేకొంచెముం ద్రిలోకములలోన నుండ దమరవరాని !”

వ॥ అనియడుగుటయు నతం డిట్లనియె. ౧౯౮

క॥ “బాగుగ నెఱుఁగుదు నే నాయోగిని సంవర్తనాము. ఒరు లెల్లెఱుఁగం
గాఁగలుగుదు రెల్లప్పుడుఁ దా గుప్తాచారుఁడై యతండు వసింపన్. ౧౯౯

సీ॥ కట్టఁ బుట్టముగూడఁ గడకుఁద్రోసి యతండు తిరుగుచుండును సదా దిస్సమొలను
ఒడలినిండ నతండు చెడుమలంబును బూసి చరియించుచుండు నసహ్యముగను.
అన్వహం బతఁడరణ్యమునందె మౌనియై వర్తించు నది యొక్క వ్రతముగాఁగ.
అనవరతం బతం డవధూతయై తన్న నాత్మలోపల నైక్యమగుచునుండు.
కుతపకాలమందుఁ గొన్ని వారాణసీభవనములను బాణిపాత్రుఁడగుచు
భిక్షమెత్తి యతఁడు పిమ్మట సాయాహ్న మరుగుచుండునడవి కనుదినంబు.

క॥ ఆపురవరమునఁ దాదృగ్విప్రులు నూఱులును వేలు కొమరారెద. రీ
తాపసవర్యునియందు విరూపంబగు లక్షణంబు లోయఁగవలయున్. ౨౦౦

శా॥ కాశీపట్టణరాజవీథి నడుమన్ గర్తంబు దీయించి యం
దేశీలంబు గణింపకుండఁ గుణపం బెట్లేని స్థాపింపుఁ. డా
వేశంబందు జనంబు దానిఁ గనినన్. వేపూడిపింపుండు. వి
శ్వేశుం డైన నెఱుంగకుండ సలుపుం డీచెయ్వి మీరందఱున్. ౨౦౧

శా॥ పీనుంగుండు టెఱుంగ కందఱును దత్పృథ్విన్ వెసం దాఁటిపో
దానిం ద్రొక్కఁడు దివ్యదృష్టిగలఁడై తానొక్క సంవర్తుఁడ
ద్దానిన్ వాని నెఱింగి చెప్పఁడు భవత్తాత్పర్య. 'మెవ్వాఁడు మీ
కే నిందుండు టెఱుంగఁజేసె'నన నన్నే చూపుఁ డమాత్మనికిన్. ౨౦౨

క॥ ఇపు డెటనున్నాఁడని యాతపసి ననున్ మరలమరలఁ దా నడిగినచో
'కృపనీసంగతి వాకొని యపుడే నిప్పులనుజొచ్చె'నని. ప్రతిచెప్పుఁడీ” ౨౦౩

వ॥ అనినవిని లోమశుండు మొదలుగా నందఱును దద్దర్శనలాలసత్వంబునఁ గాశీపురంబునకరిగి లోకు లెవరును నెఱుంగకుండున ట్లొకశవంబు నతిప్రయత్నంబున రాజవీథిం బూడిచిపెట్టి విలోకించుచు విదూరమందుండుటయు మహాత్ముండగు నారదుండు చెప్పిన చొప్పున వర్తిల్లు సంవర్తమహాముని కుతపకాలమం దటకరుదెంచి కుణపం బందుండుట దివ్యదృష్టిచే నెఱింగి క్షుత్పిపాసార్తుం డై యుండియు శల్యంబులఁ ద్రొక్కనొల్లక మగిడిచనియె. అంత నాలోమశాదు లుండు ముందు ఘనుచును గరుణింపుమనుచును భాషించుచు నతనివెంటంబడిరి. అతండు వారల వెళ్లిపొండని భర్త్సించుచు నాయొద్దకు రావలదని దవ్వులకుఁ బరువెత్తి ౨౦౪

## — బకాదులు సంవర్తునితో భాషించుట —

కం॥ "నాదుపరిస్థితి మీతో నేదుర్మార్గుఁడు వచించె? ఎఱుఁగం జెప్పుఁడీ,
బూదియొసర్చెద నస్మ న్మేదురశాపాగ్ని దుర్వినీతుని వానిన్" ౨౦౫

వ॥ అనిపలుకుటయు వారలిట్లనిరి. ౨౦౬

కం॥ "నీ వీరూపుననుండుట దైవతముని నారదుండు తాఁ జెప్పినవాఁ
డీవార్తఁ జెప్పి వెంటనె పావకమునఁ జొచ్చె నతఁడు పాప మదేమో?" ౨౦౭

వ॥ అని యిట్లు వక్కాణించుటయు వెండియు సంవర్తుండు ౨౦౮

ఆ॥ "ఎవరు నెఱుఁగకుండ నేటనో గుప్తంబుగా మెలఁగుచుంటినన్ను మీ కెఱుంగఁ
జెప్పినట్టి యా కుశీలున కేఁగూడఁ జేయుశిక్ష యిదియె శీఘ్రముగను" ౨౦౯

వ॥ అని వాక్రుచ్చుటయు మఱియు వార లిట్లనిరి. ౨౧౦

ఆ॥ "మునివరేణ్య! పెద్దప్రొద్దుననుండియు వెదకుచున్న మాకు విబుధవరాని
నేఁటికాలమునకు నిన్నెఱింగించెఁబో. ఇతర లెవరుగూడ నెఱుఁగరింక. ౨౧౧

కం॥ ఎఱిఁగించి తత్క్షణము యా సురముని నిప్పుకలలోనఁ జొచ్చినవాఁ, డి
ట్లొనరుగువారు గలకారణ మెఱుఁగ మదెయ్యదియొ మేము బుసిరుల వందా్రి!" ౨౧౩

వ॥ అని యిట్లు వక్కాణించుటయు సంవర్తుండు

ఉ॥ "ఏనును గిన్కతోడ శపియించుచునుంటి నిదేవిధంబుగన్.
తానె యటుల్ ప్రవర్తనొనె. దాన మదంతికి మీరలందఱున్
జేనినిగూర్చి వచ్చితిరొ తెల్పుఁడు వేగమ. ప్రాణయాత్రకై
ఈనగరంబునన్ భికిరమెత్తఁగఁ బోవలయున్ స్వయంబుగన్." ౨౧౪

చం॥ శవమును దీసవైచి గతశల్యమొనర్పుఁడు తోవ. లేనిచో
నవయ శపించువాఁడ మిము. నాస్థితిఁ జెప్పకుఁ డెరితోను. మీ
రవని మరుత్తభూమిపతి యధ్వరముం బొనరింపనెంచి తా
ను వెదకుచున్నవాఁడఁట ననుం బ్రతిఘుస్రము నచ్చుటచ్చుటన్. ౨౧౫

కం॥ ఆయధ్వర మేమాత్రముఁ జేయింపను నేను. గురునిచేఁ ద్యక్తుండై
ఆతనినసుతుండనఁగ నను రోయుచునున్నాఁడతండు రూఢిగఁ బుడమిన్" ౨౧౬

వ॥ అనవుడు వారలిట్లనిరి. ౨౧౭

తే॥ "కొంగ మొదలగు మేము నల్గురముగూడ బ్రాహ్మణులశాపములనుండి భ్రష్టులైతి
మనఘ! లోకత్రయార్చితులైనయట్టి ప్రమథగణముల మేము పూర్వంబునందు.

ఆ॥ ఇట్టులగుటఁజేసి యెంతయు వైరాగ్య మూనియున్నవార మోమునీంద్ర!
త్వదుపదేశమునను దచ్ఛాపమోచనం బగునటంచుఁ బ్రికృత మాగతులము. ౨౧౯
తే॥ కానఁ దిర్యక్త్వముననుండి కావవలయు మమ్ము సంవర్తనామకమౌనిచంద్ర!
ఉంటి వెంతయొకాలంబునుండియిట్టు. లిపుడు నినుఁగలియుటకున్న హేతువిదియ"
వ॥ నావుడు సంవర్తుండు ౨౨౧
ఆ॥ "అట్లయైనయెడల నల చమత్కారపురంబుఁగూర్చి చనుఁడు రయము మీరు
భర్తృయజ్ఞుఁడనఁగఁ బ్రిజల సందేహము తీర్పఁ జొక్కఁ డందుఁ దేజరిల్లు. ౨౨౨
చం॥ అతఁ డుపదేశమీయఁగలఁ డందఱ. కందునఁ దొంటి మీ యథా
స్థితమగురూపు మీరు వెసఁ జెందెద. రాతఁడు పూర్వమందు వి
స్తృత శ్రుతిశాస్త్రపారగుఁడు శిష్యమరాగ్రిణి యాజ్ఞవల్క్యుఁ డా
చతురుఁడె భర్తృయజ్ఞుఁడన శ్మాస్థలిఁ బుట్టెను దాఁ గ్రిమంబుగన్. ౨౨౩
కం॥ ఆరాధితయై భారతి చేరెను దద్భర్తృయజ్ఞ జిహ్వాగ్రమునం
దారాధించినవారల నేరీతిని విడువ దామె. ఏమనవలయున్ ౨౨౪
కం॥ ఆభర్తృయజ్ఞుచేతను నీభూప్రిజకుంగలట్టి యే సంశయమున్
తా భగ్నంబగు. నీదృక్ప్రిభవ మెవరికిని లేదు పరికింపంగన్" ౨౨౫
వ॥ అనినవిని యమ్మునికి మహాత్మహురాచరితప్రిణాములై యమార్గంబునం
బూడ్చియుంచిన పీనుంగుం దీసివైచి యందఱును జమత్కారపురంబున కరిగి హాస్తి
స్థానపదతీర్థంబున వసించెడి భర్తృయజ్ఞు సందర్శించి నమస్కరించి వినయవినమితోత్త
మాంగులగుచు ౨౨౬
ఆ॥ "బ్రిహ్మశాపమునను బక్షిత్వకూర్మత్వములను బొందినారము నలువురము
పార్శ్వచరులు మువ్వురు బహుపుణ్యవంతు లోయార్య! వారియాఖ్య లాలకింపు.
కం॥ ఆతఁడు మార్కండేయుం, డీతఁడు శ్మాస్థాలుఁడైన యింద్రద్యుమ్నుం
డేత త్తృతీయుఁ డెంతయు ఖ్యాతుండగు లోమశుండు యమినిభలతిలకా! ౨౨౮
కం॥ ఈమూవురకుంగూడను నేమందుము జీవితముగ నేడనువుగన్
స్వామీ! భవదుపదేశము కామించుచునుంటి. మట్లు కానింపఁగదే" ౨౨౯
వ॥ అనినవిని భర్తృయజ్ఞమహాముని తడవు ధ్యానించి దివ్యచక్షుస్స్ఫురణ వీక్షించి

—— సప్తలింగవృత్తాంతము ——

ఆ॥ "ఈర లేడుగురును నేగి శ్రీహాటకేశ్వరమునందు లింగసప్తకమును
యుష్మదాహ్వయముల నోజ స్థాపింపుఁడీ నరవిముచ్ఛరాంబుచరములార! ౨౩౦

ఆ॥ అఖిలపాపహరములగు కులపర్వతదానములును నేఁడు తత్సులింగ
ముల సన్నిధియందు సలుపుఁడీ క్రమ్మఱ మీగణత్వ మోజ మీకు వచ్చు" ౨౩౨

వ॥ అని చెప్పుటయు నాడీజంఘాదు లిట్లనిరి. ౨౩౩

క॥ "చెప్పుమీ తద్దానంబులు విపులంబుగ మా కవ్వెట్టివిధి గలవో వా
ని ప్రమాణ మెంతో. ఇచ్చెద మిపుడే యచ్చోటికేగి యేము మహాత్మా!" ౨౩౪

వ॥ అనియిట్లు ప్రార్థించుటయు భర్తృయజ్ఞుండు

సీ॥ "బంగారమున మేరుపర్వతముం జేసి యర్పింపవలయు విప్రాగ్రణులకు.
కలధౌతమున రజతకైలాసము నొనరించి యీయంగవలయు మహీసురులకు.
గంధమాదనగిరిం గల్పించి గుడముచే నొసఁగంగవలె బ్రాహ్మణోత్తములకు.
కార్పాసమున హిమగిరివముం గావించి దత్తంబుఁ జేయనౌ నుత్తములకు.
తిలలతోడ సువేలంబు లలితమైన శర్కరం బెట్టి వింధ్యంబు సైంధవమున
శృంగి నిర్మించి భక్తి నొసంగవలయు నాగమోక్తవిధంబుగా నగ్రజులకు." ౨౩౫

వ॥ అనినవిని సప్తలింగంబులును సంస్థాపించి పదపడి పర్వతంబు లేడును సుర్వీసురుల కర్పించిరి. భర్తృయజ్ఞానుమతిఁ బ్రతాపవంతుండగు నింద్రద్యుమ్నుం డింద్రద్యుమ్నేశ్వరు నెదుట సహేమమయంబగు మేరువును ధీమంతుండగు మార్కండేయుండు మార్కండేశ్వరు నగ్రంబున రాజతంబగు కైలాసంబును బకంబు పాలకేశ్వరు సన్నిధంబునఁ గార్పాసమయంబగు హిమవంతంబును గౌశికంబు ఘంటకేశ్వరు ముందట గుడమయంబగు గంధమాదనంబును గృధ్రంబు వానరేశ్వరు నోర లవణవిభాగంబగు శృంగిశృంగంబును గచ్ఛపంబు కచ్ఛపేశ్వరుపార్శ్వంబునఁ దిలమయంబగు సువేలంబును లోమశుం డీశానేశ్వరు కురంగట శర్కరామయంబగు వింధ్యంబును భక్తిశ్రద్ధాసమేతంబుగా బ్రాహ్మణులకు సమర్పించుటయుఁ దత్క్షణంబ యాత్మైశ్వర్యంబుఁ గలిగించుచుఁ బక్షిత్వ కూర్మత్వంబులు పరిభ్రష్టంబులయ్యె. తత్ప్రభావంబున నందఱును దివ్యమాల్యాంబరధరులును దివ్యగంధానులేపనులును నై తల్లింగసమ్ముఖంబున వెలుఁగొందుచు భర్తృయజ్ఞునకుఁ బ్రణమిల్లి యాగతంబులగు నాకాశయానంబులనై యధిష్ఠించి యరిగి కైలాసనగరంబుం గనేసిరి. భక్తిమై దల్లింగంబులకుఁ గులపర్వతదానం బొనరించిన యితరులును శివుం గలియుదురు. ప్రొద్దుపొద్దున లేచి యాలింగంబుల దర్శించిన జను లజ్ఞానకృతంబులగు పాపంబుల నుండి విడువంబడియెద. ఇంద్రద్యుమ్నేశ్వరాది తల్లింగంబుల యెదుట హేమాదిమయంబులగు మేర్వాదిపర్వతంబుల దానంబుచేసినఁ గల్పపర్యంతంబును రంభాసం

భోగాది దివ్యభోగంబు లనుభవించి మరల మహీతలంబున సార్వభౌముండై జని యించు. ౨౩౭

సీ॥ ఒకదానమునఁజేసి యొనరుఁ బాపక్షతి. అభిమతాఖిలసిద్ధి యగును రెంట.
మూట భూమీశుఁడై మురియంగఁగలి గెడి. అగు నాలుగిట మండలాధిపుండు.
అయిదింట స్వామియౌ నఖిలభారతభూమి. కాతెంట నగును ద్వీపాధినాథుఁ.
డేడింట నొడయఁడై యెల్ల ద్వీపమ్ముల నొక్కండ పాలించుఁ బెక్కుసమలు.
అచలదానవిధము నంబుజాసనుఁడిట్లు స్పష్టపఱచె నగ్రజన్ములార !
జననజననమందు మనుజుండెయగు నేత దరిద్రదాత. ఏమియనఁగవలదు. ౨౩౮

వ॥ దుఃఖితుండును వ్యాధితుండును దరిద్రుండును గాక సౌభాగ్యసుఖసంయుతుండును సుదేహుండును రత్నవంతుండును సర్వశత్రువినిర్ముక్తుండును బ్రితాపితృమహితేంద్రియుండును నగును గావున విశేషించి భూమిపాలుఁ డిప్పుడు లాధరంబు లవ్విశ్వేశ్వరు ప్రీత్యర్థ మీయవలసియుండు" ౨౩౯

## —♦ యుగవర్ణనము ♦—

మ॥ అని యిబ్బంగి వచించుచుండ మునులు "మాతా ! తొల్లి యీశానుఁడక్ఘనభూదేవున కీశ్వరుండుతనదౌ ఘస్రంబు నొక్కండు పోలిన కాలంబు మనకు వరంబిడిరొఁ బాలిం దా నటుల చంటి. వోయ్యనఁ జెప్పంగదె యా దినంపు మితి" యం చాడంగ నాతండనుక్. ౨౪౦

వ॥ "భూసురశ్రేష్ఠులారా ! పరమేశ్వరు దినప్రమాణం బెంతయైనదియు స్ఫుటంబుగం గీర్తించెదను వినుండు. నిమిషములో నాలవభాగము త్రుటి. రెండుత్రుటులు లవము. రెండులవములు యవము. పదియేనుయవములు కాష్ఠ. ముప్పదికాష్ఠలు కల. ముప్పదికలలు క్షణము. అఱువదిక్షణములు పలము. అఱువదిపలములు నాడిక. రెండునాడికలు ముహూర్తము. ముప్పదిముహూర్తము లహోరాత్రము. ముప్పది యహోరాత్రములు నెల. రెండునెలలు ఋతువు. మూడుఋతువు లయనము. రెండయనములు సంవత్సరము నని మనుష్యుల కెల్లరకుం బరికీర్తితము. ఆసంవత్సరము దేవతల కహోరాత్రమని పురాణజ్ఞులు వక్కాణించెదరు. అందుత్తరాయణము పగలును దక్షిణాయనము రాత్రియు. ఆరాత్రి శుభకర్మవిగర్హితము. నిదురించినమనుజులు భోగాదిక మెుక్కింతయుం బడయనట్లు దేవతలు రాత్రి యజ్ఞాంశంబు లెవ్విధంబునను గ్రహింపరు. ఈమానవమానంబుననైన పదియేడులక్షలయిరువదియెనిమిదివేలవత్సరంబులు కృతయుగంబు. అందు భగవంతుండును జగద్గురుండును నగు విష్ణుండు శ్వేతవర్ణుండై

చెలంగెడు. లోకు లెల్లరును శాంతులును దాంతులును జితేంద్రియులును దీక్షాయుక్తులును నై సర్వదా తపంబుండుచుఁ బాపవర్జితులై పరంగుదురు. ౨౪౧

తే॥ పుట్టు పెట్టులో యట్టులే గిట్టుటయును నొయ్యనొయ్యన ఘటించుచుండుఁగాని
మృతసుతుం బిత గాంచఁడు కృతయుగమున నేమసంగల దో ద్విజస్వాములార !

వ॥ అయ్యుగంబున జనులకుఁ గామ క్రోధ లోభ దంభ మత్సరంబులు మందునకేని కనంబడవు. అంత రెండవదగు త్రేతాయుగం బరుదెంచెడి. అందు భయంకరమగు పాపంబు పాదైకమాత్రంబై ధర్మంబునం బ్రవేశించెడి. అపుడు భగవంతుఁడగు మధుసూదనుండు రక్తవర్ణుండై రాజిల్లెడు. పాదమాత్రపాతకంబున నే జనులకుఁ బరస్పరస్పర్ధ ప్రవృద్ధమయ్యెడు. ౨౪౩

త॥ స్వర్గమునుగోరి బ్రాహ్మణుల్ క్షత్రియులు పరస్పరస్పర్ధఁ బెక్కధ్వరములుచేతు.
రాచరిం తూర్ధ్వగతికిఁగా నఖిలజనులు తీర్థయాత్రాంహతివ్రతాదికము లెల్ల.

వ॥ తమతమ కావించిన యజ్ఞకర్మములనుండి బ్రహ్మలోకపర్యంతమైన చతుర్దశభువనములందును జనులు చనుచుందురు. ఆయు వించుక లోపించు. కాని యపుడును గొడుకులు తండ్రులముందఱ మడియరు. దోషంబులు స్వల్పంబుగానుండెడి. కామక్రోధాదు లుండియు నుండనట్లుండు. కృషిపరాయణులైన వైశ్యు లొక్కసారి విత్తిన యుత్తమంబగు విత్తనంబున నేడుమాఱులు సస్యఫలం బనుభవించెదరు. ఆవులు చెంబులకొలఁదిగను గేదె లంతకెక్కుడుగను నొంటె లంతకు నెక్కువగను మేఁకలును గొఱ్ఱెలును మనుష్యస్త్రీలును నావులిచ్చువానిలో నాలవభాగమును క్షీరములు స్రవించు. బ్రాహ్మణులు వేదాధ్యయనసంపన్నులును బ్రతిగ్రహవివర్జితులును శాపానుగ్రహసమర్థులును నై యుందురు. క్షత్రియులు క్షాత్రంబున గోత్రం బాలించెదరు. అయ్యెడ జారులయుఁ జోరులయు జాడ గనఁబడదు. సర్వవర్ణజనులును స్వధర్మనిరతులై వర్తింతురు. తద్యుగప్రమాణము పండ్రెండులక్షల తొంబదియాఱువేల సంవత్సరంబులు. అంత మూడవదగు ద్వాపరంబు ప్రాపించు. అందు రెండుపాదంబులు ధర్మంబును రెండుపాదంబులు పాపంబును నుండనయ్యెడి. భగవంతుఁడగు వాసుదేవుండు కపిలవర్ణంబునఁ గ్రాలంగలిగెడి. తద్యుగప్రమాణం బెనిమిదిలక్షల యఱువదినాలుగువేలహాయనంబులు. అం దర్ధభాగంబు పాతకంబగుటఁ గామక్రోధలోభమత్సరేర్ష్యాసమేతులై యన్యోన్యము విరుద్ధముచేసికొనుచు స్వర్గంబును బడయఁజాలక కొందఱును శాంతులును దాంతులును జితేంద్రియులును నై కొందఱును వర్తింతురు. అంత నాల్గవదియగు కలియుగంబు సైకపాదధర్మంబును సత్రిపాదపా

పంబుననై భయంకరంబుగా నరుదెంచు. అందుఁ జతుర్భుజుండు కృష్ణవర్ణుండై విహా
రిల్లు. పాదమాత్రధర్మంబును బ్రథమపాదంబునం బ్రవర్తిల్లి పదపడి మెల్లమెల్ల నశి
యించు. తదంతిమయుగప్రమాణంబు నాలుగులక్షల ముప్పదిరెండువేలసంవత్సరం
బులు. అయ్యెడ జనులెల్లరును గలిచే స్పృశింపఁబడి యొకరియెడల నొకరు రాగద్వే
షపరాయణులై ప్రవర్తింతురు. ౨౪౭

కం॥ ధనము మనోరమమగు స్త్రీజనమును సేవానియింటు సౌందర్యంబుగ నుం
డునో వానితోనె సఖ్యము పొనరించుచునుందు రపుడు భూస్థలి మనుజుల్.

వ॥ యతులు విధవలు తాపసులు నందఱును జిత్తశుద్ధిలేమి నిహపరంబులకు
రెండింటికిం జెడియెదరు. దుర్భిక్షంబునఁ బీడింపఁబడుచు లోకులు వర్షాకాలంబునఁ
గూడ నాకసమువంకఁ జూచుచుందురు. ఐశ్వర్య మన్యత్ర పోకుండఁ దాము యను
భవింపవచ్చుననియుఁ బెత్తనము వహింపవచ్చుననియుఁ గొడుకులు తండ్రులయుఁ
గోడం డ్రత్తలయుఁ, జుట్టములు చుట్టములయు మరణంబుల కెదురుచూచుచుందురు.

సీ॥ కావ్యముల్పదువంగఁ గడఁగుఁగాని ద్విజుండు వేదపాఠముసేయ వెఱచు నెపుడు.
అల్లుండ్రపైనుండు ననురాగ ముండదు తనయులపైఁ దల్లిదండ్రులకును.
ఆలితోఁబుట్టుల యధికారమున నుండవలెఁ బెరచుట్టము ల్పితృగృహమున.
కులటల్లడించెడి గొప్పతనంబు దాఁ బతిరత యెప్పుడుం బడయలేదు
శూద్రులే సుతపస్వులై శోభిలెదరు. శూద్రులే యయ్యెదరు ధర్మనూచకులును
భూమిసురులకుఁ జివరకు బోధ సేయువారు శూద్రులెయగుదు రోపాపులార!

సీ॥ భక్ష్య మభక్ష్యమను పరిశీలనములేక సర్వభక్షకులౌదు రద్విసురులు.
పన్నులెక్కువఁజేసి ప్రజలఁ బీడింతురు కరుణ సుంతయులేక ధరణిపతులు.
కులధర్మమగుకృషిం జలుప సిగ్గిలుచుందు రరుధనవంతులై యూరుభవులు.
ప్రాభవంబు వహించి బ్రాహ్మణజనములం బాలించుచుందురు పాదజాతు.
లల్పనీరయుతములగును జీమూతంబు. లల్పసస్యయుక్తమగును బుడమి.
అల్పముగనొసంగు నావులు క్షీరంబు. అల్పముగను వెడలు నందు నెయ్యి. ౨౪౯

వ॥ హేతువాదులును నశ్లీలభాషణంబునఁ బ్రజల వంచించువారునే భూపా
లురకు సర్వదా ప్రియులై యుండెదరు. నేఁటికన్న రేపును రేపటికన్న నెల్లుం
డియు నిట్లు దినక్రమంబునఁ బాపంబు వృద్ధినిబొందు. భూకాంత పోయినయౌవనము
గలదియగు. క్షేమంబులేక కాలంబు మెల్లమెల్ల భయంకరంబుగం గనుపట్టు. కలియు
గంబు గతించినకొలంది స్త్రీపురుషసంఖ్య వృద్ధియైనకొలందిని జంతువులుంబోలెఁ
జలుకఁదనమువహింతురు. ౨౫౦

కం॥ పదియారేడులవయసున ముదుకలకుంబోలె నెరయ మొదలిడు శిరముల్.
పదిరెండువత్సరములకె ముదమునఁ గలియుదురు మగలఁ బూవుంబోడుల్.

వ॥ కలియుగాంతంబున జను లంగుష్ఠమాత్రశరీరులై శౌచాచారంబులు వదలి యాత్మకార్యాసక్తులై వర్తించెదరు. వారి కందఱికిని నెలుకబోతియు లిండ్లును గ్రామి వస్త్రంబు ప్రావరణంబును నయ్యెడిని. ౭౫౨

కం॥ పొందుదురు మ్లేచ్ఛభావము నందఱు నొకజాతియై దురాచారముతో.
నిందింతురు ధర్మకృతులను సందేహములేక రౌర సాంబుభులారా ! ౭౫౩

వ॥ అంతఁ గల్కిగోత్రసముత్పన్నుండై హరిపింగళుండను బ్రాహ్మణుం డవ్వారి నందఱ నంతంబునొందించు. తరువాత మగుడఁ గృతయుగం బరుదెంచెడి. ఇట్టి వేయియుగంబులు బ్రహ్మ కొక్కదివసంబు. మున్నూటయఱువదిదినంబులు సంవత్సరంబు. ఆసంవత్సరంబు విష్ణువున కొక్కదినంబు. తమతమ మానంబుల బ్రహ్మవిష్ణు లిరువురును నూఱేసియేండ్లు జీవింతురు. విష్ణుని సంవత్సరము శివుని కొక్కదినంబగు. అతండును నిజమానంబున నూఱేండ్లు మని యంత శక్తిరూపంబున నక్షయుండుగం గీర్తింపఁబడు. అట్టిశివుని శతవత్సరంబులును సదాశివున కొక్క నిశ్వాసంబయ్యెడి. అతని యుచ్ఛ్వాసంబున మగుడ శక్తిరూపంబున వర్తిల్లెడు. శంకరుని దినమానంబు నన్నుమీర లడిగితిరి. మానవాది సకలమానంబులును నేను మీకుం జె

## యుగపరిమాణము

ప్పెదని. బ్రహ్మ కొక్కదినమగు పగటికిఁ బదునలుగు రింద్రు లయ్యెదరు. ప్రకృతమున్న యతఁడే దేవవయింద్రుండు. స్వాయంభువుండు మొదలగు మనువులును నింద్రులుంబోలె నుండియున్నవారలు. జయంతుఁడను నింద్రుండును వైవస్వతుండను మనువును వర్తమానులు. ఈయింద్రు శేషించిన కాలంబు గతించుటయుఁ బద్మనాభున నుగ్రహంబున బలి యింద్రుండుగా రాఁగలండు. అవ్వాసుదేవుం డష్టమమన్వంతరమున బలి కింద్రపదవి నొసంగుదునని ప్రతినవట్టియున్నవాఁడు. ఇట్లు ముప్పదిమూఁడు కోట్లదేవతలును యథాపూర్వంబుగం బ్రభవించుచుండుదురు. బ్రాహ్మణులారా ! సృష్టికారకుండైన పరమేష్ఠిబ్రహ్మ కీమానంబున నెనిమిదిసంవత్సరముల యాఱుమాసముల యొకదినము గతమైనయది. బ్రహ్మాండంబునందలి సకలభూతంబులకును గలియుగంబున సౌరసావనచాంద్రనాక్షత్రంబులను చతుర్విధమానంబులచేతను గాలంబు గడవ నయ్యెడు. అందు మూఁడువందల యఱువదియైదుదినంబులు సౌరమానసంవత్సరమును మూఁడువందల యఱువదిదినములు సావనమానసంవత్సరమును మూఁడువందల యేఁబదినాలుగుదినములు చాంద్రమానసంవత్సరమును మూఁడువందల ముప్పదియైదుదినంబులు నక్షత్రమానసంవత్సరమును నగుచుండును. వర్షశీతాతపంబులు సౌరమానంబునను వృక్షసస్యఫలనిష్పత్తియు నగ్నిష్టోమాది యజ్ఞంబులును నుత్సవంబులును వివాహంబులును సావనమానంబునను వృత్తిసంభవంబులైన వడ్డి మొదలగు వ్యవహారంబు లధిక

మాసప్రయుక్త చాంద్రమాసంబునను నభిచారికంబులు నక్షత్రమానంబునను నడచుచుండు. ఈనాల్గుమానంబులకంటె భిన్నమైన మానం బుర్వీతలంబునం దుండ నేరదు. నరులును సురాసురులును నీమానంబుచే వర్తించుచున్నవారు. ఇయ్యది పురాతనంబగు శ్రుతి. భక్తియుక్తంబుగా నీయుగప్రమాణం బెవ్వండు పఠించు వాని కెంతమాత్రము నపమృత్యుభయంబు కలుగ నేరదు. అట్లు దుర్వాసుండు ప్రతిష్ఠించిన శివలింగంబును నట నలరారెడు. చైత్రమాసంబునం దాలింగంబు నాచరిత నృత్యగీతాద్యుత్సవపురస్సరంబుగా నెవం డారాధించు వాండు తచ్ఛివానుగ్రహంబున గంధర్వాధిపతి కాంగలండు" ౨౫౪

## —◆ నింబశుచునియొద్ద దుశ్శీలుండు శిష్యుండుగాం బ్రవేశించుట ◆—

క॥ అనియిటు సూతుండు చెప్పుటయును "దుర్వాసుండు కిమర్థముంచినవాం డా
ఘనలింగ మచట? అదియెప్పు? డనఘా! వాక్రువ్వు" మన్న నతం డిట్లనున్

వ॥ తొల్లి వైదిశంబను పట్టణంబున నింబశుచుండను వాండు మఠపతియై యుండి యొకలింగంబున కారాధకుండై తనకు లభించిన వస్త్రాదికంబును సస్యంబును శివభక్తులకు విక్రయించి యెక్కుడు రొక్కంబును గూడంబెట్టుచు నం దించుకయు వ్యయపెట్టక యుండనుండం బెద్దకాలంబున రొక్కపుపెట్టియ నిండిపోయె. అంతం గ్రయవిక్రయవ్యాపారంబునకు దొరకొని యెన్నండును నెవ్వని నెంతమాత్రము విశ్వసింపక దేవపూజాసమయంబునంగూడ నతం డా మంజూష నేమఱక భద్రంబుగం గాపాడుచుండుటయు నొకకాలంబునం బరవిత్తాపహారకుండగు దుశ్శీలనామక బ్రాహ్మణుండు తటస్థపడి తత్పరిస్థితిం బొడగాంచి. ౨౫౬

క॥ "పసిడికి సేవ సేయుచు వెస శిష్యుండనై యిటం బ్రవేశించెద మున్.
ససియగుమాటలం దన్మానసమును బెట్టెను హరింతు నమ్మించి తుదన్" ౨౫౭

వ॥ అని తలపోసి యొకనాండు మఠమధ్యగుండగు నతని సమీపించి దండాకారంబునం బుడమింబడి ప్రణమిల్లి మగిడిలేచి సవినయంబుగా నంజలింబట్టి. ౨౫౮

ఆ॥ "ఆర్య! త్వత్ప్రభావ మాలించితిని. నిన్నుంబోలు తాపసుండు పుడమి లేండు.
కాన వచ్చినాండం గడుదూరమువనుండి యిపుడు నీదు మ్రోల. కేమిగలదు? ౨౫౯

ఆ॥ జననమృత్యుజరలె సంసారమని దాన సారముండదంట చక్కం దెలిసె.
యౌవనంబటన్న నగు స్వప్నతుల్యమం చాత్మ కిపుడు సరిగ నర్థమయ్యె. ౨౬౦

ఆ॥ అద్రిపైజనించు నాపగపలె సుతుల్ సతులు చుట్టములును క్షణికు లరయ.
కలిసమాగమములుగా వీరిసందఱ నెఱుంగవలసియుండు హృదయమందు. ౨౬౧

క॥ కావున సంసారాంబుధి నేవిధమున దాఁటవలెనో యిపుడ యుపాయం
బీవు వచింపఁగవలయును దేవర ! కరుణించి యీవిధేయునిమీఁదన్." ౭౬౨

వ॥ అనినవిని యతండు రోమాంచితతనూరుహుండై — ౭౬౩

ఆ॥ "పడుచువాఁడవీవు. కడు సుకుమారుండ. వట్టినీకుఁబుట్టె నిట్టిబుద్ధి
వాస్తవార్థమీవు వచియించుచుంటివి. ధన్యుఁడైతి. వేమితక్కువింక ? ౭౬౪

ఆ॥ పడుచుఁదనమునందుఁ గడు శాంతచిత్తుఁడై యున్నయట్టివాఁడె యుత్తముండు.
ధాతువులు తుఱయించుతరుణంబునను శాంతి యెవని కుద్భవింప దెంచిచూడ ?

తే॥ ఇట్లు సంసారముననీకు నెంతయును విరక్తిగల్గినచోఁ గొల్వు రాజధరుని
జపతపంబులఁ దరియింపఁజాలవింక ఘోరభవసాగరంబు కుమార ! నీవు. ౭౬౬

తే॥ బ్రాహ్మణుఁడో శూద్రుఁడో లేకపంచముండో యెవ్వఁడో యొకఁ-డెవఁడైన నేమి దాన
పట్టి శివదీక్ష లింగంబుపైని నొక్కపువ్వువెట్టినఁజాలుఁబో పోవు దివికి. ౭౬౭

ఆ॥ ఎవఁడు భక్తితోడ శివదీక్షవట్టినయట్టివాని కొక్కయంశుకంబో
పావుకోళ్ళో గోచిపాతయో యిడు వాని కధ్వరములతోడ నగునదేమి ? ౭౬౮

వ॥ అనినవిని దుశ్శీలుం డానింబళుచు పదంబులపైఁ దలవాల్చి యిట్లనియె — ౭౬౯

కం॥ "భవదీయ సేవ నిత్యము నవహితమతి నాచరింతు. అటుగాన వెసన్
శివదీక్షాదానంబున భవదీయానుగ్రహంబు ప్రకటింపఁగదే." ౭౭౦

వ॥ అనియిట్లు పలుకుటయు నతం డంతర్గతంబున — ౭౭౧

ఆ॥ "ఎవఁడో యొకఁడు స్వయమయేతెంచినాఁడిందు కరముదక్షుఁడుగనుగానఁబడెడు
వేఱ యెవఁడు లేఁడు చేరువం గావున శిష్యునిగను వీని స్వీకరింతు." ౭౭౨

వ॥ అని యాలోచించి వాని చేయిపట్టుకొని — ౭౭౩

ఆ॥ ఇట్టులైనవత్స ! ఈదినంబె నీకు దీక్షయిచ్చువాఁడఁ దీసికొనుము.
దూరమంద నీకుటీరంబు వేయించి యటవసింపు. రాకు మిటకు రాత్రి" ౭౭౪

వ॥ అనివాకుప్పుటయు నతండిట్లనియె — ౭౭౫

కం॥ "భవదాజ్ఞవలయుఁగానీ విబుధవరా ! ఏలనాకు వేఱొకపని ? ఏ
మివినోదముండు మఠమున ? పవలేకా కందు రాత్రి పనియేముండున్ ? ౭౭౬

కం॥ గురుఁడువచించిన తెఱఁగున నరుగనిశిష్యునివ్రతంబు లగు వ్యర్థంబుల్
మఱి మీఁదుమిక్కిలి మహానిరయంబును ననుభవించి నిర్వేదపడున్" ౭౭౭

వ॥ అనినవిని సంతోషించి నింబళుచుండు వినయయుక్తుండగు దుశ్శీలునకు శివదీక్ష
యొసంగె. అదిమొదలుకొని యతం డతని శుశ్రూష శ్రద్ధనై నాచరించుచు
మనస్సును హరియించెఁగాని పెట్టియను హరింప నవకాశంబు చిక్కదయ్యె.

అనుదినంబును ననేకోపాయంబుల హరింప నదను వేచియున్నను నా శైవుండు దేవ
తార్చనభోజనసమయంబులఁగూడఁ దత్స్వర్ణమంజూషం గ్రిందఁబెట్టమిని శిష్యుండు
తనమనంబున — ౨౭౯

## —♦ దుశ్శీలుండు నింబశుచుని పెట్టెను హరించుట ♦—

ఆ॥ "మతమునందుఁ దాను మాపు శివపూజఁ దడుగు పెట్టనీయఁ డకట యెపుడు.
ప్రొద్దుగ్రుంకఁగాను పోయి కవాటము ల్వేయు. ఇంక నేమిచేయవలయు?
ఆ॥ మంచిరాళ్ళచే సమర్చంగఁబడి కరం బెత్తుగలిగియున్న దివ్యతంబు.
పడెదు కన్ను మూచుటఁబోడిచిన. అవిలంఘ్య. మఱి వేళ్ళ మెట్టులైననేమి. ౨౮౦
ఆ॥ కాన విషము పెట్టియైన పడన్నచో గ్రీవ మెల్లఁ గత్తిరించియైన
పవలె పశువుఁబోలె బంధించి గొడ్డంటు పెంత్రియైన ప్రాణముల హరింతు."
వ॥ అని చింతించుచుండుటయు వర్షాకాల మరుదెంచె. శ్రావణకృష్ణపక్షంబున సవిత
కర్కాటకరాశిగతుండగు నెడ ధనవంతుఁడగు శివభక్తుఁ డొకఁ డచటికి వచ్చి
నింబశుచునకు నమస్కరించి యుచ్చైస్స్వరంబులో — ౨౮౧
ఆ॥ ఆజ్ఞయిచ్చెదేని యస్మదీయగ్రామ మరుగుదెంచెదేని యార్య! కరుణ
నీను భక్తితోడ నీచతుర్దశిని బవిత్రకం బొనర్ప వేచియుంటి" ౨౮౩
వ॥ అని ప్రార్థింప నతం డిట్లనియె — ౨౮౪
ఆ॥ "ఆత్మశిష్యుతోడ నరుదెంతు నట్టి సకాలమునకు వత్స! గట్టిగాను
ఆచరింతు యమ్మదభిమతము గురిని మేలకంక? ఇంటి కేగుమీవు." ౨౮౫
వ॥ అనియిట్లు చెప్పి యతనిం బంపించి ప్రాభాతికకృత్యంబులు తీర్చికొని యా
శైవుండు పయనమై పోవుచు మధ్యమార్గంబునం దొక్క తరంగిణిని దర్శించి —
ఆ॥ "శిష్య! ఈ భయోలమును జేయుండ మిచ్చట దేవపూజ గాన స్థిరుఁడవగుము
సురళయనెడిపేరి వరనది యిది సింధుగామినియును, ఖ్యాతిఁగాంచినదియు"
వ॥ అనిపలుకుటయు నతండు వల్లెయని యచట నిలుచుండె. నింబశుచుండును వనవరతం
బాచరించు దుశ్శీలుని శుశ్రూషాదులచేతను వినయవిధేయతలచేతను రంజింపఁబడిన
వాఁడై సచ్ఛిష్యునిగా భావించి బంగరుపెట్టియను దన యిష్టదైవమగు నాగేశ్వర
లింగంబును బదిలపఱచియుంచిన బొంతం గ్రిందఁబెట్టి మలవిసర్జనకార్యంబునకై
యించుక యవకాశంబు తీసికొని వ్రిబ్బలి చెట్లచాటునకుఁ బోయి కనఁబడకుండఁ
గూర్చుండుటయు దుశ్శీలుండు దక్షిణంబ యాపెట్టెం దీసికొని సంతసించుచు
సత్వరదిక్కునకు వెడలిపోయె. అంత నా శైవుండు తేచివచ్చి నాగేశ్వరసమన్వి

తంబగు కేవలకంథగాక దుశ్శీలుండును గానరామిఁ జంచలచిత్తతం ద్వరితంబుగా శౌచవిధి యొక్కింతుకయు నిర్వర్తించుకొని యాచమనం బాచరింపకయ బొంత యున్నచోటి కేతెంచి సువర్ణమంజూషం గానక శిష్యుండు హరించినట్లు తెలిసి కొని మూర్ఛవోయి పుడమింబడి కొంతవడికిట్లు తెలివిఁదెచ్చుకొని లేచి ౨౮౯

క॥ "హా ! చచ్చితిని. దురాత్ముఁడు వేచి హరించెను మదీయవిత్తంబెల్లన్
నాచేయుపని యిఁకేయ్యది ? చూచుటయెటు వాని ? ఎందుఁబోచ్చుదు నిట్టుపై"

వ॥ అని శిలమీఁదఁ దలయును దక్కునంగంబులును బగులఁగొట్టుకొని తోడ్తోడ వానిమార్గంబువట్టి కొంతవడి భ్రమించి పెద్దవాఁడగుటఁ బరిశ్రాంతుండై మరలి మఠంబునకుఁజనియె. దుశ్శీలుండు పేటికం దీసికొని స్థానాంతరంబునకుం బోయి తద్ధనంబుతో వ్యాపారంబు మొదలుపెట్టి పదపడి పరిణయంబుఁజేసికొని గృహ స్థాశ్రమంబునఁ గొంతకాలంబుండి సంతతిం గాంచక వృద్ధత్వంబున భార్యయుం దానును దీర్థయాత్రలుచేయుచుఁ జమత్కారపురంబునకరిగి యందలి సకలతీర్థంబు లను స్నానంబుచేసి దేవాలయంబులం దిలకించుచు దైవభక్తిచే నృత్యగీతంబులొన రించు దుర్వాసుం గనుంగొని జోతపెట్టి — ౨౯౦

ఆ॥ "ఎవరునిలిపిరయ్య యీశివలింగంబు ? ఏలపాడెదాడె దిచట నీవు ?
ఆటపాటలెల్ల నన్యులయవి కాని తాపసులకు నిద్ది తగినపనియె" ౨౯౧

వ॥ అనియడుగుటయు నతండిట్లనియె. — ౨౯౨

—♦ దుర్వాసస్థాపితలింగమునకు దుశ్శీలేశ్వరసంజ్ఞ వచ్చుట ♦—

తే॥ "నేన యీశివలింగంబు నిలిపినాఁడ. తన్మహేశుఁడు నృత్యగీతప్రియుండు
అట్లుగావునఁ బాడుచు నాడుచుంటి. ఇతరకైంకర్యమున కర్థ మేడఁదెత్తు ?"

వ॥ అనియిట్లు సమాధానపఱచె. ఇంతలోపలఁ జర్భటియను నొక రోగవిదుండు చనుదెంచి — ౨౯౪

శ్లో॥ అసూర్యానామ తే లోకా అంధేన తమసావృతాః
తాం స్తే ప్రేత్యాభిగచ్ఛంతి యే చాత్మహనో జనాః. ౨౯౫

వ॥ అనుశ్లోకంబుఁజదివి వేదాంతికంబగు నీప్రశ్న సేయుటయు దుర్వాసుండు మూర్ఛిండి దానికిఁ దగినయుత్తరంబు నొసంగె. స్తుతింపఁబడిన యాసర్వంబును దెలిసికొనుటచే విశేషించి యుదయించిన శివభక్తితో దుశ్శీలుఁ డాదుర్వాసు నకుఁ బ్రణమిల్లి యుచ్చైర్నాదంబున. ౨౯౬

ఆ॥ "స్వామి ! జాతిచేత బ్రాహ్మణుండను నేను. కాని కర్మమునను గాను మరల
ఇంచుకయును నెవని కిచ్చియెఱుంగను. పిడికెఁ డన్న మేని పెట్టియెఱుంగ. ౭౯౭

ఉ॥ ద్యూతము వేశ్య లోనయిన దుర్వ్యసనంబులఁ జిక్కి యందుకై
నీతిదొఱంగి దేవధరణీసురవంచన మాచరించుచుఁ
స్ఫీతధనంబుగూర్చితిని. క్షత్రియమరాన్వయుఁడౌండనయ్య సం
ప్రీతిని శైవశిష్యుఁడనఁగ ధేబవ లుండితి సేవఁజేయుచుఁ. ౭౯౮

తే॥ మాయమాటలచేతఁ దన్మానసము హరించుటయె కాక బిట్టు వంచించి యాతఁ
డెంతకాలంబునుండియో సంతరించియుంచుకొన్న ధనంబు హరించినాఁడ. ౭౯౯

కం॥ ఆగురుఁడును బరలోకం బేగినవాఁడిప్పు. డదియె యెంతయు నాకుఁ
జేరఁగ్రై పశ్చాత్తాపము తాఁగలిగించెను. మనంబు తగులంబడెడుఁ. ౮౦౦

పృథ్వి॥ పురశ్చరణదానముఁ మునివరేణ్య! కావించి నఁ
కరంబు కరుణింపవే. కలదు విత్త మెంతేని. ఒ
క్కరైన సుతపుత్రికల్ కలుగరైరి. ఆవిత్తముఁ
స్థిరంబయిన పుణ్యపుంజెయువుగూర్చి వెచ్చించెదఁ. ౮౦౧

కం॥ ఇహపరముల రెండింటను విహితం బొదగూడుపనిని వివరింపఁగదే
మహిదేవ! ఉక్తమంతయు బహుభక్తిం జేసి విగతపాపుఁడనగుదుఁ." ౮౦౨

వ॥ అని వేడికొనుటయు దుర్వాసుం డిట్లనియె — ౮౦౩

తే॥ "ఆదిఁ బాపసహస్రంబు లాచరించి మగుడ ధర్మంబొనర్చెడి మానవుండు
కష్టమునకోర్చి యతికృఛ్రకారియైనఁ బూర్ణసంసారసాగరంబును దరించుఁ. ౮౦౪

ఆ॥ ఒక్కడినమె ధర్మముజ్జగించియె శైవుఁ గోరి గురుని జేసికొంటికాన
వాఁడు గురుఁడె యగును వాస్తవంబుగనీకు. ఇంచుకయును సంశయింపవలదు.

సీ॥ బ్రహ్మచర్యంబును బట్టఁగావలయును బ్రప్రథమంబున బ్రాహ్మణుండు.
ఆవల గార్హస్థ్య మవలంబనీయంబు విబుధుఁడైనట్టి బాడబునిచేత.
అంత వానప్రస్థుఁడగుట మేలగుచేత శాంతికాముండైనశర్మునరునకు.
తరువాత యతియౌట ధర్మ్యంపుఁబద్ధతి యన్నియుండెలిసిన యగ్రజునకు.
ఒగిఁ గుటీచకుఁడు బహూదకుండును హంస పరమహంస యగుట భావ్యమతని.
కిట్టిమార్గ మాశ్రయించినపదపడి పరమపదమునొందు బ్రాహ్మణుండు. ౮౦౬

ఆ॥ అందు బ్రాహ్మణుండవయ్యుఁ గుత్సితమైనయట్టి శైవమార్గ మననుసరించి.
తందువలనఁజేసి యత్యంతపాతకం బాచరించినాఁడవయ్య నీవు." ౮౦౭

వ॥ అనియిట్లు పలుకుటయు దుశ్శీలుండు వెండియు — ౮౦౮

ఆ॥ సకలవేదములను సంకీర్త్యమానుఁ డావిభుఁడు రుద్రుఁ డట్టి వేదవేద్య
దీక్ష దుష్టమనుచుఁ దెల్పెద వదియేల? మునివరేణ్య! శివ్యజనశరణ్య!" ౨౦౯

వ॥ అనియడుగుటయు దుర్వాసుం డిట్లనియె — ౨౧౦

ఉ॥ "సత్యము నీవుపల్కినది. శంకరుఁ జేర్కొను వేద మాతఁడే
స్తుత్యుఁడుగాఁడు దాన మధుసూదనుఁడుం బరికీర్త్యమానుఁ డా
దిత్యుల జ్యేష్ఠునిం గడు నుతించెడి నయ్యది. కాని బ్రాహ్మణుల్
నిత్యముఁ బూనఁ గాఁదగు ననింద్యవ్రతంబది వేఱయుండెడిన్. ౨౧౧

తే॥ పరమజాప్యము గాయత్రి బ్రాహ్మణునకు. తదుపదేష్టయె గురువును. తద్విభిన్న
శైవవైష్ణవదీక్షలు సలుపువాఁడు కాఁడు బ్రాహ్మణుఁ డంగమంత్రముఁ జదివిన.

ఆ॥ ఇదియుఁగాక కపటహేతువునంజేసి లింగభేదమును బొసంగె నీవు.
వ్రతమువదలి తందువలనఁ బ్రాయశ్చిత్త మించుకయును నుండ దెచటునీవు." ౨౧౩

వ॥ అనియిట్లు వచించుటయు మరల దుశ్శీలుండు — ౨౧౪

ఆ॥ "సప్తపదియటందు్రు సత్పురుషులమైత్రి. కాన నీవు నాకుఁ గలిగె మైత్రి.
మనవిచేతు నట్టిమైత్రిఁ బురస్కరించుకొని నే రవంత శ్రోత్రమిమ్ము. ౨౧౫

ఆ॥ కలదు నాదు ధనము కావలసినయంత. దాన శుద్ధియేని యగు నెడలను
అది వచింపుమయ్య యంతయు నొనరింపనుంటిఁ గానఁ గరుణయుంచి నీవు."

వ॥ అని యభ్యర్థించుటయు వెండియు దుర్వాసుం డిట్లనియె — ౨౧౬

కం॥ "ఒకటే యుపాయమున్నది ప్రకటంబగు నీదకీనపాపమువోవన్.
సుకముగ విశుద్ధియగు మామకవాక్యము ననుసరించి మంచిగఁ జేయన్. ౨౧౭

తే॥ కృతయుగంబునఁ దపము యుత్కృష్టమనిరి. త్రేతలోపల ధ్యానంబ త్రిదివహేతు
వధ్వరమునన ద్వాపరమందు సుగతి. కలియుగంబున దానంబ ఫలద మరయ.

తే॥ కలియుగంబిద్ది గావునఁ గల్మషంబు లెడలఁ గృష్ణాజినంబుల నిమ్ము పొమ్ము.
గురుధనంబును వంచించి కొంటివనుచుఁ దాపపడుచుంటి వెడఁద నెంతయునుమఱియు

తే॥ అందుకొఱకయి వాని యాహ్వాయముపెట్టి యొక్క శివుగుడి కట్టింపు మర్విమీఁద
దానివలననుజేసియుఁ దక్షిణంబ పొందెదావృణ్యమీవహో భూసుపర్వ! ౨౨౧

చం॥ మఱియొకచోటఁగూడఁ బడు మంచిగ నీదుధనంబు. శిష్టభూ
సురుల కొసంగు మన్వహము. శుద్ధసువర్ణసమన్వితంబుగన్
వగతిలపాత్రదానము నవశ్యముఁజేయుము. నీదు దేహమున్
ద్రాఁగి సమస్తపాపములు తొడనపోవు-విశుద్ధి గల్గెడిన్. ౨౨౨

ఆ॥ మఱియు నిచటు నేను విరచించు దేవాలయంబుఁగూర్చి దూరమునకు భక్తి
చైత్రచైత్రమునను వరిఁ గల్పగ్రామమునుండి వచ్చి చనుదునేను. ౨౩

క॥ కావున నేఁగట్టించెడి దేవాలయమందు నీవు దృష్టినిబెట్టిం
గావలయును-స్నానాదులు గావించుచునుండవలయుఁ గర మిచ్చోటన్ " ౨౪

వ॥ అనియిట్లు నుడివి దేవర యిట్లు చెప్పిన నట్లు వర్తింతునని దుశ్శీలుం గాంచి మఱియు
దుర్వాసుండు — ౨౫

ఆ॥ " అఖిలపాపములును నడఁగుఁ గృష్ణాజినదానమున. నిసంగు తప్ప కీవు.
గుప్తపాపములును గూలును దిలపాత్రదానమునను జేసి తప్పకుండ " ౨౬

వ॥ అనినవిని జింకచర్మంబులును దిలపాత్రంబులును యథావిధి సాహితాగ్నులగు
వరభూసురుల కా దుశ్శీలుఁ డన్వహము భక్తిమై నర్పించుటయుఁ బాపంబులు
తొలఁగిపోయె. అట్లు గతపాపుండగు నతనికి దుర్వాసుండు నిర్వాణదంబగు
దీక్షయిచ్చి గురుదక్షిణఁగోరుటయు దుశ్శీలుం డిట్లనియె — ౨౭

క॥ " అడుగుము గురుదక్షిణ బుధనిరోయుడయుఁడ! ఇచ్చెదను శక్తియుండినచో ని
ప్పుడ విత్తశాఠ్యమును నిరోడలను గావింప. ఇంక నేమనవలయున్? " ౨౮

వ॥ అనియిట్లు నోడువుటయు దుర్వాసుం డిట్లనియె — ౨౯

శా॥ " కల్పగ్రామముగూర్చి పోదునిఁక నే. కల్యాణక్షేత్రం బిదియుంగం.
బల్పాక్రాంతము. కావునం గృతయుంగం బాసన్నమౌ దాఁక నా
కా శ్రేష్ఠంబడదిందు నుండియును. ఈ కట్టించు దేవాలయం
బల్పీయంబయియుండియున్న. దవశిష్టార్థంబు గట్టింపనౌ. ౩౦

క॥ ఇది నాకగు గురుదక్షిణ. తదాలయముముందఱను యథాశక్తిని నీ
వు దినదినము బలికుసుమములు పొందలుగ నిడి నృత్తగీతములు సేయఁగన్ " ౩౧

వ॥ అనియిట్లు వాక్రుచ్చి యమ్మునీశ్వరుండు కల్పగ్రామంబునకు వెడలిపోవుటయు
దుశ్శీలుండు తదుదీరితం బంతయు నాచరించె. భక్తిపూర్వకంబుగా నిట్లు తత్కా-
ర్యంబులు నిర్వర్తించుటయుఁ దదాలయంబు దుశ్శీలసంజ్ఞితంబై తనరనయ్యె. అది
కారణంబుదీసికొని ప్రతివత్సరముఁ జైత్రమాసమునం దాదేవుని దర్శించు జనము
వత్సరకృతంబగు పాపంబునుండి వదలంబడు. స్నపనాది సకలార్చనంబును
నాచరించిన ముప్పదిసంవత్సరములపాతకం బప్పుడ నశియించును. తదగ్రంబున
నృత్యగీతాదికంబులు గావించువాని యాజన్మమరణాఘంబు లన్నియు నంతంబు
నొందు, ముక్తి ఘటిల్లు. దుశ్శీలుం డట్లొనర్చి భక్తిమై గురుపాదపద్మంబుల

స్మరించుచు దక్షిణదిశ నతనిపేర నింబేశ్వరమను నొక్క శివాలయంబు గట్టించె. అట్లు శాకంభరియనంబడు తద్భార్యయుఁ దనపేరుతో దుర్గం బ్రతిష్ఠించె. అంత నాదంపతు లిరువురును నింబేశ్వర శాకంభరీదేవతల నిత్యనైవేద్యదీపారాధనాదులకుంగా బ్రాహ్మణులకుఁ గొంతవిత్తమర్పించి తక్కటిధనం బంతయు ధర్మార్థంబు వినియోగించి చంకలకు జోలెలు దగిలించిరి. కొంతకాలంబునకు దుశ్శీలుండు దేహంబు విడుచుటయు శాకంభరి తద్దేహంబును హవ్యవాహంబునం జేర్చి సహగమనంబు గావించె. పదపడి యుభయులు నప్సరస్సంసేవ్యమానంబగు నాకాశయానం బధిష్ఠించి యత్యంతసంతోషంబుతో నమరాలయంబున కరిగిరి. ఉత్తమంబగు నీ దుశ్శీలోపాఖ్యానంబు పాఠకుల కజ్ఞానకృతంబులగు నఖిలపాపంబులను హరించు. బ్రాహ్మణశ్రేష్ఠులారా! అట్లిందు మునిహితకాంక్షులై యేకాదశ రుద్రులు వసింతురు — ౭౩౨

## ఏకాదశరుద్రుల యుద్భవము

సీ॥ తద్దర్శనంబునఁ బెద్దపెద్దయఘంబు లంతంబునొందు క్షిత్యమరులార!
తన్నుతిస్మృతిచేత మున్నున్నదోషముల్ విలయంబునొందు నో విప్రులార!
తత్పూజనంబున వ్యాప్తపద్మ మెంతయుం గలుగు విహీనమహా నలఘులార!
తన్నుతిశ్రీయనుండి ధన్యాత్ములయ్యెద రట్టిచెట్టులును మునీంద్రులార!”
అనివచింప శౌనకాదు “లొక్కఁడె రుద్రుఁ డాలకింపఁబడెడి నాగమముల,
మఱి ద్వితీయరుద్రు మాటయు విన మహోన్నత! అధికభూత! సుజననేత! ౭౩౩
ఆ॥ గౌరి భార్యగాఁగ స్కందుండు కొడుకుగా నుండియున్న రుద్రుఁ డొకఁడె మాకు
విదితుఁ డంతకన్న వేఱైనరుద్రు లెవ్వరో చెప్పు” మనుడు వారి కతఁడు ౭౩౪

వ॥ మహాభాగులారా! మీరనునది వాస్తవంబు. ఒక్కండే రుద్రుండు. రెండవ రుద్రుఁ డేవిధంబునను లేఁడు. కాని యేకాదశరుద్రు లెట్లయిరో వాక్రుచ్చెద వినుండు తొల్లి శంసితవ్రతులై వారాణసియందుండు పదునొకొండుగురు మునులు హాటకేశ్వరదర్శనార్థం బుత్సాహంబుతోఁ బయనమై యొకరికన్న నొకరు ముందు చనవలెనను స్పర్థచేఁ బాతాళస్థ హాటకేశ్వరంబునకుఁ బోయి యందఱికంటె ముం దందలి శివుని దర్శింపనివాఁడు తక్కనందఱిపాతకంబును నొక్కండె యనుభవింపవలెనని సమయంబుచేసికొని యగ్గలంబు పరువులెత్తుటయు హాటకేశ్వర దేవుం డయ్యది గుర్తెఱింగి వారి భక్తికి మెచ్చుకొని తత్క్షణంబ పాతాళంబునుండి యూర్ధ్వంబగు నాబిలమార్గంబునఁ బుడమికి వచ్చె. ౭౩౫

సీ॥ మొనల మూడింటిచే ముచ్చటగానుండు వాలును లీలఁ గెంగేలఁ దాల్చి
స్వాభావికంబైన చక్షుర్యుగముగాక దంబైన ఫాలనేత్రంబుగలిగి
గంగాన్వితంబైన ఘనజటాజూటంబు లలి ఖండశశిచే నలంకరించి
అడుగులదాఁక వ్రేలాడ నీలగ్రీవఁ దలకాయపుఱ్ఱెల దండవైచి
ఎంతో యందముగను నేకాదశప్రకారంబులై మునీశ్వరప్రకాండు
లందఱికినొసంగె సాత్త్వికదర్శనం బేకకాలమం దిఁ కేమిగలదు ? ౨౩౬

వ॥ అంత నమ్మునులందఱును దమముందఱ సాక్షాత్కరించియున్న వృషభధ్వజు
విలోకించి మోకాళ్ళమీఁద నిల్వఁబడి — ౨౩౭

కం॥ "నతి సర్వదేవమయునకు. నతి శ్రీదేవాధిదేవునకు శాంతునకున్
నతి సూక్ష్మకళేబరునకు. నతి యంధకమర్దనునకు. నతి రుద్రునకున్. ౨౩౮

కం॥ జోత పృథగ్విధవాయువ్రాతముచే సర్వజగము బ్రదికించుచు సం
ప్రీతి సదా దివమందున స్థితులయి వెలంగునట్టి రుద్రులకున్. ౨౩౯

కం॥ దండము పశ్చిమదిక్కున నుండి పిశాచములబారినుండి జగంబుల్
నిండుకృపం బాలించెడి రుండస్రగ్ధరులైన రుద్రులకెల్లన్. ౨౪౦

కం॥ కేలుమోడ్పు భూతజాలంబునుండి లోకములనెల్ల నిండుకరుణతోడ
మనుచు మార్గ్వమంది యనయంబు వర్తించు రుద్రులకును గణితభద్రులకును.

కం॥ జోహారు భూతలంబున మోహితమతులైన ప్రజలఁ బ్రోచుచునెప్పుడున్
స్నేహమున నుండు ప్రకటితమాహాత్మ్యుల కలుషకాంతిరుద్రులకున్ " ౨౪౨

వ॥ అనిస్తుతించుటయు భక్తినమ్రులైన యాతాపసులం గని యేకాదశరుద్రు లిట్లనిరి—

తే॥ "పదునొకండువిధంబులం బరఁగు నేను దాపసోత్తములార ! ఎంతయును యుష్మ
దీయభక్తికి మెచ్చితి. మీ యభీష్టవరము గోరుఁ డొసంగెదఁ గరుణతోడ." ౨౪౪

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయు నమ్మునీంద్రులం — ౨౪౫

తే॥ "తుష్టిఁజెందితివేని మాయిష్టవరము నిచ్చుటకు సిద్ధముంటివే నీశ ! యిచట
పదునొకండువిధంబులం బరఁగుచును వసింపు మెల్లప్పుడేమి యాచింపవలయు !

ఆ॥ అఖిలతీర్థమయము హాటకేశ్వర మెన్న. అట్టిక్షేత్రమధ్యమందు నీవు
సర్వదా వసించి శాంబ ! నీయారాధనం బొనర్చెదము ఘనంబుగాను " ౨౪౬

వ॥ అనియిట్లు వేడుకొనుటయు భగవానుండిట్లనియె — ౨౪౭

ఆ॥ " ఏధరించినట్టి యేకాదశాకారములను నెప్పుడు నిచట లలి వసింతు.
మెట్టమొదటి నాదుమూర్తి కైలాసభూధ్రమున నుండు సర్వదా సుశోభ. ౨౪౮

ఆ॥ యంశమ్మతీయమైన యరుదనామములతోడ నిమతీయమూర్తు లిచటనుండు
పరమపదముగలుగు భక్తి విశ్వామిత్ర హ్రదమునందుఁ గ్రుంకి యవి భజింప.

కం॥ వేదముల విప్రులారా ! ఆయేకాదశవిగ్రహములకు భక్తిన్
జేయఁబడు పూజ యగుఁ జో వేయేకాదశగుణంబు విఖ్యాతముగన్. ౨౫౦

వ॥ అనియిట్లు పలికి ముక్కంటి యక్కడనే యంతర్ధానంబునుఁ బొందె. సన్మునులును నచ్చోటనే యాశ్రమంబు ఏర్పఱచుకొని యత్యంతశ్రద్ధ నయ్యేకాదశ మూర్తుల నారాధించి యపవర్గంబుగాంచిరి. ఇతరులైనను శ్రద్ధమైఁ దన్మూర్తుల భజించిన మహేశ్వరుండు పరమస్థానంబు ప్రాప్తింపఁజేసెడి. ఏకాదశరుద్రులది మొదలుకొని యేర్పడిరి. చైత్రశుద్ధచతుర్దశీతిథిం దద్రుద్రులను భక్తిశ్రద్ధాసమన్వితంబుగా భజియించువాఁడు పరమపదంబు పడయఁగలిగెడి" ౧౫౩

## ఏకాదశరుద్రులదగ్గఱఁ జేయవలసిన దానములు

ఆ॥ అనివచించుటయును "నార్య! వారాణసినుండివచ్చియున్న యోగివరుల
ఆఖ్యలెవ్వొ చెప్పు" మని వేఁడుటయును నాఋషులఁగాంచి సూతుఁ డిట్టులనియె.

వ॥ "వారు పదునొకండుగురును మృగవ్యాధ సర్వసంజ్ఞ నిందిత మహాయశో జైకపాదహిర్బుధ్న్య పినాకి పరంతప దహనేశ్వర కపాలిసంజ్ఞలం జెలువారుదురు. రుద్రులును నవియె పేళ్ళం బ్రసిద్ధికివచ్చిరి" ౧౫౪

చ॥ అనియిటుపల్క శౌనకముఖావనిదేవులు రోమహర్షణిక
కనుగొని "పూర్వ మీవు జపకర్మ మెటులొనరింపనానో చ
క్కనుడివి. తత్తు రుద్రులకుఁగా నెవి యీవలెనో వచింపు" మం
చనుటయు సన్మునీంద్రులకు హర్షముతోడుత నాతఁ డిట్లనున్. ౧౫౫

వ॥ "వారి నుద్దేశించి యొక్కొక్కరికి వేయివేలుగా గోదానంబులు చేయవలయును. మృగవ్యాధునకు గుడధేనువును గపాలికి నవనీతధేనువును నజైకపాదున కాజ్యధేనువును నహిర్బుధ్న్యునకు సువర్ణధేనువును బినాకికి లవణధేనువును బరంతపునకు గసధేనువును దహనున కన్నధేనువును నీశ్వరునకు జలధేనువును నీయవలయును. ఈ ధేనువుల నిమహాత్ముల కిచ్చువాఁడు నిశ్చయంబుగాఁ జక్రవర్తి యగునని పితామహుండు వచియించె. ఇతరత్ర యీఁబడు ధేనువులే యిట్టి ఫలంబు నొసంగ నీశ్వర సాన్నిధ్యంబునఁ జేయఁబడువానిసంగతి యేమి చెప్పవలయును? కావున విశ్వప్రయత్నములు చేసియైనను నీగోవుల నొసంగునది. శక్తివిహీనుఁడు రుద్రు లందఱికిని ధర్మ్యయజ్ఞోక్త ప్రకారము ప్రయత్నించి యైనను నొక్కగోదానము కావించునది. బ్రాహ్మణులారా! హాటకేశ్వరక్షేత్రంబున యాజ్ఞవల్క్యప్రతిష్ఠితులైన ద్వాదశాదిత్యులకు భక్తిమైఁ బ్రతిసప్తమిం బూజించువారు నిస్సంశయంబుగా వాంఛితంబులం బడయం గలుగుదురు." ౧౫౬

## యాజ్ఞవల్క్యవృత్తాంతము

కం॥ అనియిటు వచియించుటయును వినినాఁ "డాదిత్యుఁ డొకఁడె వియదధ్వమునన్
గనఁబడుచుండెడి నెప్పుడమ్ముని పండ్రెండుగుర నెట్లు మును సృజించెన్ ? ౧౫౭

కం॥ ఉద్దేశము లేకుండఁగ నెద్దియుఁ జేయంగఁబడమి నెందులకై య
న్నిద్దఱ స్థాపించినవాఁ? డద్దిర! ఆ కాల మెద్ది" అని యడుగుటయున్ ౧౫౮

వ॥ "తొల్లి శునశ్శేపుండను మునిసత్తమునకుఁ గృతియను సుతుండు దయించె. అతనిపుత్త్రుండు శునఃపుత్త్రుండు. అతనికిఁ బాలకుండను పుత్త్రు. పెద్దకాలంబు నకు లోకపితామహుండగు బ్రహ్మ సావిత్రీశాపవశంబున నా నాగరఖండమునకు జన్మించె. చతుర్ముఖుండు యజ్ఞంబు సేయ సమకట్టి పెండ్లముగు సావిత్రి వేళకు రామికిం గినిసి ౧౫౯

కం॥ "కాలాప్రవేళ సముచిత కాలాత్యయ మింతకేని కాదుండఁగనే
మేలైన యనుద్వాహిత బాలికఁ గొని తెమ్ము శక్ర! కఁ బనిచెను మఘవా!" ౧౬౦

వ॥ అని యింద్రున కాజ్ఞయిచ్చుటయు నతండు సర్వలక్షణలక్షితయగు నొక గోప కన్యకను గోవక్త్రంబునుండి గుహ్యమార్గంబునం దీసి పవిత్రఁ గావించె. ౧౬౧

ఆ॥ "గోవులయును భూమిదేవులయును గులం బొకటె ద్విప్రకారమయ్యె నిది.
మంత్రసమితి యొకట మతి యొక్కచో నాదిర్స్థితి యుండెడిట్లు వెలయుచుండె"

వ॥ కావున నాయమను బ్రాహ్మణిం గావించి పదంపడి పితామహుండు గృహ్యోక్త విధానంబునం బరిగ్రహించె. అపుడు పత్నీకాలం బ్రతీక్షించి రకనాసమలం కృతయై వర్తించుచుండుటయు దేవతాస్త్రీసమేతయై యరుదెంచిన సావిత్రి విలోకించి ౧౬౩

శా॥ "తాతా! తప్పొకయింత లేని నను సంత్యాగంబు గావించినా
వేతద్ధేతువునుండి తాతగనని న్నెంచెంతు సంగంబునం
దీతీ ర్పెండ్లము మీఁది పెండ్లమునకై యిట్లొప్పుదుర్ మర్త్యలో
కీ ప్రీతిం జేతురు కానఁ బుట్టు చని ధాత్రిన్ నీవు మర్త్యుండవై. ౧౬౪

ఆ॥ మనుజుఁడుగ జనించి మతిసతీకామార్తి ననుభవించుచుండు మనఁగ నీవు.
నాయయిత్తమైన నామాట తప్పక జరిగితీరు లేదు సంశయంబు" ౧౬౫

వ॥ అని శపియించి యజ్ఞమండపంబునుండి పోయి పర్వతశిఖరం బధిరోహించి తపంబు గావించె. బ్రహ్మ యివ్విధంబున భూమియం దవతరించినవాఁడు. అట్లవతరించి యాజ్ఞవల్క్యుండను పేరం బరంగుచు యౌవనవంతుఁడగుటయుఁ గాయమునేత్రి

వ॥ అనిపలుకుటయు యాజ్ఞవల్క్యుఁ డత్యాగ్రహంబుమై నట్ల యాచరించి యగ్ర హితదక్షిణుండై యాత్మావాసంబునకరిగె. అంత నాయశ్వశాలలోని స్తంభంబు పలువిధంబులగు పల్లవంబులతోడను గొమ్మలతోడను నలంకృతంబయ్యె. అది యవలోకించి యానర్తాధిపతి యాశ్చర్యపడి యగ్గలంబు పశ్చాత్తాపంబున- ౭౭౦

"శా॥ ఛీ! నేఁజేసినకార్య మారయఁ గడుం జింత్యంబగుంగాదె ? అ
న్యాయం బీతని మంత్రిసత్త్వ. ఎవరో యిక్ష్వాదిలేయుం డిటుల్
తా సర్వేశ్వరవేషధారియగుచున్ ధాత్రిన్ దిగంబోలు. అ
య్యో! నేనీతనిమంత్రివారిఁ గొనుచో నున్నే జరామృత్యువుల్ ? " ౭౭౧

వ॥ అనిచింతించుచు నత్యాశ్చర్యంబుతో నాదినం బాపార్థివుఁ డబ్బళతోపమానస్కుఁగా గళ్పించె. ఎట్లెట్లో పవలు గడపినను రాత్రిగడపుట మతిదుంతకష్టంబయ్యె. అంతఁ బ్రొద్దుపొడుపునలేచి యమ్మహీపతి యాప్తులైన పురుషుల ద్వారంబున శాకల్యుఁ బిలువంబంచి సాదరంబుగా నంజలిచేసి వినయంబు గనఁబఱచుచు ౭౭౨

క॥ "నిన్నటిశాంతిక్రియజరుప న్నే వచ్చిన నిటుకుఁ బంపితో నేఁడున్
క్రొన్నన నతనిని పంపుము. ఈన్నదిపని. కరము భక్తి యొదవె నతనిపై " ౭౭౩

వ॥ అనివిన్నవించుటయు నతండు నట్లయని తనయింటికిం బోయి యాజ్ఞవల్క్యుం బిలిచి మృదుమధురవచనంబుల నిట్లనిరెను. ౭౭౪

తే॥ "ఈదినంబునఁగూడ మహీశునింటి శాంతికంబును గావింపఁ జనుముపుత్రి!
యన్న వారందఱుండఁగా నిన్నెయతఁడు పంపుమనె. ఏతి వర్ధమానభాజనమవు"

వ॥ అనినవిని యాజ్ఞవల్క్యుండు ౭౭౫

ఆ॥ "శాంతికంబుజరుపఁ జనఁ దగ్గ్రహంబున. నాదరింపఁడయ్యె నతఁడు నన్ను.
మామకీనమైనమంత్రింబువ్గ్గోన కొక్కి కొయ్యమీఁద నుంచుకునియు. ౭౭౬

క॥ కావున నానక్తిశునిభావము రంజింపఁజేయు ప్రజ్ఞగలండో
తావకశిష్య మఱొక్కని బ్యావిబుధవరేణ్య! నరవి నను పఁగద యార్య " ౭౭౭

వ॥ అనవుడు శాకల్యుండిట్లనియెను. ౭౭౮

క॥ "యోగక్షేమము లరయుచు బాగుపఱచు ప్రభువునాజ్ఞ ప్రజ కగుఁ గార్యం.
బేగుణహీనుం డాతని కేఁ గంటకుఁ డౌతఁ డెట్లు నందఁడు సుఖమున్. ౭౮౦

క॥ కులమున నధికుఁడననియో యలఘుకలాధన్యుండననియొ యతిగర్వముతో
ఇల రాజు నుపేక్షింపని ఖలునకుఁ బాచితము భిక్షుకత మనుదాఁకన్ " ౭౮౧

వ॥ అనియిట్లు గురుశిష్యు లిరువురును వివాదపడుచుండ మహీశు పనుపున మతి కొందఱు వచ్చి త్వరపడుచు శాకల్యునకుఁ జేతులుజోడించి " అయ్యా! రాజు

దారులుచూచుచున్నాఁడుగాన శిష్యుని త్వరితంబుగం బనుపుఁడని విన్నవించిరి. ఎన్నిపరులం జెప్పినను యాజ్ఞవల్క్యుండు శాంతికంబుగావించుటకుఁ జనమిని విధేయుఁడై దోసిలొగ్గి నిలువంబడియున్న యుద్దాలకు నొద్దకుఁజేరి శాకల్యుండు

ఆ॥ "చనుమువత్స! వేగ శాంతికంబునొనర్ప నృపతిమందిరమున కిపుడునీవు.
అస్మదీయమైన యానతి స్వాధ్యాయపఠనముంబొనర్పు బాగుగాను" ౧౮౩

వ॥ అనియాదేశించుటయు నతండు వల్లెయని రాజమందిరంబునకుం బోయి శాస్త్రోక్త ప్రకారంబుగా శాంతికంబు నిర్వర్తించి సాక్షతంబును సపుష్పంబును నగు కలశోదకంబుం గైకొని భూపాలు డగ్గఱి నతండు ౧౮౪

క॥ "నీమంత్రమహిమఁజూతము భూమిసురా! అగ్రమందుఁ బొలుపారెడియు
ద్దామస్తంభముమీఁదను క్షేమముపొంటెక్క జలంబు చిమ్ముంగదవే" ౧౮౫

వ॥ అని యానతిచ్చుటయు నతండు మంత్రం బుచ్చరించి కాష్ఠంబున కభిషేకించి వెళ్ళిపోయె. యథాపూర్వంబుగనేయున్న యాకంబంబు నానర్తమహీశుం డవలోకించి సవిషాదంబుగం బశ్చాత్తాపపడుచుఁ దిరిగియు యాజ్ఞవల్క్య నిమిత్తము శాకల్యునింటికి నేర్పరియగు మఱియొకదూతం బంపుచు. ౧౮౬

తే॥ "బాడ్యమునఁ బీడ్యమానుండ. శాంతిఁజేయ మొన్నఁబంపిన నీశిష్యుఁ గ్రిన్నఁబంపు
మతని కవమతిఁజేసితి నకట! నేను. తత్కృతాశీస్సు గొననైతి. దానఁజేసి

కం॥ హెచ్చెను బాడ్యం. బాతఁడు వచ్చిన స్వాస్థ్యంబుగలుగు వసుధాదేవా!
చెచ్చెర నాద్విజబాలుని పుచ్చుము నాభవనమునకు బోధించి యెటో" ౧౮౮

వ॥ అనిచెప్పుటయు నరుగు మరుగుమని యనేకవారంబులు శాకల్యుండు శాసించియు యాజ్ఞవల్క్యుం డేగమిని మధుకుండను మఱియొక శిష్యుం బంపించె. అతండును నుద్దాలకువిధంబున నుర్వీశున కాశీర్వాదమిచ్చి యా స్తంభంబున కభిషేకక్రియ నెఱవేర్చెఁగాని యయ్యది యథాపూర్వంబుగనే యగపడియె. మహీపతి మగుడ నొకమానిసిని యాజ్ఞవల్క్యుకొఱ కనుపుటయు నతం డనేకధా గురునిచేఁ బ్రబోధింపఁబడియు నరుగండు. అంత శాకల్యుండు గుణవంతుండును భాగవిత్తియు నగు ప్రచూడుండను మఱియొకశిష్యుం బంపుటయు నతండును బోయి మున్నుచన్న యిరువురుంబోలె శాంతికంబు నిర్వర్తించి తజ్జలంబు స్తంభంబుపై సమంత్రకంబుగాఁ జల్లెనుగాని యది యెప్పటియట్ల నిలిచియుండె. పదంపడి పశ్చాత్తాపయుతుండగు ప్రభుండు స్వయంబుగనె బయలువెడలి యాజ్ఞవల్క్యునిచే మంత్రింపించుకొనుటకు శాకల్యసదనంబుం బ్రవేశించి యతనికి నతియొనర్చి ౧౮౯

## —♦ ద్వాదశాదిత్యుల యుత్పత్తి ♦—

సీ. ధాతయన్ పేరునఁ దనరెడిఁ బ్రథముండు. మిత్రుఁ డర్యముఁ డటుమీఁదివారు.
శక్రాహ్వయుండును దా సరిగ నాలవవాఁడు. వరుణాంశులు తరువాతివారు.
భగసంజ్ఞితుండు సప్తముఁడు. వివస్వంతుఁ డష్టముం. డవతలియతఁడు పూష.
దశముండు సవితయా. త్వష్ట యాకలివాఁడు. విష్ణునామకుఁ డటువెనుకవాఁడు.
ఇట్లు పండ్రెండువిధముల యినుల నిలిపి గంధపుష్పాదికంబులం గరముభక్తి
నోలిభజియించుచుటయుఁ బెద్దకాలమునకుఁ గ్రన్ని దుటునిల్చి యారవి యిట్లులనియె.

ఆ॥ "యాజ్ఞవల్క్య! యుష్మద్దర్శనమునఁ జేసి యగ్గలంపుఁ బ్రీతియయ్యె నాకు.
ఎదియొ భవదభీష్ట మిచ్చెదఁ జెప్పుము మిమ్ముంచు కేని సంశయింపకుండ" ౯౦౬

వ॥ అనియిట్లుపలుకుటయు యాజ్ఞవల్క్యుండు ౯౦౭

కం॥ "గ్రహనాథ! నాపయి ననుగ్రహ ముద్భవమైనయెడలఁ గాదన కిపుడే
రహి నధ్యయనము సేయింపు హితాధ్యాపకుఁడవగుచుఁ బుత్త్రున కటులన్"

వ॥ అని కోరుకొనుటయు నాదిత్యుండిట్లనియె. ౯౦౯

ఆ॥ "చక్రవాళశిఖరిసందర్శనార్థమే ననుదినంబు మేరువును బ్రదక్షి
ణింపవలయుఁగాన నీచేతఁ జేయించుపెట్లు వేదపాఠ మేను విప్ర! ౯౧౦

ఉ॥ కావున నాదు తేజమున గ్రక్కున భస్మముగాకయుండున
ట్లీవు మదశ్వకర్ణమున నెంతయు సూక్ష్మపుటాకృతిన్ మహీ
దేవ! వసించుచుం జదువు తిన్నగ వేదము శాస్త్రమాదిగా.
ఏవచియించుమాట విని యీక్రియమాణము కట్టిపెట్టిఁకన్" ౯౧౧

వ॥ అనియిట్లు సెలవిచ్చుటయు యాజ్ఞవల్క్యుండు వల్లెయని యశ్వకర్ణంబునం బ్రవే
శించి సాంగోపాంగంబుగను సపరిశిష్టంబుగను జతుర్వేదంబులం దన్ముఖంబునఁ
జదువుకొని సమాప్తంబుగా గురుదక్షిణఁగోరుమన నాదిత్యుండు ౯౧౨

సీ॥ మొదటిదౌ ఋగ్వేదముననున్నయటువంటి సూర్యసంబంధి సత్సూక్తములను
రెండవదౌ యజుర్వేదంబులోపల న్రాలుచుండెడి పావనంబులను
మూడవదిగ బుధు లాడుచుండినయట్టి చారుతరంబైన సామములను
నాలవామ్నాయంబునం దేజరిల్లుచు సురుతరంబైన కల్పోక్తములను

సలిపివ్యాఖ్యానములను బ్రచారమునకుఁ జేవలయునీవు భూమిలో ధీసమేత !
ఆస్మదనుగ్రహంబునను వాని నన్నిటిని బఠించుద్విజులెల్ల స్వర్గంబుఁ గాంచఁగలరు.

తే॥ మఱియు నామీఁదిభక్తి ధీమంతులగుచు వానికిని వ్యాఖ్యలిఖియించి వసుధపైఁ బ్ర
చారముంజేయువారలు సత్వరముగ ముక్తులగుదురు-నిజము మదుక్తులెల్ల" ౯౧౪

వ॥ అనివచించుటయు నట్టిగురుదక్షిణ సూర్యున కర్పించి మగుడఁ జమత్కారపురం
బునకరిగి శాకల్యు సమీపించి ౯౧౫

కం॥ "ధరణీసురవర! తొల్లిటిగురుఁడవు నాకీవు గానఁ గోరుకొనఁగదే
గురుదక్షిణ యర్పించెద నఱమరలేకుండ నెట్టిదైనను భక్తిన్. ౯౧౬

ఆ॥ చదువుచెప్పినతఁడు జనకుండు జననియు నగ్రజుండు విశుద్ధులైననుం బ
రిత్యజింపఁదగదు-స్తుత్యులు వారు. పూజించుచుండవలయు నెందివారి. ౯౧౭

కం॥ సాంగోపాంగంబుగఁ జదువంగలిగితి వేదములను. వానిని సర్వం
బుంగూడఁ జెప్పనేర్చితిం. గురుదక్షిణయును నిత్తు. తెలుపుము కోర్కెన్." ౯౧౮

వ॥ అని మనవిచేయుటయు శాకల్యుండిట్లనియె. ౯౧౯

ఆ॥ "ద్వాదశాత్మకథితవేదరహస్యముల్ పాపనాశకములు పఠనఁజేసి.
నానఁ జెప్పుమయ్య వాని నన్నింటినాకు. గురుదక్షిణగను గోరుకొంటి" ౯౨౦

వ॥ అనియిట్లు కోరుకొనుటయు యాజ్ఞవల్క్యుండను ౯౨౧

ఆ॥ "అయిన నరుగుదెంచు మస్మత్ప్రతిష్ఠితాదిత్యసవిధమునకు ద్విజవరేణ్య!
తన్మహాత్ములైన ద్వాదశాదిత్యుల యగ్రమున వచింతు నేఁ గ్రమముగ" ౯౨౨

వ॥ అనిపలికి సబ్రాహ్మణశిష్యుండగు శాకల్య స్వప్రతిష్ఠితాదిత్యసాన్నిధ్యంబునకుఁ
దోడ్కొనిపోయి తదగ్రమం దతనికిఁ దనకు రవిచెప్పిన సకలవేదాంతవ్యా
ఖ్యానంబులను వక్కాణించె. అట్లుచెప్పఁబడిన వేదాంతంబు లవగతంబుచేసి
కొని చతుశ్చరణసంభవులైన బ్రాహ్మణులు యాజ్ఞవల్క్య సంతోషపెట్టుచు

ఆ॥ అనఘ! నీదుకరుణ నవగతవేదవేదాంతులైనవార మందఱమును.
కోరుకొనఁగదయ్య గురుదక్షిణను సమర్పింపఁగలము నీకుఁ బ్రియముతోడ"

వ॥ అని వాఱప్రచ్చుటయు యాజ్ఞవల్క్యుం డిట్లనియె. ౯౨౫

ఆ॥ "అస్మదీయమైనయట్టి యీపండ్రెండుసవితృవిగ్రహముల సమ్ముఖమున
వేదముల్పఠించు విప్రులీ మా దయ స్వర్గమునకుఁ బ్రీతిఁ జనుదురుగాక. ౯౨౬

క॥ బ్రహ్మవిచారణఁజేసెడిబ్రాహ్మణులకు జననమరణవర్జితమౌ త

ద్బ్రహ్మపద మొదవుఁగా శ్రీబ్రహ్మణ్యా! లాసంగుఁ డిదియె బలుదక్షిణగన్."

వ॥ అనియిట్లు కోరుటయు బ్రాహ్మణులు ౯౧౮

శా॥ "కలికాలంబున దౌష్ట్యభావసహితు ల్కాఁబోదురుర్వీసురుల్.
సలుపంజాలరు శ్రద్ధతోడ నెపుడున్ స్వాధ్యాయపాఠంబు వా.
రల వ్యాఖ్యానము లేమిచూడఁగలరిం? కల్లాట వాఙ్ప్రవృ మం
దలి సారంబును దౌష్ట్యయుక్తులయియుం దా రెట్లొ కీర్తింపఁగన్" ౯౧౯

వ॥ అనివచించుటయు వెండియు యాజ్ఞవల్క్యుండిట్లనియె. ౯౨౦

ఆ॥ "అర్థలక్షణాఖ్యమగురథం యుంజంతి యనెడిప్రథమసూక్త మవ్విధమున
త్రిష్టుభాఖ్యమగుచు దీపించునటువంటి యాద్యమైనసూక్త మదెవిధమున ౯౨౧

క॥ చిత్రందేవానామను మిత్రప్రీతికరమగుచు మిగిలెడిసూక్తం
బా త్రయ్యంగప్రియము పవిత్రంబగు హంసయనెడి పృథుసూక్తంబున్ ౯౨౨

ఆ॥ పావమానమనఁగఁ బ్రథితమౌ సూక్తంబు భక్తియుక్తులగుచుఁ బరమశ్రద్ధ
బహ్వృచుల్పఠింపఁ బరమపదమునకుం బోవఁగలరు భూమిదేవులార! ౯౨౩

ఆ॥ ఇనహితంబులైన యేకవింశతిసామములను శుచిత సామగులు పఠింప
మిత్రమండలంబు మెల్లన భేదించి యేగఁగలరు. చెప్ప నేమిగలదు? ౯౨౪

క॥ శ్రీరికాసంపుటమును భాస్కరకల్పం బట్లు శాంతికల్పముగూడన్
పరికీర్తించినఁ గలిగెడిఁ బరమపదం బల యథర్వపాఠకతతికిన్. ౯౨౫

ఆ॥ అజ్ఞాతేని వచ్చి యగ్రహాసరమున బిట్టుశ్రద్ధ జోతవెట్టిరేని
సప్తరాత్రికిల్బిషమునుండి విడువంగఁబడఁగలారుచూరె పాఱులార!" ౯౨౬

## —♦ రత్నాదిత్యుని యుత్పత్తి ♦—

వ॥ అని యిట్టువచించుటయుఁ జతుశ్చరణబ్రాహ్మణు లందుల కంగీకరించిరి. యాజ్ఞవల్క్యుఁ డిట్లు ఖ్యాతింగాంచుటయు జనకుండు చనుదెంచి సర్వవేదాంతములను శ్రవణించె. రత్నాహ్వయుండగు రాజొకఁడు వచ్చి యాదిత్యమాహాత్మ్యం బవగతంబుచేసికొనినవాఁడై తనపేర నొక యాదిత్యుని సంస్థాపించె. అయ్యాదిత్యుఁ గూడ నాదిత్యవారంబున దర్శించిన సప్తరాత్రకృతపాతకంబు సంక్షయం బయ్యెడి. ఈయాదిత్యమాహాత్మ్యము విన్నవాని కశ్వమేధఫలంబు ప్రాప్తించు. సంక్రాంతినాఁ డయ్యాదిత్యవిగ్రహం బిచ్చియు మాహాత్మ్యమును వినియు నశ్వమేధ

## —♦ పురాణశ్రవణమాహాత్మ్యము ♦—

యాగఫలంబు పొందుదురు. ఈపురాణమంతయుం దొల్లి బ్రహ్మపుత్రుఁడైన భృగువునకు బాహులేయుండు ప్రవచించియున్నవాఁడు. ఆభృగువువలన నంగిరసుండును నతనివలనఁ జ్యవనుండును నతనివలన ఋచీకుండును గ్రహించిరి. ఇట్లు పరంపరగాఁ ద్రిభువనంబుల వ్యాప్తంబైనయది. కుమారునిచేఁ బ్రథమోద్ధృతంబగు నీపురాణంబును సత్పురుషమధ్యంబున శ్రవణించిన సకలపాపవిమోచనంబును నాయుర్వృద్ధియు నయ్యెడిని. ఈహాటకేశ్వర క్షేత్రమాహాత్మ్యమును విన్న

వాని పున్నియమ్ము వర్షించుచున్న వారిధారలుం బోలె నాకాశమండలి నక్షత్రములమాడ్కి గంగలోని యిసుక రేణువుల పగిది లెక్కింప నలవుపడదు. భగవత్ప్రియంబైన యీ హాటకేశ్వర క్షేత్రమహాత్మ్యగ్రంథమ్మును బ్రాహ్మణున కర్పించినఁ దద్గ్రంథస్థాక్షరసంఖ్యాకసంవత్సరంబులు స్వర్గస్థితి సంభవించెడు. దీనిపఠనంబుగాని శ్రవణంబుగాని కొన్నిదినంబు లాచరించిన సర్వార్థసిద్ధియు సంఘటిల్లెడు. ౨౯

సీ॥ పుత్రార్థియై దీనిఁ బూర్తిగాఁ జదువుచోఁ బుత్రవంతుండయి పొలుపుగాను.
ధనకాంక్షియై దీనిఁ దాఁ బఠియించుచో ధనవంతుఁడై మహాఘనతఁ జెందు.
పతికాంక్షయై దీనిఁ బాఠంబు సేయుచో బహుమనోహరుఁడైన పతినిఁ బడయు.
చుట్టంబులం జూడఁ గట్టిగాఁ జదువుచోఁ జూచు దూరస్థ చుట్టములను.
వేదవేత్తయగును విప్రుండు చదివిన. పట్టభద్రుఁడగును పార్థివుండు.
వైశ్యుఁ డిదు లభించు వరధనధాన్యముల్. సుఖపడుం గరంబు శూద్రజనుఁడు.

తే॥ ఇట్టాని శ్రవణించి వాచకుం బూజించిన బ్రహ్మవిష్ణురుద్రులు మున్నుగాను
బూజింపఁ బడుదురు. ఒక్కయక్కరంబె వినిపింపనిండు. వాని కేమియుఁ సంగి నను
ఋణము తీర్చుకొనఁజాలరు.

సీ॥ అభిమతంబైనట్టి యాపుల నర్పించి చేతులు మోడ్చి పూజింపవలయు.
ఫలవంతమగునట్టి యిలను సమర్పించి ప్రీతిపూర్వముగ నర్పింపవలయు.
ఉత్తమంబైనట్టి హొన్ను నివేదించి దేవళ్ళఁ బోలెఁ బ్రార్థింపవలయు.
వెలగల్గినట్టువంటి బలు వంచుకములిచ్చి వినయంబునను గౌరవింపవలయు.
బహువిధంబులైన పక్వాన్నములు పెట్టి బాగుగాను దృప్తిపఱుపవలయు.
నిపుణుఁడైనయట్టి యుపదేష్ట నిట్లుంగిఁ గొలిచి శివపదంబు నొలయవలయు."

తే॥ అనియిట్లు లోమహర్షణి ఘనశౌనకముఖ్య మౌనిగణమున కెలమిఁ
వినిపించె నీపురాణం బనఘజనవిధేయ ! శ్రీ పరాంకుశరాయా ! ౩౦

మ॥ సురభాషన్ మును పట్టు బ్రాహ్మణులకున్ సూతుండు వారిచ్చ. నా
గరఖండం బది సర్వ మాంధ్రమునఁ జక్కన్ వ్రాసి నే నిప్డు నీ
కెఱుఁగం జెప్పితి. నీవు నీదు సుతులెంతే శ్రద్ధ నీమిత్రులున్
చిరకాలంబు పఠించి కాంచుఁడిక నుశ్రేయంబు భూమీధవా ! ౩౧

గద్య॥ ఇది శ్రీమజ్జగద్గురు గురు కరుణాకటాక్ష సంప్రాప్త కవితాసాహిత్యనిధాన
హారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబికా గర్భశుక్తిముక్తాయ
మాన సత్సభావిస్ఫురితావధానవిధాన జానపాటి పట్టాభిరామా
భిధాన సమాంధ్రీకృతంబగు స్కాందమహాపురాణాం
తర్గత నాగరఖండంబునందు సర్వము
దశమాశ్వాసము
సంపూర్ణము.



## తప్పొప్పుల పట్టిక

---:o:---

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| ౧౩ | ౩ | శద్ధ | శ్రద్ధ |
| ౧౬ | ౧౭ | సంకా్రతి | సంక్రాంతి |
| ౨౧ | ౨౨ | తగగు | తగదు |
| ౨౬ | ౨ | బూచిత | బూజిత |
| ౨౯ | ౨౩ | పిత | పితృ |
| ౩౨ | ౬ | మాప్వెడిక్ | మాస్వెడిక్ |
| | ౨౯ | కవ్యా | కన్యా |
| ౩౯ | ౭ | ప్రశేశించె | ప్రవేశించె |
| ౪౫ | ౨౧ | క్షాద్రి | క్షుద్ర |
| ౫౬ | ౨౮ | పేయ | సేయ |
| ౬౦ | ౨౨ | ఫేన | ఫేన |
| ౬౧ | ౧౫ | జన్మబు | జన్మంబు |
| ౬౪ | ౧౫ | నాలుగు | నాల్గు |
| ౬౫ | ౪ | ద్రచవణంబు | ద్రచ్ఛవణంబు |
| | ౧౪ | వనయా ! | వనయ ! |
| | ౧౫ | ప్రావస్త్యంబు | ప్రాశస్త్యంబు |
| ౬౬ | ౨౭ | సల్లక్షంబులు | సల్లక్షణంబులు |
| ౬౭ | ౧౧ | పదుండాత్మ | పదుంద్రాత్మ |
| | ౨౦ | తే॥ | ఆ॥ |
| ౭౬ | ౨౬ | సహస్త్ర | సహస్ర |
| | ౨౯ | శ్రీపుల | శ్రీఫల |
| ౮౩ | ౨౩ | జ్ఞాతి | జాతి |
| ౮౪ | ౨౨ | మెల్ల | మెల |
| ౮౮ | ౧ | మద్ | మత్ |
| ౧౦౪ | ౧౬ | యొడయుక్ | యొడలక్ |
| ౧౦౯ | ౪ | లేకహూ | లేకహో |
| | ౭ | నజ్ఞాల | నజ్ఞాన |
| | ౯ | నది | నని |
| ౧౦౮ | ౨౫ | సకలేప్సిత | సకలేఫ్సిత |
| ౧౧౬ | ౧ | ॥ | సీ॥ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |

౧౧౬ పుటలో " అనుటయుగౌరి " అను ౩౦ వ పద్యము తరువాత,-

కం॥ అనవుడు షట్కృత్తిక 'లీ
స్తనంధయుని నీకొసంగి చాతుర్మాస్యా
వనజాప్తవారమున సుర
ధునిలోపలఁ దీర్థమాడఁ దోతెంచితిమేమ్'

అనుపద్యము చదువుకొనవలెను.

| | | | |
| --- | --- | --- | --- |
| ౧౨౨ | ౬ | కుబుధు | కుజబుధు |
| | ౨౯ | తాన | దాన |
| ౧౨౭ | ౪ | మత్స్యలీ | మత్స్యలీ |
| ౧౨౮ | ౩ | డాతితేయు | డాదితేయు |
| ౧౩౪ | ౨౮ | హారింప | హారియింప |
| ౧౩౫ | ౩౦ | నర్త్మాహాము | నర్త్మాము |
| ౧౩౬ | ౯ | గరంబుండ | గరంబుండు |
| ౧౪౧ | ౫ | దఱకు | దఱచు |
| | ౨౫ | కామహార్షణి | కౌమహార్షణి |
| ౧౪౨ | ౩౦ | కరగు | కరుగు |
| ౧౫౫ | ౭ | ఫూర్దేశ | ఫూర్దేశ |
| ౧౫౬ | ౨౧ | పూష | పూవ |
| ౧౬౦ | ౧౭ | ముషాౖదులు | ముషాౖగ్నులు |
| | ౨౧ | నిష్పాడ | కిష్పాడ |
| ౧౬౩ | ౨ | ఁగనుట | నగుట |
| ౧౬౪ | ౧౯ | తదుత్సత | తదుత్సవ |
| | ౨౧ | పూష | పూవ |
| ౧౭౩ | ౮ | యాదుడు | యూదుడు |
| ౧౭౪ | ౯ | యున్న | యన్న |
| ౧౭౯ | ౧౫ | హోమ | హేమ |
| | ౨౮ | హోమాది | హేమాది |
| ౧౮౮ | ౨౮ | మననుసరించి | మనుసరించి |